శ్రీరస్తు

# కళాపూర్ణోదయము

ఇది

సుప్రసిద్ధమహాకవియు

రాఘవపాండవీయాద్యనేక గ్రంథకర్తయు నగు

పింగళి సూరనార్యునిచే రచింపఁబడినది.



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీసత్యనారాయణబుక్ డిపో,

రాజమండ్రి.

035,1;9,1
NA

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కళాపూర్ణోదయము

ఇది

సుప్రసిద్ధమహాకవియు

రాఘవపాండవీయా ద్యనేక గ్రంథకర్తయు నగు

పింగళి సూరనార్యునిచే రచింపఁబడియె.

శ్రీరామా బుక్కు డిపో

పుస్తకాల వ్యాపారం

మార్కెట్టు వీధి, సికింద్రాబాద్ (దక్కన్)



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీసత్యనారాయణబుక్ డిపో,

రాజమండ్రి.

కాపీరైటు రిజిష్టర్డు]

[వెల రు. 1—0—0.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పింగళి సూరనార్యుఁడు.

## —ఈతని కులము.—

అపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీయంబు ను శృంగారరసప్రాయంబు ను బహువస్తువర్ణనాకర్ణనీయుంబునునగు కళాపూర్ణోదయంబనుమహాకావ్యంబు నిర్మించిన మహాకవి శోభితాపస్తంబసూత్రుఁడును గౌతమగోత్రుఁడును పింగళి సూరసుకవి పౌత్రుఁడును నన్నపపతిభావనల దౌహిత్రుఁడు ను అమరధీనిధికి నబ్బమ్మకుఁ బుత్రుఁడును అమరనయొఱ్ఱనార్యుల యగ్రజుండు ను నగు సూరనార్యుఁడు.

ఈతండు మంత్రివంశజుఁడు. కృష్ణరాయసముద్రగామవాసి. ఈకృష్ణరాయసముద్రము కర్నూలుమండలములోని నంద్యాలయనుగ్రామమునకు మూఁడుక్రోసులదూరములో నున్నదఁట. దీని నిప్పుడు పెద్దకానాల యని వాడుదురఁట.

## —కాలము—

ఈమహాకవి కాలముం గూర్చి రావుబహదరు కందుకూరి వీరేశలింగము పంతులవారు స్వవచనవ్యాఘాతములతోఁ గూడిన సందిగ్ధవచనముల ను బెక్కింటిని వ్రాసియున్నారు. శ్రీవీరేశలింగముపంతులవారు "కాఁబట్టి పింగళి సూరన్న నంద్యాలసంస్థానమునం దుండి కృష్ణరాజునకుఁ గళాపూర్ణోదయము నంకితము చేసినకాల మించుమించుగా క్రీ॥ శ॥ ౧౫౭౦ వ సంవత్సరప్రాంతమని చెప్పవచ్చు" నని 246 పుటలో వ్రాసి దానికి విరుద్ధముగా "పింగళి సూరన్న కృష్ణదేవరాయని కాలములో నుండెనని యొకానొక రనుచున్నారు గాని ఆర్వీటి బుక్కరాజు మున్మనుమఁడైన యళియ రామరాజే ౧౫౭౮ వ సంవత్సరము వఱకు నుండినప్పుడు బుక్కరాజు మున్మనుమని మనుమఁ డగు కళాపూర్ణోదయకృతిపతి యైన నంద్యాల కృష్ణరాజంతకుఁ బూర్వమునం దుండె ననుట పొసఁగ నేరమింజేసి వారిమాట విశ్వాసార్హమైనది కాదు. ఇతఁడు ౧౫౭౦ సంవత్సరమునకు లోపలనుండుట తటస్థింపదు." అని 249 పుటయందు ను వ్రాయించియున్నారు. ఇందు వ్రాయఁబడినట్లు సూరన్న ౧౫౭౦ వ సంవత్సరమునకు లోపలనుండుట పొసఁగకుండు నెడల నీతఁడు కళాపూర్ణోదయమును కృష్ణరాజునకు నంకితము చేసిన కాలము ౧౫౭౦ ప్రాంతము కానేరదు. ఏమన సూరన్న చేసిన కావ్యములలోఁ గళాపూర్ణోదయము కడపటి వానిలోనిది. కళాపూర్ణోదయములో:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మ. ఇటనుక్ గారుడసంహితాదికృతులీవింపారంగఁ బెక్కైన
ర్పుట విస్తారము చెప్పనేల యవి సంస్కృతోభయశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీకె చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్."

అని వ్రాయఁబడియున్నదానింబట్టి యీకబ్బము తుదికావ్యములలోని దని తెలియవచ్చుచున్నది. తుదికావ్య మగునీగ్రంథమే ౧౫౬౦ ప్రాంతములందు వ్రాయఁబడియున్నయెడల రాఘవపాండవీయాదు లంతకుఁబూర్వమే విరచింపఁబడి యుండవలెను. మఱియు ను గారుడసంహితాదులు వానికంటె ను బూర్వము నిర్మింపఁబడి యుండవలెను గాన నీసూరకవి ౧౫౬౦ సంవత్సరమునకు లోపల నుండితీరవలెను. కానఁ బంతులవారి వ్రాఁత పరస్పరవిరుద్ధముగా నున్నది.

మఱియును శ్రీ వీరేశలింగముపంతులవారు పురాతనలేఖనములఁ బ్రమాణముగాఁ దీసికొనక స్వకపోలకల్పితము లగునూహల నాధారము చేసికొని సూరనార్యకాలనిర్ణయము ను జేసి యుండిరి. వీరు "నంద్యాలరాజైనకృష్ణరాజు సదాశివదేవరాయనికాలములోనివాఁడైనందున నాతనిరాజ్యకాలము ౧౫౭౮ వ సంవత్సరమునకులోపల నారంభమై యుండును." అని సాహసించి వ్రాసియున్నారు. కాని నంద్యాలరాజైనకృష్ణరాజు సదాశివదేవరాయనికాలములోనివాఁడని యెచ్చటఁ దెల్పఁబడియున్నదో వ్రాయరైరి, వీరు తలంచిన ట్లెచట ను వ్రాయఁబడి యుండలేదు. ఇది స్వకపోలకల్పితము. "నంద్యాలరాజైనకృష్ణరాజు సదాశివదేవరాయనికాలములోనివాఁడైనందున" అని వ్రాయుటకుఁ బూర్వ మొపుటయందే మొదట నీపంతులవారు "కృష్ణరాజు విజయనగరము ను సదాశివదేవరాయలు పాలించుచుండినకాలములో నంద్యాలరాజయియున్నట్టు కానఁబడుచున్నది" అని వ్రాసియుండిరి. దాని కది ప్రమాణము ను దీని కది ప్రమాణము నే గాని పురాతనలేఖనము లేవియును గావు. శ్రీ వీరేశలింగముగారు రామరాజభూషణునకుఁ బరగుచున్న పింగళిసూరనార్యుని బూర్వునిగాఁ జేయఁ బాటుపడియుండుటచే నీవిరుద్ధపువ్రాఁత వ్రాయవలసివచ్చినది.

రామరాజభూషణుఁడు అర్వీటిబుక్కరాజు మనుమఁడగునళియరామరాజు కాలములోనివాఁడు. ఇందులకు వీరేశలింగముగారే యంగీకరించిరి. కళాపూర్ణోదయము ను గృతియందిన కృష్ణరాజు అర్వీటిబుక్కరాజు మునిమనుమఁడని శ్రీ వీరేశలింగముగారే 249 పుటలో వ్రాసియున్నారు. అర్వీటిబుక్కరాజు మనుమని (రామరాజు) కాలమున నున్న రామరాజభూషణునికంటె వీరు వ్రాసిన వ్రాఁతను బట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుక్కరాజు మునిమనుమని మనుమఁడైన కృష్ణరాజు కాలమునం దున్న పింగళిసూరన్న యుండుటకు బూర్వమునం దున్నవాఁడు కావలసి వచ్చుచున్నది. ఇది యసంగత మని శ్రీవీరేశలింగముగారే 249 పుటలో వ్రాసియున్నారు గదా. శ్రీవీరేశలింగముగారు [illegible] విరుద్ధమని వ్రాసియుండిరో దానినే తుదకవలంబించినవారైరి. వీరు స్వకపోలకల్పిత [illegible] పురాతనలేఖనముల నమ్మిన నీవిపరీతము పుట్టనేరదు. రామరాజభూషణుఁడు వసుచరిత్రమును అప్పటి బుక్కరాజు మునిమనుమఁడగు తిరుమలదేవరాయని కంకితము నొనర్చినాఁడు. పింగళి సూరన్న తన కళాపూర్ణోదయమును బుక్కరాజు మునిమనుమని మనుమఁడగు కృష్ణరాజున కంకిత మొనర్చినాఁడు. దీనినిబట్టి యుభయకావ్యముల కాలము ను సులభముగా దెలిసికొనవచ్చును. తిరుమలదేవరాయనికిని కృష్ణరాజునకును గూటస్థుఁ డొక్కఁడే కనుక వీరి కాలము ను వారివంశక్రమమును బట్టియే తెలిసికొనవచ్చును. కాన వసుచరిత్రమునుబట్టియు ను గళాపూర్ణోదయమును బట్టియును బుక్కరాజు వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




దీనిబట్టి యాప్పటి బుక్కరాజునకు వసుచరిత్రము కృతిపతియగు తిరుమలదేవరాయఁడు నాలవపురుషుఁడుఁ గళాపూర్ణోదయమును గృతిపొందిన కృష్ణరాజాఱవ పురుషుఁడు నగుచున్నాఁడు.

శాసనాదులు ను బైవంశవృక్షమునకు ననుకూలముగానే యున్నవి. శాసనాదులను బట్టి యళియరామరాజు గొబ్బూరి శాసనము (సదాశివదేవరాయని పేర) రాజ్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మ. ఇటనుక్ గారుడసంహితాదికృతు లీ వింపొంపఁగాఁ జెప్పఁగా న
చ్చట విస్తారము చెప్పనేల యవి సంస్కృతోభయశ్లేషసం
ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీకె చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్."

అని వ్రాయఁబడియున్న దానింబట్టి యాకబ్బము తుదికావ్యములలోని దని తెలి యవచ్చుచున్నది. తుదికావ్య మగునీగ్రంథమే ౧౫౬౦ ప్రాంతములందు వ్రాయఁబ డియున్నయెడల రాఘవపాండవీయాదు లంతకుఁబూర్వమే విరచింపఁబడి యుండవలె ను. మఱియు ను గారుడసంహితాదులు వానికంటె ను బూర్వము నిర్మింపఁబడి యుం డవలెను గాన నీమూఁడవి ౧౫౬౦ సంవత్సరమునకు లోపల నుండితీరవలెను కానఁ బంతులవారి వ్రాఁత పరస్పరవిరుద్ధముగా నున్నవి.

మఱియును శ్రీ వీరేశలింగముపంతులవారు పురాతనలేఖనములఁ బ్రమాణము గ్రహింపక స్వకపోలకల్పితము లగునూహల నాధారము చేసికొని సూరనార్యకాలనిర్ణ యమును జేసి యుండిరి. వీరు "నంద్యాలరా జైనకృష్ణరాజు సదాశివదేవరాయనికాల ములోనివాఁ డైనందున నాతనిరాజ్యకాలము ౧౫౪౭ వ సంవత్సరమునకులోపల నారంభ మై యుండును." అని సాహసించి వ్రాసియున్నారు. కాని నంద్యాలరాజుకృష్ణరా జు సదాశివదేవరాయనికాలములోనివాఁ డని యెచ్చటఁ దెల్పఁబడియున్నదో వ్రాయ రైరి. వీరు తలంచిన ట్లెచట ను వ్రాయఁబడి యుండలేదు. ఇది స్వకపోలకల్పితము. "నంద్యాలరా జైనకృష్ణరాజు సదాశివదేవరాయనికాలములోనివాఁ డైనందున" అని వ్రాయుటకుఁ బూర్వ మాపుటయందే మొదట నీపంతులవారు "ఈకృష్ణరాజు విజయ నగరమును సదాశివదేవరాయలు పాలించుచుండిన కాలములో నంద్యాలరాజయియు న్నట్టు కానఁబడుచున్నది" అని వ్రాసియుండిరి. దానికిది ప్రమాణము ను దీనికిది ప్రమాణము నేగాని పురాతనలేఖనము లేవియును గానరావు శ్రీ వీరేశలింగముగారు రా మరాజభూషణునకుఁ బరనామ మున్న పింగళిసూరనార్యుని బుద్ధుని గాఁ జేయఁ బాటు పడియుండుటచే నీవిరుద్ధపువ్రాఁత వ్రాయవలసివచ్చినది.

రామరాజభూషణుఁడు ఆర్వీటిబుక్కరాజు ముమ్మనుమఁ డగునళియరామరాజు కాలములోనివాఁడు. ఇందులకు వీరేశలింగముగారే యంగీకరించిరి. కళాపూర్ణోదయ మును గృతియందిన కృష్ణరాజు ఆర్వీటిబుక్కరాజు ముమ్మనుమనిమనుమఁ డని శ్రీవీరే శలింగముగారే 249 పుటలో వ్రాసియున్నారు. ఆర్వీటిబుక్కరాజు ముమ్మనుమని (రామరాజు) కాలపునాఁ డున్న రామరాజభూషణునికంటె వీరు వ్రాసిన వ్రాఁతను బట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుక్కరాజు మనుమని మనుమఁడైన కృష్ణరాజు కాలమునందున్న పింగళిసూరన్న యంతకుఁ బూర్వమునందున్నవాఁడు కావలసి వచ్చుచున్నది. ఇది యసంగతమని శ్రీవీరేశలింగముగారే 249 పుటలో వ్రాసియున్నారు గదా. శ్రీవీరేశలింగముగారు శ్రమము చేసి విరుద్ధమని వ్రాసియుండిరో దానినే తుదకు వలయించినవారైరి. వీరు స్వకల్పితములను నమ్మక పురాతనలేఖనముల నమ్మిన నీవిపరీతము పుట్టకుండు. రామరాజభూషణుఁడు తన వసుచరిత్రమును అప్పటి బుక్కరాజు మనుమనివాఁడగు తిరుమలదేవరాయని కంకితము చేసియున్నవాఁడు. పింగలి సూరన్న తన కళాపూర్ణోదయమును బుక్కరాజు మునిమనుమని మనుమఁడగు కృష్ణరాజున కంకిత మొనర్చెనాఁడు. దీనిబట్టి యుభయకావ్యముల కాలమును సులభముగా దెలిసికొనవచ్చును. తిరుమలదేవరాయనికిని కృష్ణరాజునకును నూటసుఁ డొక్కఁడే కనుక వీరి కాలమును వారివంశక్రమమును బట్టియే తెలిసికొనవచ్చును. కాన వసుచరిత్రమునుబట్టి యు నగళాపూర్ణోదయమును బట్టియును బుక్కరాజు వంశవృక్షము క్రింద నిచ్చుచున్నాఁడను.

అప్పటి బుక్కరాజు.




దీనిబట్టి యాయప్పటి బుక్కరాజునకు వసుచరిత్రము కృతిపతియగు తిరుమలదేవరాయఁడు నాలవపురుషుఁడుఁ గళాపూర్ణోదయమును గృతిపొందిన కృష్ణరాజు ఆఱవ పురుషుఁడు నగుచున్నాడు.

శాసనాదులు నీ వంశవృక్షక్రమమున కనుకూలముగానే యున్నవి. శాసనాదులను బట్టి యళియరామరాజు గొబ్బూరి వద్ద ను (సదాశివదేవరాయని పేర) రాజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము చేసినట్లు కాన్పించుచున్నది. పిమ్మట నాతని తమ్ముఁడగు తిరుమలదేవరాయఁడు ౧౫౭౦ సంవత్సరము మొదలు ౧౫౭౩ వఱకును రాజ్యము చేసెను. పిమ్మట నాతని పుత్త్రుఁడగు శ్రీరంగరాయలు ౧౫౮౫ వఱకు నేల యేలెను. అటుపై ౧౫౮౫ మొదలు ౧౬౧౪ వఱకు ను వేంకటరాయఁడు రాజ్యము చేసెను.

పై కాలవివరణమున కంగీకరించుచు శ్రీ వీరేశలింగముగారు సూరిసాహిత్యమునందే యిట్లు వ్రాసియున్నారు :—

"రామరాజు సదాశివరాజ్యసంస్థాపకుఁ డను పేరు పొంది, పేరునకు సదాశివరాయఁడే రాజయిన ను నిజమైన యధికారము నంతను దానే వహించి రాజ్యపరిపాలన ము చేయుచుండి ౧౫౬౫ వ సంవత్సరమునందు మహమ్మదీయరాష్ట్రీయులవారి సేనతో తాలికోటవద్ద జరిగినయుద్ధమునందుఁ జంపఁబడెను. ......తరువాత నయిదుసంవత్సరములవఱకు రాజ్య మించుమించుగా నరాజకము కాఁగా నీలోపల ౧౫౬౭ వ సంవత్సర ప్రాంతమున సదాశివరాయఁడు స్వర్గస్థుఁ డయ్యెను. ఆ సంవత్సరమునందే తిరుమలదేవరాయఁడు విజయనగరము ను విడిచి పెనుగొండఁ జేరి తాను రాజ నని ప్రకటించి ప్రమోదూత సంవత్సరములో ననఁగా ౧౫౭౦ వ సంవత్సరమున పెనుగొండ రాజ్యమునందు స్థిరపడి ౧౫౭౩ వ సంవత్సరమునందు లోకాంతరగతుఁ డయ్యెను. ౧౫౭౩ వ సంవత్సరమునకు సరియైన అంగిరససంవత్సర వైశాఖ శుద్ధ దశమి నాఁ డాతనిపుత్త్రుఁ డయినశ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చి ౧౫౮౫ వ సంవత్సరమువఱకు ను రాజ్యము చేసి స్వర్గస్థుఁ డయ్యెను. ౧౫౮౫ వ సంవత్సరమునకు సరియైన పార్థివసంవత్సర మాఘశుద్ధ దశమి నాఁ డాతనితమ్ముఁడైనవేంకటరాయఁడు సింహాసనమునకు వచ్చినతోడనే తనరాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికిమార్చి ౧౬౧౪ వ సంవత్సరమువఱకు ను రాజ్యము చేసి సంతానహీనుఁడై పరమపదము ను బొందెను."

267 వ పుటలోఁ గూడ శ్రీ వీరేశలింగముగారు వీరిపరిపాలనముం గూర్చి యిట్లు వ్రాసియుండిరి :—

"తిరుమలదేవరాయఁ డేసంవత్సరమునందు మృతినొందెనో స్పష్టముగాఁ దెలియదు గాని ౧౫౭౪ వ సంవత్సరమువఱకు ను నాతఁ డిచ్చినదానశాసనములు కనఁబడుచున్నవి; ౧౫౭౪ వ సంవత్సరము మొదలుకొని ౧౫౮౫ వ సంవత్సరమువఱకు ను ఆతని రెండవకొడు కయినశ్రీరంగరాజు దానశాసనములును ౧౫౮౫ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకు ను మూఁడవకొడుకైనవేంకటపతియొక్క దానశాసనములు ను కానవచ్చుచున్నవి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇఁకఁ గళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణరాజు కాలముంగూర్చి విచారింతము. కృష్ణరాయలయన్న యగుతిమ్మరాజు దానశాసన మొకటి కరిమద్దల యనుగ్రామమునందలి యంకాళమ్మగుడిలో నున్నది. అం దిట్లు వ్రాయఁబడియున్నది :—

"శాలివాహనశకము ౧౪౭౦ క్షయ సం॥ ఆషాఢ శు ౧౨ లు శ్రీమన్మహామండలేశ్వరనంద్యాలనారయదేవ మహారాజులవారి పౌత్రులు, నరసింగరాజుగారి పుత్రులు తిమ్మయ్యదేవమహారాజులుగారు కరిమద్దల యక్కలిదేవమ్మకు యిచ్చిన భూదాన ధర్మశాసనక్రమము ఎట్లన్న ను :—సదాశివరాయలు తమనాయంకరానకు పాలిచ్చిన పెడకంటిసీమలోని పాట్లపాటిలోనికరిమద్దలగ్రామాన పాట్లపాటికాలవను యిచ్చియున్నది తోటస్థళం ౩౫౦ గాక తాము యీదినం యిచ్చినతోట కి ౧౫౧ యిచ్చినశాసనము" అని యున్నది. (ఓరియంటల్ లైబ్రేరీలోకల్ రికార్డ్సు వాల్యూం 16)

ఈశాసనముంబట్టి కళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణరాయలయన్న యగుతిమ్మరాజు శాలివాహనశకము ౧౪౭౦ అనఁగా క్రీస్తుశకము ౧౫౪౮ వ సంవత్సరమునఁ బరిపాలనము చేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈతఁడు కృష్ణరాయలనపతియన్న, పెద్దకొండమాంబకొడుకు. చినకొండమాంబకుమారుఁడు కళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణరాజు. ఈవిషయము కళాపూర్ణోదయములో నిట్లు తెల్పఁబడి యున్నది—

"చ. నిరుపమవిక్రమంబు ను వినీతి యు నీతి యుఁ బోలెఁ దత్త్వవి
త్పరిచయము న్విరక్తి యు సుభక్తి యుఁ బోలె సురేగవర్తనా
దరవిభవంబు శాంతి యు సు దాంతి యుఁ బోలెఁ గరం బలంకరిం
చిరి తమనిత్యసేవ నరసింగయ నిద్దఱుకొండమాంబలున్."

"గీ. అందుఁ బెద్దకొండమాంబయం దానర, సింగభూవరుండు శిష్టమతులఁ
గాంతియుతుల సుతులఁ గనియె మూర్తిక్షమా, రమణుఁ దిమ్మవిభునిరమణమీఱ."

"ఉ. ఆనరసింగభూపతి ప్రియం బెసఁగం జినకొండమాంబయం
దానమితాఖిలాహితసమాజుఁ దనూజుని గాంచె బంధుసం
తానసురావనీజు సముదంచితభోగబిడౌజు సూరిమై
త్రీనవభోజు భానునిభతేజుని గృష్ణమరాజు నున్నతిన్."

సూరకవి యీతిమ్మరాజు ను గళాపూర్ణోదయములో విశేషముగా వర్ణించియున్నాఁడు. ఈతిమ్మరాజు ౧౫౪౮ లో నంద్యాల పరిపాలించుచున్నట్లు తెలియవచ్చుచున్నది గదా. ఇఁకఁ గళాపూర్ణోదయకృతిపతి యగు కృష్ణమరాజు పరిపాలనకాలముం గూర్చి చర్చించుకొందము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పింగళిసూరన చారిత్రముం గూర్చి చక్కని యుపన్యాసము ను వ్రాసిన పి. దక్షిణామూర్తి గారు తమ యుపన్యాసములోఁ గృష్ణమరాజు పరిపాలనకాలముం గూర్చి యిట్లు సప్రమాణముగా వ్రాసియున్నారు:—

“సదాశివదేవరాయలు సంవత్సరము (౧౫౪౨) మొదలు ౧౫౭౩ సం॥వఱకు నేల యేలినట్టును దర్వాత శ్రీరంగరాయలప్పటినుండి ౧౫౮౫ సంవత్సరము వఱకను అంతట వేంకటపతిరాయలు ౧౫౮౬ మొదలుగ ౧౬౧౪ సం॥ వఱకను రాజ్యము చేసినట్లును బళ్లారిమండల చరిత్రముల వలన దెలియవచ్చుచున్నది. ఈవేంకటపతిరాయలు పెనుగొండయందు సింహాసనాసీనుఁడై యుండఁగ నంద్యాల ను గృష్ణమరాజేలుచుండినట్లు నంద్యాలగ్రామచారిత్రమునందు వ్రాయఁబడియున్నది.”

దీనినిబట్టి కళాపూర్ణోదయకృతిపతి యగు కృష్ణమరాజు పెనుగొండప్రభు వగు వేంకటపతిరాయలకాలమునందు నంద్యాలను బరిపాలించుచున్నట్లు తేలుచున్నది. వసుచరిత్రమునుకృతిపొందినతిరుమలదేవరాయని తృతీయపుత్రుఁడగు నీవేంకటపతిరాయల ౧౫౮౬ సం॥ మొదలు ౧౬౧౪ సం॥ వఱకును బరిపాలనము చేసినట్లందఱు నంగీకరించియున్నారుగదా. కావ సూరనార్యుని కృష్ణమరాజు కాలము నించుమించుగా నిదియే యగుచున్నది. ఈతనికిఁ బూర్వము తిమ్మరాజు చాలకాలము పరిపాలించి యుండుటచేతనే కళాపూర్ణోదయములోఁ గృష్ణమరాజు నన్న యగు తిమ్మరాజు విశేషముగా వర్ణింపఁబడి యున్నాఁడు. కావునఁ గళాపూర్ణోదయము క్రీస్తుశకము ౧౬౧౪ సం॥ మున కీవల వ్రాయఁబడినదిగాని శ్రీవీరేశలింగముగారు తలంచినట్లుగా ౧౫౨౦ సం॥ ప్రాంతమందు వ్రాయఁబడినది కాదు. ౧౫౬౪ వఱకునళియరామరాజే రాజ్యము చేయుచుండెను గదా. ౧౫౮౬ మొదలు ౧౬౧౪ వఱకును రాజ్యము చేసిన వేంకటపతిరాయలకాలములోఁ గృష్ణమరాజున్నట్లుగా శ్రీవీరేశలింగముగారు నంగీకరించుచు నొక్క మూలదానిని గూడ వ్రాసి యుండిరి:- “నంద్యాలకృష్ణరాజు వేంకటపతిరాయల రాజ్యారంభదశలోను జీవించి యున్నాఁడఁట. అందుచేత నతఁడు ౧౫౮౬ వ సం॥ నకుఁ దరువాత కూడ నల్పకాలము రాజ్యమేలియుండును” అని వ్రాసిరి. (వేంకటపతిరాయల) రాజ్యారంభదశలో నన్నది మీరు తెచ్చిపెట్టినది. ఆరంభదశ కాదు. పరికించిచూడఁ దుదిదశయందే యున్నాఁడు.

పెనుగొండరాజగు వేంకటపతిరాయలకాలములోఁ గృష్ణమరాజున్నాఁ డన నతనితుదిదినములలో నున్నాఁ డని మనము గ్రహించుకొనవలసియున్నది. సూరనార్యునికృష్ణమరాజు ౧౬౧౪ సంవత్సరముకంటెను నవీనుఁ డని తెలిసికొనుటకుఁ దగునిద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్నవములు కళాపూర్ణోదయమునందే కలవు. కళాపూర్ణోదయకృతిపతి యగుకృష్ణమరాజు విశ్రుతతిరుమలతాతాచార్యవంశజసుదర్శనాచార్యపుత్త్రుఁ డగుశ్రీనివాసగురుని శిష్యుఁ డైనట్లుగాఁ గళాపూర్ణోదయములో నిట్లు వర్ణింపఁబడియున్నాఁడు :—

"క. విశ్రుతతిరుమలతాతా, ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జశ్రీనివాసగురుచర, ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్."

తిరుమలతాతాచార్యులు తిరుమలదేవరాయనిమూఁడవపుత్త్రుఁ డగువేంకటపతిరాయలకాలములో (౧౫౮౬-౧౬౧౪) నాస్థానమునం దుండెడివాఁ డనియు నాస్థానమునందె కల యప్పయ దీక్షితులు వారి ప్రతి పక్షి యనియు నందఱు నెఱిఁగియున్న సంగతియే. ఈతాతాచార్యులకాలముంగూర్చి శ్రీ వీరేశలింగముగారిట్లు వ్రాయుచున్నారు :—

"రామకృష్ణకవి యప్పయదీక్షితులవారితోను దిరుమలతాతాచార్యులతోను సమకాలికుఁ డయి చంద్రగిరిరాజగు వేంకటపతిరాయలప్రభుత్వకాలములో నుండినవాఁ డయినట్లు కొన్ని నిదర్శనములు కనఁబడుచున్నవి. ఈవేంకటపతిరాయలు వసుచరిత్రము ను కృతినందిన తిరుమలదేవరాయలయనంతరమున తనరాజధానినివిజయనగరమునుండి చంద్రగిరికి మార్చుకొని క్రీస్తుశకము ౧౫౮౬ వ సంవత్సరము మొదలుకొని ౧౬౧౪ వ సంవత్సరమువఱకు ను రాజ్యముచేసినవాఁడు."

అప్పయదీక్షితులును దిరుమలతాతాచార్యులు ను వేంకటపతిరాయలకాలములోని వా రనుటకు నిదర్శనము లనేకములు కలవు. అప్పయదీక్షితులవారి మేనల్లుఁ డయిన యయ్యలదీక్షితులు హూణశకము ౧౬౨౩ మొదలుకొని ౧౬౫౯ వ వత్సరమువఱకుఁ బాండ్యదేశము ను బాలించిన తిరుమలనాయకుని మంత్రిగా నుండెను గావున నీలకంఠవిజయగ్రంథకర్త యగునయ్యలదీక్షితుల మేనమామ వేంకటపతిరాయలకాలములోనివాఁ డనుట నిర్వివాదాంశము కాన దీక్షితులప్రతిపక్షి యగుతాతాచార్యులును నాకాలపువాఁడె యగుచున్నాఁడు.

తిరుమలతాతాచార్యులే వేంకటపతికాలములోనివాఁ డయినప్పు డాతనివంశజుని పుత్త్రునిశిష్యుఁ డగుకళాపూర్ణోదయకృతిపతి (కృష్ణమరాజు) వేంకటపతిరాయల కిటీవలివాఁడు కావలయునుగదా. ఇది మనకుఁ గళాపూర్ణోదయమువలననే తెలియవచ్చుచున్నది. కావున సర్వవిధములఁ గళాపూర్ణోదయము హూణశకము ౧౬౧౪ వ సంవత్సరమున కీవలరచింపఁబడినది. కాని పూర్వపుది కాదు. పింగళిసూరన్న రామకృష్ణకవ్యాదుల కీవలివాఁడు గాని పూర్వుఁడు గాఁడు. ఈతనికి రామరాజుకాలములో నున్న రామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజభూషణుఁడు చాలపూర్వుఁడు. వసుచరిత్రము రచింపఁబడిన యిమ్మట చాలకాల మైనతర్వాతఁ గళాపూర్ణోదయము రచింపఁబడినది.

వసుచరిత్రము తిరుమలదేవరాయని కాలమునందు విరచింపఁబడియుండఁగాఁ గళాపూర్ణోదయము తిరుమలదేవరాయని తరువాతివాఁడగు శ్రీరంగరాయల తరువాతివాఁడగు వేంకటపతిరాయలకాలమునకుఁ జివర విరచింపఁబడినది. వసుచరిత్ర కృతిపతి యార్వీటి బుక్కరాజునకు నాలవపురుషుఁడైయుండఁ గళాపూర్ణోదయకృతిపతియాఱవపురుషుఁడై యున్నాఁడు. కానఁ గళాపూర్ణోదయము వసుచరిత్రము తరువాత రచియింపఁబడిన దనుట నిర్వివాదాంశము. ఈకళాపూర్ణోదయము క్రీ॥శ౧౬౧౦ ప్రాంతమునందు విరచింపఁబడిన దనుట నిశ్చయము. పింగళి సూరన కృష్ణదేవరాయని కాలపువాఁ డని హిందూదేశకథాసంగ్రహకారులగు వేంకటలక్ష్మణరావు ఎం॥ ఏ॥ గారు వ్రాసిరి గాని యది యనాదరణీయము.

—సూరన మతము.—

ఈసూరనకవి తా నద్వైతమును గొల్చువాఁడైనను దన దేమతమైనను దన కృతిపతి మత మెట్టిదైన దానినట్లు శ్లాఘించుచు నితరముల నిరసించుచు వచ్చినాఁడు. రాఘవపాండవీయము ను గృతిపొందిన వేంకటాద్రి ప్రభుఁడు శివారాధనతత్పరుఁడగుటచే నందు శివుని బరదైవతముగా వర్ణించి యున్నాఁడు. వేంకటాద్రివిభుఁడు విరూపాక్షస్వామికంకితముగా గ్రంథము ను జేయఁ గోరఁగా నట్లు చేసితి నని పీఠికలో వ్రాసియున్నాఁడు. ఇఁకఁ గళాపూర్ణోదయ కృతిపతివిష్ణుభక్తుఁడు. వైష్ణవదాసుఁడై యున్నాఁడుగాన విష్ణుస్తవము విశేషముగాఁ జేయుటయ కాక వైకుంఠపురముం గూర్చి:—

"సీ. ఘటమంచుఁ బటమంచుఁ గారయుక్తులఁ బెంచు దుష్టతార్కికులకు దూరమగుచు
శ్రుతిమంచు స్మృతులంచు శుష్కకర్మము లెంచు మీమాంసకుల కప్రమేయమగుచు
ఝుకియంచు ఖరియంచు జనులపీనుల నొంచు శబ్దైకగతుల కసాధ్య మగుచు
మృషయంచు నిషయంచు విషమోక్తిఁ గలహించు నద్వైతపరుల కప్రాప్యమగుచుఁ
గృష్ణవిష్ణుహృషీకేశ కేశవయను, భక్తుల కొకప్పుడు ను దుర్లభంబు గాక
పరఁగుఁ బ్రకృతివికార దుస్స్పర్శతరము, గురుతరానందఝురము వైకుంఠపురము."

అని వర్ణించుటలో నద్వైతమతనిరసనముం గావించియున్నాఁడు. వైష్ణవమతశీలుఁ డగు కృతిపతిని మెప్పించుటకే యిట్లు చేసినాఁడో నిజముగాఁ దాను నద్వైతవిరోధియో తెలియకున్నది. సూరన తండ్రియగు నమరన్న సోమారాధ్యకృపాలబ్ధామల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శివభక్తిశోభితాచారుఁ డఁట! ఈతని కృతినాయకుఁ డగు కృష్ణమరాజు విశ్రుతతిరుమలతాతార్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూజశ్రీనివాసగురుచరణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయుఁ డఁట! రాఘవపాండవీయమున్ బట్టి చూడ నీసూరన యు లలాటేక్షణ భక్తిశీలుఁ డని తెలియవచ్చుచున్నది. సోమారాధ్యశిష్యుఁ డగు సూరన తాతాచార్యశిష్యునకుఁ గృతియిచ్చి యద్వైతము ను నిరసించి యున్నాఁడు. కాన నీతఁడు శైవవిశిష్టాద్వైతి కానోపు. అద్వైతికాని శైవమతశీలుఁడు వైష్ణవమతశీలునకుఁగృతి యిచ్చి విష్ణుని బరదైవతముగా వర్ణించుట చమత్కృతియే. ఈతఁడద్వైతికాక పాషండమతస్థుఁడు కనుకనే "శ్రుతియంచు స్మృతియంచు శుష్కకర్మము లెంచు మీమాంసకుల కప్రమేయమగుచు" నని శ్రౌతస్మార్తకర్మల నిరసించి యున్నాఁడు కాఁబోలు! ఇట్లనుటకు ను వలనుపడదు. ఏమనఁ దనతండ్రిని వర్ణించుచు "సారతరవైదికసభాభారుఁ" డనియు, "వైదికశాస్త్రసింధునిరంతరప్రమథనాత్తశుభుం"డనియు, "శ్రౌతస్మార్తపథానువర్తనుఁ"డనియుఁ బ్రభావతీప్రద్యుమ్నములో నుడివియుండుటచే నీతఁడు శైవకులఁజాఁడుగాఁ డని తెలియవచ్చుచున్నది. ఇఁకఁ గళాపూర్ణోదయములోని వర్ణనమంత యుఁ గృతిపతి మెప్పునకై యుండు నని తలంపవలయును. ప్రభావతీప్రద్యుమ్నము ను దనతండ్రి కంకితము చేయుటచే నీతఁడు చాల పితృభక్తికలవాఁడని తెలియవచ్చుచున్నది.

—సూరనకవితావిశేషము—

లోకములోఁ గవిత్వ మబ్బుట చాల దుర్లభము. మనపూర్వులు—

"శ్లో॥ శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతుస్తదుద్భవే."

అని కవిత్వ మబ్బుట కిన్ని లక్షణము లుండవలె నని నుడివియున్నారు. పింగళి సూరనార్యునం దీలక్షణము లన్నియుఁ బూర్తిగాఁ గలవు.

ఈతనికి రచనాపాటవము సహజముగాఁ గలదు. శబ్దపరిచితియందు మేటి. అలంకారశాస్త్రమునందుఁ జాలపరిచయము కలవాఁడు. ఈతఁడు కవిత్వ ముండవలసినరీతిం గూర్చి కళాపూర్ణోదయమునందే యిట్లు చెప్పియున్నాఁడు :—

"సీ. పాసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ దమలోన దొరయుశబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమర నుపమాదులు ను యమకాదులు నగు, నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవిత చెప్పంగ నేర్పుచక్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగనివారు కలరె.''

ఈపద్య మీతనికి నలంకారశాస్త్రమునందుఁ గలపరిజ్ఞానము ను వెల్లడించుచున్నది. నిజముగా నీతనికవిత్వమునకు గుఱియై యున్నది. మఱి యు నీతఁడు కవిత్వలక్షణముం గూర్చి ప్రభావతీప్రద్యుమ్నములో నిట్లు వ్రాసియున్నాఁడు :—

''సీ. శబ్దసంస్కార మొక్కట ను జాఁగనీక పదమైత్రియర్థసంపదలఁ బొదలఁ
పలఁపెల్ల నక్లిష్టత ను బ్రదీపితముగాఁ బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితన్యాస మాచరించుచు ను శాఖాచంక్రమక్రియఁ గడవఁజనక
ప్రకృతార్థభావంబు పాడుకోనడుచు నుపపత్తి నెందునత్యూర్జితముగ
నొకటఁ బూర్వోత్తరవిరోధ మొదవకుండఁ, దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనరఁ, బలుక నేర్చుటబహుతపఃఫలము గాదె.''

ఇందు వర్ణింపఁబడినరీతి నీతనికవిత్వము దోషరహితమై గుణమణిగణఘటితమై ప్రకాశించుచున్నది. ఈతఁడు తొల్లింటియాంధ్రకవులందఱివలెనే బాణకాళిదాసాదుల సంస్కృతకావ్యములను బాగుగాఁ జదువుకొని వారియూహలఁ బెక్కింటిఁ దనకబ్బములలోఁ జెట్టుకొని యున్నాఁడు.

—సూరనకబ్బంబులు.—

సూరనరచించిన కబ్బములు మూఁడు కాన్పించుచున్నవి. రాఘవపాండవీయము ను కళాపూర్ణోదయము ను ప్రభావతీప్రద్యుమ్నము ను. ఈకావ్యములం దున్నపీఠికలంబట్టి యీతఁడు గారుడసంహితాదిగ్రంథము లనేకములు విరచించినట్లు కాన్పించుచున్నది గాని యవి యిప్పుడు లభ్యములు గాకున్నవి. రంగరాట్ఛందముంబట్టి చూడ నీతఁడు గిరిజాకల్యాణ మను గ్రంథమును గూడఁ జేసినట్లు తెలియవచ్చుచున్నది. ఇది యు నిప్పు డెచ్చట ను గానరాదు.

ఈతఁడు రచించిన ప్రధానకావ్యములలో మొదటి దగు రాఘవపాండవీయము ప్రసిద్ధకథ యు రెండవది యగు కళాపూర్ణోదయము కల్పితకథ యు మూఁడవది యగు ప్రభావతీప్రద్యుమ్నము మిశ్రకథయుఁ గలవి గానున్నవి. రాఘవపాండవీయ మీతనిపాండిత్యము ను దెలుపుచున్నది. కళాపూర్ణోదయము కల్పనాచమత్కృతి బోధచేయుచున్నది. ప్రభావతీప్రద్యుమ్నము వర్ణనాసామర్థ్యంబు వెల్లడించుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## —రాఘవపాండవీయము—

ఇది రామాయణభారతకథల రెంటిటి జోడించి చెప్పిన ద్వ్యర్థికావ్యము. ఇది ద్వ్యర్థికావ్యములలో నెల్ల (సంస్కృతకావ్యములలోఁ గూడ) మొదటి దని కొందఱును నాంధ్ర ద్వ్యర్థికావ్యములలో నెల్ల మొదటి దని మఱికొందఱును నుడివియున్నారు. కాని యీరెండును గూడ సత్యములు గావు. ఇంతకుఁబూర్వము సంస్కృతమున ద్వ్యర్థికావ్యములు పెక్కులు గలవు. ఇంతకు ముందు గీర్వాణభాషలోఁ గవిరాజకృతమైన రాఘవపాండవీయమే కలదు. దానిం జూచి దానిసాహాయ్యముం గొనియే సూరన యీభాషాకావ్య మొనరించియున్నాఁడు. రాఘవపాండవీయమునందలి యీక్రిందిపద్యమువలన నిది సూచింపఁబడుచున్నది :—

"శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
ఉండుం దద్గతిఁ గావ్యమెల్ల నగునో హో యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బంద్రు ద
త్తుం డెవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్."

ఇందలి "భాషాకృతిన్" అనుపదమును "అందునుం దెనుఁగుకబ్బం" బను పదమును నింతకుఁ బూర్వము సంస్కృతమున నిట్టికావ్యము కలదని సూచించుచున్నవి. సూరన కళాపూర్ణోదయమునందుఁగూడ రాఘవపాండవీయముం గూర్చి ముచ్చటించుచు "నీకె చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్" అని నుడివియున్నాఁడు. దీనిం బట్టి దీనిని కవిరాజకృతసంస్కృతరాఘవపాండవీయమునకు నాంధ్రభాషాకావ్యముగా నెంచుచున్నారు. (చూ. పి. దక్షిణామూర్తిగారి గ్రంథము)

ఇఁకఁ దెలుంగునం దన్ననో రామరాజభూషణుఁడు సూరనకుఁ జాలపూర్వుఁడని మన మిదివఱకె కనుఁగొనియున్నాము. రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనళోపాఖ్యాన మనుద్వ్యర్థికావ్యము నిదివఱకె వ్రాసియున్నాఁడు. దానిని జూచియే సూరకవి యీగ్రంథము ను విరచించియున్నాఁడు. రెండుకావ్యములందలి మొదటిపద్యములం గనిన నియ్యది తేటపడఁగలదు :—

గీ. అలఘుమణిసౌధవిజితహేమాద్రినిషధ, నగర మవతంసమఖిలభూనగరములకు
లలితజయసంపదలఁ బొల్చు నిలుపయోధ్య, లఘుగభీరాంబుపరిఖాకలాప మగుచు.

హరిశ్చంద్రనళోపాఖ్యానము.

గీ. వెలయు నఖిల భువనములలోన వారణ, నగరి పురమతల్లి నాఁ దనర్చి
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబల నయోధ్యనా, రాజవినుతిఁ గనిన రాజధాని. రా॥పాం॥

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూరన తన గ్రంథములో ద్వ్యర్థి కావ్య మెట్లుండవలెనో తెలిపినాఁడు గానఁ నాతనిది మొదటి కావ్య మనుట యుచితముగాదు. అట్లెంచుచో సూరన తనగ్రంథములో మహా కావ్య మెట్లుండవలయునో తెలుపుచువచ్చినాఁడు గాన నీతఁడే కావ్యరచనఁ బ్రౌఢుఁడనవలసియుండును. సూరనకంటె రామరాజభూషణుఁడు పూర్వుఁడగుటయే యీయంశమును నిర్ధారణము చేయుచున్నది. రామరాజభూషణుఁడును దన కావ్య మనుపమాద్భుత మని తెలిపియే యున్నాఁడు.

—ప్రభావతీప్రద్యుమ్నము.—

ఇది యీతఁడు తుదిని వ్రాసిన ప్రబంధము. ఇది హాస్యములగు స్వభావోక్తులు గలిగి మృదుమధుర శైలి నొప్పి రసికజనుల కమితానందముం గూర్చునదిగా నున్నది.

—కళాపూర్ణోదయము.—

ఇది సూరన కబ్బములలో నడిమిది. ఇందే యీతని కవితానైపుణ్యము నంతను జూపి యున్నాఁడు. ఇది వచనములోనుండిన నొక నవల యనవచ్చును. ఇందలి కథా కల్పనము మిక్కిలిచిక్కుగానున్నది. "ఊహించి తెలియరాకుండ సూరపరాజు శ్రమఁ గళాపూర్ణోదయము రచించె." అని రామకృష్ణకవి పలికినట్లుగా నొకవదంతి కలదు. రామకృష్ణకవి యీతనికిఁ బూర్వుఁ డగుటచే నియ్యది యాతని యభిప్రాయముగా నెన్నుటకు వలనుపడదు గాని సూరనకుఁ దరువాతివా రెవరో యట్లు వ్రాసియుందురు. ఎవరు వ్రాసిన ను నియ్యది యథార్థకథన మనుటకు సందియములేదు. ఇందలికథ చాలఁ జిక్కుగ నున్నది; మూలకథ పంచమాశ్వాసమున వర్ణింపఁబడియున్నది. ఈకవికిఁ దిర్యగ్జంతువులచే మాటలాడించుట బాలురచేఁ బ్రౌఢవాక్యములు పలికించుట మున్నగు నస్వాభావికవిషయములందు రుచియుండుటచే నిప్పటి వారి కిందలి కథ యంతగా రుచింపకపోవచ్చును గాని మొత్తముమీఁదఁ గథాకల్పనము మనోహరముగ నున్నది. ఈతఁడు రామరాజభూషణుని జూచి యాతనివలెఁ దన కావ్యములలో నాటకశైలిఁ దెచ్చిపెట్టికొనినాఁడు. వసుచరిత్రమునందు విమర్శకుఁడు తెచ్చిపెట్టఁబడినట్లె యిందును గలఁడు. రామరాజభూషణునివలెనే యీతఁడు ను జిత్రకవిత్వరచనమునందుఁ జాల యభిలాష కలవాఁడు. ఈతఁడు ప్రభావతీప్రద్యుమ్నములో వర్ణనాంశమునందుఁ గ్రొత్త మార్గము ద్రొక్కినను దీనియందు మాత్రము తొల్లింటికవుల మార్గముననే పోయినాఁడు. ఇతఁడు ను బూర్వకవులవలెనే సముచితముగఁ గ్లిష్టరచనయం దింపు కలవాఁడె కాని వేఱుకాదు. కావుననే తెలుఁగువాక్యములవలెఁ గాన్పించు సంస్కృతవాక్యములను విలోమముగాఁ జదివిన నొక యర్థమును ననులోమముగాఁ జదివిన వేఱొకయర్థమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చుపద్యములను విరచించియున్నాఁడు. సందర్భమును బట్టి యిట్టివి వ్రాయుటయుఁ ప్రౌఢతయే.

ఈకావ్యమును దనవార్ధకదశలో విరచించిన ప్రభావతీప్రద్యుమ్నము వలెఁ గేవల శృంగారపురుషులకు రుచించునట్లు మాత్రము చేయక నడుమనడుమ వేదాంతవిషయములఁగూడఁ జొప్పించి దీనినిసర్వవిధముల స్తవనీయమగు నుత్తమమహాకావ్యముగా నొనరించియున్నాఁడు.

కావున నీగ్రంథము శృంగారరసప్రాయంబును బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబు నునై యిహపరముల రెంటికి ననుకూలించునదియై విరాజిల్లుచున్నది.

కాశీభట్ట బ్రహ్మయ్య.

## విజ్ఞాపన.

విద్వద్వరులార !

మేమీ కళాపూర్ణోదయమును జక్కఁగ ముద్రింపవలయునని సంవత్సరమునుండి ప్రయత్నము చేయుచున్నను మంచిప్రతులు దొరకక కొన్ని దినములను నవరించుటలోఁ గొన్ని దినములును జెల్లినవి. సాధ్యమైనంతవఱకుఁ జాలభాగము శుద్ధప్రతిగాఁ జేయవలయునని మేము పడిన శ్రమ దీనిం జదివిన పండితులకు విదితము కాక పోదు. కొందఱు మామిత్రులు కఠిన పదముల కర్థములు (పాండురంగవిజయములోవలె) వ్రాయింపవలయునని చెప్పిరి. కొందఱు కథ చిక్కుగా నుండును గావున సంక్షేపముగా నిందు మొదట జేర్పఁడని నుడివిరి. కాని మేమిది ముద్రించుట కిచ్చిన సరస్వతీ ముద్రాక్షరశాల మేనేజరు కొత్తపల్లి సూర్యరావుగారి యనారోగ్యము చాలకాలమునుండి మేము చేయు నాలస్యమునను మఱింతతోడగుటయు నిదివఱకు బహుదినముల క్రిందట నే యార్యమతబోధిని పత్రికయందును సరస్వతియందును నచిరకాలములో వెలువడునని ప్రచురించియుండినప్పటికి నట్లు చేయలేకపోవుటయు మమ్ముఁ ద్వరపెట్టినందున మాస్నేహితుల యాలోచనమును వెంబడించుట కసమర్థుల మైతిమి. ఇందలి 6 వ యాశ్వాసములోని 157-170 పద్యములకు రాజమహేంద్రవరము గవర్నమెంటుసర్వకళాశాలలోని సంస్కృత పండితులు బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులవారు వ్రాసిన ప్రతిపదార్థములనొకమిత్రునివలనఁ బడసితిమి. దీనితెలుఁగర్థము మండపేటనివాసులు దేవులపల్లి నృసింహశాస్త్రులుగారు వ్రాసియిచ్చిరి. శతావధానులు బ్రహ్మశ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారును బి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాపురము ఆర్. సి. హెచ్చి హైస్కూలులోనియాంధ్రపండితులు బ్రహ్మశ్రీపురాణపంజ మల్లయ్యశాస్త్రులుగారు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులు గారును ఆర్యమతబోధిని పత్రికాధిపతులగు చుట్టూరి గోపాలదాసు గారును జామర్లకోట బ్రహ్మశ్రీ వింజమూరి రామమూర్తి గారును మాకమితసహాయ మొనరించిరి. మఱియు బ్రహ్మయ్యశాస్త్రులుగారుద్యోగమున దీక్షితులైనవారయ్యును మాకొఱకు శ్రమపడియింత లిపీఠికను వ్రాసియిచ్చిరి- ఇందఱుపండితులకు మాయందు లోకమునందు నవ్యాజమగు వాత్సల్యముకలదు కావున నేచేసినయత్నము నిరాటంకముగ కొనసాగిన దని యుప్పొంగుచు నీపండితమండలి కనేక కృతజ్ఞతావందనము లొసగుచున్నారము. ఇంతకంటె లోకోపకారమే ముఖ్యముగాఁ గల యీవిద్వద్వర్యుల కేమియుపకృతియుం జేయఁజాలము.

ఎంతశ్రద్ధగాఁ జూచినను మావలనఁ గలిగిన లోపము లనేకము లిందుండవచ్చును. వేత్తలు వానిని మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు

విద్వద్విధేయులు,

పి. వి. రమణయ్య అండుకో.

గుంటూరు.



## —సవరణ.—

| | | | | |
|---|---|---|---|---|
| 62 పుట | 83 పద్యం | 1 పంక్తిలో | కసవుబట్ట | కసవుబుట్ట |
| 64 ,, | 101 ,, | 2 ,, | వారస్త్రి- | వారస్త్రీ. |
| 120 ,, | 50 ,, | ,, | కటా- | కదా. |
| | | 3 ,, | జాగిలంబలై | (జాగిలంబడి |

పుటలో 36 పద్యము పిమ్మటను "ఆనినవిని" యనియేమైనఁగొంతయుండవలసి యున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమారమణాయనమః.

# కళాపూర్ణోదయము.

## ప్రథమాశ్వాసము.



లావణ్యవతీసమన్వితయు కాశ్మీరప్రభాచారువ
క్షోలంకారమణిప్రకాండము నవీనార్కుండుగా సన్మనో
నాళీకావిరతప్రభాతమగుచు న్భాసిల్లుతత్త్వంబు నం
ద్యాలశ్రీనరసింహకృష్ణవిభు నిత్యశ్రీయుతుం జేయుతన్. 1

చ. ప్రమదవిలాసనర్తనవిభాసురగోపకిశోరమూర్తితోఁ
దమ కిలువేలుపై వెలయుతాండవకృష్ణపదాబ్జసేవ ను
త్తమతనయాదిసంపదలు తామరతంపరలై ప్రవర్ధిల
న్రమణఁ దనర్చుఁగావుత ధరన్నరసింగయకృష్ణుఁ డెంతయున్. 2

మ. పలుకే ల్దాపలికిం గుచస్తబకసేవాలోలతం బోవఁ డా
పలికే ల్సిగ్గున మాన్ప నల్క నది తత్పార్శ్వంపు లేఁజెక్కుఁ గో
మలపాదంబును ముట్టుచున్వలచుబ్రహ్మం బర్ధనారీశ్వరుం
డెలమి న్నిత్యముఁ బ్రోచుఁ గృష్ణవసుధాధీశు న్నృసింహాత్మజున్. 3

చ. అనయముఁ బ్రేమసంధిలఁగ నాస్యచతుష్టయయోగపద్యచుం
బనఘనకాంక్షఁ బోలె నిగమంబులపేరిట నాల్గురూపులం
దనరెడుభార్యమాట జవదాఁటక సృష్టి యొనర్చు వారిజా
సనుఁడు నృసింహకృష్ణవిభుఁ జాలఁ జిరాయువుఁ జేయుఁగావుతన్. 4

చ. ఒనరఁగ నూర్ధ్వలోకమున నుండి ధరిత్రికి డిగ్గుగంగకు
న్మనసిజవైరిమౌళియు హిమక్షితిభృత్కటకంబుఁబోలె శో
భనరసభవ్యకావ్యమయభారతికి న్వసతిస్థలంబులై
తనరెడువామలూరుభవతాపసు సాత్యవతేయుఁ గొల్చెదన్. 5

చ. పలుకఁ దలంప దవ్వగుభారతరామకథార్థముల్ విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్రవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్పలలితశక్తి నందఱను సుప్రథితంబులు చేసినట్టిధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్. 6

ఉ. మెచ్చి యొకింతగౌరవము మెచ్చక యుండి లఘుత్వలేశముం
దెచ్చుటకు న్సమర్థులె కృతిక్రియకుం గుకవిత్వగర్వితుల్
తచ్చరితంబుపేక్ష కుచితంబగుఁ గాక నగంగ నైన వా
క్రుచ్చి యజాగళస్తనసగోత్రుల వారల నెన్న నేటికిన్. 7

సీ. విశ్రాంతి విరతి గావింపక సారవత్సాహిత్యసౌమనస్యంబు లెడఁగి
సమతయుంబు దప్పక శ్రవణకఠోరంబు లైనశబ్దముల నత్యాకులాత్మఁ
జేయక సత్పరిచితసుకుమారవాక్సరళితాభిప్రాయఁగా నొనర్చి
పదబంధశిథిలతఁ బాటిల్లఁగానీక యేఛందములయందు నేమరిలక
పరఁగు కవియు దోహకరుఁడును యశము దు, గ్ధమును బడయు నట్లు గానినాఁడు
కృతిదురాప మొదవుఁ గీర్తియుఁ బాలు నీ, కుంట కాదు హాసయోగ్యుఁ జేయు. 8

వ అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి సుకవుల సేవించి కుకవు లుపేక్షామాత్రదండ్యు
లగుట భావించి సకలలక్షణలక్షితం బైనమహాప్రబంధంబు కీర్తికారణం బనియు ని
తరం బపహాసకారణం బనియు మాహించి యెద్దియేని యు నొక్కసరసప్రబంధని
బంధనంబునకు జాతకౌతూహలుండనై యుండునంత. 9

సీ. తనకీర్తి సకలదిగ్దంతిదంతానంతకాంతిపఙ్క్తికిఁ జెలికత్తె గాఁగఁ
దనప్రతాపంబు మార్తాండమండలచండిమోపదేశమునకు నొజ్జ గాఁగఁ
దననీతిపస యుగంధరభట్టిచాణక్యఘనచాతురికి నిదర్శనము గాఁగఁ
దనవిలాసంబు కందర్పేంద్రనందనవార్తకు ఖండనవాది గాఁగ
వెలయు మనుమార్గవర్తనావిరతవిహిత, ధరణిపరిపాలనాపరిస్ఫురితరాజ్య
వైభవుండు నృసింహభూవరసుతుండు, జిష్ణుతుల్యుండు నంద్యాలకృష్ణవిభుఁడు. 10

వ. అనర్ఘ్యమణిమయాభరణకిమ్మీరితదిగంతరుండు ను, గంధసారకస్తూరికాద్యనులేపసౌ
రభసంవాసితపర్యంతభాగుండు నగుచుం జెలువుమీఱి కొలువుకూటంబున గురుశుక్ర
నీతిచాతురీవిఖ్యాతిపంచనాచుంచుపంచాంగనయజయాతిశయభూషితశేముషీవిశేషవై
యాత్యు లగునమాత్యులు ను, సదనూచానసంప్రదాయసిద్ధాధ్యయనశుద్ధిగరిమపరిపూ
ర్ణశక్తివిభ్రాజమాననానావేదమంత్రతంత్రసంతాయమాన శాంతికర్మదూరవారితదైవి
కాత్యాహితు లగుపురోహితులు ను, గాణాదకాపిలగౌతమీయజైమినీయ వైయాసి
కపాతంజలతంత్రరాద్ధాంత పూర్వపక్షవైపరీత్యకరణచణ యుక్తికల్పనానల్పకల్పిత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రతివాదిబుద్ధివిధ్వంసు లగువిద్వాంసులు ను, బ్రాహ్మపాద్మవారాహవైష్ణవమాత్స్య
మార్కండేయభాగవతబ్రహ్మకైవర్తకౌర్మగారుడస్కాందాది నిఖిలపురాణ కథాకథ
నపాండిత్యపరితోషితాంతర్వాణికు లగుపౌరాణికులు ను, నాశుమధురచిత్రవిస్తారకవి
తావిజృంభణస్తంభిత బాణభవభూతికాళిదాసముఖ్యవిఖ్యాతిగౌరవు లగుకవులు ను,
బహువిధపురాతనజ్యౌతిషసిద్ధాంతసంఘర్షనిశితమతిచతురిమసమధిగతకళాకాష్ఠానిమే
షాదిసూక్ష్మసూక్ష్మతరసూక్ష్మతమకాలకలనాకౌశలప్రకాశకీర్తికు లగుమౌహూర్తిక
లు ను, ధన్వంతరిచరకప్రముఖనిఖిలాద్యవైద్యవైశారద్యదృష్టాంతభాజనాయు
ర్వేదవేదిత్వవైభవాలంకారు లగునగదంకారులు ను, విశ్వావసుతుంబురునారదాంజ
నేయభరతమతంగకోలాహలదత్తిలప్రభృతి గాంధర్వకౌశలగౌరవస్మరణకారణగాన
మాధురీధురీణతాప్రీణితబుధశ్రేణికు లగువైణికులు ను, రూపలావణ్యవిభ్రమవిలాస
విభవవిస్మాపితవివిధజనస్వాంత లగువారకాంతలు ను, నిరంతరపరిణతబహువిధప్రహ
రణవ్రణకిణగణకాఠిన్యఖండిత కంకటాక్షవక్షోవిభాగజాఘుష్యమానశౌర్యసాహసో
ద్భటు లగుభటులు ను, యథోచితప్రదేశవర్తు లగుచుం గొలువ, వేత్రహస్తజనసమా
ఖ్యానసందర్శితసామంతకుమారుల సేవలు కటాక్షహాసభాషణాదుల నాదరించుచు గీ
తవాద్యతాళానువర్తినర్తకీనర్తనప్రవర్తనంబు లవధరించుచు ననేక విధరాజ్యకా
ర్యవినియుక్తులైనయధికారిపురుషులవిన్నపంబు లాలించుచు వందిబృందపఠ్యమానబి
రుదావళిప్రబంధబంధురశబ్దార్థచమత్కారంబులు పరికించుచు నొడ్డోలగంబై కూ
ర్చుండి కార్యప్రసంగవశంబున. 11

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు సుచరిత్రుఁ బింగళిసూరసుకవి
పౌత్రు నన్నపపతి భావనదౌహిత్రు నమరధీనిధికి నబ్బమకుఁ బుత్రు
ననుజన్ములైనట్టి యమరన యెల్లనార్యులు భక్తిసేయంగ నలరువాని
సత్కావ్యరచనావిశారదుం డగువాని సూరననామవిశ్రుతుని నన్ను
బ్రియముసంధిలంగఁ బిలిపించి బహువస్త్ర, భూషణాదిదానములఁ గరంబు
సంతసం బొనర్చి యెంతయు గౌరవ, మెసఁగ మధురఫణితి నిట్టు లనిరి. 12

శా. నీచే నొక్కమహాప్రబంధముఁ గడున్నిర్నిద్రసారస్యలీ
లాచిత్రం బగుదాని నోయనఘ వాలాయంబుఁ జేయించుకో
మాచిత్తంబున వేడ్క యుండు నది నీమాధుర్యధుర్యోరువా
గ్వైచిత్రి న్సఫలంబు చేయుము సుధీవర్గంబు లోహో యనన్. 13

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. ఇటు ము న్నాయడసంహితాదికృతు లీ వింపొందఁగాఁ జెక్కొన
ద్పుట విస్తారము చెప్ప నేల యవి సంస్కృతోభయశ్లేషసం
ఘటన స్రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె
చ్చట నెవ్వారికి నీక చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్. 14

క. అని యాదరణము మిగులం, దనర నియోగింప నేను నాకోలఁది గనుం
గొన కీయకొంటిఁ దగ నా, యనఘుఁడు సంకల్పసిద్ధుఁ డనునమ్మిక చేన్. 15

వ. ఇవ్విధంబునం బూని యమ్మహాప్రభువు సగౌరవనియోగంబునకు ననుగుణంబుగ మదీ
యశక్త్యనుసారంబున విచారించి యపూర్వకథానవిధానవైచిత్రీమహనీయంబు ను
శృంగారరసప్రాయంబు ను బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబు ను నగుకళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబు నిర్మింపం గడంగితి నట్టిమదీయకృతి కధీశ్వరుం డగుచుం బెం
పొందు నంద్యాలకృష్ణభూవిభునివంశావతారం బెట్టి దనిన. 16

గీ. సకలకువలయపాలనైశ్వర్యయుతుఁడు, చండధామకృతశ్రీఘనుండు నైన
రాజచంద్రుండు జగతిఁ గరంబు వెలయు, సంతతోదయసౌభాగ్యశాలియగుచు. 17

గీ. అత్రిలోచనభవుఁ డయ్యు నతఁడు మీఱె, నపరిమితతారకావళి కధిపుఁ డగుచుఁ
జాఁద్రిలోచనభవుఁ డయ్యు ధరఁగుమారుఁ, డేకతారకజయ మొందు టేమియరుదు.

క. ఆ నంద్రునివంశంబున, భూచంద్రుం డారెవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల, త్సాచక్రస్ఫూర్తికీర్తిసాంద్రుఁడు పుట్టెన్. 19

క. ఆబుక్కనృపాలునిచా, హాబలముకోలంది తదసిహతరిపువీర
ప్రాబల్యనిరాకృతనల, కూబరునకుఁ దెలియఁ జెలిసికొనఁగలఁ డేనిన్. 20

చ. మతి నజుఁ డంచురూపమున మన్మథుఁ డంచు నయోన్నతి స్పృహ
స్పతి యనుచు న్వదాన్యతను భానుసుతుండనుచు న్నుతించు నా
ర్యతతి నిరంకుశాః కవయ యం చది యొప్పుట గాని బుక్కభూ
పతికి సముండు లేఁడు తలఁప న్భువనంబుల నేగుణంబులన్. 21

క. పావనగుణ యగుసబ్బల, దేవిని గుణశీల గుణనిధి న్మతి బల్లా
దేవిని వివాహమయ్యె న, హావిభవుఁడు బుక్కనరవరాగ్రణి వేడ్కన్. 22

క. అందు ను బల్లాదేవికి, నందను లుదయించి రింద్రనందనదృశుల్
చందనవిశదయశ ల్సం, క్రందనవైభవులు రామరాజప్రముఖుల్. 23

ఉ. భూమహనీయశీలుఁ డగుబుక్కయయగ్రవధూటి కబ్బలాం
బామణికిం జనించిరి సమస్తగుణాఢ్యుఁడు సింగరయ్య యు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రామవిభుం డహోబళధరారమణుండు ను విక్రమాన్వయో
ద్దామత నొప్పనీతికి సుదగ్రజయాభ్యుదయంబులుం బరేన్. 24

ఉ. అందు ను సింగభూరమణుఁ డౌబళదేవిని బెండ్లియాడి నం
క్రందనతుల్యవైభవులఁ గాంచెఁ దనూజుల మువ్వుర న్బుధా
నందవిధాయినిర్మలగుణప్రకరు న్నరసింగరాజు శ్రీ
నందనతుల్యు నారవిభు నవ్యపురారవుఁ దిమ్మపార్థివున్. 25

ఉ. ప్రాలినకీర్తిఁ బెంపెసఁగి వారలలో నరసింహరాజు నం
ద్యాలపురాధిపత్యవిభవాతిశయంబు వహించి మించె ను
త్త్వేలనిరూఢి నెల్లెడల విశ్రుత మై తనవంశ మెల్ల నం
ద్యాలపదప్రసిద్ధిఁ దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్. 26

క. ఆనరసింగక్షితిపతి, మానవతీతిలక మైనమాదమదేవి
న్మానితసమస్తగుణల, క్ష్మీనిధిఁ దగఁ బెండ్లియాడెఁ గీర్తి దలిర్పన్. 27

సీ. మందారమందాక్షసంధాయిదానప్రసిద్ధుండు సింగరక్షితివరుండు
గర్వితారాతిహోర్గర్వనిర్వాపణోదీర్ణుండు నారధాత్రీవిభుండు
భూభువనప్రశంసాభిశోభితమహాప్రాభవాఢ్యుఁడు కుమారాబళుండు
శరదిందుచంద్రికాపటశుద్ధవిహసనస్ఫురదనర్గళకీర్తి వరదరాజు
బ్రమరవిక్రమరఘుపతి రఘుపతియును, దనయు లేవురు గల్గి రుదాత్తసకల
గుణగరిష్ఠులు నరసింగకుంభినీశ, లాధినాథున కమ్మాదమాంబయందు. 28

క. నరసింగవిభునిసింగరి, నరవరుఁ డనమానుఁ డధికనయసారత ని
ర్భరశూరత నతిధీరత, నసు దగుదానక్రియావిహారత నిలలోన్. 29

క. నారాయణభక్తుఁడు సుజ, నారాధనపరుఁడు జలరుహాక్షీసుమశో
నారాచుఁడు నరసింగయ, నారావనిపాలకుండు నరవిభుఁ డాజిన్. 30

సీ. స్వారాజభావంబు కారణంబుగ నేమొ శక్రుండు నెలవున జడియ కునికి
మిత్రపుత్రతఁ దాను మిత్రుండ నని యేమొ యముఁ డాత్మపురమునఁ దెమల కునికి
వారుణీసేవామదారూఢిచే నేమొ జలధర్త దనవీటఁ గలఁగ కునికి
తల్లడం బేల యేధవదుండ నని యేమొ ధనరాజు నిజపురిఁ దలఁగ కునికి
తమకు మఱి దిక్కు లేమిని దలఁకి యేమొ, కడమనలువురు మూలల నడఁగి యునికి
వీరవరుఁ డైననంద్యాలనారవిభుని, యాజిఘోరభేరీధ్వను లడరునపుడు. 31

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పగ లనుశబ్దమాత్రము నభఃకుసుమంబు నిజంబు నారభూ
జగదధిపప్రతాపగుణసంపదచే రవి తత్సరూనుగాఁ
దగునె నుతింప నారవి ప్రతాపమహత్త్వముచేతఁ జేప్పచుం
బగ లొకనాఁడు దప్పక యపారతఁ జొప్పడుఁ గాక మానునే. 32

చ. వవలక యుత్కళేంద్రునిసవాయిబరీదు వడంచు దుర్జయుం
గుమపనముల్క తల్లడిలఁ గొట్టె మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండపిటికడ నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్. 33

సీ. శ్రీవిష్ణుపదభక్తిచే ధర్మసంపత్తి ధర్మసంపత్తిచేతను జయంబు
జయసిద్ధి చేత నుజ్జ్వలబాహుశౌర్యంబు శౌర్యగౌరవముచేఁ జతురనీతి
నీతి పెంపున మహనీయసామ్రాజ్యంబు సామ్రాజ్యమహిమచే శాంతిగుణము
శాంతిచే వేదాదిసకలసద్విద్యలు విద్యలచే బుద్ధివిలసనంబు
దానపాత్రవివేకంబు దాన నీగి, దానఁ బ్రవిమలకీర్తి యుఁ దానఁ గులము
ప్రేమ నత్యంతము నలంకరించుకొనియె, భళిర నంద్యాలనారభూపాలకుఁడు. 34

చ ఘనతరదానచాతురిన కాదు శ్రుతిస్మృతిశాస్త్రనైపుణం
బున ను బుధానురంజనుఁడు భూరిశుచిత్వమునంద కాదు లో
భవపుఁ బ్రతాపసంపదను బావకుఁ డానరసింగభూపనం
దనుఁడు కుమారయోబవసుధాతలనాయకుఁ డివ్వసుంధరన్. 35

ఉ. సాత్త్వికతాపరాయణుఁడు సత్యవచస్కుఁడు దానశాలి దో
స్సత్త్వవిజృంభితుండు రణశౌర్యధురీణుఁ డకల్మషుండు ధీ
రత్వము మన్కిపట్టు చతురత్వనిధానము నీతిపద్ధతీ
తత్త్వవిశారదుండు వరదక్షితిపాలుఁ డయోబలుఁ డెయ్యెడన్. 36

క. కరుణాఘనవీక్షణమున, శరణాగతరక్షణమున సంగరశౌర్యా
భరణాహితశిక్షణమునఁ, దిరముగ రఘుపతియ రఘుపతిం దలపోయన్. 37

గీ. అందు సింగరయ్య యనవద్యగుణ గౌరి, మాంబఁ బెండ్లియాడి యాత్మజులను
గనియె నారసింహజననాథు రఘుపతి, క్ష్మాతలేంద్రు నోబమనుజవిభుని. 38

క. ఆనారసింహవిభుఁ డన, మానగుణుఁడు రఘుపతిక్షమావరుఁడు యశ
శ్శ్రీనిధి యహోబళాఖ్యధ, రానాథుఁడు సకలగుణవిరాజితుఁ డయ్యెన్. 39

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆముప్పురిలో నగ్రజుఁ, డై మించు నృసింహునకుఁ దడంగన యగు శ్రీ
రామాంబకు నుదయించె న, హోమతి నావళిచినోబళాఖ్యుఁడు వెలయన్. 40

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁ డఖండచండతే
జోవిభవంబునం దపనసూనుఁ డనూనవితీర్ణి పెంపునం
దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంపఁ గా
నావళి చిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే. 41

క. ఇది సింగరయ్యసంతతి, తదనుజుననుజుఁ డగునోబధరణిపువంశా
భ్యుదయక్రమ మభివర్ణిం, చెద నిఁక భువనప్రసిద్ధి చెన్నెసఁగంగన్. 42

గీ. ఆకుమారయోబభూకాంతుఁ డింపుతోడ, బెండ్లియాడె గుణగభీరచరితఁ
దిరుమలాంబ నెందుఁ బరమపాతివ్రత్య, పావనతఁ దనర్చుభాగ్యనిధిని. 43

సీ. నానాగుణైకనిధానంబు నా నొప్పునరసింగమేదినీనాథవర్యు
నిద్దంపుఁగీర్తులఁ దద్దయు విలసిల్లునట్టి పెద్దయహోబళాధిపతిని
నాదిమనృపగతి మేదినీజనములఁ బ్రోదిసేయుచు నొప్పుమాదవిభుని
సమున్నతోన్నతవృత్తి నెన్నికఁ గన్నట్టి చిన్నయహోబళక్షితితలేంద్రు
సారతరచారుచారిత్రు నారనృపుని, నాకుమారాబళుండు తిమ్మాంబయందుఁ
గనియె నేవురు సుతుల సత్కాంతియుతుల, విష్ణుసేవాభిరతులఁ బ్రవీణమతుల. 44

క. అందు నరసింగవిభుఁ డిం, పొందఁగఁ దాఁ బెండ్లియాడె నుభయకులశ్రీ
సౌందర్యగుణచరిత్రము, లందిర మై తనకుఁ దగిన లక్ష్మీదేవిన్. 45

స్రగ్ధర. ఆలక్ష్మీదేవియం దాయతమతి నరసింగావనీశుండు గాంచెం
ద్రైలోక్యస్తుత్యుల న్నందనుల నురుయశోభవ్యు నోబాహ్వయక్ష్మా
పాలోత్తంసుం గవిత్వప్రముఖబహుకళాపారగుం దిమ్మరాజుం
బాలాదిత్యోపమానప్రచురతరరుచిస్ఫారు నారక్షితీంద్రున్. 46

ఉ. వైభవజృంభణావమతవాసవుఁ డిందుముఖీనవీనచే
తోభవమూర్తి కల్మషవిదూరుఁడు నిత్యరమావిహారలీ
లాభవనాయమానసువిలాసకటాక్షనిరీక్షుఁ డాకుమా
రాబళునారసింహసుతుఁ డోబళు నెన్నికకెక్కె నెంతయున్. 47

శా. ప్రతాపోజ్జ్వలశూరతాగుణకుమారాహోబళక్ష్మాపస
త్పుత్రశ్రీనరసింహతిమ్మవిభుకీర్తి ల్మీఱి యత్యంతమై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిత్రిం దిక్తటుల న్నటింప నది దా శిలించుచున్నట్ల త
త్తోత్రాకారసరస్వతీసతి నటించుచున్నారిరాడ్జిహ్వలన్. 48

క. ఏసీమ వెదుకలేక వి, భాసిలు నంద్యాలతిమ్మపార్థివుబలము
ల్వాసిగల యతివిభాసి, ప్రాసాదులతోడ సత్ప్రబంధములగలిన్. 49

ఉ. భూతలవాలలామ కడుఁ బొ ల్పెసలారెడువేడ్కలోడ నం
ద్యాలకుమారయోబనరనాథునృసింహునిసారశౌరి యు
త్తాలభుజాగ్రమెక్కట యుఁ దక్కక యెక్కెఁ దదీయకీర్తి యుం
జాలను చేయుశృంగము నపత్నికి మచ్చర మెచ్చకుండునే. 50

గీ. అతనిపిన్నతండ్రి యగు పెద్దయోబభూ, నాథుకుండు గాంచె నందనులను
పారసుగుణమణివరోరాశి నుద్దండ, యోబశేంద్రుఁ జిన్నయోబఘనిని. 51

ఉ. ధీరజనాభివర్ణ్యుఁడు తదీయకనిష్ఠపితృవ్యుఁ డుజ్జ్వలా
కారుఁడు పిన్నయోబఘుఁడు గాంచెఁ దనూజుల మువ్వుర న్మనో
హారిగుణోన్నతుం దిరుమలయ్యను రాజమనాముఁ గృష్ణభూ
మీరమణోత్తముం దిశలమించి నిజాన్వయకీర్తివర్తిలన్. 52

క. ఇల నంద్యాలకుమారా, బలువంశచరిత్ర మిది సుపావనవృత్తిం
బొలుపొందు తదనుజన్మని, విలసితవంశక్రమంబు వివరింతు నిఁకన్. 53

ఉ. సంగరపార్థుఁ డావరదశౌరి సుతత్రితయంబుఁ గాంచె నా
త్మాంగన యైనశ్రీతిరుమలాంబికయందు మహాగుణాఢ్యు శ్రీ
రంగజనాధిపు న్బృథవరప్రణతు న్నరసింగమేదినీం
ద్రుం గవిపోషణాతిచతురుం గనకక్షితిపాలశేఖరున్. 54

గీ. అందు శ్రీరంగరాజు సమస్తగుణని, కేతనం డాశ్రితసుపర్ణకేతనుండు
తనకుఁ గులరూపగుణములఁ దగినయట్టి, తిరుమలాంబికఁ బెండ్లి యై తేజరిల్లె. 55

సీ. శోభనజయలాభసౌభాగ్యభూభరణాభిశోభితుఁ డైన యోబశేంద్రు
నిర్మలసత్కర్మధర్మనిర్మితబుధసమ్మోదుఁ డైయొప్పు తిమ్మవిభుని
సురదంతిశరదభ్రహరదంతిరిపునిభస్ఫురదుదంచితకీర్తి వరదవిభుని
విష్ణుసేవాఢ్యంభవిష్ణు నిత్యాచారనిష్ణాతహృదయుని గృష్ణనృపుని
నందనులఁ గాంచె నలువుర నందనద్రు, మానువర్తనకీర్తనీయానవరత
దానముదితార్యతతుల ననూనమతుల, రమణఁ దిమ్మాంబయందు శ్రీరంగరాజు. 56

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఆ ట్టిశ్రీరంగవిభు ద్వితీయానుజునకుఁ, గనకవసుధాధిపతికిని గలిగె సుతుఁడు
ధరణిఁ గనగిరియౌబళేశ్వరుఁడనంగ, నభినుతాహ్వయుఁడగుచుఁ బెంపారె ఘనుఁడు.

వ. ఇది వరదరాజువంశక్రమంబు. 58

గీ. ఇట్టి వంశాభివృద్ధికి హేతువు లయి, తనరు సౌజన్యనిధు లన్నదమ్ము లెపుడుఁ
దనదుసౌభ్రాత్రమునకుఁ జిత్తముల నలర, వెలసె నంద్యాలనారపృథ్వీవరుండు. 59

క. ఆనారక్షితిపాలుఁ డ, నూన శ్రీవిభవనముచితోద్వాహవిధిం
బూని వరియించె నిజరూ, పానుగుణం దిరుమలాంబ నధికప్రీతిన్. 60

గీ. పుణ్యకులశీలమహిమల శ్లోక యనఁగ, నిష్కళంకపాతివ్రత్యనిధి యనంగ
వెలయు నంద్యాలనారభూవిభుని దేవి, పరమశుభగుణనికురుంబ తిరుమలాంబ. 61

క. ఆతిరుమలాంబయందుఁ బ్ర, భూతియశుఁడు నారవిభుఁడు పుత్రులఁ గనియెం
బూతాత్ముల నరసింగ, క్ష్మాతలవిభు మాచనృపునిఁ గనకక్షితిపున్. 62

ఉ. ఉన్నతిఁ బేర్చి యందు వెలయు న్నరసింగవిభుండు శౌర్యసం
పన్నుఁ డటంచు విద్యఁ బ్రతిపన్నుఁ డటంచుఁ గవీంద్రకోటికి
న్సన్నిధి యంచు నిత్యహరిసన్నిధి యంచు విపన్నరక్షణా
సన్నుఁ డటంచు నెప్పుడు బ్రసన్నుఁ డటంచు జను ల్నుతింపఁగన్. 63

క. నారయనరసింహుఁడు మఱి, నారయ నరసింహుఁడే యథార్థము కరజ
శ్రీరచితార్యస్థితి యై, భూరిప్రహ్లాదభరణమున శోభిలుటన్. 64

శా. స్ఫూర్తిప్రౌఢి నిరంతరం బగుచు నెచ్చోటం బ్రకాశింపఁగా
వర్తిల్లు న్భువనంబు లందును సహోవస్థానవత్కౌముదీ
మార్తాండద్యుతివైభవంబుల ననిర్మర్యాదవై చిత్రితోఁ
గీర్తింపన్వశ మే నృసింహవిభుసత్కీర్తిప్రతాపోన్నతుల్. 65

ఉ. భానుసమానతేజుఁడు విభాసురరూపమనోజుఁ డుజ్జ్వలా
నూనయశోవిభాసి విభవోదయనిత్యవిలాసి విశ్వవి
న్నానితవర్తనుండు కవిమండలనిర్మితకీర్తనుండు ల
క్ష్మీవమాధవుండు నరసింహుని నారయమాధవుం డిలన్. 66

క. వితరణమున రణమున న, న్నతవినయంబున నయంబునం దన కిలలోఁ
బ్రతి లేక నారభూపతి, సుతుఁ డామాదప్రభుండు శోభిలు మిగులన్. 67

క. కనకమహీభృద్వరుఁ డల, కనకమహీభృద్వరుండు గట్టిగ శౌర్యం
బున విబుధాధారత్వం, బునఁ బరహితధర్మభావమునఁ దలపోయన్. 68

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. స్థానం బెన్నఁడుఁ బాయ దుత్సవఘనస్వస్త్రీసుఖక్రీడ పై
పై నొందన్భువి నర్థిలోకము దివిం బ్రత్యర్థిలోకంబు న
న్యూనం బాకనకయ్య యుద్యతకృపాణుం డైనమాత్రంబునన్
దానత్రాత్రము లింతయంతె యనుచుం దర్కింపఁగా శక్యమే. 69

సీ. సంతానసురధేనుచింతామణిశ్రీకి లజ్జఁ దానొనరించు నొజ్జ యగుచు
నలకాధిపతిసూనునలకాములకు దర్పరహితత్వ మొనరించు మహితలీల
నరభీష్మకోదండగురుభీష్మసమరంబుఁ దక్కువ యనిపించు నిక్కువముగఁ
గుంభీనసక్రోడకుంభీనగిరులకు విశ్రమంబు నొనర్చు నశ్రమమున
సంతతౌదార్యసౌందర్యశౌర్యధరణి, భరణనైపుణగుణములఁ బ్రౌఢి మెఱసి
వఱల నరసింగమేదినీశ్వరుని నార, నరవరేణ్యునికనకభూనాయకుండు. 70

క. ఆమువ్వురందు నగ్రజుఁ, డై మించిన నారసింహుఁ డతులితవిభవ
శ్రీ మెఱయఁ బెండ్లియాడెం, బ్రేమం బెదకొండమాంబఁ జినకొండాంబన్. 71

చ. నిరుపమవిక్రమంబు ను వినీతి యు నీతియుఁ బోలెఁ దత్త్వవి
త్పరిచయము న్విరక్తి యు ను భక్తియుఁ బోలె సుయోగవర్తనా
దరవిభవంబు శాంతి యు ను దాంతి యుఁ బోలెఁ గరం బలంకరిం
చిరి తమనిత్యసేవ నరసింగయ నిద్దఱుకొండమాంబలున్. 72

గీ. అందుఁ బెద్దకొండమాంబయం దానర, సింగభూపవరుఁడు శిష్టమతులఁ
గాంతియుతుల సుతులఁ గనియె మూర్తిక్షమా, రమణుఁ దిమ్మవిభుని రమణమీఱ.

ఉ. ఆనరసింగభూపతి ప్రియం బెసఁగం జినకొండమాంబయం
దానమితాఖిలాహితసమాజుఁ దనూజుని గాంచె బంధుసం
తానసురావనీజు నమదంచితభోగబిడౌజు సూరిమై
త్రీనవభోజు భానునిభతేజుని గృష్ణమరాజు నున్నతిన్. 74

వ. అందు.

సీ. శేషుపర్వముఁ జివ్వి శీతాంశురుచి నవ్వి పాలమున్నీటిపైఁ గాలుద్రవ్వి
యాదిత్యుపస యాఁచి హాలనాలంబును లోఁచి హుతవహుగర్వ ముట్టూఁత లూఁచి
కల్పశాఖిని గెల్చి కర్ణుకీర్తి మరల్చి ఖచరువార్తఁ దరల్చి ఘను నదల్చి
కందర్పు మఱపించి యిందుని నిందించి నలకూబరు హసించి నలుని మించి
తనరుఁ గీర్తిప్రతాపవదాన్యతాసు, రూపవిలసనములచేత రూఢికెక్కె
ధరణి నంద్యాలనరసింగనరవరేణ్యు, పట్టి యైనట్టి మూర్తిభూపాలకుండు. 75

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తిమ్మక్షితిపతి శోభిలు, నిమ్మహిలో మిగుల వాసి కెక్కెడు గాంభీ
ర్యమ్మున ధైర్యమ్మున శౌ, ర్యమ్మునఁ బ్రఖ్యాతుఁ డై జనావళి పొగడన్. 76

సీ. శ్రీపుత్రతులనానురూపంబు రూపంబు నిర్మలాంగిరసవినీతి నీతి
మహనీయుతానుపమానంబు మానంబు భూతిమద్రిపుదావహేతి హేతి
ధాత్రీసురశ్రీనిదానంబు దానంబు తులితమారుతిభీమబలము బలము
గోవిందచింతాన్వభావంబు భావంబు కోవిదబంధుసంకులము కులము
తరమె వర్ణింప వనభృత్తటకుటీర, కటురటద్ఘిల్లికాచ్ఛటాఘటితబిరుద
కాహళారవశంకాప్రకంపితత్ర, తీపనృపజాలు నంద్యాలతిమ్మవిభుని. 77

ఉ. చెన్నెసఁగన్నృసింహనృపశేఖరుతిమ్మనృపాలమౌళి య
ఖ్యున్నతకీర్తి యజ్జగము నూనఁగ మానవకన్యలట్ల తా
రెన్నఁడుఁ బోని పున్నమసమ్మద్ధులఁ గాంచితి మంచు నబ్బుచు
న్వెన్నెలపప్పు లాడుదురు వేలుపుఁగన్నెలు నాగకన్యలున్. 78

ఉ. శ్రీయుతుఁ డైనయట్టి నరసింహునితిమ్మనికీర్తివైభవ
శ్రీ యనుమాక్తికావళికిఁ జెల్వధికంబుగ దిక్కులన్నిజ
స్ఫాయదకీర్తినీలపటసంవరణం బొనరించు మున్నుగా
నాయనశత్రువర్గము ప్రియం బిఁక నెవ్వఁడు సేయకుండెడున్. 79

మ. క్షితి నంద్యాలనృసింహుతిమ్మవిభుసత్కీర్తిప్రతాపంబు లు
న్నతిఁ బర్వన్నవఫేనవిద్రుమము లై నానాబ్ధుల న్సింహసం
తతిధాతుప్రకరంబు లై వలయగోత్రంబులన్ స్రవచ్చామరో
ర్జితసిందూరము లై దిశాగజములం జెన్నొందఁ గైసేయుచున్. 80

మ. అతిధన్యుం డగు నారసింహవిభుతిమ్మాధీశహస్తాబ్జసం
గతిచే వింతగ దానవారి సముద్రగప్రౌఢిచే విప్రసం
తతియందు న్నెఱపున్ ధృవస్థితిని దానత్వంబుఁ బ్రహ్లాదపో
షితయుం గాక యశేషభోగపరతం జెన్నొందు సౌభాగ్యమున్. 81

ఆ. ఇట్టితిమ్మమేదినీశ్వరుం డనుఁగుఁద, మ్ముఁడు సభక్తివినయమోదగరిమఁ
దను భజింప నలరుఁ జినకొండమాంబగా, రాపుఁబట్టి కృష్ణభూపవరుఁడు. 82

సీ. ఆఖండలాహంక్రియాఖండనోదంచితాఖండవిభవోదయాంచితుండు
వారణారిత్రపాకారణాజిస్థలావారణాంచద్భుజపౌరుషుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మందేహారిపుదీప్తి సందేహఘటసాత్యమందేహ తేజస్సమన్వితుండు
బంధురాజీవమస్సింధురాజీభవద్బంధురాజీజయభ్రాజితుండు
వెలయు నిఖిలదిగంతపృథ్వీతలాధి, పతిశిరఃకంపకంపితశ్రుతివలక్ష
మణిమతల్లీఘృణిప్రతిమల్లఫుల్ల, కీర్తివిభవుండు నంద్యాలకృష్ణవిభుఁడు. 83

మ. అనఘాత్ము న్నరసింహకృష్ణవసుధాధ్యక్షు న్విరాజద్గుణై
కనిధి న్వర్ణనసేయుఁగాఁ దరమె దిక్చక్రంబునం దెల్ల శో
భనతత్కీర్తినదీమతల్లి ప్రవహింపం బూనము న్మున్నుగా
ఘనమై యుబ్బఁ గపీంద్రులం జెలమలం గావ్యావృతం బెంత యున్.

చ. అవిరళనిత్యభోగవిభవాతిశయోల్లసితుండు నారపా
ర్థివువరసింహకృష్ణజగతీపతి నిత్యసువర్ణవర్ష ము
ల్కవినికరంబుపైఁ గురియఁగాఁ బ్రవహించును హృద్యగద్యప
ద్యవివిధకావ్యరూపత ననంతసువర్ణమహాప్రవాహముల్. 85

ఉ. దానమునందుఁ! గృష్ణవసుధావరుఁ డప్రతిముండు యుక్తముం
దీని గణించిన న్సురమణీలతి గొల్చుచు నున్కి సప్తసం
తానసమృద్ధి చేకుఱుటఁ దద్వినయాదిగుణంబు లన్ని యుం
బూనిక మీఱఁగా ననయము న్సురభిత్వము దాల్చియుండుటన్. 86

మ. తని నంబేలనృసింహకృష్ణునిమహాదానక్రియాకౌశలం
బు మహత్త్వంబున నర్థిబృందము ధనంబుం జెందఁ బ్రత్యర్థిబృం
దము చెందు న్నిధనంబు నింతయు మదిం దర్కింప యుక్తంబు త
థ్యము వర్ణాధికు లెందుఁ గోరుదురు వర్ణాధిక్యవద్యోగమున్. 87

మ. ఒకప్రద్యుమ్నునిఁ గాంచెఁ దొల్లి యదువంశోద్భూతిఁ బెం పొందుచు
న్సకలక్ష్మాసుతులం గరం బిపుడు శ్రీనంద్యాలకృష్ణక్షితీం
ద్రకరాబ్జాన్వయసంభవంబు కతనం బ్రద్యుమ్నులం జేయుచున్
బ్రకటం బయ్యెడు దానవారి భవతారం బొంది ధాత్రీస్థలిన్. 88

చ. కలన నృసింహకృష్ణుఁ డతికౌశలతన్ జళిపించు ఖడ్గ మ
గ్గలికఁ ధటిల్లత ల్వెడలఁ గ్రాయు నరాతినరాధిపు ల్మన
స్వలసిన పీనిఁ గైకొనుఁడు వక్త్రిములం దని పంపు పూరి పు
ల్లలు వెదచల్లెనో యనుతలంపులు చూపటులం జనింపఁగన్. 89

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ జళిపించు వాలుపెనుడాకను భీ
తిల్లినపగవాఁ డడవిని, భిల్లవిలాసినుల చూపు బెరుకుల కళుకన్. 90

చ. పొలుపుగ నారసింహనృపపుంగవు కృష్ణుఁ డనంతవైభవో
జ్జ్వలుఁడు ప్రతాపకుంకుమపుఁజర్చలఁ బాండుయశఃప్రసూనపూ
జల నలరించు విశ్వమును జక్రి విరాడ్తను వౌ పెఱింగి యా
బళి యిది నో మహాద్భుతపుభక్తి మనంబున నెన్ని చూడఁగన్. 91

చ. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడ నియంతు లె టన్న నంద్రు గా
ని మది నొకింత చేర్చి యతినిం గనుఁగొన్న తుద స్సుధాంశురూ
పము ప్రియ మన్నవారు మఱి భావజు మే లనువారుఁ గల్గు ట
బ్ర మిదియ సాక్షి యానృపునిరాజమనోజులరూపువాసికిన్. 92

మ. అవనీకాంత కరంబు రంజిలెను నంద్యాలాధిపుం గృష్ణపా
ర్థివునిం జేరి సదా యనంతవిభవాధిక్యంబు సొంపు న్వరా
హవనత్రాశలజృంభణంబుఁ గులగోత్రౌన్నత్యము న్మానసో
త్సవ మైనట్టి యనేకపావనగుణోదారత్వముం గల్గుటన్. 93

సీ. శ్రీవిష్ణుభజనైకశీలుం డలోలుండు వైదికమతరక్షణాదరుండు
నెఱబంటుతనమున మెఱయు జోదులయందు గజహయారోహదీక్షాగురుండు
కీర్తిప్రియుండు సంగీతసాహిత్యాదిసకలకళావిచక్షణుఁడు రసికుఁ
డీవిపట్టునఁ గొంచె మెఱుఁగఁడు తగవరి కలనైన నెఱుఁగఁడు కల్లలాడ
ధీరుఁడు గభీరుఁ డుచితవిహారుఁ డార్య, వర్తనుఁడు శరణాగతవత్సలుండు
శేషునకు నైన వర్ణన సేయవశమె, యనఘు నంద్యాలకృష్ణధరాధిపతిని. 94

క. ఈదృశగుణరమ్యున క, న్యాదృశధరణివరదురభినయసామ్యునకున్
వైదికపథరతునకు న, లాదికనృపనయతిరస్క్రియాదక్షునకున్. 95

క. ఆధునికరామభద్రున, కాధిక్యచణాహవక్రియారుద్రునకున్
మాధవపదపద్మసమా, రాధనవిధిసాధితావిరళభద్రునకున్. 96

క. జయలక్ష్మీపరిణయసహృ, దయకీర్తిసతీసమర్పితస్ఫుటతేజో
మయహారిద్రాక్షతసం, చయమధురితదిక్పురంధ్రిజననిటలునకున్. 97

క. దానోదకధారామహి, మానారత శీతలీకృతాంగణభూభా
గానుష్ఠితయాచకసం, తానాకించన్యజన్యతాపక్షితికిన్. 98

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఇభకర్ణతాళవృంత, ప్రభవానిలసుఖితపరనృపప్రహితసువ
స్తుభరవహజనసమాకీ, ర్ణభవనగోపురబహిర్ధరాభాగునకున్. 99

క. శ్రీనంద్యాలనృసింహ, క్ష్మానాథతనూజునకు సముంచితవిభవ
శ్రీనవ్యబిడౌజునకు న, దానకళాతులితదైవతక్ష్మాజునకున్.

క. ఆత్రేయమహానిగోత్రప, విత్రునకు విరోధిమదలవిత్రునకు దిశా
జైత్రునకు లోచనోత్సవ, గాత్రునకును గొండమాంబికాపుత్రునకున్. 101

క. విశ్రుతతిరుమలతాతా, ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జశ్రీనివాసగురుచర, ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్. 102

క. జిష్ణుయశోధిక్షేపణ, ధృష్ణుమహాశౌర్యపద్ధతీఖేలునకున్
వైష్ణవకులశీలునకుం, గృష్ణమహీపాలునకు ను గృతిలోలునకున్. 103

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నాయురారోగ్యసమృద్ధియు నగునట్లుగా నా యొనర్పంబూనిన కళాపూర్ణోదయం బనుమహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 104

క. శ్రీలకు నాకరమై వి, ద్యాలతలకు నాలవాలమై హాటకి సదా
కేళీభవనం బై మహిఁ, జాలన్ ద్వారవతియొప్పు సౌభాగ్యములన్. 105

ఉ. తోయధి యంకభాగమునఁ దోరపుఁ బెంపులతోడఁ దత్పుర
శ్రీ యతఁ డూర్మిహస్తములచేఁ దను నిట్టటు ముట్టి లాలనల్ సే
యఁగ నొప్పు నంగగుణలీలల నెంత యుఁ బెద్ద యయ్యు నే
ప్రాయము లైనఁ దండ్రియెడఁ బట్టుదు రేలొకరీతిగా జనుల్. 106

చ. సురుచిరవస్తుసంపదల సొంపునఁ బెంపు వహించుచున్న య
వ్వరపురి యాత్మసామ్యపువివాదముఁ దీర్చుకొనంగఁ బిల్చి ని
ర్జరనగరి న్సువర్ణమయసౌధకరప్రసరంబుచేత నం
బరము గ్రహించి భూరితరపౌరజనారవగౌరవంబుచేన్. 107

చ. అహిమకరప్రచారసుదురాసదమై నిబిడాంధకారస
న్నహనముఁ బోల్పఁ దెల్పుచుఁ దనర్చుసముద్రమహోదకంబుచే
బహిరభివేష్టితం బగుచు భాసిలుఁ దత్పురికోట మిక్కిలి
న్మహిమను జక్రవాళగిరిమాడ్కిని జూడ్కికి వేడ్క సేయుచున్. 108

చ. నలుగడలందుఁ గంబములనం దగి రైవతకాదిపర్వతం
బులు పయి కప్పుటాచలువపోలికి నింగి యు నందుఁ జిత్రభం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గులు పసరించు సౌధమణికూటమరీచులు నొప్పు నొప్పు మి
క్కిలిఁ బురలక్ష్మి కొల్వుచవికెం గొలు వున్నగతి న్శుభస్థితిన్. 109

చ. కొలఁదికి నెక్కుడై పరుణు గోటలు మేడలు గోపురంబులుం
గొలువఁగ నచ్చు నప్పురముకోటల మేడల గోపురంబులం
జలనిధితుంగభంగచయసంగతతత్ప్రతిబింబసంతతి
చ్ఛలమున నంత మ్రొక్కు ధరఁ జాఁగిల నీడనువారు చిన్నవోన్ 110

ఉ. శైవలనీలయుం గమలశాలి యు నైనయగడ్తనీరు ప
ద్మావళి వ్రాఁతతోడికరకంచుగ నొప్పుచుఁ గోటశాటిలా
గై వఱలంగ హర్మ్యకనకాంశునికాయము పేరఁ దత్పుర
శ్రీవిలసిల్లు నభ్రచరసింధువుమాళికి మల్లెదండగన్. 111

చ. విలసితవీచికాయుతరవిప్రతిబింబమిషంబున న్మహా
జలనిధి లక్ష్యపార్శ్వశయచక్రిపయిం జెయి చాఁచి యొప్పు సం
ధ్యలఁ బురలక్ష్మి ధర్మవిధు లన్నియు నొజ్జలపుచ్చకాయ గా
వలయు విడెం డతండు రసవత్పరిఘామిషబాహుబంధమున్. 112

చ. అగణితలీల నప్పురమునందు విరాజిలుచుండు నెంత యున్
మృగమదలేపపంకముల మేలిమికోటలుఁ బువ్వుఁదోఁటలు
న్నగనిగమ న్విటంకములు నీలపుమేడలుఁ బైఁడిగోడలుం
బగడఁపుటంచుపాంకముల పచ్చలతిన్నెలు వింతవన్నెలున్. 113

లయవిభాతి.

అలికులము నీలముల చెలువము వహింప నవదళములు హరిన్మణులపోలువునఁ దలిర్పం
దలిరుగమి కెంపులుగఁ బలుదెఱఁగు క్రొవ్విరులవిలసనము ముత్తియపుగుళికలకుఁ దక్కం
గలమణులకుం బసిఁడితళుకులకు నీ డగుచు వెలయఁగఁ బరాగములు లలితపువితానం
బులుగగృహముఖ్యముల చెలువుప్రతిబింబములు బలెఁ బురమున న్దెసలఁ బొలుచు సుమనంబుల్.

చ. అనుపమితస్వవాద్యనివహంబులతో నరిఁ బ్రోయుట లుపహిం
పనియది యై పురం బెదురుపాఁజులు దీర్చెనొ మచ్చరంబున
న్వనధి కనంగ నయ్యుపవనంబులు పొల్చు మిళిందబృందము
ల్ఘనమకరాకృతిం దనర గాఁపులఁ జింద మరందబిందువుల్. 115

చ. కొలఁదికి మించు కెంజిగురుగుత్తుల మొగ్గలఁ బువ్వుగుచ్ఛకం
బులఁ బువుఁదేనెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయల న్ఫలం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుల నెపుడు న్సమగ్రపరిపూర్తి వహించుచుఁ దద్వనవ్రజం
బెలమి వహించు నందనసమృద్ధికిఁ గోటిగుణాధికంబుగన్. 116

శా. చాతుర్యాధిగతాఖిలశ్రుతిచయు ల్షడ్దర్శనీపారగు
ల్శ్రౌతస్మార్తవిధిప్రసిద్ధపదవీసంచారలీలాఢ్యగు
ల్చేతోనామవిలోచనాచలితలక్ష్మీనాథసంజ్ఞాదిమ
జ్జ్యోతిర్నిత్యనిరీక్షు లప్పురములో నున్నట్టియుర్వీసురుల్. 117

శా. నానాయుద్ధవిహారశూరులు గుణానందజ్ఞఖుశ్రీనఖాం
శానూనభ్రమ వాయుధప్రణకిణోదంచచ్ఛరీరు ల్సదా
దానప్రౌఢియశోవిశేషజితమందారు ల్గభీరు ల్మహా
మానాధారులు రాజమాత్రు లతిభూమి న్నింతు రవ్వీటిలోన్. 118

చ. తమతమపెద్దవారు మును దాఁచినద్రవ్యము లున్నయట్ల యుం
డ మితములేక యొప్పెడు ధనంబులు తారు గడించి యుర్విని
త్యము నమితంబుగా నవనిధానము లున్నచు నప్పురంబులో
నమరెడుకోమటు ల్నగము రల్లకుబేరునిధీశ్వరత్వమున్. 119

క. ద్విజులను శాస్త్రినియుక్తిని, భజియించుచు నిండ్లసకలభాగ్యవిభవమ
క్కజమై తనర సుఖింతురు, సుజనులు తత్పురములోని శూద్రులు నెమ్మిన్. 120

క. ఎప్పట్టున ఘనసారపుఁ, గుప్ప లగుగజాశ్వసుభటకోటులచేతం
గప్పురపుఁగ్రోవి యనఁ దగి, యప్పురము కరంబు వెలయు నవనీస్థలిపై. 121

బంధురము. అరుదుగఁ బిడికిట నడఁగెడు నడుము ల్హాస్తిసమానపుయానములు
న్గురుజఘనములును గుచములభరముం గొప్పల గొప్పతనంబులు మే
గరగరికలు సిరిగలనగు మొగము ల్కలికిమెఱుంగుఁగనుంగవలు
న్దొరయఁగ వెలపడఁతులు విటధనముల దోఁతురు చొప్పడ నప్పురిలోన్. 122

చ. అమరఁగ వింత నింపొసఁగు నందు విటాలికి వేశవాటిహ
ర్మ్యములు విమానమానహరహారిశిరోగృహభాగభోగభా
గమరభుజంగసంగహృదయంగమరంగదనంగసంగర
క్రమరమణీమణీమణితకల్పన నేర్చినపారువాలచేన్. 123

ఉ. మాటలు వేయు నేటికి రమావరుఁ డందుఁ బదాఱువేల పై
నూటెనమండ్రు భార్యలు దనుం బరిపూర్ణరతోత్సవంబుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థాటముగాఁ దనర్చు కుతుకంబులఁ గొల్వఁ గడు న్సుఖించు నే
నాఁట నెఱుంగ నివ్విలసనంబు లతం డల తెల్లడీవిలోన్. 124

ఉ. అందును వారు వీ రనక యందఱు ధర్మధురీణు లైనవా
రందఱు శుద్ధభాగవతు లందఱు వేదనిరూఢి నున్నవా
రందఱు సాత్త్వికప్రవరు లందఱు తత్త్వ మెఱింగినట్టివా
రందఱు సత్కృపానిరతు లందఱు పావను లెన్నిచూడఁగన్. 125

క. ఇట్టట్టన నేటికిఁ ద, త్పట్టణమున నున్నయట్టి ప్రజ లేజాతిం
బుట్టినవారలు వంద్యులు, గట్టిగఁ దద్వినుతి నెల్ల కలుషముఁ బాయున్. 126

క. అం దొకనటముఖ్యుని ప్రియ, నందని శైశవమునంద నానాగుణరే
ఖం దనరారుచుఁ గ్రమమున, నందంబుగ యౌవనోదయముఁ బ్రాపించెన్. 127

క. కలభాషిణి యనుపేరా, వెలఁది మునువహించు నహ జవిలసత్కలభా
షలకుఁ దగఁ జాల దపు డది, కలికితనముఁ జతురతయును గలపలుకులకున్. 128

క. బాలిక కేలికతాలన, తాలసదచిరావతరణ తరుణిమతరుణీ
లీలానలాలనవిలస, నాలోకనములు విటాళి నట్టిటుఁ జేసెన్. 129

ఉ. కూఁకటివేణితోఁ గురులు గూడకమున్న కుచప్రరోహము
ల్కోఁకలతోడి సామ్యమును బొందకమున్న నితంబసీమకున్
ద్రేఁకఁదనం బొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
స్త్రాఁకలఁ బెట్టెఁ దానఁబవనామెత బాలికకై విటావళిన్. 130

చ. తనదు మెఱుంగుఁజెక్కులకు దాఁకఁగనీక మొగంబు నాఁపుచుం
జనుబొగడ ల్నఖాంకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచు
న్ననసిజుమించుభీతి యను నానయుఁ బూనుచు నే మృగాక్షి యుం
పానరుచు మెన్నఁ డొక్కొ యని యువ్విళులూరుదు రత్తఱిన్ విటుల్. 131

క. తొలుప్రాయపు మగరాదముల, తలఁపుల తమకములు మిగులఁ దను నెదురుకొన
న్నలజాక్షి జవ్వనము గడు, వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగ నంతన్. 132

గీ. మొదల బలురేక గలఁ దఁట యది యుఁ గాక
వయసుప్రొత్తఁట వెలయాలి వంగడ మఁట
వనిత చక్కఁదనంబు నవ్వన్నెలాఁడి
తనముఁ గ్లిల్కితనంబు ను దరమె పొగడ. 133

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. మెఱుఁగుదట్టపుమించు మించుబాగుల నింపు నింపు చక్కని ముద్దు నెమ్మొగంబు
నవచంద్రికలనవ్వు నవ్వుతీవులఁదాఁపు చూపుల చొక్కపు సోయగంబు
సారూఢిఁ బలుమాఱు మాఱువిండ్లకు నేర్పు నేర్పుకన్బొమదోయి నెఱతనంబు
గటికిచీఁకటిఁగప్పు కప్పుఁబూనినకొప్పు కొప్పుతోరంపు జక్కవ బెడంగు
గుబ్బపాలిండ్లు లేఁగౌను గొప్పపిఱుఁదు, బాహులతికలు మృదుపదపల్లవములు
బంగరుసలాకపస భంగపఱచుమేనుఁ, గలిగి చెలువొందుచుండు నాచెలువ మిగుల.

చ. బెళుకులఁ జిమ్ముచుం గలికి బిత్తరిచూపు సరత్నకుండలాం
చలకమణోజ్జ్వలత్వము పస న్నెఱపం జళిపించుచుం భుజం
గులహృదయస్థలు ల్వ్యాడిచి కొంచక తోడన పోఁటుగండ్లఁదూ
ఱె లలన యూర యొక్కకతటిం బువుబోండ్లు కటారికత్తియల్. 135

ఉ. కీర్తనపాత్రచిత్రమృదుగీతకళాకలనప్రవీణత
న్నర్తననైపుణీవిలసనంబుల పెంపుల నత్యపూర్వని
ర్వర్తితపంచబాణసమరక్రియలన్ హరిణాక్షి యప్సరః
కీర్తిబలెన్ హరింపఁ దొడఁగె న్విటసంచయచిత్తవిత్తముల్. 136

ఉ. ఆరమణీశిఖామణి మహావిభవంబున నొక్కనాఁడు సిం
గారము లెంత యు న్మెఱయఁగాఁ జెలికత్తెలతోడఁ జేటికా
వారముతోడ వింతచెలువం బనయంబుఁ దలిర్పఁగా వసం
తోరువిలాసభాసురపురోపవనంబుల కేగియచ్చటన్. 137

సీ. క్రొన్నన ల్వలరాచమన్నన ల్గరగర మల్లిక ల్గానియున్న మల్లికలును
సంతానముల కళిసంతానముల యాటపాటల ములుచూపుపాటలములు
తీవచేకొన్న పూఁదావిచేఁ బథికాంతరంగము ల్గొంచు సారంగములును
మాఱుమే లైనబంగారుమేడలఁ బోల్ప భంగినై మించు సంపంగిగములు
మంజులము లై కనంబడు వంజులములుఁ, గుందములు ను వాసంతికాబృందములును
కేసరములును నవనాగకేసరములుఁ, గాంతలార కంటిరె కడు వింత లగుచు. 138

క. పూఁబోఁడి యొఱసికొని చనఁ, గాఁ బయ్యెద యొడిసి పట్టెఁ గనుఁగొంటె చెలీ
లేఁబొన్నను బళిరా యిది, గోఁ బురుషాహ్వయము నిలుపుకొనుసమయంబున్. 139

క. అలికుచంబులు సాగ, య్యాలికుచంబులు ను వాదు లాడెడుఱొద గాఁ
బోలు ననఁ దనరె నూపుర, కోలాహలచకితకీరఘోషము వింటే. 140

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. లేఁగరువలిచే ముంగలి, పూఁగొమ్మలు పాయవడుచు భుజగతి నెఱపం
గాఁ గురువక మిదె తివిరెడుఁ, గౌఁగిటికి న్నీకుఁ దగుచెఁ గైకొనమిచెలీ. 141

చ. పయఁటచెఱఁగు శాఖ యను పాణిఁ దెరల్చుచు నోలతాంగి తాఁ
బ్రియమున భృంగకైతవనిరీక్షణము ల్కుచకుట్మలంబులం
గయికొన నొప్పు పల్లవశిఖామణి మామిడి రిత్తపోవు నే
భయ మిఁక నేల రే మిచటఁ బత్రముఁ బుష్పము వేడ్క నందితో. 142

వ. అని యిప్రకారంబుల మఱియు నొండొరులతో ననేకవిధసరససల్లాపంబులం బి-
సాళించుచు నింపుదళుకొత్తఁ గ్రొత్తవిరిగుత్తులచేత నేత్రపర్వం బగుచున్న యాపు
వ్వుఁదోఁటఁ దఱియం జొచ్చిన. 143

సీ. అరవిడుకొప్పుల విరులవానలఁ దోరపు టూర్పుఁదావులు ప్రాపుగాఁగ
నడలమందతఁ బెంచు బడలికలకుఁ బిఱుందులప్రేఁగుఁ జనుప్రేఁగుఁ దోడుపడఁగఁ
జెమటచిత్తడిఁ గ్రొత్తచెలువుఁ గాంచిన చెళుల్మోలనూళ్లకాంతికి బలిమి నొనఁగఁ
బయ్యెదలాడింపఁ బ్రభవించు కంకణనాద మందెలమ్రోఁతఁ బ్రోదిసేయ
మిగుల రోదగాఁ గిశాకిక నగుచు రతుల, యాయములుసోఁక నెద్దియేవాడుకొనుచుఁ
నందడించుచుఁ బుష్పాపచయముఁ జలిపి, యంతఁ, గడఁగిరి డోలావిహారములకు.

వ. అప్పుడాకాశమార్గంబునం గృష్ణసేవాలాలసుం డగుచు నేగుదెంచు నారదమహాము-
నీంద్రుని మణికంధరుం డనుగంధర్వకుమారుండు గానవిద్యావిశేషాభిలాషంబునం
గొలిచి వచ్చుచునుండి యమ్ముగువల ప్రగల్భతాగరిమకు వెఱఁగందుచు శతానందనం
దనున కిట్లనియె. 145.

మ. తమిఁ బూఁదీఁగెలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగు నా
కొమదుంద్రాయఁపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చనుదెంచు తీవఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్దాఁచులా గొప్పెడున్. 146

వ. అనుటయు నారదుండు. 147

మ. బలిరా సత్కవి వాదు నిక్కము తగ న్భావించి నీవన్నయా
యెలప్రాయంపు మిటారికత్తెల బెడంగే నెందు నుం గాన వా
రలడోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁ దన్నం జనునట్లు నించె ననినం ద ప్పేమి రా యొప్పె యగున్. 148

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనిపలుకునప్రసూనికటంబున నలకూబరుఁడుం దాను మొగులుమఱుఁగుననొ
ఘనస్థేమగుదివ్యవిమానంబునఁ జనుచు రంభ విశదముగ నది వీక్షించెన్. 149

గీ. విస్మితయై కింత కనలి మన సాకల్యా గైన, నతని నారదుఁ డని యాత్మ నెఱిఁగి
భావవికృతి యెఱుకపడనీక యడఁచి యా, మ్మగువ తనదు ప్రియుని మొగముఁ జూచి.

క. ఆలించితె యాపలుకుల, పోలికఁ దెలియంగఁ గలహభోజనముని గాఁ
బోలు మన మితనిఁ గని యుచి, తాలాపములాడి చనుట యభిమత మనియెన్. 151

ఉ. నారదుఁడుం దదీయవచనంబు వినంబడుదిక్కుఁ జూచె నె
వ్వారలొ మాటలాడుచును వచ్చుట తోఁచె నటంచు వచ్చుట
న్వారివిమానరత్నము ను వారిధరంబుమఱుంగు వాసె భా
లారుణభానుబింబ ముదయాద్రిమఱుంగున బాయుచాడ్పునన్. 152

క. ఆరంభయును గుబేరసు, మారుఁడు నవ్వేళఁ దమవిమానోత్తమము
న్నారదమునీంద్రుపదాం, భోరుహములక్రిందిచాయఁ బోనిచ్చి తగన్. 153

సీ. పారిజాతకుసుమ సౌరభంబులువెద, చల్లుశిరఃశిరంబు లల్లనల్ల
నద్దుచును దదీయ మగుపాదయుగళి వా, సించి రంతఁ గొంతసేపు నిలిచి. 154

క. ఆవరమౌని యు నొండొరు, పై వదలని ప్రేమ కలిగి భాసిలుఁ డనుచుం
దీవించె రంభ యపుడా, దైవతమునివర్యుఁ జూచి దరహాసముతోన్. 155

క. ఓమునివర మీదీవన, చే మాపైఁ బ్రేమ కొంత చెడక నిలుచునో
యేమో కాని యిఁక స్మర, భామలపోఁడుముల కితఁడు భ్రమయక యున్నే. 156

వ. అని తనమనంబునం గలయూరసంబు పైకింపంజాలక యొక్కసక్కియఁబాగా నాడు మాటలకు సంశయంబునొందుచు నిది యేమి యనుట వివరింపు మని మునివరుండు నిలిచి యనుగుటయు దేవరకుం బ్రస్తుతగమననిరోధంబు గాకుండ విచ్చేయుఁడు విమానంబు మీఁదికి రా నవధరింపుఁ డన్నియు వివరించుచు నరుగుదెంచెద మహానుభావులం గొంతమేర యైనం గొలిచివచ్చుట భాగ్యంబుగాదె యనుచు శిష్యసమేతంబుగా నతనిం దనువిమానంబునందు నునుచుకొని తదలంకారచామరంబులు రెండును విచ్చి పుచ్చుకొని తనప్రియుండును దాను నిరుగెలంకుల నిలిచి యల్లనల్లన వీచుచు నప్పుడంతి మౌనివర్యా యప్పుడు మీర లాడోలికావిహారిణుల ప్రసంగంబున శిష్యతోడ నే మని పలికితిరది యానతీవలయు ననుటయుఁ జెలువగప్రతో నతండు.

మ. బళిరా నక్కవి వోచు నిక్కము తగ న్భావించి నీ వన్నయా
యెలప్రాయంపుమిటారికత్తెలచెడం గెం దొందునం గాన వా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రలడోలాచలనోచ్ఛలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁ దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి యొప్పే యగున్. 158

క. అని పలికితి నిం దేమై, నను గాని తెఱంగు గలిగినం జెపుమా యో
వనజాక్షి యింక దాఁపం, బనియేమి మనంబులోనిభర మని పలికెన్. 159

వ. అని పలికిన నవ్విలాసిని యతనిం జూచి. 160

క. మీరలు పెద్దలు త్రైలో, క్యారాధ్యుల రేమియన్న నంటిరిగా నె
వ్వారలు మాన్చెద రిట నే, మారసి యాడితిరొ యనుచు నడిగితి ననఘా. 161

ఉ. ఊహ యొనర్పఁగో యతిశయోక్తుల వర్ణనలందు నిట్టివౌ
వ్యాహతి చెల్లు నంచునో యి టాడితి రింతియ కాక యేవరా
రోహలు మమ్ముఁ బోలమికి రూఢిగ నిక్కమయి నున్నయాజగ
న్మోహనమూర్తి యర్థపతిముద్దుకుమారుఁడె సాక్షి నావుడున్. 162

ఉ. అల్లన నవ్వుచున్ముని సురాంగనఁ జూచి యి టాడుఁ గొన్నసం
జెల్లుఁ గదమ్మ నీకుఁ గడుఁ జెల్వ్యఁడు నిబ్బరమైన ప్రేమ రా
జిల్లఁగ నిట్లు వర్తిలుటఁ జేసి మృగేక్షణ యైన నిట్టు రా
వెల్లదినంబులు న్నవతి యేగతిఁ గల్గునో మీఁదు గంటివే. 163

క. నినుఁ బోలువనిత నీవ ను, వనజముఖీ యితనిఁ బోలువాఁ డితనికి నెం
దు ను గల్గి కలఁచునో యి, ట్టనిగాఢప్రమదము సొంపుతీవులు చను నే. 164

క. అనుట యు నవ్వుల కని, న్మునివర మీమాట యి ట్లమోఘం బగునో
వినలే నిట్టివి మానుఁడు, ననుమన్ననచేసి యనుచు నాతుక మ్రొక్కెన్. 165

వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణివిహరించు
చున్న యెలదోఁటలోనికిం దిగియె నట్టియెడ రంభానలకూబరులు వినయపూర్వకంబు
గా నతనిచేత ననిపించుకొని యశ్వ డెదుటఁ గాన్పించు వాసుదేవుని ప్రాసాదరా
జంబునకుం జెయ్యెత్తి మ్రొక్కి తమవిమానంబుతోడ నిజేచ్ఛం జనిరి కలభాషిణి
యు నటమున్న తన కనతిదూరంబున వినంబడువారలసల్లాపంబు లాలకించియుండి
తదనంతరంబ ధగధగితదిగంతరం బగుచుం జేర నేతెంచువిమానంబు నవలోకించి
యు నాశ్చర్యంబు నొందుచుండి యప్పు డ ట్లడుగు నలకూబరుని రూపలావణ్యాది
సౌభాగ్యంబులకు మిక్కిలి మెచ్చుచుఁ దదాలోకనంబునం దనియక కొంతమేర త
ద్విమానంబు క్రిందటిచాయ పొదరిండ్లయోరమిఱుంగున వారిసల్లాపంబు లాలకిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచుం జని యంత నది మిక్కిలి దూరంబుగా నేఁగుటయుఁ దిరిగి వచ్చుచుఁ దన
మనంబున. 166

గీ. ఇంతరూపవంతు నెంతయుఁ దనకుఁ గై, వసము చేసికొని యవార్యగర్వ
మతి చెలంగ భాగ్యవతి యీలతాంగి యె, వ్వతె యొకో మనంగవల దె యిట్లు. 167

చ. మునుపు నిజేశు నర్థపతిముద్దుకుమారుఁ డటంచు నానితం
బిని పలుకంగ వింటిని గుబేరతనూజునకుం గరంబు మో
హిని యగుకాంత రంభయని యాడుకొనంగ వినంబడు న్మనం
బున నిపు డెన్న నామెయుఁగుఁబోఁడియు కావలయు న్నిజంబుగన్. 168

క. ఇప్పు డిది నిశ్చయంబుగ, నప్పరమమునీంద్రుఁ జేరి యడుగఁగవలయుం
దప్పఁ డతఁ డమరమౌని య, య్యప్పటికప్పటికి వచ్చు యదుపతికడకున్. 169

క. అని చింతించుచు నాయం, గన తానొక్కతియు యేగి కడుఁ జేరువ నా
యనుపమతేజుని నారద, మునిఁగాఁగ నెఱింగి వినయమునఁ బ్రణమిల్లెన్. 170

వ. ప్రణమిల్లి లేచి విరచితాంజలియై నమస్కరించి నిలువంబడి యంజలిబద్ధురాలై. 171

క. మౌనీంద్రచంద్ర యిపుడువి, మానముతో నేగినట్టి మహితాత్ములు రం
భానలకూబరులే యన, నానారదుఁ డట్ల యగుదు రని యాయకలోన్. 172

క. నీ వె ట్లెఱిఁగితి చెపుమా, నావుడు మీ రాడుకొన వినంబడుమాటల్
భావింప నట్ల యౌనా, భావమునకుఁ దోఁచె ననుచు భామిని పలికెన్. 173

చ. పలికిన మింట నాడుకొనుపల్కులు వింటివొ యన్న వింటి నో
యలఘుతపోనిధాన, తనయత్యధికం బగురూపసంపదం
జెలువుఁడు కైవసం బనుచుఁ జెల్లుఁబడిం బచరించి పల్కె నా
కలికి తదుక్తి కోర్వమిప్రకాశిత మయ్యెను మీవచస్స్థితిన్. 174

క. అనుటయు మునినాయకుఁ డో, వనితా యె ట్లోర్వవచ్చు వలవనిగర్వం
బునఁ గన్నుగాన కాడెడి, యనుచితవాక్యంబు లేరికైనం దలఁపన్. 175

క. తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నేమింతవార మనుకొన నిదిగోఁ
బిపువీఁకగ నున్నది తాఁ, గర మద్భుత మైన సవతికయ్యము చేతన్. 176

క. సవతి యన నింక నొకతె, న్భువిలోపల వేఱ వెదకఁ బోవలయునె యో
ధవళాక్షి నీవ కానే, రవె దైవనియుక్తి గొంతప్రాప్తి గలిగినన్. 177

క. నావుడు నంతటిరూప, శ్రీవైభవసతికిఁ గాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాకుం, ట్లైవిధమునఁ బాట్లఁబడిన నిద్ధవివేకా. 178

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనుడు నామాట కేమి యోయంబుజాక్షి, రంభ మొదలైన యేయచ్చరలకు నైనఁ
దక్కవే నీదురూపసౌందర్యమహిమ, లెక్కడే కాక మిగుల నూహించి చూడ.

గీ. అది య టుండనిమ్ము ముదిత నిన్నును జూచి, నట్లు దోఁచుచున్న యది యొకింత
నలిననాభుకొలువునకు వత్తువో యన, వత్తు మిమ్ముఁ జూతు పరమునీంద్ర. 180

సీ. అని యింతి పల్కిన ముని పల్కె నవునవు చెలఁత నిన్నెఱుఁగుదుఁ దలంచుకొంటి
మాశిష్యుఁ డైనయామణికంధరాహ్వయుఁ డిటఁ గొన్నినాళ్లక్రిందటను గ్రొత్త
గాఁగ హరిం బొడఁగానంగఁ దా వచ్చి దండకరూపసంస్తవరచన
యొనరింప నేకసంతన గ్రహించి పఠించినట్టి నేర్పరివి గదమ్మ నీవు
పేరు కలభాషిణివి గద బిరుదుచదుర, వగుదు బళిబళి యిపుడు నీకదిముఖస్థ
మగుచు నున్నదియే శక్యమగునె చదువ, ననుడు శక్యంబు గాకేమి యనుచుఁబలికె.

వ. అమ్మదిరాక్షి మధురగంభీరస్వనంబున నిట్లని చదివె. 182

దండకము. శ్రీకామినీకామితాకార సాకారకారుణ్యధారానవాఁకూర శంకాకరాశో
ణరేఖామయూఖాలికిమ్మీరితాలోకనాలోకలోకైకసంస్తుత్యనిత్యప్రభావా విభావైభ
వాధిక్యధిక్కారితానంతమార్తాండకోటీరయాటీకమావామలాస్తంభశుంభద్యశఃపూర
కర్పూరసారభ్యమైత్రీపవిత్రీకృతామ్నాయవాయుప్రచారా నిశాపాదితాపారసంసా
రసంతాపనిర్వాపణాపాపనిర్వాపణోపాయనామప్రశంసానుభావా భవాభావలోభా
కులీభూతచేతస్సుధీవారితనిర్ణీతసంప్రాప్తసద్భక్తిమార్గైకవిశ్రామభూమీభవత్తత్త్వ
రూపా సురూపావళీదుర్నిరూపస్వరూపా గురూపాసనాపాదితావారతానన్యసాం
కర్యకైంకర్యమాధుర్యధుర్యప్రసన్నా ప్రసన్నావళీమానసోదస్తభోగాపవర్గాభిలా
షా హృషీకేశ యీశానవాణీశముఖ్యుల్ సువిఖ్యాతమైనట్టినీదివ్యచారిత్రచారుప్రచా
రంబు పారంబుముట్టన్నుతింపంగలే రంచు నెంచంగ విందుం బ్రపంచస్వభావంబు
భావంబునన్ నానకిట్టేము నీముందటం జాటువాచాటతల్ చూపుచున్నార
మిన్నేరముల్ మన్నవత్సేసి సైరింపు మోవాసుదేవా సదానంద గోవింద సేవిం
చుమావిందవై డెందమానందమొందింప నెందున్ విచారంబు లేమి న్వచోగో
చరాగోచరత్వంబు లూహింపలేమైతి మోదేవ మీపాదసేవాదరంబు న్మదింగోరు
చు న్వేదవాదుల్ మమాదుల్ కడుం జాల నార్జించి భోగేచ్ఛ వర్జించి నానాతప
శ్చర్యతాత్పర్యపర్యాకులత్వంబునం గైకొన న్నాకు నేయత్నముల్ లేక యోకృష్ణ
యీకైవడిన్ మీకృపాలోకసంసిద్ధి సిద్ధించుటల్ బుద్ధిఁ దర్కింప నత్యంత చిత్రం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బు గాడే జగన్నాథ యీరీతిఁ జెన్నార మున్నె బుధు లిమ్ముఁ గన్నారఁ గ
న్నారు మాకన్న లెన్నంగ నేపుణ్యము ల్నేసెనో యీవిశేషంబుఁ గాంచ న్వి
రించోదయస్థాననాభీసరోజా సరోజాతజాతాండము ల్తుండతుండంబు లై యుండ
నొండొండు నీరోమకూపంబు లేపారఁగాఁ దాల్చుట ల్చెప్పఁగా నీవు గోవర్ధనం
బెత్తి తంచు న్వరాహావతారంబున న్ధారుణీచక్రము న్దాల్చి తంచు న్మహాకూ
ర్మభావంబున న్మందరగ్రావము న్మోచి తంచు న్జగంబు ల్సమస్తంబుఁ ద్రైవిక్ర
మప్రక్రియావేళఁ బాదత్రయిం జాలఁ బూరించి తంచు న్నుతింపంగ యుక్తం
బె భక్తప్రజాధీన దీని న్వివేకించి లోకంబులోఁ గొంద ఱార్యోత్తము ల్సర్వవేదం
బులు న్సర్వవాదంబులు న్సర్వయాగంబులు న్సర్వయోగంబులు న్సర్వమానంబులు
న్సర్వదానంబులు న్జూడ నీదాసదాసానుదాసాంఘ్రి సంసేవలోఁ గోటికోట్యంశ
ము న్బోలఁగాఁ జాల వంచుం దదాచారముం బూని వర్తింతు రత్యున్నతి న్సర్వసం
కల్పనిత్యోదయా యేము నీనామమాత్రంబు మానాలుకం జేర్చుట ల్దక్క నో
క్కింత యు న్దక్కత్రోవ ల్భవన్మాయ దాఁటంగలే మవ్యయా భవ్యయోగీంద్రసాం
ద్రాదరా కాంక్షితైకాంతసంసేవనా భావనాతీత కల్యాణనానాగుణశ్రీసముద్భా
సితాంగా మముం గేవలం బైనకారుణ్యదృష్టిం గటాక్షించి రక్షించు లక్ష్మీమనో
వల్లభా దేవదేవా నమస్తే నమస్తే నమః. 183

మ. అని యీవైఖరి నంతయుం జదివి దైత్యారాతి యీదండకం
బునకు న్మెచ్చుచు నిచ్చినట్టిది గదా భూరిద్యుతి న్నీదుశి
ష్యునికంకంబున నొప్పు నావిమలరత్నోదారహారంబు న
న్నునిలోకోత్తమ యంచుఁ బల్కె మఱి యుం బూఁబోఁడి దా నిట్లనన్. 184

సీ. పొసఁగ ముత్తెపుసరు ల్పోహళించినలీలఁ దమలోన దొరయు శబ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
గీతుల కుచితంబులై తనరారెడు ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి
యమర నుపమాదులును యమకాదులు నగు, నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చుసత్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె. 185

లయవిభాతి

చలువ గలవెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం
బొలు పెసఁగుకప్పురపుఁ బలుకులకుఁ గోమలత నెలకొనినసౌరభముఁ బలుపసయుం గో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములతయునుగలిగిజనములమిగులఁబెంపెసఁగు మలయపవనంపుఁగోదమలకుమధురత్వం
బలవడిన నీకుమతి కలపనఁగవచ్చుఁ గడునెలయఁగల యాసుకవిపలుకులకు నెంచఁగ.

క. ఊరక యటు మిముబోఁటుల, చేరవఁ బఱియింపఁగనిన సిద్ధింపవె యే
కోరుకు లైన నజస్రముఁ, గోరుకు మీవీణ మోసికొని కొల్చుటకున్. 187

సీ. మునినాథ యిటమున్న వనజనఖాత్ముని యంతఃపురంబున నరుగువేళ
మణికంధరునిఁ దదంగణమున నిల్పి మీవీణియ మీరలే పాణిఁ బూని
పోవఁగాఁ జూతు నప్పుడు దాని నేఁ బుచ్చుకొని కొల్చివత్తునో యని తలంతు
నేవరచిత్తంబు దెలియమి నట్లు సేయఁగ నేమిదోఁచునో యనుచు వెఱతుఁ
గవున నంతమాత్రపుటూడిగంబు నాకు, మొదలవెట్టుఁ డటంచుఁ గేల్మోగిచి మిగుల
వినయమొప్పఁగ నాయింతి వేఁడుకొనిరియె, నతఁడు నట్ల కాని మ్మని యనుమతించె.

వ. అనుమతించుటయు నిమ్మహాత్ముని యనుగ్రహం బీపాటి గలిగె నీనం జేసి నావాంఛితంబు ను సఫలం బగు నని సంతసిల్లి రంభానలకూబరులవలనఁ గతపట విసంబడిన వాక్యం బొకటి దలంచుకొని యది తెలియుటకుఁ గృతాంజలి యై వినయభరంబునఁ గొంకుచున్న దాన మణికంధరుండు రహస్యశంక నెడగలుగఁ జనఁగ నమ్మహామునికి ట్లనియె. 189

సీ. మహితాత్మ మీర లిమ్మహి నుండ సంకోచపడియే మొ మిక్కిలి పొడవు చనఁగ
నీక విమానంబు నిలఁ జేర్పవన కొంతమేరఁ బోనిచ్చె నమ్మిథున మిప్పు
డేను వృథాభ్రాంతి నింతనంతను దానివెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినుఁ డది యర్థేశతనయుఁ డోయబల యివ్వారదుమాటల నడుమ వేఱ
పొడమె నే మయ్యె నలకళాపూర్ణసుద్ది, కడమ చెపుమన్న రంభ యప్పుడ తెలుపనె
నీకు మఱి చెప్పరాకుంట నీకథయు ను, నీకు నాతోడును స్మబ్బనీకు మనియె. 190

గీ. ఏ నెఱుఁగ వేడ్కపడుచున్న దాన నోత, పోధనోత్తమ యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్ది మున్నేమి చెప్పె, నెద్ది చెప్పరా దనియె నాయిగురుఁబోఁడి. 191

వ. ఇది యానతీయవలయు ననిన నతండు వెఱఁగంది యిది యంతయు నపూర్వంబు దీనిఁ దెలిసెదంగాక యని కొంతదవ్వు నిశ్చలుం డగుచు విశ్వప్రపంచంబునం గలభూతభవిష్యద్వర్తమానవర్తనంబు లన్నియు విమర్శించి తత్ప్రకారంబుఁ గాంచి కలభాషిణిం జూచి యారంభ ప్రియునకుఁ జెప్పరా దనినకథ యత్యపూర్వంబు నాకు నుం జెప్పఁ దగ దని పలికిన. 192

గీ. అనఘ చెప్పరానికథాంశ మట్ల యుండ, నిమ్ము నలకూబరునకు నయ్యింతి యేమి
కారణమ్మున నీప్రసంగము నచించెఁ, దెలుపుఁ డన దాని కిట్లని తెలిపె మౌని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఈరంభయును వీఁడు నీవేళయును రతిక్రీడాపరాయణుల్ కేవలమును
వీరి నొండొరు హాసవీక్షణోక్తులు దక్కినట్టి చేష్టితములు నెట్టివైన
మన్మథోద్దీపనమహిమఁ జొక్కించు నొక్కొక్క ప్రేమచొప్పిది యుర్విఁ గలదు
కావున మము నేఁడు కనుఁగొనుటకు మున్న రంభ నవీనమార్తాండుదండ
శుభ్రఘనరేఖ వర్తిల్లఁ జూచి నగుచు, బ్రహ్మతోనున్న శారదారమణిఁ బోల్చె
ధనదసుతుఁడు నమ్మాటకుఁ దరుణిమోవి, దంతశిఖి నొత్తె నత్తఱిఁ దనరుతమిని. 194

క. ఒత్తుటయు నెందుఁ గలుగని, క్రొత్తతెఱంగునఁ జెలంగుకోమలకలవా
గ్వృత్తి యపు డొకటి బహువి, చ్చృత్తిక మై దానికంఠసీమం బొడమెన్. 195

ఉ. ఏయెడ నెన్నఁడుం గననియింపులు గుల్కెడు తద్గళస్వనం
బాయత మైన కౌతుకము నద్భుతము న్మొలపింప నేదియే
దీ యిది చాలఁ గ్రొత్త బళి యిం కొకమా టిఁక నొక్కమా ఱటం
చాయలనీలివేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్. 196

క. నాచేత నింకఁ గా దిది, యోచెలువుఁడ యనఁగఁ గాకయున్న న్విడనే
నోచెలువ యనఁగ వచనా, గోచరసల్లాపరసము కొం తపు డొదవెన్. 197

వ. అంత నక్కాంత కాంతునికి సంతసంబుగాఁ గొంతకొంత తత్ప్రార్థనంబు సఫలంబు చేసె నతం డంత నింతకు మున్నిది యెన్నండును విన్నయది గా దిప్పు డెప్పగిది నొదవెఁ జెప్పు మని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ నిది నేఁడు నేర్చినది కాదు తడవుల నుండియు నే నెఱుంగుదనియు నొక్కకారణంబున నిది యిఱుకపఱుపక నెఱయ మఱచియు నేఁడు బాలభాను పాండుమేఘసంసర్గవిశేషవీక్షణంబునం దలంచిన మానసంబులోనన పూని యుండి యిప్పటి నీదుండగంబువలనఁ గలిగి వెలివిరియనిచ్చితి నని పలికిన నతం డి ట్లనియె. 198

గీ. ఏమికారణమున దాఁచి తిన్నినాళ్లు, తరుణి యెఱుఁగింపు మనుడు నేతత్ప్రసంగ
మునఁ గళాపూర్ణకథలువచ్చునోయనియెడు, తలఁపుచే దాఁచితినటంచు వెలఁది పలికె.

సీ. పలికి యీపాపసాధరణ తత్కథలు వచ్చిన నేమి యంచేని వినుము తెలియ
నాకథ లిఁకఁ జెప్పినట్టివారును విన్నట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాదిబహుసంతతియుఁ దనర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు రనుమాట యున్నది యాదియంద
యేను నీ కది చెప్పిన దీనికొఱకు, నవనిఁ బుట్టంగవలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ యని తావకాంగసంగ, సౌఖ్యమునఁ బేర్చు నాకు నిష్టంబులగునె. 200

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అది యు వింటివిగద యని యనియె దేని, యేను వినినట్టిపిమ్మట నిట్టిమాట
పలికె నొక్కయమోఘవాగ్విలసనంబు, కావున వచింప విన నీకుఁ గాదు సాకు.

వ. అని చెప్పె నని చెప్పి నారదుండు. 202

గీ. అతివ విను రంభకును గలయట్టిభయము, నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున, వెలయుఁగలదది వెలయుఁ ద్రోవలును గలుగు.

వ. అది యట్లుండె రంభానలకూబరు లవ్విధంబున సల్లాపం బొనరించినయనంతరంబ త ద్విమానంబు మత్సమీపంబున కేతేర మీఁదోలికాప్రసంగంబులు వడిరొ నని కలభా షిణికిం జెప్పె నప్పుడు తద్వనలక్ష్మీవిలోకనకౌతుకంబున కడగాఁ జనియున్న మణి కంధరుం బిలిచి యంబుజాక్షునికొలువువేళ దప్పకుండం బోవలయు ర మ్మనుచు వ చ్చుటఁ గదలి చనియెఁ గలభాషిణియు నంతఁ దను జేరవచ్చిన నెచ్చెలులుం దాను నిజగృహంబున కేగి వేగంబ కొలువుసింగారంబు సంఘటించుకొని కృష్ణనగరి కరిగె. 204

శా. శ్రీనంద్యాలపురాంక వాగ్విభవలక్ష్మీనాథపర్యంక సు
జ్ఞానశ్రీమిథిలేంద్ర సూనృతవచస్సంధాహరిశ్చంద్ర వి
ద్యానైపుణ్య సముద్భటార్భటికవిద్వద్వాదవాచాలితా
స్థానీమందిర యిందిరారమణపత్పంకేరుహేందిందిరా. 205

క. అంభోనిధిసాధారణ, గాంభీర్య యరాత్యసుప్రకంపనచయకు
క్షుంభరితరవారిమహా, కుంభీనసవర్య సమరగురుభుజశౌర్యా. 206

మానిని. శేషసుభాషణ శీలవిభూషణ సేవకపోషణ చిత్తరిపూ
న్మేషనివర్తన నిర్మలకీర్తన నిత్యసవర్తన నీతికళా
పోషవిచక్షణ పుణ్యవిధిక్షణ భూసురరక్షణ భూరిమద
ద్వేషణశాసన ధీజలజాసన దీప్తివిభాసన ధీరమతీ. 207

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళిఅమరనార్య
తనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతం బైన కళా
పూర్ణోదయం బను మహాకావ్యంబునందుఁ
బ్రథమాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమారమణాయనమః.

# కళాపూర్ణోదయము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీఖండాద్రిహిమాచల, మేఖలికావిలసదపరిమితహయరింఖా
రేఖితజయలాంఛన నృప, శేఖర నంద్యాలనారసింహునికృష్ణా. 1

వ. అవధరింపు మవ్విధంబునం గలభాషిణితోడ సంభాషించి యరుగుచు నారదుండు తనమనంబున. 2

చ. హృదయము ద్రవేఁ గోకిలత శమియించెను వెల్వపుఁ గ్రొవ్వు పెంపునం
బొవలెకురంభకు న్నవతిపోను ఘటించుట కంతురాగ్రణిం
చిది యిటు గొంతచేసితి నపేక్షిత మంత యు నైనయట్ల యీ
సుదతియు చాలు దానికి ననూయ యుం నున్నది మాట లారయన్. 3

క. ఎంచఁగ నాగమనమునకు, నించుక చు ట్టైన నయ్యె నిది యోగ్యము సా
ధించుట కెవ్వారిని బో, రించనిక్షణ మొక్కటి యుఁ దరింపఁగ వశమే. 4

వ. అని తలపోయుచు శిష్యుండు నుం దాను ను బురప్రవేశమార్గంబున నడుచుచుండె నప్పుడు. 5

సీ. దవుదవ్వులనె నేఁడు ధరణికి దిగివచ్చుచున్న వాఁ డిది యేమియొక్కొ యని యుఁ
గయ్యంబు లిడ నెందు గతిగల్గునో యని వెదకుచు నేతెంచువిధమొ యని యుఁ
బవనీకృతము లైనపాదపాంసువుల నిందఱఁ గృతార్థులఁ జేయుకొఱకో యని యుం
నీమార్గమహిపుణ్య మెట్టిదియో ఫలంబునకు రా కది రిత్త చనునె యని యు
దను నెఱుఁగువార లతిదూరమునన లేచి, రెండుచేతులు మొగిచి వర్తిల్లుచుండ
నికటమునఁ గన్నవారలు నేలఁ జాఁగి, యాదరమునఁ బ్రణామంబు లాచరింప. 6

చ. అలఘువినీతిసంభ్రమసమాకులత న్వెసఁ బల్లకీలు నం
దలములు వాహనంబులు ను దంతులు సాదిగఁ గల్గువాహనం
బులు డిగి వచ్చి మ్రొక్కుదొరమూఁకల పెల్లునఁ ద్రోవ చాల సం
కులముగ నందుఁ గొంద ఱొకకొంత బరాబరి చేసి కొల్చిరాన్. 7

మత్త. కొందఱుం గడకంటి చూపులఁ గొందఱు న్నెఱచూడ్కులం
గొందఱుం జిఱునవ్వుడాలునఁ గొందఱుం దగుదీవనం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొందఱుం జెయి చాఁచి లెమ్మని కొందఱుం గయిదండ గొం
చుం దపోధనుఁ డాదరించెను సొంపుగాఁ బ్రణతాత్ములన్. 8

వ. అవ్విధంబున సకలజనసేవన లాదరించుచు శిష్యులుం దాను నమ్మునివరుండు పర
స్పరవిఘట్టనవాచాలవీచీహస్తసమార్జితచర్చరిమచర్చికా చర్చాంకురంబులవలన ను,
సంకులకలహంసచక్రవాకపుష్కరాహ్వయప్రముఖజలపక్షిసందోహకోలాహలంబులవ
లన ను నవిరళపరిస్ఫాకమానడిండీరఖండమండలీపాండిమచ్ఛలవిలసితప్రహసితంబులవ
లన ను నికటంబునం బొదలు జలధివిలసనంబులం జెలరేఁగి గేలిసేయు సోయగం
బునం బరఁగుపరిఘావలయంబులు ను, పరిఘావలయసలిలనిధిసముత్తాలకల్లోలశీకరా
వకీర్యమాణంబు లగుచుం దమయందు నుభయతమాకృష్యమాణభోగీంద్రభోగవేష్టన
ప్రకారానుకారపారీణంబు లై రాణించుచుం దిరుగు మెఱుంగుఁదీఁగలు ప్రకాశింప
వైశాఖపర్వతనితంబడంబరవిడంబనచతురంబు లై చూడ నొప్పు వైదూర్యప్రాకా
రంబులు ను, ప్రాకారవలయవిపులకపిశీర్షసముదయసముత్కీర్యమాణమాణిక్యనివహ
వివిధకాంతిసంతానసౌమనసమాలికాస్తోమాభిరామపర్యంతభాగం బగుచుం బౌరవిభవ
లక్ష్మికిం బట్టినయాతపత్రంబురీతి నుద్యోతించుగగనమండలంబునకుం జాందుపర్యాసం
పాదనంబున సొం పొనర్చునమున్నతశిఖరసంసక్తనిర్ణిక్తమౌక్తికభక్తివిశేషంబులతో
డం బసిండికామ చెలువు నలవరించు వాసుదేవప్రాసాదరాజంబు ను, వాసుదేవప్రా
సాదరాజకైతవద్యోతమానశాతకుంభకుంభినీధరంబునకుఁ బ్రత్యంతపర్వతభంగి నంగీ
కరించి యలంకారంబు గావించు వసుదేవసంకర్షణసాత్యకిప్రద్యుమ్నాదియాదవసం
ఘసౌధయూథంబులు ను, సౌధయూథభూధరప్రవాతజాతమహాతరంగిణీబృందసందే
హంబు ప్రభవింపంజేయు నుభయపార్శ్వభాగహీరమయగృహభిత్తిసంతతతంతన్యమా
నమరీచినిచయపరిస్ఫూర్ణరాజమార్గంబులు ను, రాజమార్గసజ్జితశైవాలినీశైవలభావభా
సురంబు లై పొలుపారు గారుత్మతబహిర్వితర్దికానికాయంబు ను, బహిర్వితర్దికాని
కాయవిరచితకురంగనాభిగోముఖోపరితరంగితరంగవల్లీమతల్లికామనోజ్ఞమౌక్తికమం
డలీపాండిత్యంబు లత్యంతకాంతంబు లగుచు నుత్తుంగహర్మ్యశిఖరకేతుసంఘసంఘ
ర్షణశకలితపతితాంతరిక్షఖండలక్ష్యమాణనక్షత్రసముత్ప్రేక్షా సంధుక్షణవిచక్షణంబు
లై వీక్షణపర్వంబు నిర్వహింపం బెంపుమీఱుచుం దదవలంబనలంబమానవివిధాంబు
దకదంబకంబు డంబుఁ జూపు కలువడంబులు ను, గలువడంబులం దపిలిన మిళిందం
బులచందనంబు నఁదపఱచుచంద్రశాలాఖేలనాలోలనాళీకలోచనాలోచనంబులమరీ
చివీచికల పెల్లు చిల్లునం జిమ్మనగ్రోవులఁ జిమ్ముగంధసారకస్తూరికానీరధారాప్రసారం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బులతెఱఁగు ఱంగింప బంగారురంగుపనలఁ బసుపువసంతంబులాగు భావంబున శోభి
తెలుపుథర్మహర్మ్యశ్రీల ఖేలానంద్రభమోచ్ఛ్వసితవిశరారుకేశబంధంబులో యనంగ
బంధురంబు లగుమంథరగంధవహనివహవిహారణవిసృమరకాలాగరుధూపధూమంబు
లును ధూపధూమశ్యామికామిషంబున నిజస్వామికొలువునకు నిబ్బరంపుఁ జేయుబ్బునం
బ్రబ్బికొనుచుఁ జేరిన శృంగారరసనముద్రంబునకు నిర్ణిద్రవిద్రుమకుడంగసంఘసాం
గత్యసౌభాగ్యంబు నను గ్రహించుచుఁ బ్రత్యగ్రజాగ్రదగ్రస్థలస్థాపితకురువిందకలశ
కంపకచ్ఛవిచ్ఛటాజటాలితంబు లగుగోపురంబులు ను, గోపురద్వారతోరణవ్యాజవి
భ్రాజమానమంగళసూత్రసువ్యక్తనిర్వర్తితపరిగ్రహాగృహవైభవశ్రీసముపభోగనిస్తంద్రు
లగుసకలజనులు ను, నత్యంతచిత్రతరమహత్త్వంబునం బ్రవర్తిల్లు నుత్తమోత్తమకీర్తులం
బొగడొందు తద్ద్వారకానగరంబు దరియం జొచ్చి రంత. 9

సీ. మహనీయకురువిందమాణిక్యకాంతులచేతఁ బల్లవిత మై చెలువుమీఱ
మరకతమణినముత్కరమరీచిచ్ఛటాపత్రసంతతిచేత బాగుమీఱ
నకలంకనవ్యముక్తికచాకచక్యప్రసూనసంపదచేత సొంపుమీఱ
నింద్రనీలజ్యోతిరిందిందిరశ్రేణివిలసనంబులచేతఁ బొలుపుమీఱఁ
దనరమున్నతిచే నభస్తరువుఁ బ్రోచి, విమలశిఖరాగ్రకనకకుంభములచేత
సఫలితంబుగఁ జేయుచుఁ జాల వెలయు, నంబుజాక్షునికొలువుకూటంబుఁ గాంచె.

క. కాంచి మణికంధరునితోఁ, గాంచనగర్భుఁడు వలికెఁ గలకాలము వీ
క్షించిన నిది నిచ్చలు నొక, యంచితరుచి నెఱపుచున్నయది కనుఁగొంటే. 11

శా. ఆవైకుంఠముఁ జూచినట్లు కడునింపై యీసభామండప
శ్రీవిస్ఫూర్తికతంబునన్మిగుల నాచిత్తంబు నానందమ
ద్రావైచిత్రిఁ గరంచుచున్నయది యేతద్ద్వారకాపట్టనం
బీవిశ్వంబునఁ గల్గుమే లిదియ పో యొండు న్వివేకించినన్. 12

వ. అని పల్కుచుఁ జేరం బోవునంత. 13

క. ఆఋషియాగమనం బపు, డారసి చని చెప్పి రంబుజాక్షునకు బహి
ర్ద్వారిను లగుపరిచారిక, లారీతిని జెప్ప నతనియానతికల్మిన్. 14

సీ. బంగారుగొలుసులుఁ బవడంపుఁదఱిమెనకోళ్లు ను వింతబాగులబొగడలు
రత్నంపుఁజిలుకలు రాయంచపతిమలుఁ బసిఁడిపువ్వులవాఁతపనులసొబగు
వివిధంబు లగుచిత్రవిరచనలు ను దసిలీనూలిపట్టెయల్లికబెడంగుఁ
బలుదెఱంగుల పట్టుతలగడబిల్లలు మవ్వంపుఁ గుంకుమపువ్వుపఱుపుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలిగి మెఱుఁగులు దిక్కులఁ గడలుకొనఁగ, మించుదంతపుటుయ్యాలమంచమున సు
బోలుపుమీఱుచుఁ దనయంతిపురమునతుల, యాడిగంబులు గైకొంచు నున్నశౌరి.

ఉ. అప్పలుకు ల్చెవిం బడినయంతన డిగ్గున లేచి యొ ట్టిటూ
యప్పరమేష్ఠినందనుఁడె యా నె వాజారపుత్రోవ వచ్చె నే
డెప్పుడు నంతరిక్షగతి నిచ్చటికే చనుదెంచు నివ్విధం
బిప్పుడు చాలఁ జిత్ర మిది యే మొకొ యంచు ససంభ్రమంబునన్. 16

సీ. తూఁగుటుయ్యెలఁ దూఁగుచోఁ గొంత చెదరిన యరవిరివన్నెబా గట్ల యుండ
నడపంబులోయ్యలి మడిఁచి యిచ్చిన తెలనాకుఁజీలిక చేతియందె యుండ
నట్టిటు దొడిగిన యంఘ్రుల రత్నంపుసమ్మాళిగలు సారె జాఱుచుండ
రాణివాసపుఁ జామరగ్రాహిణులు గూడ నరుగుదెంచి లేమంత మరలుచుండ
దనకుఁ గైదండ యొసఁగినతరుణి కేలు, వదల నెఱుఁగమి నది తోన వచ్చుచుండఁ
గనినవా రెల్ల నొదుఁగుచుఁ గలఁగుచుండ, మురరిపుఁడు వాకిటిహజారమునకు వచ్చె.

తే. ఇల్లెదుర్కొని ప్రణమిల్లియుంపుఁ బెంపుఁ, దనరఁ గైదండయొసఁగి తోడ్కొనుచు నేగి
యతనియాజ్ఞ వెంబడిని శుద్ధాంతనికట, భాసి యగునొక్కమణిసభాభవనమున ను. 18

మ. జగదీశుండు తపోధనాగ్రణికిఁ బూజావర్తన ల్నాఁడ క్రొ
త్త గనే తెంచినవానికిం బలె మహాతాత్పర్యసంయుక్తుఁడై
తగఁ జేసెం గడుఁగ్రొత్త క్రొత్త గుచు నత్యంతాదరం బెక్క ధ
ర్మగరిష్ఠాత్ములు బుద్ధిపూజ్యులగువార ల్వల్మఱు న్మెచ్చినన్. 19

ఉ. అప్పుడు తత్సభాగృహసమాగమనార్హులు కొల్వు సేఁతకై
యొప్పటియట్ల యందఱు బహిస్థితు లై యెతెఁగించి పంపఁ దా
నప్పరమర్షి వీడ్కొలుపునంతకు రమ్మనఁ గొంకి యచ్యుతుం
డప్పలుకు ల్గణింపక తదంచితగోష్ఠిన యుండె నింపులోన్. 20

ఉ. మానివరేణ్యుఁ డి ట్లనియె మా కొక పెద్దతనం బొనర్చి రా
జ్యానుగుణప్రవర్తనల కక్కట యిమ్మెయిఁ గొంకితేని వ
న్నోనలినాక్ష పా ప్మనుట యుక్తము నీ కిపు డట్లు గాక మా
వానిగఁ జూచితేనిఁ గొలువం బిలిపింపుము వారి నావుడున్. 21

మ. చెలులం బొట్టలఁ దండనాథుల విపశ్చిద్వర్యుల న్సత్కవీం
ద్రుల మంత్రీశుల వారముఖ్యుల మునుండుం డెంతయుం బ్రీతితోఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిలిపించెం బోడగాంచి రవ్విభవశోభిం న్వారల స్వైరిహా
స్తులు దప్తాంపలు నపు డేరెలుఁగుతోఁ దోడ్తో నెఱింగించుచున్. 22

తే. కమలనాభుండు నపుడు శీఘ్రంబ తనదు
కొలువు వీడ్కొంచు మానిఁ దోడ్కొనుచు నేగ
నంతిపురమున కాతండు నాత్మశిష్యు
వెలుపలన నిల్పి తాఁ దనవీణఁ గొనియె. 23

ఆ. అప్పు డతనిచేతి యావీణఁ దాఁ బుచ్చు, కొనియె సంభ్రమమునఁ గూడ నేగి
కరము వినయ మొప్పఁ గలభాషిణి ముకుందుఁ, డపుడు దానిఁ జూచియల్ల నగుచు.

క. ఏమీ శిష్యత్వంబున, నీమునివరు సేవసేయు నిచ్చ వొడమెనో
రామగుప యనిన విని యది, యేమి యు లే దని వినీతి నిటు నటు కొదిఁగెన్. 25

ఉ. ఒదుఁగుట యు న్యదుప్రవరుఁ డోహరిణాక్షి తలంక నేల నీ
కిది కడులెస్సబుద్ధి కృప నిట్టిమహామహు లాత్మసేవకు
హృదయమునందు నియ్యకొను టెవ్వరి కున్నది వేయు నేటికిం
బ్రదికితి సేవసేయుము శుభప్రదు నిమ్ముని నిట్ల యొప్పుడున్. 26

ఉ. నీమతి పెంపుఁ బాదుకొను నేసుపులు స్మృదుమంజులస్వర
శ్రీమధురత్వముం గనుచుఁ జిత్తములోపల నేను నెంతు ని
క్కోమలి గొంత నారదునకుం బరిచర్య యొనర్చు నేని వి
ద్యామహిమం గడు న్వెలయు నంచు నినుం గనుఁగొన్న వేళలన్. 27

మ. అనుచుం జాంబవతీగృహంబునకుఁ దా నమ్మౌనిలోకాధినా
థుని వెంటం జని శిష్యురాలి నొకతెం దోడ్తెచ్చితిం దీనిఁ గై
కొని శిక్షింపు మటంచు నల్ల నగుచుం గోవిందుఁ డాయింతిఁ బి
ల్చి నయం బొప్పఁగఁ బల్కె నమ్మగువ యుం జిత్తంబు రంజిల్లఁగన్. 28

క. నాకు మును మీరు చెప్పెడి, యాకలభాషిణియె యిది యటంచును వినయో
ద్రేకమునఁ బలికి మునికి వి, వేకత నుచితోపచారవిధు లొనరించెన్. 29

సీ. అంతట గోవిందుఁ డాయింతిఁ జూచి యోవనజాక్షి యిచటికి మునివరేణ్యుఁ
డేతేరదారకొని యున్నయో నా ళ్లయ్యె నీ వేమి దిద్దితి వెలుఁగఁ జెపుమ
గానచాతురిఁ దాను గడుఁబ్రోడ యయ్యెఁ దుంబురుమీఁదిమత్సరంబునను జేసి
మనవిద్య సాధింతునని పూని నాఁడిది యెందు నెవ్వరును మున్నెఱుఁగకునికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గావున విశేషములు నీకుఁ గలవి వరుసఁ, దెలిపి నీ నేర్చిన వెల్ల దిద్దుమనుచు
నొప్పగించితి నిమ్మహాయోగివర్య, యనుచు జాంబవతీసతి వినయ మొప్ప. 30

క. ఎప్పుడు న మ్మావచస్ఫూర్తిఁ, దప్పక యే నడుపుచున్న దాన నిపుడు సా
తప్పొప్పులు మీ ఱరయుట, యొప్పు న్నివనవధరింపుఁ డోకళాం తనుచున్. 31

క. కుందనపుఁగమ్మిఁ దిగిచిన, యందంబున జవరతనము వలయుం దేనె
ల్చిందినగతి మాధుర్యము, పొందుపడ న్వీణె ముట్టి పాలఁతుక పాడెన్. 32

సీ. ప్రౌఢితో సరిగమపధనిస్వరంబుల ప్రతినియతశ్రుతిక్రమము లెఱిఁగి
రాగభేదముల వర్గములఁ దొలంగించి లయతాళశుద్ధి నెంతయుఁ దలిర్ప
గ్రామవిశేషమూర్ఛన లేర్పడఁగ మంద్రమధ్యమతారసామగ్రి దనర
ధాతుమాతువులు గీతప్రబంధములందు సమానలీలమై నతిశయిల్లఁ
దోరమగు ప్రేమరసమువఁ దోఁచితోఁచి, వీనులకు నింపుఁ జలువయు విస్తరిల్ల
నాకరణిఁ దనకాంత యనేకగతుల, నాత్మగుణగానములు సేయ నచ్యుతుండు. 33

గీ. మునిత మేలుమేలు కొవవ లే దందు నీ, యనఘచరితుడిద్దు మనుచుఁ జనియె
జాంబవతి యు నొక్కసంవత్సరము దాఁకఁ, బాట నేర్పె మునికిఁ బాటవమున.

ఉ. అంతఁ గ్రమంబునం బ్రియుని యాజ్ఞ ననత్యయ భోజకన్య యు
న్నంతన మొప్ప నప్పరమసంయమి నొక్కొకయేఁడు దిద్ది ర
త్యంతమనోజ్ఞగానపటిమాతిశయోన్నతుఁ గాఁగ నవ్విభుం
డంతటఁ దాను దిద్ద నొకయబ్దము పూర్ణము గాఁగ నాతనిన్ 35

వ అప్పుడు మణికంధరుండు కలభాషిణికిఁ బోలె నంతఃపురకాంతలవలనిశిక్ష యేమి
యు లేకుండి యుఁ బుండరీకాక్షుని యనుగ్రహవిశేషంబున సకలరహస్యసంగీతవి
ద్యాసంపన్నతచేత నారదకలభాషిణులయట్ల యత్యధికుం డయ్యె. 36

క. అమ్మువురకు గానము హరి, యిమ్మెయి నఖిలంబు నేర్పి యిఁక మీసంగీ
తమ్మునకు నీడు లేదు జ, గమ్ముల నని పలికె మోదగరిమం దేల్చెన్. 37

గీ. అంతిపురములోని కరిగినప్పుడు తదీ, యాంగనలు నుదగ్రప్రసంగమైన
మానితోడ నీకు గానవిద్యకు సరి, లేనటంచుఁ బలికె రాదరమున. 38

క. మణికంధరుఁడును గలభా, షిణి యుఁ గొలిచి రాఁగ సాబుషిప్రసరశిఖా
మణి యొక్కనాఁడు యదుభూ, షణుపీడ్కొని వేడ్క నవని సంచారమునన్. 39

ఆ. ఇమచునుండి తనదు సంగీతచాతురి, గరిమపసదు మున్న సరసిజాక్షు
చెలువలాత్మ మెచ్చి చలిపినయట్టి ప్ర, శంసఁజందముల ప్రసంగమైన. 40

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. వారితో ని ట్లనియె నివ్విధంబున నవ్వరవర్ణినులు మువ్వురుం బెక్కుమాఱులు మదీయసంగీతచాతుర్యంబురీతు లతినూతనంబు లని యు నీతెఱంగు లెవ్వరికిని దొరక వని యుఁ బలుమఱు పలుక దది నిజహృదయంబునఁ గలవిధంబో నాదుమదికిఁ ముదం బొనరించు కొఱకునో యెఱుంగరాదు చదురు లెదిరి మదికి నెట్టిపగిది నైన సమ్మదం బొదవించుట పరమధర్మం బని తలంతురు గావున నట్టికథలు గట్టిగ నమ్మరాదు త మచెలులతోడ నేతత్ప్రసంగంబున నేమి పలికి రది నిజంబు తదవబోధంబు గలుగు సందాకఁ డెందంబు సందియంబు నొందుట తప్పదనుటయు నప్పరమతపోధనునకుం గలభాషిణి యి ట్లనియె. 41

క. మీ వెంట రాకపోకలు, గావింపఁగ నగరిలోనఁ గలజనములు న
న్నో వాచంయమ యెఱుఁగుదు, రావనితలకడకు నాకు నరుగఁగవచ్చున్. 42

గీ. ఇ ట్లరిగి వారు సఖులతో నిష్టగోష్ఠి, నాడుకొనుమాటలను వినఁగూడు నైన
నేను మీదాన నగుట మీగానకథలు, పడిన నవ్వేళఁ గొదవలు దడవరేమొ. 43

సీ. నాకపేక్షిత మైనసాతిరూపు ధరింపఁ సామర్థ్య మబ్బిన నామగువల
సఖుల రూపముఁ దాల్చి సముచితం బగువేళఁ జని వారి హృదయంబు గనఁగవచ్చు
నన నిది నెపము గాను నిధీశసుతుని దా రంభ యై కూడుట రమణికోర్కి
యదియ మదీయకార్యానుకూలము కదా యని యాత్మ నలరి యాయతివఁ జూచి
యువిద నీ కిట్టి సామర్థ్య మొదవుటకును, వర మొసంగితి నేను నీవలసినట్టి
యంగనలరూపుఁ దాల్చి యాయబ్జనాభు, వనితలతలంపుఁ దెలిసిర మ్మనుచుఁ బనిచె.

సీ. పనిచిన నాచెల్వ వనజదళాక్షుని సతులపాలికిని దత్సఖులరూపు
ధరియించి వార లొద్దను లేని వేళలఁ జని ప్రసంగము దెచ్చి సంయమీంద్రు
సంగీతచాతుర్యభంగు లనన్యసాధారణం బగుట తద్వాక్యసరణి
చేత నెంతయు సునిశ్చితముగాఁ దెలిసి యమ్మునికది యెఱిఁగించి ముదితుఁ జేసె
సంయమియు నాయకంజూచి జాంబవతియు, సత్యభామయుభోజాత్మజయును హరియు
గురువులుగఁ గానకళ లెల్ల గరిడిముచ్చుఁ, దనముతో నేర్చితివి గద యనుచుఁ బలికె.

గీ. కొమ్మ మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి, కాంతు రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయువానిని గూడి రమింపఁగలవు, నమ్ము పొమ్మిఁక నీభవనమున కనియె. 46

వ. అని యవ్వనిత ననిపి మణికంధరుండుం దానును నముచితభాషణంబులు గొంతతడవు నడిపి నారదుండు నిజేచ్ఛం జనియె మణికంధరుండు ను దదాదేశంబునఁ దీర్ఘయాత్రకేగ నటయున్న కలభాషిణి యు నట్లు నారదుచేత ననిపించుకొని నిజగృ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హంబునకుం జని గానాభ్యాసం బునుగుటం జేసి నగరి రాకపోకలతగులంబు చాల
మిం గ్రమంబునం దనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండం దత్సమీపగమ
నంబున కుపాయంబు గానక బహుకాలంబుగడపి కాలయాపనంబు దుష్కరం బగు
ట యు నొక్కనాఁడు దానొక్కతియ వీణం గొని గృహారామంబున కరిగియుం
డునంత. 47

చ. లలితప్రభూతిపూఁత యును లాతఁపుగోలయుఁ గక్షపాలయుం
న్మలకోను దిన్ని కెంజడలు మందులపాత్రము నాగబెత్తము
న్లలిగనుపట్టు కిన్నెర యు లాహిరిమోహము శృంగినాదముం
జెలువలరంగ నొప్ప నొకసిద్ధుఁడు సింగఁపువాహనంబుతోఁ. 48

గీ. అభ్రపదవి నేతెంచి యయ్యబల యున్న, తోఁటలోనికిఁ డిగియెనద్భుతము గాఁగ
సదియుఁదన్మహిమకు వెఱఁగందుమనము, నల్లనాల్కల్పి యర్ఘ్యపాద్యాదులొసఁగె.

గీ. అతఁడు నోకలభాషిణి యాత్మగురుని, గృష్ణుఁ గొలువఁగ నేగుదే గీతవిద్య
పూర్ణముగఁ నేర్చితే రాకపోక లిపుడు, మానినాఁడు గదా దివ్యమానివరుఁడు. 50

క. దానంజేసియ నీవు ను, మానసమితరప్రచింత మాని తిరముగా
నానలకూబరునంద య, ధీనం బై నిలిచియున్నదియొ తరళాక్షీ. 51

చ. కడపటినాఁడు నిన్ను నిటు కాంచనగర్భతనూజుఁ డంపుచోఁ
గడమయభీష్టసిద్ధి యును గాఁదగుదీవన యిచ్చెఁ గావునం
బడఁతి యమోఘ మాయనఘుపల్కు చలింపఁగ నీవు తాల్మి నీ
బడలుటఁ జూడ నోపుదురె ప్రాణసఖుల్ క్షణమాత్రమేని యుఁక. 52

సీ. తడవులనుండి యుఁ దపము సేయఁగఁ బూని మణికంధరుఁడు పాట మాని యుఁకి
నుపవాసఖేదంబు నపనయింపఁగలేక క్రేఁగుచున్నది నాదువీణ లిపుడు
వీణె వాయింపు మోవెలఁది నేఁ డైవఁ దుష్టిగ విని పారణ సేయుఁ గాని
యీభువనముల మీయిరువుర గానంబ కాని యన్యము లింపు గావు నాకు
నని పలుక మాటమాటకు నద్భుతంబు, చాలఁ బ్రబలంగ వినివిని యాలతాంగి
కరసరోజము ల్ముకుళించి కరము వినయ, మతిశయిల్లఁగ ని ట్లను నతనితోడ. 53

క. ఓయనఘ దేవుఁడవో యో, గాయతకపిలాదిసిద్ధులందు నొకఁడవో
నీయనుభావం బద్భుత, మై యున్నది నామ మెద్ది యానతియీవే. 54

క. అనిపలుక మణిస్తంభుం, డనుసిద్ధుఁడ నేను జలరుహాసన నీ కెం
చినవారలలో నెవ్వాఁ, డవు గా నని యతఁడు పల్కుటయు వినయమునన్. 55

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఓమహితాత్మ మీవచన మొక్కొకటే పరికించి చూచిన
న్నామదిలోన నెంత యు ఘనం బగుచున్నది యద్భుతంబు మీ
శేమహిమవ్యథార్థముగ నిట్లిది సర్వముఁ గంటి రిట్టిమీ
కీమహిఁ గావరానిపని యేమి యు లేదు గణించి చూడఁగన్. 56

గీ. నాకుఁ దార్కాణయయునయుంత యును దిరుగఁ, నడుగఁ జెప్పంగవలవదో యనఘచరిత
యిప్పుడు మణికంధరుని మీరుతపముసేయఁ, జెప్పితిరి మొదల్కొనియది చెప్పవలయు.

వ. అనుట యు నతం డాయింతిం జూచి యోకాంత నాకు దూరదృష్టిదూరశ్రవణంబు
లు గలవు దానం జేసి యేనున్నచోటన యుండి సమస్తంబు నుం గంటి నిందు నీ
యొఱింగినయర్థం బెల్లసరిదాఁకు ను గదా యింక నీవనిపించుకొనిపోయినవెనుకటి
శారదమణికంధరసంభాషణప్రకారంబుఁ దపఃపర్యంతం బైనమణికంధరవర్తనంబు
ను వివరించెద విను మని యిట్లని చెప్పందొడఁగె నట్లు నారదుండు గానశిక్షాపరి
పూర్తి యైనవెనుక నిన్ను నీగృహంబున కనిపి యంత మణికంధరుం జూచి. 58

క. నీసంగీతవిశేషా, భ్యాసము సఫలముగ కృష్ణుఁ బరమేశ్వరు న
త్యాసక్తితోడఁ బాడుచు, వేసరక భజింపు మెల్లవేళలయందున్. 59

క. ఆదేవున కెంత యుఁ బ్రియ, మై దురితవినాశహేతు వగు నిది యని యే
నాదరమున నామోక్షా, పాదిన్వీణియ ధరించి పాడుదు నెపుడున్. 60

సీ. బృహతీసమాఖ్యతోఁ బెంపుమీఱెడువీణె వహియించి యెపుడు విశ్వావసుండు
జగతిఁ గళావతిసంజ్ఞ నొప్పెడివీణతోడ నేప్రొద్దును దుంబురుండు
మహతీసమాహ్వయమహనీయ మీవీణె మానక నిత్యంబుఁ బూని యేను
గచ్ఛపి యనుపేరఁ గరముశోభిలువీణె నవరించి జగదంబ శారద యు ను
బాయ కెంత యుఁ బాటింతు భంగు లరయ, విద్యలం దెల్ల సంగీతవిద్య మిగుల
నుత్తమము గాదె యిది పురుషోత్తమునకు, నర్పితం బగు నేని నేనుని నలింతు. 61

ఉ. నీమకృతార్థతామహిను నెమ్మది నెన్నఁగ నంతయింతనా
రాదు తపంబులం గనఁగరానిజగత్పతి కృష్ణుఁ డెట్టిభా
గ్యోదయశాలికిం దొరకు నుల్లమునం బరికించి చూడుమా
శ్రీవయితుండు నీకుఁ గృపచేసె గురుం డయి గానసత్కళల్. 62

క. కావున నీవిద్య సదా, యావర్తింపుము కుమార యది సకలాభీ
ష్టావాప్తికిఁ గారణ మిం, పావహిలంజేయు నప్పు డటు వనమున కన్. 63

శా. ఏను స్వేగను యేగి నాపడినపా ట్లీజేఱ నాకంబులోఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గానీ కాంచనగర్భుకొల్వునడుమం గానీ పురద్విట్సభం
గానీ తొల్లిటి విష్ణుదేవుకడనే గానీ మదీయోల్లస
ద్గానప్రౌఢిని వాదు పూని గెలుతు న్గర్వోన్నతుం దుంబురున్. 64

వ. అనిన నాపలుకు లాకర్ణించి మణికంధరుం డమ్మునీంద్రునకు ముకుళితకరకమలుం డగుచు ని ట్లనియె మీకు గానవిద్యచేతం దుంబురుని గెల్చుసంభ్రమం బిప్పటి మాటలవలన నెఱుంగంబడియె నతనియం దిట్టిబద్ధమత్సరం బేల పుట్టె దజ్జయంబున కేమిపాట్లం బడితిరి నాకు నింత యు నెఱింగింపవలయు ననుట యు నతం డి ట్లనియె. 65

ఉ. వైకుంఠంబున నొక్కనాఁ డతులితైశ్వర్యుండు విష్ణుండు నా
లీకప్రోద్భవముఖ్యదేవగణములేస్సేవింప యోగీశ్వరా
నీకంబుల్నిగమాంతసూక్తులను వర్ణింపంగ నొడ్డోలగం
బై కూర్చుండె మహాసభన్సదవనవ్యాపారపారీణుఁ డై. 66

శా. కౌండిన్యాత్రిమరీచిదక్షకపిలాగస్త్యాత్రిపారాంగిర
శ్శాండిల్యక్రతుకణ్వకుత్సభృగువిశ్వామిత్రమైత్రేయమా
ర్కండేయాసురివామదేవకపిదుర్వాసోబకవ్యాఘ్రపా
న్మాండవ్యాదిమహామునుల్చనిరి ప్రేమ ల్మీఱఁ దత్సేవకున్. 67

వ. ఇవ్విధంబున దేవమునిసంఘంబులు వచ్చి సేవింప విష్వక్సేనుండు వేత్రహస్తుం డగుచు నందఱి నెడగలుగ జడియుచు బరాబరి యొనరింప దివ్యవారాంగనానాట్యంబు లవలోకించుచు నద్దేవదేవుండు పేరోలగమ్ము న నున్నసమయంబున, 68

ఉ. వారిదపజ్క్తులలో వెడలివచ్చుమెఱుంగులపిండువా సఖీ
వారములో రమారమణి వచ్చెను హెగ్గడికత్తె లెంచఁ గోఁ
గోరిభజింప నాకొలువుకూటము ముందటిపంక్తి నొప్పసిం
గారపుఁదోఁటనుండి యధికం బగువైభవ మింపుమీఱఁగన్. 69

ఉ. నెచ్చెలిపిండుఁ దానును వనిస్థలిదండ నొకింత గానఁగా
వచ్చెనొ రాదొ యాకమలవాసిని యంతనె యేమిచెప్పుదున్
హెచ్చినసంభ్రమంబున న సేకులుబ్రద్దలవార లెక్కడ
న్వచ్చిరొ మోఁది రాకొలువువారు కళాపిక లై చనన్వడిన్. 70

క. అప్పుడు మముబోంట్లకత, ల్చెప్పఁగ నేమిటికిఁ దారసిలి వేత్రధరు
ల్గొప్పఁగఁ జనిరొ న్నిలువక, యప్పరమేష్ఠి యు ను నచటి కతిదూరమునన్. 71

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అతనిని వేత్రహస్తులా, హా తుంబురుఁడా యటంచు నచ్చెర్వర ను
ద్యోతింపఁ బిల్చి క్రమ్మఱ, నాతనిఁ దోడ్కొనుచుఁ బోయి రతివేగమునన్. 72

వ. అట్లు తోడ్కొని పోవుచుండ. 73

చ. కని తమలోనఁ దా రితనిఁ గ్రమ్మఱఁ గాఁ బిలిపించె నేమొకో
యనియెడువారు గానవిధులందుఁ బ్రసంగము లేమి గల్గెనో
యనియెడువారుఁ దచ్చతురు లన్యులు లేరె యితండె కాని యిం
దనియెడువారునై మనములందు ను సందియ మొంది రందఱున్. 74

ఉ. అప్పుడు నేను నామనమునం దితనిం బిలిపించు టెట్లొకో
యిప్పు డటంచు నిల్చి యరయింప వినంబడియె న్నిజంబుగా
నప్పురుషోత్తముండు దనయంగనతో వినుచున్నవాఁడు సాం
గొప్పఁ దదీయగాన మని యొద్దఁ జరించెడివారు చెప్పఁగన్. 75

క. మమ్మెల్లఁ దోలి యొక్కని, నిమ్మెయిఁ బిలిపించి హరి యు నిందిర యుఁ గడు
న్నెమ్మదమునఁ దుంబురుగా, నమ్మును వినుచునికి విని మనం బెరియంగన్. 76

సీ. అనిపెవా యే మిచ్చె ననుచు ను సంభ్రమంబున సందడించుచు నూఁగువారు
సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు వినుట యడుగనేల యనెడువారుఁ
గడునను గ్రహము నెక్కడలేని యాయోగిపనయ తెల్పెడునంచుఁ బలుకు వారు
నీ వొక్కఁడవొ మఱియెవ్వార లైన నయ్యెడనుండిరో యనియడుగువారు
నగుచు సురలు మునులు నరుసంప మేపూఁత, డంబుతోడ వచ్చెఁ దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు, పదకము ను సునేత్రపటముఁ దాల్చి. 77

క. దగదగ యనుపదకంబున, నిగనిగ యన్క్రొమ్మెఱుంగు నేత్రపటమున
న్బుగబుగయను మేపూఁత, న్భగభగయనిపించె నతఁడు నాహృదయంబున్. 78

సీ. తనుఁ గ్రమ్మఱంగఁ బిల్చినవేళ యంద నాతో విచారింపక పోవు టెట్లు
పోయెఁబో ననుఁ బిల్వఁజేయక తా నొకనెరజాణ యై విద్య నెఱపు టెట్లు
నెఱపెఁబో ప్రభువు మన్నించినాఁ డని మీఁదు పడికింప కేసామ్ము పట్టు టెట్లు
పట్టెఁబో దొంగఁ దే ల్గుట్టిన ట్టివి డాఁచికొంచుఁ బోవక మెఱయించు టెట్లు
లేఁడు తగవరి యెందును మాడిచొచ్చి, వాతవెళ్ళైడువాఁడె యెవ్వాఁడు నంచుఁ
బాపి తుంబురుఁడా యంచుఁ బండ్లుగొఱుకు, కొంచు లోలోన నుడికితిఁ గొంతతడవు.

క. నాకంటెఁ దాను ఘనుఁడే, యాకోలఁది యు బయలుసేయునంతయు నేనే
పోకలఁబోయినఁ బోని, మ్మీకరణిం జాణిఁగి పోవనిత్తునె వీనిన్. 80

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని యాగ్రహించు మనతనితోడ సెందేని యు వాడు వెట్టుకొని భంగపఱచి యతులి తం బైనమదీయసంగీతచాతుర్యంబు వార్తలు క్రమంబున నిజ్జగన్నాయకునకు వినంబ డునట్టియుపాయంబు వెట్టెదం గాక యని యూహించి తదనంతరంబ. 81

ఉ. తలఁగక యిప్పు డిట్లు నముదగ్రతఁ జేర్చినయీర్ష్య బుద్ధిలో పలన యడంచి మైత్రిగనుపట్టఁగ నింతనఁ గొంతరాక పో కలు ఘటియించి యే నతనిగానములో గుణదోషవర్తన ల్దెలియుట నీతి యా తెలివిలే కగునే జయ మంచు నెంచితిక్. 82

గీ. ఎంచి యతనియింటి కేగితి నొక్కనాఁ, డతఁడు నపుడు పాట కాయిలమున వీణె మేళగించి వెలుపలిమోసల, నునిచి లోని కరిగి యున్న వాఁడు. 83

ఉ. ఏను తుంబురుం డెచటి కేగ గృహంబున నున్నవాఁడె యం చానికటంబున న్మెలఁగునట్టిజనంబులఁ బల్కి వీణె యి చ్చో నిశి లోనికేగ ననుసుద్ది వినంబడ నీవిపంచి యె వ్వానిదొ యంచు నుండి తమి వానిదె చూత మటంచు నల్లనక్. 84

గీ. పుచ్చుకొని శలికించి యపూర్వమైన, శ్రుతుల పెంపు నిర్దోషత నతులమగుచుఁ గడు వెలఁ గొనర్ప దాని నక్కడన వెట్టి, మిగుల లజ్జించి పచ్చితి మగిడి యపుడు. 85

వ. ఆసమయంబున నంతర్గతంబున.

మ. కడుఁ బ్రావీణ్యధురీణుఁ డీతఁ డయిసం గాంధర్వసంపూర్తి నె ల్లెడఁ బ్రఖ్యాతి వహించు నాకు నకటా యీతుంబురుం డంతయె క్కుడుగాఁ గానము నేఁటిదాఁక నని సంక్షోభించుచుం దాడిఁ ద న్నెడువానిం దలదన్ను వాఁడు గలఁ డన్వేషింప నం చెన్నితిక్. 86

చ. అటమును చెల్మి పెంపు దనరారఁగ నేమను దాను నప్పట ప్పటికిని గూడి పాడుదుము పద్మభవాదులయొద్ద నప్పుడె చ్చటఁ దన కింత గానకళసంపదకల్మి యెఱుంగనీఁడ ము చ్చటపడి యిట్లు విష్ణుఁడు ప్రసన్నతఁ దాఁ బలిపించునంతకుక్. 87

క. తమవిద్య నెవ్వ రేమా, త్రముఁ గనఁజాలుదురు వారిదండను దస్మా త్రమ్ము ప్రకటింతురు బుధు లు, త్తములమహిమ నీరుకొలఁది తామర సుమ్మీ. 88

క. ఇటు గాక విను జనంబుల, పటిమకు నెక్కుడుగ విద్య పచరించుటయు క్కుట విఫలము గాదే యె, చ్చటఁ జెపిటికిఁ బట్టునట్టిసంకు సుబోకుక్. 89

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అది యట్లుండె నేను నవి మొదలుగాఁగ నెక్కడెక్కడ నక్కజపుగానవిద్య గ
లవారు గలరు వారి నరసి యరసి తద్విద్య సాధించుచు నెందునుం దుంబురునకు
నీడు గాఁజాలమి యెడనెడం బరికించుచుం బెద్దకాలంబు ప్రవర్తిల్లి యీమనోర
థంబు సర్వజ్ఞుం డైనపుండరీకాక్షుని యనుగ్రహంబునం గాని ఫలియింపనేర దని
నిశ్చయించి తద్దేవునిం గూర్చి చిరకాలంబు తపం బొనర్చితి నంత. 90

సీ. అంజనాచలగర్వభంజనాచలలీల నీలవర్ణపుమేనిడాలు దనరఁ
బుండరీకముల నుద్దండరీతుల గెల్చు చెన్నొందు నిడువాలుఁగన్ను లమర
మకరకుండలరుచిప్రకరకుంఠితము లై దినకరప్రభలు వెన్వెనుకఁ గొదుఁగ
నురము రత్నమునందుఁ గరము రంజిలునీడ తోడునీడగ లక్ష్మి క్రీడలాడ
శంఖచక్రాదిపరికరసహితుఁ డగుచు, మఘవముఖదేవతాసేవ్యమానుఁ డగుచుఁ
బతగరాజాధిరోహణోద్భాసి యగుచుఁ, గృప దలిర్పంగఁ గాన్పించెఁ గేశవుండు. 91

గీ. కానుపించి యేమి కావలయును వరం, బడుగు మనిన నేను నాత్మశక్తి
కొలఁది నతులు నుతులుఁ జలిపి తుంబురు గాన, కలనవలన గెలువవలయు నంటి. 92

చ. అనుట యు నన్నుఁ జూచి కృప నచ్యుతుఁ డిట్లను నేను ద్వాపరం
బున వసుదేవనామునకుఁ బుత్రుఁడ నై యుదయింతు శిష్టపా
లనము ను దుష్టశిక్ష ను నిలాస్థలిఁ బ్రోవఁగ నప్డు ద్వారకా
ఖ్యనగరియందు నీ కభిమతార్థ మొనర్చెద రమ్ము నాఁటికిన్. 93

క. అని యంతర్ధానము నొం, దినఁ జిరకాలంబు నేఁ బ్రతీక్షించుచు నం
తను వాసుదేవుకడ ని, ట్లనుపమసంగీతకౌశలాఢ్యుఁడ నైతిన్. 94

క. ఏ నిన్ని పాట్లఁ బడి యీ, గానమహిమఁ గంటి నీవుఁ గలభాషిణియు
న్నేమి చెమర్పక యుండం, బూనితి విది యప్రయాసమున హరికరుణన్. 95

క. అనుడు మిముఁ గొలుచుపుణ్యం, బున కిది యరుదయ్యె ఘనతపోధన తన్నుం
దినవారు తమంతలవ, న్వినరే లోకోక్తి మీరు విశ్వంభరలోన్. 96

మ. అది యట్లుండె నొకప్డు తుంబురుని దా నారీతిఁ బిల్పించి యిం
పు దలిర్పన్ హరి పాట వింట మిగులం బూజ్యంబుగాఁ జెప్పితే
కొదయున్లేక సదా నివాసముగ వైకుంఠంబులో నుండి యా
సదయు న్విష్ణునిఁ గొల్వఁగల్గెడుమహాసౌభాగ్య మెట్లబ్బునో. 97

క. అనుట యు నమ్మాటకు నె, మ్మన మలరఁగ నతనిఁ జూచి మణికంధర య
త్యనఘుఁడవు మేలు మేలీ, యనుపమసద్బుద్ధి యేరికైనను గలదే. 98

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వినరే యెవ్వరుఁ బాపం, బనఁ బుణ్యం బన నిషేధ మన విధి యనఁ గీ
డన మే లనఁ బరలోకం, బనఁ దలఁపగలేరు గాక యాత్మహితంబుల్. 99

చ. అలయక వేదశాస్త్రసతతాభ్యసనవ్యసనప్రసంగతిం
దెలివి యొకింత కాంచినగతి న్మతి కెక్కి యు వెట్టి దీరెరోఁ
కలిఁ దలఁ జుట్టు మన్నక్రియఁ గానొకకొందఱు దాల్తు రెప్పడుం
గలుషపథప్రవర్తనము కర్మపువాసన నన్యుఁ గొల్వఁగన్. 100

సీ. వినుము గంధర్వనందన భూతములయందుఁ బ్రాణు లుత్తమములు ప్రాణులందు
బుద్ధిజీవులు మేలు బుద్ధిజీవులయందు మనుజులు శ్రేష్ఠులు మనుజులందు
బ్రాహ్మణు లధికులు బ్రాహ్మణులందు విద్వాంసులు ఘనులు విద్వాంసులందు
విదితార్థకృతిలోలహృదయులు ముఖ్యులు విదితార్థకృతిలోలహృదయులందుఁ
గర్త లెంతయుఁ బూజ్యులు కర్తలందు, బ్రహ్మవిదు లెక్కుడామీఁదఁ బరమ మొకటి
గలుగ దనుచు ను మున్నుదాఁ బలికె మనువు, ధర్మశాస్త్రప్రసంగవర్తనలవేళ. 101

ఉ. నీవిధ మారయం బరిగణించిన యప్పటితారతమ్యపుం
ద్రోవ కరంబు దూరముగఁ ద్రొక్కినవాఁడవు నిక్కవంబు ల
క్ష్మీవరనిత్యసన్నిధివిశేషమహత్త్వ మెఱింగినంత నే
యావిభవంబుఁ గాంచుటకు నాన యొనర్చితి గాన నిష్టయిన్. 102

క. కావున నీవడిగిన య, ద్దేవునియనవరతసన్నిధిమహత్త్వవిశే
షావాప్తికిఁ బెద్దలచే, నేవినినయుపాయ మిప్పు డెఱిఁగింతుఁ దగన్. 103

క. అధికారి కానివానికి, నధికపదవిఁ దెలుపఁ బ్రాప్త మయ్యెడుపాపం
బధికారి యైనవానికి, నధికపదవిఁ దెలుపకున్న నగు నిక్కముగన్. 104

వ. అని యిట్లని చెప్పె. 105

సీ. తనశక్తికొలఁది సత్కర్మము ల్ఫలవాంఛ మాని కృష్ణార్పణమతిఁ జలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుట విష్ణుభక్తిపైఁ గ్రమమునఁ బాదుకొనుట
తద్భక్తి గలపుణ్యతములసంసర్గంబు దుర్జను లున్నట్టి త్రోవఁ జనమి
విష్ణుసన్నిధికళావిఖ్యాతవివిధదివ్యక్షేత్రతీర్థయాత్రాచరణము
బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము, వలయు వైకుంఠము ను గోరువారి కెల్ల
వీనిలోపలఁ గొన్ని గావింపఁ గనిన, వృథఁ జనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము.

వ. అని చెప్పి నీవు నిజశక్తికొలఁది నిందుఁ బ్రవర్తిల్లుము కృష్ణానుగ్రహంబునం గలిగిన
యీయనన్యసాధారణసంగీతచాతుర్యంబు వృథ సేయక శ్రీపురుషోత్తమ శ్రీరంగాది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దివ్యక్షేత్రములందు ముకుందసన్నిధిం దద్దివ్యగుణనామసంకీర్తన గానంబు గావింపు
మది సకలశ్రేయోనిదానం బని పలికి తత్ప్రసంగవచనంబున. 107

ఉ. అక్కజ మైన భక్తి దనరార నతం డనయంబుఁ గృష్ణునిం
దక్కక యాత్మఁ జూచి ప్రమదంబునఁ బొంగుచుఁ జెంగలించుచుం
జొక్కుచు మ్రొక్కుచుం బొగడుచుం బలికించుచుఁ గన్ను మోడ్చుచు
న్మిక్కిలి చోద్య మందుచును మెచ్చుచుఁ బాడుచు నాట్య మాడుచున్. 108

క. కేవలము నతిప్రేమర, సావేశవశంపదాత్ముఁ డై తద్గుణము
ల్భావించుచు నొకరీతిం, ద్రోవగనుచు నేగె నారదుండు నిజేచ్ఛన్. 109

వ. మణికంధరుండు ను దచ్చరితంబులకు నతివిస్మయప్రమోదహృదయుం డగుచు ని
తం డింతధన్యతామహిమంబున నొప్పు నే యని కొనియాడుచుం దనదృష్టిమార్గంబు
గడచునందాఁక వీక్షించి యెట్టకేలకు నాలోకనంబులం ద్రిప్పుకొనియె నివ్విధంబున
గురుం డరిగిన నతండుఁ దదుక్తప్రకారంబునఁ బుణ్యకర్మంబులు నడపుచుఁ గ్రమంబు
న విష్ణుభక్తి హృదయంబునం బొదలఁ దీర్థయాత్ర గావించె నందు. 110

మ. యమునం జూచెను వీచికాచయమునం భ్రాంతద్ఘనశ్యామతో
యమున న్సారసకైరవోచ్చయమున న్సారావభృంగీనికా
యమునం జక్రమరాళసంచయమున న్వ్యాఘూర్ణితామవ్యపా
యమున న్సంతతపుణ్యనిశ్చయమునన్ హర్షప్రకర్షంబునన్. 111

శా. నిధ్యానోత్సవకారణంబు లగుచు న్మించెం గరం బానది
న్మధ్యేతీరవనద్విజప్రకరసమ్యగ్వర్తితారణ్యకా
స్వాధ్యాయాధ్యయనస్వరాభినయలీలాందోళనభ్రూలతా
బుద్ధ్యాపాదనమై పుణీవిలసితాంభోవీచిచాంచల్యముల్. 112

చ. ఇరుగడలందు మించిన యహీశ్వరశయ్య తెఱంగుఁ దాల్చి క్రొ
న్నురువులపజ్క్తి రాజిలఁగ నూతనపీతపటంబుగా వడిం
దరళసరోజరేణుసముదాయము సొంపెసఁగంగఁ జూడ్కి కా
తరణితనూజ యొప్పె శయితం బగువిష్ణునిమూర్తియో యనన్. 113

క. ఆవైణికుండు తత్తీ, ర్థావళిఁ దగువిధులొనర్చి యాయాచోట్లన్
శ్రీవరుగుణములు వీణా, ప్రావీణ్యము పొలుపుమీఱఁ బాడుచు నంతన్. 114

వ. మధుర సేవించి యంతట హరిద్వారంబు ను సాలగ్రామపర్వతంబు ను బదరికాశ్ర
మంబు ను నైమిశారణ్యంబు ను గురుక్షేత్రంబు ను బ్రయాగ యుఁ గాశి యు న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యోధ్య యు గంగాసాగరసంగమంబు ను స్నానదానాదివిధు లనూనంబుగా నడ
పుచు దర్శించి యంత నుదధితీరంబున నీలాచలసన్నిధికి నేతెంచి. 115

క. ఇదిసాక్షాద్వైకుంఠం, బిది నానామునితపస్సమృద్ధివిపాకం
బిది పరమం బిది శరణం, బిది పుట్టినయిల్లు సిరుల కెల్లఁ దలంపన్. 116

తే. అని నుతించి యింద్రద్యుమ్న మనుసరసిని, రోహిణీకుండమున సమారూఢభక్తిఁ
దీర్థ మాడుచు వాతఁ డాత్మీయగాన, నైపుణి వెలార్చుచు ను జగన్నాథు గొలిచె.

సీ. ఇత్తెఱంగునఁ బురుషోత్తమశ్రీజగన్నాథుని సంసేవనమునఁ దవరి
శ్రీకూర్మవిభునియంఘ్రిసరోరుహంబులు గనుఁదమ్ములకు విందుగా నొనర్చి
సింహాచలాధీశసేవావిశేషలీలల ను జన్మంబు నలంకరించి
శ్రీమదహోబళస్వామిపాదనఖోడుజాలసంఘము ఫాలశశికి నొసఁగి
వేంకటేశ్వరచరణారవిందగంధ, నందదిందిందిరశ్రేణినైల్యమున ను
నిజశిఖాకాంతికిని బుష్టి నిర్వహింపఁ, జనియె నాదరమేదురస్వాంతుఁ డగుచు. 118

మ. కమనీయోజ్జ్వలశీలశాలి యగు నాగంధర్వుఁ డంతన్ ఘన
ప్రమదప్రేమవిశేషసంభృతపరీరంభక్రియాసంభ్రమ
భ్రమకారాభిముఖప్రసారలహరీబాహాసమూహాసమా
నమనోజ్ఞం బగుస్వామిపుష్కరిణికి న్వచ్చెం గడున్వేడుకన్. 119

తే. అంత హరిసంతతాశ్రితస్వాంత మైన, స్వామిపుష్కరిణి యు ను నాశ్రితభక్త
తనువు నన్యోన్యపావనత్వము భజించె, మిగుల మజ్జనసమయసమ్మేళనమున. 120

వ. అంత నిత్యనియమములు సమస్తము ను నొనర్చి యాచెంతఁ జెలువు మీఱుచున్న క్షితివరాహమూర్తి శ్రీకాంతుఁ గొలిచి భక్తివినయకౌతుకప్రమోదసంక్రాంతిశబలతావిశేషకలితచిత్తవృత్తి యై. 121

సీ. మణిమయప్రాకారమండపగోపురోదీర్ణకాంతులచేతఁ దేజమునకుఁ
జారునదీహస్తచామరవీజనవ్యాపారములచేత వాయువునకు
నారాధనార్థయాతాయాతజనవిభూషణరజోవృష్టిచే ధారుణికిని
హృద్యచతుర్విధవాద్యస్వనోపయోగప్రవర్తనముచే గగనమునకు
నిజనవాగరుధూపజనీరవాహ, జననసంబంధమహిమచే సలిలమునకుఁ
బావనత్వంబు గలుగంగఁ బరఁగువేంక, టేశునగరుఁ దాఁ జేరి యిం పెసక మెసఁగ.

క. మునుపు పరివారదేవత, లను దగ సేవించి నిర్మలప్రేమభరం
బున మేను గగుర్పొడువఁగ, ననఘుఁ డతఁడు లోని కరిగి యగ్రమునందున్. 123

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. మృదుపదాంబుజములు మెఱుఁగుటందెలుఁ బైఁడిదుప్పటియును మొలనుప్పిడియును
మణిమేఖలయు బొడ్డుమానికంబు ను వైజయంతి యు నురమున నలరుసిరి యు
వరదహస్తముఁ గటి నర్తిలుకేలు శంఖముఁ జక్రము ను దాల్చుకరయుగంబుఁ
దారహారంబులుఁ జారుకంఠంబు నిద్దపుఁజెక్కులు ను నవ్వుదళుకుపసలు
మకరకుండలములును దామరలఁ దెగడు, కన్నులు మనోజ్ఞనాసయుఁ గలికిబొమలు
ముత్తియపునామము ను రత్నమకుటవరము, నెసఁగఁ గనుపట్టు శ్రీవేంకటేశుఁ జూచె.

శా. ప్రత్యంగంబు ను మిక్కిలిం దడవుగా భావించి భావించి యా
దైత్యారాతితనూవిలాసము సమస్తంబు న్విలోకించెఁ దా
నత్యంతంబు ను వేడ్కఁ బొంగుచు నితాంతాశ్చర్యముం బొందుచుం
గృత్యం బేమి యుఁ గొంతఁ బ్రొద్దెఱుఁగ కక్షీణప్రమోదంబులోన్. 125

వ. పదంపడి నిజానుభవం బిట్లని యుగ్గడింపం దొడంగి. 126

సీ. పదపద్మములఁ జిక్కి పాయదు నాదృష్టి కనకాంబరమున కేకరణిఁ దెత్తుఁ
గనకాంబరమునఁ గీల్కొనినఁ జలింప దే నుదరబంధమున నెట్లోనరఁ గూర్తు
నుదరబంధమున నిం పొంది భేదిల్లదు శ్రీవత్సమున కెట్లు చేరఁ దిగుతు
శ్రీవత్సమునఁ దారసిలిన రానేరదు కేలుఁదామరల కేక్రియ మరల్తుఁ
గేలుఁదామరల ను గళశ్రీల మోవి, మకరకుండలముల గండమండలముల
నాసఁ గనుఁగవ బొమలఁ గుంతలములందు, నెందుఁ బర్విన విడఁజాల దేమి చెప్ప.

వ. అని పరమానందంబున నితరప్రపంచంబు సర్వంబును మఱచి కొంతతడవు నిరీక్షించి
తదనంతరంబ దండప్రణామంబు లనేకంబులు గావించి విపంచిసమంచితమృదుమ
ధురనినదంబు ను గంఠస్వరంబు ను నేకం బగుచు లోకుల నస్తోకసమ్మదాశ్చర్యసం
భృతస్తంభభావులఁ గావింప నద్దేవుని దివ్యమంగళగుణగానంబు లొనరించె నివ్వి
ధంబున మూఁడహోరాత్రములు సేవించి వేంకటనగంబుడిగ్గి చనిచని ముందట. 128

సీ. ఏపట్టనము ముక్తిహేతుసప్తపురాంతరభిగణనాతివిఖ్యాతశాలి
యేపట్టనము ఖేలదేకామ్రవిభుశిరస్సింధుమత్సరిసరశ్శ్రీవిభాసి
యేపట్టనము సముదీర్ణకామాక్షీతపఃపరిపాకసంపద్విధాయి
యేపట్టనము సరిద్రూపవాగ్దేవతాసంశ్రయాంచితసమస్తద్విజాళి
బ్రహ్మయజ్ఞవపాహోమపరిమళసహ, జాతసాక్షాత్పరబ్రహ్మసన్నిధాన
భాగ్యసౌభాగ్యయోగ్య మేపట్టనంబు, పుణ్యతర మైనయా కాంచిపురముఁ గనిరొ. 129

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. కని మనంబున మోదంబు గడలుకొనఁగ, నందు నేకామ్రనాథుఁ గామాక్షిఁ దక్కఁ
గలుగు వేల్పుల దర్శించి కరిగిరీంద్ర, మునకుఁ జని యుక్తగతి నెక్కి పోవ నెదుట.

సీ. తనశంఖరుచికి నాతనిమనస్సత్వోదయంబు ప్రత్యుత్థాన మాచరింపఁ
దనచక్రమునకు నాతనిదివ్యతేజంబు గురుభావమున నెదుర్కోలు సేయఁ
దనకృపాలక్ష్మి కాతనిభక్తి నెనరు పెంపెసఁగఁ గౌఁగిటఁ జేర్చి యెత్తుకొనఁగఁ
దనకౌస్తుభమున కాతనిశుద్ధచిత్ప్రకాశము మైత్రి నెఱపుచు సరస మాడ
వరదరాజదేవుఁడు భక్తవత్సలుండు, మిగులఁ గనుపట్టె నతఁడు నజ్జగదధీశుఁ
గని పులకితాంగుఁ డగుచును వినతి చేసి, పాడుచు భజించె నెంతయు భక్తిమీఱ.

శా. ఆకాంచీనగరంబు వెల్వడి సముద్యత్పూగపున్నాగరం
భాకంకేళిరసాలసాలసుమనఃపాళీజధూళీమధూ
ళీకేళీపరగంధవాహపృథుకాళీచంక్రమాలంకృత
క్ష్మాకప్రాంగణచోళమండలమహాగ్రామంబు లీక్షించుచున్. 132

చ. చెఱకును రాజనంబు వరిచేలు ను దట్టపుఁబోఁకమ్రాఁకులుం
దఱచగుపూవుఁదోఁటలు ను దమ్మికొలంకులు నేటికాల్వలుం
బఱపగునారికేళవనపఙ్క్తులు మామిడితోఁపులుం గడు
న్నెఱయుచు నాత్మకు న్ముదము మెచ్చు ను నచ్చెరువున్ ఘటింపఁగన్. 133

శా. ఆపీనాధరుఁ డేగి కన్గొనియెఁ బుణ్యఖ్యాతదర్పోల్లస
ద్దైవద్వీపవతీసమత్సరవివాదప్రౌఢిమానర్గళ
వ్యావల్గత్కరభావభృల్లహరికావర్గావృతవ్యోమమున్
గావేరీతటినీలలామము నఘౌఘక్షాళనోద్దామమున్. 134

గీ. కని తదీయమైన యనితరసదృశపా, వనతరప్రభావఘనత దనకుఁ
గరము మెచ్చొనర్పఁ బరమనిరూఢి నా, దరముతోడిభక్తిగరిమఁ దనరి. 135

క. పావనగుణానుభావము, భావన గావింప నెట్టిపరమనదులు నీ
కావేరికి సదృశంబులు, గా వేరికి నైనఁ బొగడఁగా వెర వగునే. 136

లయగ్రాహి. ఈనది ప్రవాహయుగళీనిభవిభాసితభుజానియతరంగసదనూనపరిరంభం
బీనది భజన్నిఖిలమానవమనఃకలుషతానిరసనాతిపటుతానతజలౌఘం
బీనది సమస్తతటినీనికరదుష్కరతరానుపమచిద్విభవదానమహనీయం
బీనది పవిత్రతర మీనది శుభైకనిధి యీనది విముక్తికి నిదానము గణింపన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉత్సాహ. అమితరంగధామ! లక్ష్మి నరయఁ బృషతమణినికా
యములఁ బూజసేయఁ దాల్చినట్టి నేత్రభుజసహ
స్రములు గాని జలరుహములు జలరుహములు గావు భం
గములు భంగములు ను గావు గణనసేయ నీనదిక్. 138

మానిని. బంగరుచేలయుఁ బద్మనిభాక్షులు బాహుచతుష్కము భవ్యవిభో
త్సంగితశంఖసుదర్శనశార్ఙ్గగదాముఖచిహ్నము తత్త్వము నీ
లాంగము నీనది యార సృజించు నిజాశ్రితదేహికి నంతికస
ద్రంగశయానుఁ దిరంబుగఁ జూచి కరం బిదివో చతురత్వ మనన్. 139

వ. అని ప్రశంసించుచున్న యచటిజనులవాగ్జన్మసాఫల్యంబునకు నుల్లసిల్లుచు నరవిందకు
ముదకల్హారతల్లజసముల్లసితగంధసంబంధబంధురగంధవహకిశోరవారంబులు దూరం
బుననయెదుర్కొనఁజక్రచక్రాంగబకక్రౌంచసారసారావంబులు సారస్యవికస్వరస్వా
గతభాషణంబుల వేషంబు నుపచరింప నుత్కంపమానకల్లోలజాలంబులు సమాలింగ
నలీలాలోలబాహుకాండపాండిత్యంబు లత్యంతంబుఁ బ్రకటింపఁ దటస్థలస్థాపితస్థూ
లడిండీరఖండమండలవిలాసంబులు రజతాసనసమర్పణప్రకారంబు నేర్పరింప నింపు
మీఱుచు నిష్టబంధుసందోహంబులలాగున నాగంతుకజనసంతతుల సంతసంబున నుప
చరింపఁ బెంపుమీఱుచున్న యాకావేరియందు నుచితవిధులు దీర్చి యంచు మి
క్కుటం బగు వెక్కువ నుక్కుమిగులు జక్కవల చక్కఁదనంబును వెక్కిరించు ని
రుత్తరీయవర్తులోత్తుంగరంగత్కుచయుగంబుల నరస నరసంబు లాడం జేసిన తెఱం
గునం గానుపింపఁ జంకల నిడిన కనత్కనకకలశంబులతోడఁ బొలుపారుచు నీరాటి
రేవున తీవినెఱపు ద్రావిడయువతీవితతుల యతులచతురిమపరిమళితలలితవచనరచన
లరుచులు గొనవలసి తెలిసి యుఁ దెసపడుగుతెరువరులం గూడుకొని పురంబు ప్రవే
శించి వేదాధ్యయనశబ్దంబులతోడి యుద్ధులై యుద్ధిఁ బెంచు షడ్దర్శనవ్యాఖ్యాన
ఘోషంబులచేతఁ బూతాతిథిశ్రోత్రంబు లగుబ్రాహ్మణగృహవాటికలు దాఁటి
కోటానకోటులై కోటకొమ్మలయందు నవ్యుత్పన్ననిర్వాణంబు లగుమాణిక్యదీపంబు
లు మార్తాండమండలమునకు మాఱుమండుచు ఖండితబహిరంతరతమస్సముచ్చయం
బు లగుహెచ్చు నచ్చెరువున విలోకించుచు శ్రీరంగరాజభజనయాతాయాతవర్తనన
ర్తకీమణివిభూషణఘోషణపోషణంబుల నినుమడించి యేపారు పారావతారవాపా
రపారంపర్యంబులం బర్యాకులాంకణంబు లగువిశంకటవిటంకంబుల నలంకృతంబు
లగుగోపురంబులు విలోకించుచుఁ బ్రాకారంబులు సొత్తెంచి యథోచితక్రమంబున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వైనతేయాదుల సేవించుచు రంగసంజ్ఞితం బైనదివ్యధామంబు డగ్గఱ నేఁగి యందు.

సీ. ఒసపరిపసమించు పసిఁడిదుప్పటివాని శుభమైన యురముకౌస్తుభమువానిఁ
జిలిదమ్మిరేకులఁ దెగడుకన్నులవానిఁ గమ్మకస్తురితిలకంబువానిఁ
దొలిపల్కుఁగిల్కుఁ బావలఁజరించెడువానిఁ జలువతావుల సెజ్జవలరువానిఁ
నింద్రనీలపుడాలు సేలువర్ణమువాని సిరిముసల్గొలుపుమై చెలువువాని
మకరకుండలదీప్తిడంబరమువాని, డంబు నెఱపెడు మణికిరీటంబువాని
రంగనాథునిఁ గాంచి సాష్టాంగనతులు, సలిపి తన్మూర్తి యంతయుఁ గలయఁ జూచి.

చ. తనియమరంగ నొక్కొకటి దక్కఁగ నేలెఱు నార మద్విలో
కముల మణీకిరీటము ను గస్తురి నామము నవ్వుమోము హా
రములు ను వైజయంతి యు నురస్థలరత్నము శంఖచక్రము
ఖ్యములు ను బొడ్డుఁదామరయుఁ గంకణకాంచిపదాంగదాదులున్. 142

సీ. దివ్యసంయమిమనస్స్థితిఁ బొల్చు మత్కులదైవంబు పదములఁ దలఁపుఁ జేర్తు
నఖిలలోకస్రష్ట యగుబ్రహ్మఁగన్నమత్ప్రాణబంధువునాభి నాత్మఁ జేర్తు
దైతేయకంఠనిర్దళనంబు లైననాస్వామిహస్తముల భావంబుఁ జేర్తు
లక్ష్మి చన్గవకు నలంకారమైన నాతండ్రివక్షము నఁ జిత్తంబుఁ జేర్తు
నుల్లమునకు ను జూడ్కికి వెల్లిగొలుపు, నావరదు మోమునందు మనంబుఁ జేర్తు
ననుచు గీతరూపములుగా నాశుకవిత, నుతుల రచియించి పాడుచు నతఁడు గొలిచె.

వ. అంత నాగంధర్వుం డచ్చటు వాసి యొక్కించుక తూర్పుగాఁ జని చని. 144

చ. అలరుచుఁ గాంచె ముందట సహమ్మతినిర్మథనప్రవీణము
న్విలసితశోధవజ్రరుచినిర్జరనిర్ఝరిణీప్రవాహసం
వలనమిళత్ప్రమత్తఝషవారమతిప్రదచంద్రశాలికా
లలితవతీవిలోలదృగలంక్రియమాణముఁ గుంభకోణమున్. 145

వ. అందుఁ గంధళదమందసందీప్తప్రవాహసంక్షాళితదిగంతరాళసంతమసజంబాలంబు ల
గుగోపురప్రాకారంబుల దీపించుమాణిక్యమయమందిరంబునందు. 146

సీ. నును గాడ్పుదూదినిం దినయట్టిచల్లనిపానుపుపై లీలఁ బవ్వళించి
బటువులై హొంబట్టుబటువులో యననొప్పు రమచన్నుదోయిఁ బాదములు చేర్చి
చెలువు దీపింపఁగ శిరముక్రిందట నొక్క కేలు దలాడగాఁ గీలుకొలిపి
బంగారువలువున రంగారుకటిమీఁదఁ జక్కఁగా నొక్కహస్తంబు చాఁచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యన్యకరయుగ్మమునఁ బాంచజన్యము ను సు, దర్శనంబు ను దాల్చి సుదర్శనమున
వచటిజనములచూడ్కి ధన్యముగఁ జేయు, శార్ఙ్గపాణిని గొల్చె నుత్సవ మెలర్ప.

వ. మఱియు నందుఁ గుంభేశ్వరుని సేవించి దర్భశయనంబున కరిగి యందు రామభద్రు
నిర్నిద్రభక్తితాత్పర్యంబుల సేవించుచు వీణావాదనానువాదమేదురగానకౌశలంబు
లోడ నిట్లని స్తుతించె. 148

తురగవల్గనరగడ. దశరథావనీశవిమలతరతపఃఫలావతార
నిశితశరలఘుప్రయోగనిహతతాటకావిహార
కపటపటుసుబాహువశనఘటితగాధిసూనుయాగ
అపరిమేయగౌతమాంగనాఘదమనపదపరాగ
కోమలేక్షుదళనసదృశఘోరశంభుచాపభంగ
భూమిజావివాహవిభవపూర్ణసన్ముదాంతరంగ
పరశురామగర్వపవనపానపీనబాహునాగ
గురువచోనుపాలనాతికుతుకవిధుతరాజ్యభోగ
పాదభజనవితరణాతిఫలితగుహసమస్తపుణ్య
పాదుకాప్రదానవిహితభరతసౌహృదానుగుణ్య
ఘనవిరాధమదవినాశ కలితబహువిపన్నిరాన
వినుతపదనివేశ పూతవివిధమౌనికులనివాన
తతనిశాచరీవిరూపతాకృతప్రియావినోద
అతులబలఖరాదిదనుజహననజనితవిబుధమోద
హరిణరూపధారిదారుణాసురాసుహరణబాణ
పరమఘోరబాహుబలకబంధమర్దనప్రవీణ
అమలశబరికాఫలోపహారరుచిఘనాభిముఖ్య
సమదవాలిదర్పదమనఫలితార్కతనయసఖ్య
శరణవరణపరపరానుజప్రదీపితప్రసాద
అగణితాక్షికోణవిరచితాంబురాశిగర్వసాద
పర్వతౌఘరచితసేతుబంధసుతరసింధుకాండ
గర్వపఙ్క్తికంఠకంఠఖండనప్రచండకాండ
సకలదివిజనుతచరిత్ర జానకీమనోజ్ఞగాత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సకరుణాతరంగ నేత్ర సాధుభవలతాలవిత్ర
యాతిజపార్శ్వ పుణ్యనామ యతివితీర్ణభక్తకామ
సతతసితయశోభిరామ సర్వలోకపూర్ణధామ
అహితవిదళనాతిరౌద్ర యార్తపాలనావినిద్ర
మహితనిఖిలగుణసముద్ర మమ్ముఁ బ్రోవు రామభద్ర. 149

క. పరమం బగుమీనామము, కర మామ్నాయములు తారకబ్రహ్మముగా
నిరతి న్వినుతింపఁగ నా, తరమే మిము నభినుతింప దశరథరామా. 150

వ. అని వర్ణించి యచటు గదలి సేతుబంధంబునకుం జని యందు రామేశ్వరు బహుభక్తివిశేషంబుల నారాధించి యనంతశయనంబున కరిగి యందుఁ బద్మనాభునిం గొలుచుచు నతనిసన్నిధిం గొన్నినాళ్లు దనదుగాంధర్వవిద్య హృద్యంబుగా నెఱపె నేను గానప్రియత్వంబునంజేసి చెవియొగ్గి తత్తత్ప్రదేశంబుల నతండు పాడెడు పాటలు వినుచు దృష్టియుం బాఱవిడిచి యిది యింత యుం గనుంగొంటి నివ్విధంబున ననంతపద్మనాభుని సన్నిధి నుండి యతం డంత. 151

క. ఆపడమటిదిశ దళత్కళి, కాపుష్పఫలాదిగరిమకతన సమీప
శ్రీపకలాపమణీపట, లీపటిమస్పర్ధ వర్ధిలెడువనవాటిన్. 152

క. సారిఁ గూర్చి తప మొనర్పఁగ, దొరకొనియెను దానఁ జేసి తోయజముఖి యా
నరసుని గానకళామా, ధురి యేమి యు ననుభవింప దొరకదు నాకున్. 153

క. అని యాడిక్కునకు విలో, కనములు నిగిడించి యట్టినిగాఢపుఁబద్మా
సనమునఁ గూర్చున్నాఁ, డో, వనిత యిపుడు దృఢసమాధివర్తన మీఱన్. 154

చ. అనుట యు నాలతాంగి కడునద్భుత మింత యు నోమహాత్మ మీ
కనుఁగవ కిప్పు డిమ్మెయిఁ బ్రకాశతఁ దత్సకలప్రవర్తన
ల్గనఁబడుచున్నవే యనినఁ గంజముఖీ యనుమానమున్న ని
ష్ఠనుపుము దవ్వుగాఁ జెలుల నచ్చటితత్క్రియ లెల్లఁ జెప్పెదన్. 155

సీ. అనుడు మహాత్మ మి మ్మంత నేనొంటియుంగ నర్వనే మీపలుకులందుఁ గలదె
యనుమానమనుట యు నైన నిం జేమి తప్పిది యు వినోద మోయింతి యనుచు
బలిమి నాయకచేతఁ జెలుల సిద్ధజేఁ గడుదవ్వుగా నంపించి తత్క్రియలును
దద్వాక్యములుఁ జెప్పి తాఁ గ్రాక్కన చేసి యోయబ్జాక్షి యిది యెట్టు లట్టు లతని
తీర్థయాత్ర యుఁ దపమును దేటపఱుపఁ నొదవినపుడు గదా మది కొదవ దీఱు
దూరతాతారతమ్యవిచార ముండు, నే మొ లేదొ తెరు విది యేరుపఱుప. 156

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అని విని యట్టివేళ నికటావనిజంబున నున్న చిల్క యో
యనఘచరిత్ర నీపలుకులం దొకచోట నసత్యశంక గ
ల్గునె మును చెప్పినట్టి కతలుం దలపోయ యథార్థము ల్మనం
బున సరిదాఁకె నా కనినఁ బుల్గుఁ గనుంగొని యద్భుతంబుతోన్. 157

క. కలభాషిణి యి ట్లను నీ, తలఁపున కెట్లు సరిదాఁకెఁ దథ్యము చెపు మో
చిలుక మును పెచట నుండుదు, తలపోయఁగ నీవు చతురతరమతివి కదున్. 158

సీ. అనుడు నాపక్షి యి ట్లనియె నోపూఁబోఁడి నానివాసంబు నందనవనంబు
వనజాక్షుఁ డిచటికి మును పారిజాతంబు దెచ్చుచోఁ దత్పక్షు లిచ్చ గలిగి
మరలి పాఱుచునుండ మద్భార్య యప్పేళఁ బ్రసవార్తయై యున్కిఁ బఱవలేక
మె ల్లైన నయ్యె నే నిచటన యుండెద నని యొక్కతొఱ్ఱలో నడఁగియుండె

వెనుకఁ దోడ్కొని పోవనాకనుపడదు, పిల్ల లీఁకలు వచ్చి వర్ధిల్లుదాఁక
నంతఁబలుమాఱు వచ్చి ర మ్మనుచు మిగుల, నెత్తు లిడియెడు నన్ను నాయింతి చూచి.

క. ఈభవ్యోద్యానంబుల, సౌభాగ్యము గతిని మానసమునకుఁ గడు నిం
పై భాసిల్లదు నందన, వైభవమం దెట్లు ప్రేమ వదలదొ నీకున్. 160

తే. అనఁడు నీవనినట్ల యౌ నైన మనకుఁ, గలుగు బంధువు లెల్ల నక్కడనె యునికి
నచటు నెఱియంగఁ బాయులే నని యొనర్తు, రాకపోక లివ్వీటికి నాకమునకు. 161

వ. అట్టి యే నిప్పు డుప్పరవీధి నేగుచుండి మణికంధరుం డనుచు మీర లాడుకొను మా
ట చెవిం బడిన నతని సుద్ది యిక్కడఁ గలుగుటకు నిమిత్తం బేమి గలిగెనో తెలి
సెద నని నిలిచితి నీసిద్ధుండు నీకుం జెప్పినతీర్థయాత్రాతపశ్చర్యలవృత్తాంతంబు ని
క్కువంబుగాఁ దెలిసినప్రకారంబు వివరించెద వినుము. 162

సీ. శచియును దాను వాసవుఁ డలనందనవనములోనికి నేఁడు వచ్చియుండ
నొకచాయఁ డేతెంచి యోదేవ నే నున్నవనములోనికిఁ దీర్థవాసి యొక్కఁ
డిటఁ గొన్నినాళ్ళక్రిందట వచ్చి యచ్చోటఁ దపము సేయుఁగఁ జూచె దానికొలఁది
యెఱుఁగునంతకు నేను నిన్నినాళ్ళాలసించితి నది నానాఁటి కతుల మైనఁ
జెప్పవచ్చితి నతఁడు కాశీగయాప్రయాగపురుషోత్తమాహోబలాదు లైన
పుణ్యభూములు బహుతీర్థములుఁ జూచి, నాఁడఁటవచించె మొదల నేవేఁడుకొనఁగ.

ఉ. ఉగ్రతపఃప్రభావవిభవోద్ధతి నద్భవమం దె నోసుప
ర్వాగ్రణి యిప్పు డాతపసి యాఁచల నిత్యజలావగాహని
ష్ఠాగ్రహణాభిపాటలజటాపటలస్ఫుటలాలనాభృశ
వ్యగ్రసమగ్రదీప్తినివహప్రవహద్దహనాంకురచ్ఛటల్. 164

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7857



క. ఇది మాసాష్టకమున సి, ద్ధిప మిచ్చుటకెవ్వ రేఁగుదెంచి తపమునం
బొదలినఁ జెప్పుము నా కని, త్రిదశేశ్వర నన్నుఁ బంపితిరి తద్వనికిన్. 165

క. అని చెప్పినఁ గలదు కలదు, నిను నట్లవచించి యందు నిలిపితిఁ నని యా
యనిమిషవిభుండు చారుని, ననుపుచుఁ బిలిపించె రంభ నచటికి వేగన్. 166

క. పిలిపించి యవ్వధూటికి, వలఘుశరం బైనయట్టి యాతపసితపో
బల మెల్లఁ దాను జారుని, వలనన్వినినట్ల చెప్పె వాసవుఁ డంతన్. 167

ఉ. ఓలలితాంగి యాతపసి యుగ్రత నింత నితాంతదుర్గమా
ఖీలతపోధురంధరతఁ జేయుచుట నాసురరాజ్యలక్ష్మిఁ దా
నేలఁగఁ గోరి కావలయు నిప్పుడ దీనికిఁ బ్రత్యుపాయముం
జాలఁగ నెంచి చేయఁదగు సంశయ మంత యు మానునట్లుగన్. 168

క. చింత యొనర్పక యిది యొ, క్కింతయు పేక్షించి యున్న నె ట్లగునో గో
రంతాలస్యంబునఁ గొం, డంత ప్రయోజనము దప్పు నన‌ఁగా వినమే. 169

క. విను మిట్టిపనుల కెంత యు, ననుకూలం బగునహో యమచ్చర లిపు డీ
పనికరయి వారిలోనన్, ఘనతరముగ నీకు నేర్పు గల దని తోఁచెన్. 170

సీ. కడు నల్లికలుగొను కలికిబిత్తరపుఁజూపుల క్రొమ్మెఱుంగులు వలలుగాఁగఁ
నెఱయుంగఁ బర్విడు నిద్దంపు లేనవ్వు తెలినిగ్గు తరఁగలు తెరలుగాఁగఁ
గొమరొందు నవవిలాసముల కన్బొమ లులివాడు చోపుఁకుగోల లగుచుఁ దనరఁ
చేనె లుట్టెకు మాటతేటలపసలు వాకట్టుమంత్రంబులకరణి నమర
నీవు గడఁగి యమ్మునీంద్రశార్దూలు త, పోమహత్వదర్పమును హరించి
కీరవాణితుతనిఁ గ్రీడామృగంబుగాఁ, జేయవలయుఁ గుసుమసాయకునకు. 171

వ. అనిన విని యారంభ జంభవైరిం జూచి యమ్మునీంద్రుం డనఁగ నెవ్వాఁ డని దేవర
చిత్తంబున నున్నది యో యతండు నారదశిష్యుం డైనమణికంధరుం డని మాకు వి
నంబడియె నతని నిటమున్ను పరికించుచుండుదు మస్మదాదులవిలాసంబు లెవ్వి
యు నెన్నండు ను నరకుగొని చూచినవాఁడు గాఁడు నేఁడు విశేషించి తపశ్చ
ర్యాతాత్పర్యంబునఁ బ్రవర్తిల్లుచున్నవాఁడు గావున నవశ్యంబు దేవకార్యంబు నిర్వ
హింతు ననలే ననుట యు నతం డవ్వాలుఁగంటిం జూచి నీకుఁ దొంటికంటె వయో
రూపలావణ్యవిలాసంబు లెక్కుడుగ వరం బొసంగితి సందియంబు వలదు పొమ్ము
కార్యసిద్ధి యయ్యెడు నీచాతుర్యంబు నెఱపుము. 172

క. అనుపలుకుల నలరించుచు, ననుప మహోత్సాహ మాత్మ ననుపమలీలం
దనర మణీభూషణములు, దనరమణీయాంగకాంతిఁదద్దయు మెఱయన్. 173

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నెచ్చెలులుఁ దాను ధరణికి, నచ్చెలువ కృతిప్రయాణ యయ్యెనప్రడ యా
యచ్చరపదువు బెడంగు వి, యచ్చరపదవికి మేటుంగు లై కనుపట్టెక్ 174

వ. అని చెప్పి దీనంజేసి యోకొష్ట యిమ్మహాత్మునివాక్యపద్ధతి యంత యుం సత్యంబ యగుట యేర్పడియె నని పలికి యి ట్లనియె. 175

శా. ఏ సానందవ మంతేట స్వేడలి యిం దేతెంచితి న్మున్ను గా
నో నారీమణి యిప్పు డేఁగెదువిధం బూహించినం దత్తప
స్థానం బింతకుఁ జేరఁ బోవుదువు తద్దంభాదులు పొన్నవుడుం
దా నాచిల్కపచోవిలాసమున కత్యంతంబు రంజిల్లుచుక్. 176

సీ. అఖిలంబునందు సత్యంతంబు వెలసి పర్తిల్లెడు శుకసంజ్ఞఁ దేజరిలుచు
సత్యుదారాంగమాధ్యవ్యాసనందనభూయోర్జితానందమునఁ దనరుచు
ఘనపక్షవిలసనంబున పారితత్వంబు తెల్లంబుగాఁ జేసి యుల్లసిలుచు
నరయ నైసర్గికం బైనవిష్ణుపదైకగతికత్వమునఁ జాల నతిశయిలుచు
నున్న యోచిల్క నీమధురోక్తిమహిమ, వీనుల కమృతరసములు వెల్లిగొలుపు
చునికి యుచితంబు మిగుల నీయోగవిభవ, మింత యం తని పొగడ నే నెంతదాన.

క. కావున నినుఁ బెడఁబాయఁగ, నోవిహగవరేణ్య కొలుప దుల్లం బైనం
బోవలయుఁగదా నీను ను, నీవనితం బాడ ననుచు నెలఁతుక యనియెక్. 178

ఉ. వాసుకిపూర్వజన్మకిటివర్యదిశాగజకచ్ఛపేంద్రభో
లాసుఖసక్తతత్తదబలాహృదయాంతరసంతతాదరా
శాసితనిత్యభూభరణశక్తిలసద్భుజదండ కీర్తిసం
వాసితపద్మజాండ పరివర్ధితభూసుర కాంతిభాసురా ! 179

క. కృష్ణమ్మనాయక శ్రీ, కృష్ణధ్యానామృతాబ్ధిఖేలనలీలా
తృష్ణ జ్ఞానదయావహ, ధృష్ణద్బాహాబలావధీరితభీమా. 180

మంగళమహాశ్రీవృత్తము.

శీలితశుభాచరణ శిష్టజనతాశరణ చిత్తవిజయాభరణ యుద్ధా
భీలభుజవిస్ఫురిత భీకరదయానత్వరితప్రేమపదసచ్చరితభావా
లోలకరుణాసహిత లోకభరణాదహితలోభకలనారహితవిద్యా
ఖేలనసముచ్ఛ్వసిత కేవలసుఖోల్లసితకేశవనుతప్రసితధీరా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# కళాపూర్ణోదయము.

---

## తృతీయాశ్వాసము.

శ్రీనిత్యనిహారస్థల, తానుతిలీలాకటాక్షధర్మవిధానా
నూనాపేక్షవిలాస, శ్రీనవ్యమనోజ నారసింహతనూజా! 1

క. అంతటసిద్ధుం డానీ, మంతిని నీక్షించి యేను మదిరేక్షణ మీ
చెంతను వచ్చుట చెవులకు, వింతచెలువు గులుకుపాట వినుటకె సుమ్మా. 2

క. కావున విపంచిఁ గైకొని, నీ వించుక గానపటిమ నెఱపఁగవలయు
న్నావుడు నట్టుల కా కని, యావిద్యం బ్రౌఢవుచ్చె నతనికి మిగులన్. 3

వ. ఇవ్విధంబునం గలభాషిణి తనగానవిద్యాకౌశలంబున నతని సంతుష్టుం బుచ్చె నంతక
మున్న రంభాదులు ను మణికంధరుని తపోవనంబు డగ్గఱం జనియవనికి డిగ్గిరప్పుడు.

చ. వనదచయంబుతో నలిగి వచ్చుచు నన్నమెఱుంగుఁదీఁగెలో
యనఁగఁ దనూలతల్ మెఱయఁ నవ్విరహంబున కోర్వలేక వెం
టన చనుదెంచు నంబుదగణం బన వేణిభరంబు లింపుగా
ననయము భూజశంబులకు నచ్చెలువల్గనుపట్టి రంతటన్. 5

చ. కరపదపల్లవద్యుతులు కాలపునంజ ఘటింపఁ దన్నఖ
స్ఫురణలు తారకానికరముం దలపింపఁగ వారి మోముఁదా
మరలబెడంగ నేకవిధుమండలవిభ్రమకారులై మహీ
చరులకు నెల్ల నద్భుతము సౌఖ్యము నెంతయుఁ జేసె నయ్యెడన్. 6

క. ఇలమీఁదికి డిగి వేల్పుఁ, బోలఁతులు మణికంధరుని తపోవనమున కిం
పలరఁ జనిరి తమచూడ్కులు, తొలుతగ నీలోత్పలములఁ దోరణకట్టన్. 7

చ. ప్రసవపరాగము ల్పసపుఁబయ్యెదచాడ్పున నద్దమింప ను
ల్లసదళిపుంజము ల్కచకలాపము లీలఁ జలించుచుండఁ బ
క్షిసముదయంబు భూషణవిశేషములుం బలె మ్రోయ వారి కిం
పొసఁగ వనాంతలక్ష్మి ప్రియ మొప్ప నెదుర్కొనలేచెనో యనన్. 8

చ. అళులఁ గచంబులు న్లతలు నంగములుం బువుగుత్తులుం గుచం
బులు ను జిగుళ్లుఁ బాణులు ను బుష్పవిలాసము మందహాసముం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలసి తడంబడ న్విబుధకామిను లావనలక్ష్ము లిందుశో
భలు మిగులం బ్రవర్తిగిరి పాలును నీరును బోలె నేకమై. 10

సీ. ఆవులు నాకఁ గన్నరమోడ్చు పులులు ను బులులచ న్గుడువంగఁ బోవు లేళ్లు
లేళ్లచర్లాట రంజిల్లెడుహరులును హరులు గోళ్ల ను గోఁక నలరు కరులుఁ
గరులకటాళి వైఖరి నాడుపాములుఁ బాముల లాలించు బర్హితతులు
బర్హితతులప్రక్కఁ బాయని యెలుకలు నెలుకలఁ బెంచు పిల్లులును గలిగి
యపుడు వెరఁ గొనరించె నాయుంగనలవుఁ, గీరభాషితపోషితాఖిలతపస్వి
పటలతారకబ్రహ్మవిభావనంబు, భావితసుభావనంబు తపోవనంబు. 11

సీ. ప్రత్యక్ష మైనట్టిపావనత్వంబునాఁ బుంజీభవించిన పుణ్య మనఁగ
సాక్షాత్కరించిన శాంతరసంబునాఁ గరుడు గట్టిన తపోగరిమయనఁగఁ
గరువఁ బోసిన పరమసత్వంబునా రాశి యైయున్న వైరాగ్య మనఁగ
గరచరణాదులు గలయోగవిద్యనాఁ బూదెగట్టిన తత్త్వబోధమనఁగఁ
బరఁగు నమ్మౌనిఁ గనిరి తచ్చరణనఖర, చంద్రచంద్రికాముకుళితచారుహస్త
నలినసంఘభృంగాయమానభ్రమకర, నికర లగుచు నావేలుపునెలఁత లంత. 12

క. కని యాతనియసమసమా, ధినిశ్చలత నుగ్రమైనదృష్టి కెదురుగాఁ
జనఁ గొంకుచు భయవశమున, వెనువెనుకకుఁ జని రొకింత వేలుపుఁజెలువల్. 13

ఉ. అప్పుడు రంభ చాల భయ మందుచు నిమ్ముని యుగ్రరూపముం
దప్పక చూడ మేను గరుదాల్చుచు నున్నది యింద్రు కార్య మే
చొప్పున నౌనొకో యరసి చూడఁగ నేరక యియ్యకొంటి నే
నిప్పని కంచు బుద్ధిఁ బొరయించె దృంగచలచంచలత్వముల్. 14

క. తదనంతరంబ మగుడం, ద్రిదశాధిపకార్యమునకు ధృతి పాదుకొన
న్మది నిలిపి చెలులుదాను, స్మితమెలఁగఁ దత్సమీపమున వనకేళిన్. 15

ఉ. లోఁగక వార లవ్వనములో విహరించి రొకళ్లొకళ్లకై
యేఁగుచుఁ గమ్మపూఁబొదరు లీఁగుచుఁ దేనియ సోనవానలం
దోఁగుచు దూఁగుటుయ్యెలలఁ దూఁగుచు నొక్కతె కోయు గుత్తికి
న్మూఁగుచుఁ గంతువీణెలన మ్రోఁగుచు నొండొరుచేతు లాఁగుచున్. 16

సీ. చిగురాకుబోఁడి యీచిగురాకుఁ బోఁడిమి మఱి లేదె యచటికి మరలె దేమె
కయ్యంబు వలదు నీ కయ్యంబుజాక్షితోఁ గేలికి మఱి యుఁ గంకేళిగలదు
లీలాగుళుచ్ఛంబు లీలాగున దలిర్పఁ గలహంసగమనరో కలహమేల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుంభరాజికి నింకఁ గుంభ రాజీవాక్షి యేటి కీఁజాలు నీయేఁటి కెల్ల
ననుపలుకు లెంత యు న వాళావళిఁ జెలంగ, రహివసంతహిందోళాదిరాగకలిత
గానములు మీఱ భూషణక్వణన మమర, నమరకాంతలు విహరించునవసరమున. 17

ఉ. అంచితలీల గంధ ముని యగ్రమున న్విహరించె నెంత యు
న్మించు నొయారము న్గులుకు నెన్నడ యు న్విడఁజాఱు కొప్పు నొ
క్కించుక జాఱుపయ్యెద యు ని ట్టటుఁ దూలెడుహారము ల్మిటా
రించుకుచంబులుం జలదరించువలగ్నము పొల్పు మీఱఁగన్. 18

ఉ. దైవనియుక్తిఁ జేసి విరతం బగుచున్న మనస్సమాధితోఁ
బావనమూర్తి యాతపసి భామల యారొచపించు నక్షిప
క్ష్మావళు లంత విచ్చుచుఁ దదంగనఁ గన్గొని దాని రూపు చే
తోవికృతిన్ ఘటింప ధృతితోఁ గనుమోడ్చి హరిం దలంచుచున్. 19

ఉ. కొమ్మ బెడంగుసొంపుఁ గనుఁగొన్న కనుంగవ తత్తరింపఁగా
నమ్ముని యాఁప నోప కపు డల్లన నెప్పలు విచ్చుఁ గ్రమ్మఱం
గ్రమ్మఱఁ గృష్ణకృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱం
గ్రమ్మఱ మాయు మన్మథవికారము ధైర్యము గ్రుమ్మలాడఁగన్. 20

ఉ. అంతట భావికార్యఘటనానుగుణంబుగ నీశ్వరేచ్ఛచేఁ
గంతుఁడు మిక్కిలిం బ్రబలి కాంతపయిం బరఁగంగఁ జేసె న
త్యంతము మానిమానసము తద్ఘనధైర్యకఠోరశృంఖలా
సంతతి యెంత యుం గుసుమశస్త్రకలం దెగఁ గోసివైచుచున్. 21

తే. దర్పకోగ్రప్రతాపసంతప్త మైన, తాపసునిచిత్త మప్పు డాతలిరుబోఁడి
చెలువ మనియెడునమృతంపుఁగొలనిలోన, నోలలాడుచుఁ దిరిగి రాఁజాల దయ్యె. 21

వ. ఇత్తెఱంగున బద్ధానురాగుం డగుచు మణికంధరుం డాగంధగజయాన యాకారరేఖా
విలాసంబు లెంత యుఁ బరికించి. 22

తే. రంభయే యిది కాదొ లేఁ బ్రాయపుఁజెలు, వంబు నుజ్జ్వలరూపలావణ్యములు ను
నగుమొగము సొంపునింత యెన్నఁడు ను గాన, దీని కీవింతమహిమ సంధిలుట యెట్లు.

వ. అని యాపల్లవాధరసల్లాపపరిరంభణాదులకు నువ్విళ్లూరుచుఁ దదీయలీలావిహారంబు
లత్యాదరంబున విలోకించుచుఁ దనమనంబున. 24

సీ. చెలువ మో మెత్త నాసికఁ జూచి యో వింతగతులఁ బువ్వులు చంపకము సృజించె
వెలఁది కౌఁగిట నది వికసించెఁ దొలుమేనఁ గురువకద్రుమ మెంతపరమముని యొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గల్గున నందియు ల్గవలంగ నది తన్నెఁ గాంచె యక్కజ మశోకంబ యగును
నాతి కెంగేల నంటఁగఁ బులకించుచున్నది చూతె మెంతపుణ్యంపుఁదరు వో
యొంతజాణ యొ ప్రేంకణ మింతిపాట, కలరె నూర్పుఁదావులకు వావిలి యుఁ బోలె
మగువనగుచూపులఁ దనర్పు మ్రాఁకులార, పురుషతిలకవిఖ్యాతి మీ కరుదు గాదు.

క. మగువముఖానవవాసనఁ, దగ నలరఁగ నేర్చురసికతకు సుకవీంద్రు
ల్బొగడం బొగడం బొగడం, బొగడంబుల కలరు తరులు పొగులవె లజ్జన్. 26

క. ఈ నెలఁతతోడిసంగతిఁ, గాననియుపవర్గపదము గలుగుటకంటెం
దీవివిహారంబుల నిం, పూనెడు వనతరువు లగుట యుత్తమ మరయన్. 27

మ. మునిధర్మంబుల కెల్ల దప్పని జనంబుల్నవ్విన న్నవ్వనీ
ఘన మైనట్టితపోధనంబు నెఱయుంగాఁ బోయినం బోవనీ
మునుముట్టంగఁ బ్రబోధవాసనల పెంపు ల్మాసిన న్మాయనీ
వనితారత్నముఁ గూడ కెల్లు స దమి న్వారింపలే నియ్యెడన్. 28

క. అని సాహసమున నాతం, డనుమానము లెల్ల విడిచి యచటుఁ గదలి యా
వనజాక్షి వనవిహారం, బొనరించుసమీపమునకు నొయ్యనఁ జనియెన్. 29

గీ. చని చకోరాక్షి యివ్వనంబునకు నెచట, నుండి వచ్చితి నెచ్చెలిపిండుతోడ
రాకకు నిమిత్త మెయ్యది నాకుఁ జెవుల, పండువుగ వినిపింపు నీపలుకు లనియె. 30

గీ. అనుడు నది తనరాక క్రీడార్థమనిన, వినుచు నది యెల్లఁ గల్ల యోవెలఁది నాత
పఃఫలంబవు నీ వని పల్కె మాని, ముదిత ముసిముసినగవుతో మోమువంప. 31

ఉ. చంచలనేత్ర యిట్లు వనసంగతి కొప్పుటఁ గాంచి మౌని దాఁ
గొంచక పట్టెఁ బైచెఱఁగుఁ గొమ్మ యు మీ రెటువంటి పెద్దవా
రెంచ రొకింత యుం గెలనియింతుల నంచుఁ బెనంగె నాత్మచే
లాంచలముం దదీయ మగుహస్త మురోజము లూఁది పట్టుచున్. 32

ఉ. ఆయ్యెడ నింతనంతఁ గుసుమాపచయుం బొనరించుపువ్వుబోం
డ్లొయ్యన దవ్వుగా నరిగి రొండొరు మోములు చూచి యద్దిరా
యయ్యకు మన్మథాభ్యుదయ మంచుఁ గరంగనివాఁడు కల్గునే
యెయ్యెడ రంభ దాను మెఱయించుబెడంగుల కంచు నవ్వుచున్. 33

చ. బలిమిఁ దపోధనాగ్రణి యుఁ బైకొనుకోర్కులఁ దత్తరిల్లుచుం
జెలువను గౌఁగిలించుకొని చెక్కు ను జెక్కు ను సంఘటిల్లఁ దొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ట్రెలుచుఁ బదంబు లొక్కటొకటి నెన్నఁగ నెలుపొప్పఁ దార్చె లేఁ
దలిరులఁ జొంపము ల్గలుగుదట్టపుఁబూఁబొదరింటిలో నికిన్. 34

వ. ఇట్లు తార్చి. 35

గీ. క్రొవ్వి కలహించుతుమ్మెదకొదమకదుపు, రాయిడిని గడు దళముగా రాలినట్టి
ప్రసవదళములు పఱపనిపఱుపు లగుచు, నెనఁగ నింపొందు నాపొదరింటిలోన. 36

సీ. ఔరు కెఱుంగనిగాఢపరిరంభమున నల్లిబిల్లిగొంచుఁ బెనంగు పెనఁకువలు ను
బెరిఁగెడి పేరానపేర్మి నసర్గళలీలఁ బర్వెడుకుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయ ల్లెల్ల నమరించు నఖరరేఖాంకముల ను
గొదగొన్నతమిఁ గొంకు కొసరు లే కొనరించు వివిధదంతక్షతవిభ్రమముల
మన్మథావేశవిలసనమహిమ నెఱపు, తపసిఁ గని సాదు శేఁగినఁ దలపొలాన
నిలువ దనుమాట నిజమయ్యె నేఁ డటంచు, మగువ నవ్వుచుఁ జేఁతకు మాఱు సేసె.

వ. ఆసమయంబున నటమున్న ద్వారకానగరంబునం గలకలభాషిణిగానంబు వినుచు
న్నసిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున మణికంధరునిమాటఁ దడవుట యుఁ దలఁ
చుకొని యాచంచలాక్షి సిద్ధుని నభివీక్షించి. 38

గీ. అమరపతిపంపున ను వచ్చినట్టిరంభ, కతన నే మయ్యె నో మణికంధరునిత
పం బిపుడు మీరలటు దృష్టిఁ బఱపి చూడుఁ, డనిన నొకకొంతతడ వతఁడట్లచేసె.

క. నగుచు నిఁక నేమి తపమో, మగువ చలుపుచున్న వాఁడు మణికంధరుఁ డా
మృగలోచనతో నదె యొక, చిగురుంబొదరింటిలోనఁ జిత్తజలీలన్. 40

వ. అనిన విని కలభాషిణి యమ్మణిస్తంభుని బోధమహిమకు వెఱఁగందుచు ననేకప్రకా
రంబులఁ బ్రశంసించి యీమహాత్మ యొకటిరెండుపూఁటలు మాయింట నిలిచి యే
ను సేయుపరిచర్యఁ గైకొనవలయు ననిన నతండు గానలోభంబున నీభవనంబునకు
వచ్చి యెంతియుఁ గాని మఱి వీరు వారు నుం బలెఁ బట్టనంబుల నెట్టుకొని యిట్టునట్టు
మహిమలు పచరించువారము గాము గూఢప్రకారంబున నిలుప నోపుదేని నీయుప
చారంబులు గైకొనియెద ననుట యు నట్లచేయుదు నని తనగృహారామంబునంద
నిలిపి యతిరహస్యంబుగా నాసిద్ధునకు నిష్టంబు లైనయన్నపానాదుల మోదం బొ
నర్చుచు నెచ్చట నెవ్వరిం బోనీక తాన పరిచర్య సేయుచు రెండుమూఁడుదినంబు
లు హృదయంబు రంజిల్లఁ జేసి యంత నంతరంగంబున నలకూబరసంగమాభిలాషం
బఱికయిల్ల నతనిప్రియవనిత యైనరంభ తెఱం గెఱుంగుటకుఁ గ్రమంబునఁ బ్రసంగం
బు దిగిచి సిద్ధునితో ని ట్లనియె. 41

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనఘ మణికంధరుం డట్లు తనదుతపము
విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెఁ
దిరుగఁ దప మొనరింపంగఁ దొరకొనియెనొ
యిపుడు రంభతో నున్నాఁడొ యెఱుఁగవలయు. 42

క. అనుట యు నతఁ డమ్మునిదెసఁ, దనదృష్టి నిగిడ్చి నగుచుఁ దరుణి యిఁకఁ దపం
బనుమాట గలదె యిదె యా, ఘనుఁడున్నాఁ డిపుడు రంభ కౌఁగిట ననియెన్. 43

గీ. అనిన వార లింక నచ్చోటు వాసి పో, యెవరొ యుండువారొ యెఱుఁగవలయు
మఱి యుఁ జూచి చెప్పుఁడు మాటికిఁ దదభిప్సి, క్షణము వెలయ నేఁడు శంక విడిచి.

గీ. అనుఁడు లేవు నాకు నాశంక లెవ్వి యు, నెన్ని మార్లు చూడు మన్నఁ జూతుఁ
బడఁతి కలదె భాతిపతిమనుఁ జక్కిలి, గింత నాదుధృతికి గెంటు లేదు. 45

సీ. అనిపల్కి మణికంధరునిదిక్కునందు దృష్టి నిగిడ్చి యొక్కింత చెవి యు నొగ్గి
యొకకేల మాట లాడక యుండఁ గలభాషిణికి సంజ్ఞ సేయుచు నిశ్చలత్వ
మున నొకించుక సేపు విని యార వారశామినుల మే లిట్టిదె యనుచు నగిన
నది యేమి యెఱుఁగింపు మని యాలతాంగి త న్నడయంబు నడుగ ని ట్లనియె నతఁడు
నీకు నేమని చెప్పుదు నీరజాక్షి, యడఁచుకొనియెద ననిన న వ్వడఁపరాదు
పరమసంయమిఁ దా నట్లు బతము చెఱచి, మిగులఁ దుది రంభ చేసినతగవువినుము.

క. కళలంటి కలచి తనచె, య్యులఁ జొక్కెడు తపసి మది చివుక్కురు మనఁగా
నలకూబర విడు విడు రా, యలసితి నని పల్కె మన్మథాతివివశతన్. 47

మ. అని చెప్ప న్విని సిద్ధుఁ జూచి నగ నేలా యింతభవ్యాత్మ యా
వనజాతేక్షణ యేమిసేయును మహావాల్లభ్యసౌభాగ్యవ
ర్తన నర్థేశకుమారుఁ డంతరహితుగాఁ ద న్నేలుకోఁబోలు నా
యన దా నిత్తఱి నట్టివల్లభుఁడు దవ్వై యెందునున్నాఁడొకో. 48

వ. అతని బరికించి చూడవలయు ననుట యు సిద్ధుండు నవ్వుచు నీకిదియే కదా ప్రధాన ప్రయోజనంబు నని పల్కి యిటు నటు పరికించి చూచి యతఁ డున్నచోటు గని కలభాషిణికి ని ట్లనియె. 49

ఉ. తా వెనువెంట బాయక సదా చరియించినఁ ద ద్వినోదమో
దావృతిఁ జిక్కి రంభ తగినట్టి తపోహతి నల్పలేదు కో
పావహ మింద్రబుద్ధి కది య ట్లగుటం బ్రియుఁ గూడి యట్టికా
ర్యావసరంబులందుఁ జనఁ డాతఁడు మానఁడు పెవ్వరాళిచేన్. 50

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కావున మణికంధరునిత, పోవనము సమీపభాగమున నొకవనిఁ జా
తావళిలో నున్నాఁ డదె, పూవుల నుజిగుళ్ల నొప్పు భూజముక్రిందన్. 51

క. తరుణీ యిపు డాతనిపైఁ, బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయింప వేవే, నరిగెద మతి లేదె యితర మగుపని యిచటన్. 52

గీ. అంపితేఁ బోయి వచ్చెద ననుటయుఁ గల, భాషిణి మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మియుంటి నాజీవితంబు, నేమిగాఁ జేసి పోయెద వెలుఁగఁ జెపుము.

చ. అనుట యు నన్ను నిప్పు డనునట్టిది యెయ్యది నాకుఁ జెప్పుమా
వనిత క్రమక్రమంబున ను వచ్చినయట్టుల వచ్చెఁ గాక నా
విని భళి లెస్సమాట యిది వేటొకనాఁ డిఁక మీరు వచ్చిరే
ననుఁ గృపఁ గాచుట ల్వినుఁడు నామదిలోపలిచంద మేర్పడన్. 55

క. ఈవేళన యాతని కడ, కేవిధమున నైనఁ జేర్చు టింతియ తక్కం
దోఁపిఁ మతి లేదు నన్నుం, గావన్ క్షణభంగురములు కాంతలతాల్ముల్. 55

క. తదుపాయము దిద్దుటకు, న్నది నెన్నఁ బ్రభావఘనులు మతి లేరు మహా
భ్యుదయానుభావగుణనం, పదఁ బొదలిన మీర తక్కఁ బావనచరితా. 56

చ. అన విని సిద్ధుఁ డి ట్లనియె నంబుజలోచన నిన్ను నేఁడ యా
యనకడఁ జేర్చునంతటి యుపాయము నేర్చిన నేను డాఁతు నే
యనుకొనరాదు గాక నినుఁ బ్రాణవిభుం దగఁ గూర్చి ప్రోచి యా
వెనుకటి నీదు పాట వినువేడుక నె ట్లగుచున్నవాఁడనో. 57

గీ. చింతసేయుము నీవ యనంతశయన, పద్మనాభసమీపభూభాగవర్తి
యైన కావేరి యెక్కడ నతనిద్వార, కాజనులు నేఁడ చేర్చునెక్కడ లతాంగి.

క. మించుగ మాగురువులు శి, క్షించిన యాయొక్కరింత సింగమునకు నూ
హించ నొక నాల్గుగడియల, సంచారము వలయు నతని సన్నిధిఁ జేరన్. 59

వ. దీని కెంత వలసిన నేమి యిది దడవం బని లేదు నిన్ను దీనిపై నునిచికొని పోయెద నంటినేని యోపుఁబోడిఁ తోడిసిద్ధు లిది వేటొక్కలాగుగా నెంతు రెవ్వరి యంతస్సారం బెవ్వ రెఱుంగుదు రది యు నుం గాక మీబోంట్ల సంస్పర్శమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబు గాదు మతి వేటొండు సామర్థ్యంబు లేదు నాకుఁ గల దూరదృష్టి దూరశ్రవణశక్తియుం దేమియుఁ నుపకరింప దింక నీవు చెప్పినప్రకారంబు గావించెదఁ జెప్పు మనుట యు నాసిద్ధుననుఁ గలభాషిణి యి ట్లనియె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఓసిద్ధపురుష మీకేసణిని గొనిచన్న నేమగుఁ దక్కశంక గలదె
నీమహత్త్వముఁ గానని జడాత్మ లేమన్న నేమి కన్న మహాత్ము లెంచుకయు సు
వేతొక్కగతిగ భావింపర మముబోంట్ల సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబు గాదంటి రుచితంబె మఱి నాదు ప్రాణహానికి నోర్చు టరసిచూడఁ
బలుపలుకులేల యింక నాచెలులుగిలులు, నేఁగుదెంచి విఘ్న మొనర్తురిత మెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు, వెనుక నిడుకొని నన్ను మద్విభుని కడకు. 61

సీ. అన నియ్యకొని సిద్ధుఁ డరుదైనపులితోలుపల్లంబుతోడ నిబ్బరపుబిగిని
బొట్టపట్టెడ గాఁగఁ గట్టిన పెనుఁబాఁపదట్టంబుతోడ వాదపుఁబసిండి
యంకపన్నెలతోడ సంకుపేరులతోడ వశ్యౌషధపుఁదీఁగెవాగెతోడ
నేకపార్శ్వమున భల్లూకచర్మపుటొఱ ఘటియించినట్టి బల్గత్తితోడ
వలు లేనిక దిండివార్వమ్ముఁ దొలుతఁ, గాఁగఁ దానెక్కి నన్ను దాఁకకయ దీని
కటివిభాగంబు నెక్కి రాఁగెలవెయబల, వెనుకమరగొమ్మునూఁతగాఁ గొనుచుననియె.

క. అన విని యాపాటిగ మీ, యనుగ్రహము గల్గియుండ నక్కడ యిఁక నేఁ
జనుదేక యేమి యని తన, కనువుగ హరి నతఁడు నిలుప నంగన యెక్కెన్. 63

తే. ఎక్కి సిద్ధేశ యెవ్వరు నెఱుఁగకుండ, నెట్లు గొనిపోయెదో యన నేల శంక
యెందు సిద్ధులు బండి యం నేకమైనఁ, గొండమీఁదికిఁ బోవు నోకొమ్మ యనుచు.

క. నింగికి ధే యని కదలిం, చెంగడు వడిగలుగుతనదుసింగముఁ బలుమా
ఱుం గలభాషిణిఁ దేఱిక, నుంగొని పదిలంబుసు మ్మనుచు శీఘ్రగతిన్ 65

ఆ. మగలుగోడమీఁద మ్రాఁకులు చిగురుజొం, పములు వానిమీఁదఁ బ్రచురపోహ
దములధూపములు న దనకుఁ మాటుగ గూఢ, గతిని గాంతఁగొనుచు నతఁడుననియె.

చ. చనిచని యొక్కచో నతఁడు చాలఁగ నక్కజ మందుచుం గనుం
గొనఁ దమ మేఘరంజిఁ బాడిగొన్న ఘనావళిలోననుండి దా
రున నెదురైరి వైభవనిరూఢిఁ జెలంగెడు కొంద ఱంగన
ల్ఘనతరచాతురీమధురగానకళాకలనాకలాపలై. 67

క. తమపాటఁ జినుకుచినుకుల, దుమదుమనాఁ దడిసినట్టిదువ్వలువలతో
గుమగుమ యనుపరిమళబ్బం, దముతో నప్పుడొకయిం బానర్చిరి వారల్. 68

వ. అట్లింపొనర్చుచు నెదురైన నతండు వారిని సంభాషణక్రమంబున రంభాసఖులగుట
యెఱింగి యిని మేమి యనుంగు నెచ్చెలి నచ్చట నిశిదివచ్చెరి రచ్చెలువ మణికంధర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీఁది యనుగ్రహంబు వదలక యింక నుం గొన్ని నాళ్లు తద్వనంబున నిలుచునో యను నటయు ను నగుచు వారి ట్లనిరి. 69

క. ఎక్కడి మణికంధరుఁ డలఁ, డెక్కడఁ బోయెనొ రయుంగ మిపుడు ముదముతో నక్కూన్మ పొదలుచున్నది, తక్కక నలకూబరుండుఁ దాను ప్రతులక్. 70

చ. ప్రియుని సమాగమోత్సవము పెంపున నిం తలరారు నాప్పుగా
తీఁ యిపుడు తద్వని ప్రతివిశేషము సొంపులఁ జిక్కి యున్కి యా
రయుచుఁ దదిష్టము న్విడిచి రమ్యవజాలక యాకె నుంచి యే
మ యరుగుచున్నవార మని మానిను లచ్చటు వాసి పోవుచుక్. 71

క. వేళాకోళపుఁ దీఁగెలుఁ, బేలికలుఁ గిళానములు ను బీఐజడలానుం
దాలుచు పెట్లూకొ మింట, న్లీలాహరిఁ బోల నింత నేర్పరి యయ్యుక్. 72

క. ఎక్కడ వారకనొకో యీ, చొక్కపుసబ్బైత బెడంగులోగికి నవహా
యిక్కలికి గుత్తగొనుఁ బో, తక్కక దివి నిమిష మున్న దైవతవిటులక్. 73

క. నలకూబరుండు రంభం, గలయుట విని చిన్నవోక కలభాషిణిరీ
తులు దిరిగి చూచి దీనిం, గలఁచెర యివ్వార్త తాపకరమై యనుచుక్. 74

ఉ. సిద్ధుఁడు నవ్వి యాచెలువ చింతిలఁగా వల దిప్పు డెంతయు
న్వృద్ధిఁ దిరంబుగాఁగ ధృతిఁ బూను మెుకించుక సేవులోన నే
శుద్ధముగాఁగఁ నీమనము శోకము సర్వముఁ బుచ్చివై చెద
న్సిద్ధము వాదు పల్కనియెఁ జెల్వయు మోము వికాస మందఁగక్.

క. ఏరీతి నింత మిక్కిలి, చేరికగా నాడి తనియె సిద్ధుఁడు చూడం
గారాదె కుడువఁబోవుచుఁ, గూరల చవు లడుగ నేల కోమలి యనియెక్. 76

క. కంఠీరవ మట్టి యెడం, గంఠం బెగనెత్తి చూచి కదలక నిలిచెం
గుంఠితగతియై యొండు నీ, కుంఠితగతి యనఁగఁ దొల్లి గుణము నెఱిఁయుక్. 77

వ. అప్పుడు. 78

సీ. హుంకారములతోడ నుచ్చాటనపు బదనికతీఁగలఁటున ప్రేసి ప్రేసి
కడు ఢాక మీఱంగ మడమలు తాటించుచు ను ముందలికి లివ చూపిచూపి
మొగము సాధ్యములకు మగిడింపకుండ వాకట్టు మూలికవాగఁ బట్టిపట్టి
వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దననాఁగబెత్తాన మూర్ధంబు మొత్తిమొత్తి
సిద్ధుఁడధిక ప్రయత్నసన్నద్ధుఁడగుచు, నెంత చేసిన నాసింహ మెదుటి కడుగు
పెట్టకయ్యెను గర్జానిభీషణముగఁ, దోఁకఁ ద్రిప్పుచుఁ గడు వెనుకఁద్రొక్కుఁ గాని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అప్పుడు చాల సంక్షుభితయై పడజాతి యిదే యిదే మయా
యిప్పుడు దీనిచంద మనియెం గలభాషిణి మే చెమర్పఁగాఁ
గొప్ప విడంగఁ బాఱఁ జనుగుబ్బల పయ్యెద వాయ సుస్థితిం
దప్పి పిఱుందఁ బల్లటిలఁ దా మరగొ మ్మిరుగేలఁ బట్టుచున్. 80

క. తరుణీ వెఱవకు పల్లవు, మరగొ మ్మేమఱకు నాకు మర్యాదావి
స్మరణం బైనది మాటల, పరాకుచే ననుచుఁ దనదుపారీంద్రంబున్. 81

వ. కొన్ని యడుగులు దిరుగఁబట్టి ధరణికి డిగఁద్రోలుకొని వచ్చి యచ్చట నచ్చెలువతోడ నవరోహణంబు సేసి కేసరిని మేఁతకు విడిచి యోపడఁతి యోకలభాషిణి యీగ్రామం దతి నికటంబునంద మృగేంద్రవాహన యను శక్తి గలదు తన్మందిరంబుముందట నున్న మృగేంద్రంబునకుఁ గ్రిందు మీఁదం జట్టుపట్టున నెట్టి బెట్టిదంపు సింగంబులుం జనవెఱచు నిది మఱచి యే నెంతతోలిన మనవాహనం బచటి కెట్టెదురు నడచు మనమమ్మహాశక్తికి నభివందనంబు చేసి పోయినం గార్యసిద్ధి యగు రమ్మనుచు నల్లన తన భల్లూకచర్మకోశంబుతోడి ఖడ్గంబు పుచ్చుకొని సింగపుఁబల్లమునఁ బోక యక్కడన యొక్కమఱుంగున డాఁచి యాచపలలోచనను మృగేంద్రవాహన గుడికిం దోడ్కొని చని తద్బాహ్యమండపంబున నునిచి యద్దేవిపూజకుఁ బువ్వులు దెచ్చెద నని పూఁదోఁట కరిగె నప్పు డత్తెఱంగు గనుంగొని. 82

సీ. పసిమి పోనెండిన కసవుబట్టయుఁ బోలె సరవెంద్రుకలఁ బర్వ శిరమువలన
నులిగొన్న చెలఁదిపుష్పుల నూలివల్లునా నమరెడు ముడుతకన్బొమలవలనఁ
గడుఁ జిట్లినట్టి బంగరుపూఁతపొక్కిళ్ల వడువుఁ జూపెడి మేనివళులవలనఁ
దునిసి వ్రేలెడు మ్రాఁకుఁదునుకలఁదలపించు బాహుపక్షోజలంబనమువలన
ఘూకరవముల చాడ్పున ఘోరవృత్తిఁ, దనరు ఘనకాననకుహకుహధ్వనులవలన
భావజుఁడు వెళ్లిపోయిన పాడుమేడ, పగిదిఁ గాన్పించు ముదుసలిపడఁతి యొకతె.

క. కలభాషిణిఁ జేరఁగ వచ్చి లతాంగీ యిచటనుండి చేరితి వకటా
కలుషపు బావురుఁబిల్లిని, జిలుకయుంబలె నిద్దురాస్తు సిద్ధుండనుచున్. 84

ఉ. ఎంత యు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పు మేనిపస కన్నులపండువు సేయు నిన్ను న
ల్లంతన చూచి దైవ మకటా దొరకించెను యిట్టి నిర్దయా
స్వాంతుని చేతి కీభువనసారము నంచుఁ గడుం గలంగితిన్. 85

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మఱి, రాకమునుపె తొలఁగి పోవరాదా యెటకే
నోకూన యీమనోజ్ఞత, రాకృతి యేఁ జూడఁజాల ననిపల్కెఁగన్ 86

గీ. అమ్మ విను మింక నొకయించుకంత తడవు, నీ తెరువుఁ జూడ నీ పేరు నీ తెఱంగు
నడిగి పరికింప మదియున్న దైన వాఁడు, రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము.

శా. నీ కెంతే నితఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁదోఁబుట్టువో
నీకార్యార్థమె పూనితా నెచటికేనిం గొంచుఁబోచున్నవాఁ
డో కాఁగా డిటువంటిపల్కు లనక తోడ్తో నింతబెట్టాడ నే
నోకాంతామణి వెఱ్ఱిగా నితని చెయ్యుల్మున్న వీక్షింపుదున్. 88

వ. అను పల్కు లన్నియు విని కలభాషిణి తనమనంబున. 89

క. ఈయవ్వవాక్యములు దలఁ, పోయఁగ నాయుల్లమునకుఁ బొందుపడినయ
ట్టైయున్నది యీసిద్ధుఁడు, మాయావియె యొక్కమాట మది నూహింపన్. 91

గీ. ఇంక నొక్కింత సేపున కెల్లవగపుఁ, బుచ్చివై చెద నని పల్కి నిచ్చటికిని
జేరునపు డది యీయమ్మ చెప్పినట్లు, శక్తి కిడియెద ననుట నిస్సంశయంబు. 92

సీ. ప్రజల కందఱకు నాపదలు వాపెడునట్టిచక్రిపట్టనములో జననమంది
వారకామిని నయ్యు గౌరవంబున సఖ్యజను లిటు చేర రమ్మనఁగ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్యనిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపునతుల్కెల్ల గావింపంగ సంగీతవిద్య నేర్చి
తుద నొకానొక కపటసిద్ధుం డొనర్చు, శక్తిపూజకుఁ బశువైతిఁ జర్చనేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లువచ్చుఁ, బ్రహ్మ దా మున్న వ్రాసిన వ్రాఁతఫలము. 93

క. అని మది నడలుచుఁ బ్రియసఖు, లను మొఱఁగుట దలఁచి కడు గలంగుచుఁ దెగునే
యనుభావ్య మెంతయంతయు, ననుభవమునఁ గాకఁ యనుచు నవయమఁ గుందెన్.

వ. తదనంతరంబ డెందంబు డిందుపఱచుకొని ధైర్యబలంబునఁ గంఠగద్గదిక వారించుచు నావృద్ధభామినితో ని ట్లనియె.

శా. అమ్మా నీపలుకెల్ల నెంతయు నిజం బై యిప్డు గాన్పించెనే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగ లే కొక్కయ
ర్థమ్ము న్నీవనికృపం గడింతు నని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మార్కిం దెగివచ్చితిం దెరువులే దీపాటు దప్పింపఁగాన్. 96

క. ఎక్కడికిఁ బాటిపోయెదఁ, జిక్కుపడక యేను వీని శీఘ్రగతికి నో
యక్క యఁక దూరదృష్టి యీ, నెక్కడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్. 97

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. అనవిని యాకె యోవనిత నీవు నెఱుంగదే వీని యాదూరదృష్టి యనిన
దానన కాదె యీతఁడు నన్ను భ్రమయించి యీరీతిఁ దాఁ దెచ్చె నిచటి కనుచుఁ
బలికి యీతఁడు దన్నుఁ బ్రథమంబునందు గృహారామమునఁ గాంచు టాదిగాఁగ
నది తుదగాఁగ సమస్తంబు వినిపించి తత్ప్రసంగంబునఁ దనదు పేరు
కులము విద్య యు నప్పటికోరిక యు ను, జెప్పి యాకోర్కి సాధించుచింత దక్క
చింత యెఱుఁగక యేగుదెంచితిఁ గొఱకకుఁ, బోవఁ బిడిగల్లుపడియెనో పాలఁతి యనియె.

చ. అన విని యట్ల యౌ నిది యథార్థము నీ కటు లానచూపి తో
డ్కొని చనుదెంచెఁ దాఁ దనదుకోర్కి యొనర్చుట కీవినింద్యవ
ర్తనుఁడు మనుష్యయత్నమునఁ దక్కఁగ నేరఁడు దూరదృష్టిసా
ధనమయినట్టి పిమ్మట నితం డొనరించువిచార మారయన్. 99

గీ. ఇంతపాట్లను బడి కన్న యీవిచిత్ర, మహిమకుం దగరాజ్యసంపదలు గనిన
నెంతయింపగునే యని యేను వినఁగఁ, బలుమఱు ను వీఁడు ముచ్చటపడుచునుండు.

క. ఆకోరికకై కలదాకొ, లోకోత్తరగానయుత యు లోకోత్తర ర
మ్యాకృతి యు నొకతెవార, స్త్రీకులమున ననుచు దూరదృష్టి న్వెదకున్.

క. తాను ను గిన్నర యొకటి మ, హానందత మీటుచుండు ననిశంబు ను ద
ద్గానరసజ్ఞత నిలఁ గల, గానము దూరశ్రవణముకతమున ననియెన్. 102

సీ. తొల్లి యిచ్చటన యాదూరదృష్టియు ను దూరశ్రవణము సిద్ధురాత్మకుండు
సాధించి వాఁడె తత్సాధన కెందఱెందఱకుత్తుకలు గోసి చెఱచె నొక్క
యది కొంత యెఱుఁగుదే నంగన యెఱిఁగింపు వినియెదఁ గాలయాపనము కొఱకు
మీఁదటఁ గాఁగలమేలుఁగీడ్లెరికిఁ దప్పింపరాని యెంతయు ధ్రువంబు
ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో, చచ్చు టెట్లో యనువిచారమున ను
బెగడుచుండనేల జగదంబ యాశక్తి, సేయవలసినట్లు సేయుఁ గాత. 103

క. అన విని యాయమ మెచ్చుచు, ఘనధైర్యవివేకమహిమ గలయుత్తమభా
మిని వాడు మేలుమే లీ, వనినట్ల వచింతు నీకు నని యిట్లనియెన్. 104

క. ఓరమణి దూరదృష్టి యు, దూరశ్రవణంబుఁ బడయుత్రోవ లితరముల్
ఘోరముల యైనఁ బరహిం, సారూపంబు లవి గావు సాహసపువిధుల్. 105

క. ఆరెండు నితఁడు వడసెం, గోరిక నల గోరుగల్లు గొని నిజనయనో
ద్ధారమొనర్చి యు వీనుల, ఘోరపునారసముఁ బఱపుకొనియు న్వరుసన్. 106

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అనుచుఁ దన్మందిరాగ్రభాగంబున మృగేంద్రవాహనంబు దండ ననేకాక్షరపఙ్క్తిఁ జి హ్నితశిలాస్తంభంబున వ్రేలఁగట్టిన యాశస్త్రయుగ్మంబును మఱియు నచ్చట గంధ పుష్పాద్యర్చితంబు లై యున్న యొక్క సురియ యు గండకత్తెర యు డగ్గఱం దోడ్కొనిపోయి చూపి యి ట్లనిరి. 106

క. ఈక్రోరిక కిది తెరు విది, యీక్రోరిక కనుచు వ్రాసి యిడినా రదె యా టాకంబంబునఁ జదువుము, నీకాలిపి తెలియు నేని నీరజవదనా.

సీ. అనుడు నమ్మాట దా విని కలభాషిణి యందు నున్న ర్థ మి ట్లనుచుఁ జదివె నిచట రెండేండ్లు జితేంద్రియత్వంబున భువనేశ్వరీమంత్రము ను జపింప నెల్ల కోర్కులు నిచ్చు నిద్దేవి మఱి యట్లుగాక సద్యస్సిద్ధి గావలసిన దూరవీక్షార్థి యాగోరుగంట హృతాక్షుఁ డయ్యు దూరశ్రవణార్థి చెవిని ఘోర మైనట్టి యాబలు నారసంబు పఱపుకొని యు సారస్వత ప్రాప్తిమార్థి యీసురియచేత నాలుకఁ గోసికొని యు, నిష్టహాళక్తి మెప్పించి యిష్ట మొందు.

గీ. ఈమెఱుఁగుగండకత్తెర, చే మిడిచల యిచ్చుసాహసికుఁడు శిరం బ ట్టే మగుడఁగ నదుకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిన్. 109

క. పదిలముగ నిర్విపక్షా, భ్యుదయమహారాజ్యలక్ష్మిఁ బొందు న్వశత న్పదమలరూప సుగానా, స్పదవారవధూటి నిచట బలిగా నిడినన్. 110

గీ. అని చదివి దానఁ దలఁపులో నాత్మ నిధన, శంక నిస్సంశయం బయి చాలఁ బ్రబలఁ గలఁగి చలియించు తద్ధైర్యగౌరవంబు, నంతవ మగిడ్చి కడమ యి ట్లనుచుఁ జదివె.

ఉ. ఈవిధులందు నెందు ను నొకింత సమర్థత లేనివృద్ధు లి ద్దేవతయొద్ద నిర్భయత దేహము నెమ్మెయిఁ బాసిన న్లన జ్యోవనరూపసిద్ధి యగు నప్పుడ యంగవిమోక్షవేళ ని చ్చావృత మెద్ది వారి కది సంఘటిలుం దిరమై తదాదిగన్. 112

క. అని చదివిన నందుఁ దుద, న్వినఁబడిన విధాన మునకు వృద్ధాంగన యిం పున నవ్వుచు నిది విని సు, మ్మనితము నే నిచట నునికి యంబుజవదనా. 113

గీ. అబ్జముఖి సుముఖానత్తి యంద్రు నన్నుఁ, గరముఁ గాశ్మీరభూమిఁ బ్రఖ్యాత మైన శారదాపీఠమున సరస్వతిని గొల్చు, నట్టి పూజరి బ్రాహ్మణునట్టి నేను. 114

వ. అనునంతట సిద్ధుండు దేవీపూజకుఁ దగిన గంధమాల్యాదులు సంపాదించుకొని వచ్చి యమ్ముదుసలిపడఁతిం జూచి యీయువ్వ కుశలంబున నున్నదానవే నిర్మానుష్యం బై న యీశక్తిస్థానంబునఁ జిరకాలంబునం బట్టి యెట్టు వేగించుచున్నదాన వని పలికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలభాషిణిం బిలిచి యోచెలువ మనకు నవ్వలఁ జనవలయుఁ గద మిక్కిలి ప్రొద్దు
పోవుచున్నయది శక్తిం బూజించి పోవుద మాయమ్మచేత ననిపించుకొని రమ్మ
నుటయు నది భయాకులమానస యగుచు వృద్ధాంగనం జూచి. 115

క. ఏ నొంటిఁ బోవ వెఱతు, న్లోనికి నోయమ్మ నీవును రాఁగదె నా
తో నన నెవ్వరు నేటికి, నేనుండఁగ ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్. 116

సీ. పలికి యప్పటి దాని భయచేష్ట భావించి యిమ్మది జంతచే నిది యొకింత
యేమైన నాతలం బెఱిఁగెఁ గాఁబోలు విఘ్నం బేమి యగునో విలంబ మైన
నని సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగిరించుచు నోసి చెల్లి యిమ్మసలివగ్గు
నీకుఁ దోడై వచ్చునో కలదో మఱి యేమైన ననుచు నాయిగురుఁబోఁడి
కొప్పువట్టి తివంబోవ నప్పడంతి, ప్రాణభయమునఁ గలఁగి యోయవ్వ నీకు
బిడ్డనే కావవే నాకుఁ నడ్డపడవె, యనుచు నావృద్ధనారి మాటునకు నొదిఁగె.

క. ఆవృద్ధనారి యును గరు, ణావిలమతి యగుచు నాభయార్తమృగాక్షిం
దా వెనుక నిముడుకొనుచుం, గావుము కావుమని వానికరములు వట్టెన్. 118

సీ. పట్టిన నతఁడు లోపలికిరాకుండ విఘ్నము సేసె దింతియకద యటంచుఁ
దద్దేవి కిచటు ముందఱఁ గాదె యంచు నప్పడఁతి చేతులు నులిచి పాఱఁద్రొబ్బి
బలిమిఁ దార్కొని కలభాషిణి వేనలి యొకకేలఁ బట్టి వేఱొక్కకేల
నొఱఁ గత్తి వెఱికి నీకొప్పన మిదె యంచు నత్తికిఁ గత్తి చే యెత్తి మ్రొక్కి
వ్రేయఁబూన దీని వ్రేసిన నిద్దేవి యాన సుమ్ము నీకు ననుచు దాని
యానెలంత మెడకు నడ్డంబుగా మెడ, యొగ్గె వృద్ధసతి యనూనకృపను. 119

వ. ఇవ్విధంబునం గలభాషిణి కంఠమునకుఁ దనకంఠంబు నడ్డంబుఁ జేర్చి వ్రేటున కనువీక
దాని నిజగేలం బొదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగక
యావృద్ధభామిని యోయిసిద్ధుండ నీకుం గార్యసిద్ధి గాదు చుమీ యద్దేవిమీఁ
ది యాన నతిక్రమించిన ననుచు నోమహాశక్తి నన్ను సత్యవచనం గావింపుమీ
యనుచు నుండ నతం డఖండరోషంబున మున్న దానిమెడ ఖండితంబు చేసి విచి
త్రవేగంబునఁ గలభాషిణికొప్పుఁ వట్టి పట్టెంబు జళిపించి వ్రేయ నెత్తుట యు నె
త్తిన చేయి తత్క్షణంబ యందుకొని మృగేంద్రవాహన నిజశపథనముల్లంఘనోత్సాహ
సాహస దోషదూషితుం డగునతని నతిదూరంబునం బడవైచె సుముఖాసత్తి యు నట్లు
సంప్రాప్తం బైన యసివిఘాతంబునం దన జరద్దేహంబు వడినట్టి క్షణంబునందు 120

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నిండుచందురు నవ్వు నెమ్మోము సిరితోడ నిరులు గ్రమ్మెడు వేణిభరముతోడ
నాకర్ణలోలంబు లగు నేత్రములతోడఁ దళుకొత్తు చెక్కుటద్దములతోడ
మిగుల మిటారించు బిగిచనుంగవతోడ లలితంపు బాహువల్లరులతోడ
నతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ నభినవం బైన నూఁగారుతోడ
వలువమీఁదికిఁ దొలఁకు సువర్ణపులిన, గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ, నమరు ప్రాయంపురూపు చిత్రముగఁ దాల్చె.

గీ. తాల్చి యావికచోత్పలదళనిభాక్షి, కనుఁగొనియె నభ్రమున శక్తి కరవినున్న
గాత్రుసిద్ధుని నొకకేలఁ గత్తి యొక్క-, కేలఁ గలభాషిణిని విడకే చనంగ. 122

క. ఆకరణిఁ జూచినదియై, యాకలభాషిణి యవస్థ కాత్మఁ గలఁగుచు
న్వ్యాకులత నొందెఁ దనదుచి, రాకాంక్షితసిద్ధి పెంపు నరయని మదితోఁ.

సీ. అంతఁ గ్రమంబున నాసరోజాక్షి సంసారస్వభావవిచారమహిమ
వలనఁ దద్దుఃఖంబు వారించుకొని! దానఁ దాను భోగ్యార్థచింతనము వదలి
దేవిసత్కృపఁ బ్రసాదించినయట్టి జవ్వనపుసత్త్వము వృథా చనకయుండ
యోగవిద్యాభ్యాసనోపయోగంబునఁ గడపెదఁగా కంచు విడువ కపుడు
యమనియమవర్తనములతో నాసనాదు, లభ్యసింపఁగఁ దొడఁగ నత్యాదరమునఁ
దాను మును విన్నభంగులు దాఁపుగాఁగ, నచటిశక్తిని గురువుగా నాత్మ నునిచి.

వ. అంతటం గలభాషిణి యచ్చటి కేగుదెంచి యాచంచలాక్షి నీక్షించి నీ వెందునుండి వచ్చి తెట్టిదాన వని యడుగుట యు నప్పడంతి యేను మును నీకు నడ్డపడి సిద్ధునిచేత ఖండిత యైనసుముఖాసత్తి యనువృద్ధవనితం జుమ్ము క్రమ్మఱ నిమ్మహాశక్తికారుణ్యశక్తివలన నిట్టియెలప్రాయంపుసొంపు వడసియున్నదాన నని తత్ప్రకారం బెఱింగించి యోకలభాషిణి యట్లు సిద్ధునితోడ నిమ్మహాశక్తిచేత దూరవిక్షిప్తవై యెచటం బడి తేమి యు నొవ్వక యిట్లు తిరిగి వచ్చుట యద్భుతం బగుచున్నది యనుటయుం గలభాషిణి యోయమ్మ ధర్మగుణంబున నిమ్మహాదేవిని మెప్పించి యిప్పగిది నీవు తిరుగం బ్రాయంబుఁ గనుట యద్భుతంబుగాక యింతటిమహాపుణ్యనిధి వైననీకారుణ్యంబు గలుగ నేఁ దిరిగివచ్చుట యేమియద్భుతంబు నావిధం బంత యు విన్నవించెద నని పలుకుచుండ. 125

క. బంధురవీణాసహిత, స్కంధముతో రత్నమాలికాఘటితజటా
బంధముతో నంతట మణి, కంధరుఁ డచ్చటికి వచ్చె గంభీరగతిన్. 126

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వచ్చినఁ గని యతిమోదము, నచ్చెరువుఁ దలిర్ప మ్రొక్కె నతని కతఁడు దా
నచ్చెలువఁ జూచి మోదము, నచ్చెరువుఁ దలిర్ప వికసితాననుఁ డగుచున్. 127

క. ఓహోహో మాబంధు, వ్యూహం బంత యు న వచ్చి యున్న ట్లయ్యె
న్నాహృదయమునకుఁ బరమ, స్నేహనిధి న్నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ. 128

మత్తకోకిల. మచ్చికంటి మముందలంతువె మానసంబున నిందు నీ
వచ్చు పెట్లు కడున్విచిత్రము ద్వారకాపురివాయ నీ
కిచ్చవుట్టుట యెన్నఁడుఁ న్మతి యిట్ట లేగి యెఱుంగ వీ
వచ్చెలు ల్మణిగేహము ల్విరు లట్ల యున్నవియే కదా. 129

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాక్షు సేవింప నేఁగితే యీవెన్క నెన్నఁడైన
నాజగత్పతి తోఁటి యలవజ్రమణిసభ కేతెంచి కొలువు సేయించుకొనునె
తనసేవగాఁ బురందరుఁడు గట్టించు కెంపులహజారము కడముట్టె నొక్క
మనవీణితో లడంచుకొని భ్రమయించు నీలపుటరంగులకుఁ బో నిపుడు గలదె
యంతకంతకు వర్ధిల్లుహరికొమాళ్ల, బలఁగమున కిది చాలదన్ దలఁపులోడఁ
దిరుగఁ గట్టింత వనుపైఁడిగరడిసాల, యట్ల యున్నదియే వికచాబ్జవదన. 130

మ. చిగురుంబోఁడి యెఱుంగు జే యదుపతిస్త్రీలెవ్వరే నిందు లే
రుగదా యంచు న శంకఁ గ్రమ్మఱితిఁ జారుద్యూతగేహంబు క్రొ
త్తగ నీవొక్కటిఁ జూపఁ దొడ్కొని చనం దచ్చోక చొపంచ యి
త్తగ బాగా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింపఁ దాడవ్వులన్. 131

చ. కుటిలకచా యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట మె
క్కటి కడమన్కి యారయఁక కట్టెదుటం బటికంపుగోడఁ బ్ర
స్ఫుటముగ దానియందు హరిఁ జూచుచు మ్రొక్కఁగ వెన్కనుండి యె
ట్టెటు మొగమంచు నవ్వె సభయెల్ల న దన్మణిభిత్తి యున్నదే. 132

క. అని యడిగిన నన్నియు శో, భనవర్తనఁ దొంటియట్ల భాసిల్లెడు నో
యనఘ సురరాజుసేవ యు, ననుపమముగఁ బూర్ణమయ్యె నని యది వలికెన్. 133
134

వ. అని పలికిన నతండు.

సీ. సంగీతవిద్యాప్రసంగంబునం దైన మముఁ దలంతువొ లేదొ మనసునందు
దనుజారి కే నొసంగిన వండకంబు నీ వెం దైన మఱి వెలయించి తొక్క
యిప్పుడు నారదుఁ డప్పటప్పటికి వచ్చునొ రాఁడొ వసుదేవసూనుఁ గొలఁవ
నాలోకవిభుసత్తు ల్మేలేర్చి యిచ్చినవీణె యేమయ్యెఁ దే విచ్చటికిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేమి యేమియో నాఁడు నీహృదయమునను, గోర్కె యొక్కటిగలఁగఁటఁ దొమ్మవింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన, విడిచిపెట్టితో క్షీణపై వేడ్క లెల్ల. 135

చ. అనుట యు లజ్జ నజ్జలరుహానన యించుక యోరగాఁగ వం
చిన మొగమొప్ప నేమనుచుఁ జెప్పెద దాననచేసి కాదె యీ
యనఘచరిత్ర నాకుఁ గలయట్టిబలంగము లెల్లఁ బాసి యీ
ఘనగహనప్రదేశములఁ గష్టపుఁబాటులఁ గుందితిం గదా. 136

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి యైనపిమ్మటఁ దనయున్నచోటికి మణి
స్తంభుండు వచ్చినప్రకారం బెఱింగించి యతండు దూరదృష్టిమార్గశ్రవణశక్తిబలం
బునం దనకుం జెప్పినయర్థము సకలంబు నుం జెప్పి తన్నునతండు మృగేంద్రవాహ
నాభవనంబునకుం దెచ్చిన తెఱంగును బలిపశూపకరణోద్యమప్రకారంబు ను సుముఖా
సత్తి తన్ను రక్షించుట యు వివరించి యాపుణ్యసాధ్వి యీయమ యని యాయ
క్కఁ జూపి తత్కాలస్థానవర్తనంబులు దెలిపి యోగంధరోత్తమ యింక నాకు నీ
చందంబు వినవలయు నవ్విధంబున రంభ చేత నీతపంబు విఘ్నంబు నొందుట యా
మణిస్తంభుని చేత నేను విన్నప్రకారంబు వింటివి కదా యటమీఁదటి భవదీయవ
ర్తనం బెఱింగింపు మనునంతట మణిస్తంభుండు వచ్చుట యు నిప్పుడేఁ జెప్పినసిద్ధుం
డితం డని చూచిన నితండా యని దరహాసితవికసితాననుం డగుచు మణికంధరుం డ
తనిం దగు తెఱంగున సంభావించె నతఁడు ను. 137

క. ఇచ్చఁ దదాగమనమునకు, నచ్చెరువు జనింప నిది మహాశ్చర్యము మీ
రెచ్చోటనుండి యిచటికి, వచ్చితిరి రని విస్మితవృత్తిం బలికెన్. 138

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి యోయింతి నిన్నెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్యమందుచు నప్పు డక్కడ నుంటి విప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసత్తిఁ జూచి యెచ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు
నే రెద్ది యని తత్ప్రకారంబు దానిచేతన విని వెఱఁగంది వినుతిచేసె
నాతి యతనిఁ గనుఁగొని యరుదుపడుచు, నిట్లనియె నోయిసిద్ధుండ యిచటఁ బడితి
వీవుఁ గలభాషిణి యు ను నిద్దేవిచేత, నట్లు సరభసవిక్షిప్తు లగుచుఁ బోయి. 139

వ. మీర లేమి యు నొవ్వక తిరిగిఁ జచ్చుట యు నచ్చెరువై యున్నయది నాకు నింత
యు వినిపింప వలయు ననిన విని మణిస్తంభుం డోయంబుజముఖి నీకు నట్ల వినిపిం
చెద వినుము మది యు కాదు మఱి యు నెన్నియేని విచిత్రంబులు గని వచ్చినాఁడ నే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వచ్చినఁ గని యతిమోదము, నచ్చెరువుఁ దలిర్ప మ్రొక్కి నతని కతఁడు దా
నచ్చెలువఁ జూచి మోదము, నచ్చెరువుఁ దలిర్ప వికసితాననుఁ డగుచున్. 127

క. ఓహోహో మాబంధు, వ్వ్యూహం బంత యు న వచ్చి యున్న ట్లయ్యె
న్నాహృదయమునకుఁ బరమ, స్నేహనిధి న్నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ. 128

మత్తకోకిల. మచ్చికంటి మముందలంతువె మానసంబున నిందు నీ
వచ్చు టెట్లు కడున్విచిత్రము ద్వారకాపురివాయ నీ
కిచ్చవుట్టుట యెన్నఁడుఁ న్మతి యి ట్ట టేగి యెఱుంగ వీ
వచ్చెలు ల్మణిగేహము ల్సిరు లట్ల యున్న వియే కదా. 129

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాతుని సేవింప నేఁగితే యావెన్క నెన్నఁడైన
నాజగత్పతి తోఁటి యలవ్రజమణిసభ కేతెంచి కొలువు సేయించుకొను నె
తనసేవగాఁ బురందరుఁడు గట్టించు కెంపులహజారము కడముట్టె నొక్క
మనవీణితు లడంచుకొని భ్రమయించు నీలపుటరంగులకుఁ బో నిపుడు గలదె
యంతకంతకు వర్ధిల్లుహరికొమాళ్ల, బలఁగమున కిది చాలదన్ దలఁపులోడఁ
దిరుగఁ గట్టింత వసుపైఁడిగరడిసాల, యట్ల యున్నదియే వికచాబ్జవదన. 130

మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతిస్త్రీలెవ్వరే నిందు లే
రుగదా యందు ను శంకఁ గ్రమ్మజితిఁ జారుచ్యూతగేహంబు క్రొ
త్తగ నీవొక్కటిఁ జూపఁ దోడ్కొని చనం దచ్చోక చొవంచ యి
త్తిగ ఛారా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింపఁ దాదవ్వులన్. 131

చ. కుటిలకచా యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట మొ
క్కటి కడమన్కి యారయక కట్టెదుటం బటికంపుగోడఁ బ్ర
స్ఫుటముగ దానియందు హరిఁ జూచుచు మ్రొక్కఁగ వెన్కనుండి యొ
క్కటు మొగమంచు నవ్వె సభయెల్ల ను దన్మణిభిత్తి యున్నదే. 132

క. అని యడిగిన నప్పియు కో, భనవర్తనఁ దొంటియట్ల భాసిల్లెడు నో
యనఘ సురరాజుసేవ యు, ననుపమముగఁ బూర్ణమయ్యె నని యది పలికెన్. 133

వ. అని పలికిన నతండు. 134

సీ. సంగీతవిద్యాప్రసంగంబునం దైన మముఁ దలంతువొ లేవొ మనసునందు
దనుజారి కే నొసఁగిన పండకంబు నీ వెం దైన మఱి వెలయించి తొక్క
యిప్పుడు నారదుఁ డప్పటప్పటికి వచ్చునొ రాఁడొ వసుదేవసూనుఁ గొలువ
నాలోకవిభుసకు న్మేలెర్చి యిచ్చినవీణె యేమయ్యెఁ దే విచ్చటికిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేమి యేమియొ నాఁడు నీవ్వాదయమునను, గోర్కె యొక్కటిగలఁగఁ టకొప్పవింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన, విడిచిపెట్టితో కీణపై వేడ్క లెల్ల. 135

చ. అనుట యు లజ్జ నజ్జలజహాసన యించుక యోరగాఁగ వం
చిన మొగమొప్ప నేమనుచుఁ జెప్పెద దాననచేసి కాదె యో
యనఘచరిత్ర నాకుఁ గలయట్టిబలంగము లెల్లఁ బాసి యీ
ఘనగహనప్రదేశములఁ గష్టపుఁబాటులఁ గుందితిం గడుఁ. 136

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి యైనపిమ్మటఁ దనయున్నచోటికి మణి
స్తంభుండు వచ్చినప్రకారం బెఱింగించి యతండు దూరదృష్టిమార్గశ్రవణశక్తిబలం
బునం దనకుం జెప్పినయర్థము సకలంబు నుం జెప్పి తన్ను నతండు మృగేంద్రవాహ
నాభవనంబునకుం దెచ్చిన తెఱంగును బలిశషూపకరణోద్యమప్రకారంబు ను సుముఖా
సత్తి తన్ను రక్షించుట యు వివరించి యాపుణ్యసాధ్వి యాయమ యని యాయ
క్కఁ జూపి తత్కాలస్థానవర్తనంబులు దెలిపి యోగంధర్వోత్తమ యింక నాకు నీ
చందంబు వినవలయు నవ్విధంబున రంభచేత నీతపంబు విఘ్నంబు నొందుట యా
మణిస్తంభునిచేత నేను విన్నప్రకారంబు వింటివి కదా యటమీఁదటి భవదీయవ
ర్తనం బెఱింగింపు మనునంతట మణిస్తంభుండు వచ్చుట యు నిప్పుడేఁజెప్పినసిద్ధుం
డితం డని చూచిన నితండా యని దరహసితవికసితాననుం డగుచు మణికంధరుం డ
తనిం దగుతెఱంగున సంభావించె నతఁడు ను. 137

క. ఇచ్చఁ దదాగమనమునను, నచ్చెరువు జనింప నిది మహాశ్చర్యము మీ
రెచ్చోట నుండి యిచటికి, వచ్చేసితి రని విస్మితవృత్తిం బలికెఁ. 138

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి యీయింతి ని న్నెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్యమందుచు నప్పు డక్కడ నుంటి విప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసత్తిఁజూచి యెచ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు
చే రెద్ది యని తత్ప్రకారంబు దానిచేతన విని వెఱఁగంది వినుతిచేసె
నాతి యతనిఁ గనుఁగొని యరుదుపడుచు, నిట్లనియె నోయిసిద్ధుండ యెచటఁ బడితి
వీవుఁ గలభాషిణి యు ను నిద్దఱిచేత, నట్లు నరభనవిక్షిప్త లగుచుఁ బోయి. 139

వ. మీర లేమి యు నొవ్వక తిరిగిఁ వచ్చుట యు నచ్చెరువై యున్నయది నాకు నింత
యు వినిపింప వలయు ననిన విని మణిస్తంభుం డోయంబుజముఖి నీకు నట్ల వినిపిం
చెద విను మదియు కాదు మఱి యు నెన్నియేని విచిత్రంబులు గని వచ్చినాఁడ వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వి యొక్కరితోడం జెప్పెడునందాఁక హృదయంబు వేగిరపడుచున్నది కావున ని
న్నిటం బూజ్యురాల వైననీకు వినిపించెద నని యి ట్లనియె. 140

ఉ. ఆవిధి నీపయిం దెగి మదాతిశయంబునఁ గన్నుగానమిం
దేవతమీఁదియాన యుఁ గణింపక యాకలభాషిణి న్శిరో
జావళిఁ బట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టికే
ల్దైవవహించివైవఁ జనితిం గడుదవ్వుగ నివ్వధూటితోన్. 141

మ. అనుడు న్నీ విది చెప్పఁగా వలవ దే నాయున్న యారూపుఁగై
కొని వీక్షించితి నిన్ను నీచిగురుటాకుంబోఁడి మూర్ధంబు వ
ట్టినకే ల్పట్టినయట్ల యుండ దృఢముష్టిం బూని బల్గత్తి యె
త్తినకే లెత్తినయట్ల యుండ దివి నుద్వేగంబునం బోవుచోన్. 142

క. వినిపింపు నాకు నటమీఁ, దన నతఁ డి ట్లనుచుఁ జెప్పె నట్లురుపడి వం
చనమున వైచినగతినభ, మునఁ జని మణికంధరుని తపోవనభూమిన్. 143

క. ఇత్తరుణి యు నేను ను నొక, మెత్తని క్రొత్తలిరుఁబాన్పుమీఁదఁ బడితి మో
మత్తేభగమన యట్లే, సత్తి యుఁ గృపసేయఁబోలుఁ జావక యుండన్.

క. మునుపటిభయమున బ్రాన్పడి, యనికి నపుడు చేతికత్తి యు ను దనదుశిరం
బును విడువఁగ నెఱుగని ననుఁ, గనుఁగొని నెమ్మేను మిగుల గడగడ వడఁకన్. 145

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలంబాఱుముఖేందుబింబంబుతోడ
బాలకర్ణద్వయాకూలంకషంబులై తల్లడంబందు నేత్రములతోడఁ
గడుఁ జెమర్చినయట్టికలికిలేఁ జెక్కుల నంటెడువిగళత్కచాళితోడ
వలిగుబ్బపాలిండ్ల నిలువ కిట్టట్టు సంక్షోభించుపయ్యెదకొంగుతోడ
వెఱపు నొకయొజ్జ యై వింతవిలసనములు, గఱపఁ జూపట్టు సౌందర్యగరిమతోడ
సరభసాకర్షణాక్షోభ చకిత యైన, మదనుజయలక్ష్మిలీల నిమ్మగువ దనర. 146

క. కనుఁగొంటిం గనుఁగొనునం, తన మన్మథవశుఁడ నగుచుఁ దగఁ బరిరంభం
బు ను గావించితి నేఁ జే, సినపాపముఁ జెప్పవలయు శీతాంశుముఖీ. 147

మ. అది సైరింపక బాల పేరెలుఁగుతో నాక్రోశముం జేసి న
న్నిదె యాపాతకి బల్మిఁ బట్టెడుఁ గృప న్వీక్షింపరే కావరే
సనయత్వంబున నొప్పుసత్పురుషు లిచ్చో నెవ్వరు న్లేరె యా
పద వారింప శరణ్యులార యని యాపద్భ్రాంతి యత్యంతమున్. 148

వ. అప్పుడు. 149

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. నెఱయుఁగ నసహ్య మగున, మ్మెఱ వీనులఁ బడిన మిన్నుముట్టు నెలుఁగులో
వెఱవకు వెఱవకు మే నిదె, పఱతెంచితి సత్వరముగ భామిని యనుచు౯. 150

క. వెఱవక యెవ్వఁడురా వెత, పఱపెడు ని ట్లతివ నెందుఁ బాఱినఁ గూడం
దఱిమెదఁ దల నరములతోఁ, బెఱికెద ననుచు న్నితాంతభీషణగతితో౯. 151

చ. ఒకపొదరిల్లు వెల్వడి రయోద్ధతుఁడై నలకూబరుండు రాఁ
బ్రకటముగాఁ గనుంగొని యభంగురభీతిఁ గలంగి దీని నే
వికలమనోధృతి న్విడిచి వేగమ దవ్వుగఁ బాఱిపోయితిం
బ్రకుపితుఁడై యతండు ననుఁ బాయక వెన్కొని పట్టె నుగ్రత౯. 152

వ. అట్లు కూఁతముట్టి పట్టుకొని. 153

శా. ఓరీ యెవ్వఁడ వీవు పోతరముతో నున్మాదివై యిప్పుడే
నారిం బట్టితి బెట్టుగా మెఱయిడన్నాదండ నీదుండగం
బా రా ర మ్మటు దానిఁ జూపుదువు ప్రాయశ్చిత్త మామీఁద నీ
కేరీతిం దగు న ట్లొనర్తు నని తా నెంతే నమర్షంబున౯. 154

వ. కొంతమేర నన్నుం గ్రమ్మఱఁ దెచ్చునంత. 155

సీ. తిరముగా ముడువమి విరియుఁబాఱెడుకొప్పుఁ దోడ్తోడ నొకకేలఁ దుఱుముకొనుచు
వల్లెవాటుగఁ గొంత వలువ చన్గవ నిల్పి పెఱచేత నీవిఁ గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరిన ముంగురు ల్పాపటకు ను బొందుపఱచుకొనుచు
సారెకుఁ జాఱెడు శ్రవణకల్హారంబు లందంద మూఁపున నానుకొనుచుఁ
జెమటనంటినపానుపుఁ జివుఁకుఁ దునుక, లెడనెడ నఖక్షతాళంకఁ దడవుకొనుచు
రంభయేతెంచె మిగుల సంరంభ మమరఁ, దొలుతఁ బ్రియుఁ డేగుదెంచిన త్రోవఁ బట్టి.

శా. ఈలీలం జనుదెంచి యక్క టకటా యేమంచు నిద్దూఱుదుం
గేలం గైదువు గీదు వేమి యు ను లే కే యిమ్మెయి న్వత్తురే
చాలం దూరముగాఁగ నేనిదె పరిశ్రాంతిం గడు న్వచ్చితిం
జాలుం జాలుఁ గరంబు మెచ్చఁదగు నీచందంబు ప్రాణేశ్వరా. 187

వ. అని తనను ప్రియుం బలికి నన్నుం గనుంగొంచు నతనితోడ. 158

క. వీఁడా యట్ల న్యాయపుఁ, బోఁడుములకుఁ బూనునట్టిపుణ్యుఁడు పూవి
ల్కాఁ డోవల్లభ యింతటి, వాఁడైన నగు న్విశంకవర్తనుఁ డెందు౯. 159

క. ఆయింతి యెంచుఁ బోయెనొ, కో యనుట యు దానిఁ జూపుకొఱకునె కాదే
యీయయ్యఁ బట్టి తెచ్చుట, యోయంగన యిప్ప డనుట యు ను గృపవొడమ౯.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అయినం జూపక యిట్లం డింక నీవుండట యెందుఁ బోయెదుఁ జెయివదలు మనుచుఁ బ్రార్థించి. 161

తే. విభునిచే విడిపించె నవ్వేలఁది నన్ను, నేను వారలఁ బోఁడొంగి యీనెలంత
యున్నచోటారయుచు మునుపున్న తలిరుఁ, బాన్పుఁ జూపితిఁ గాననిప్పడఁతి నచట.

క. తాను ను మనతోల్తటి యీ, పానుపుఁ జేర్చుకొనఁబోలుఁ బడఁతుక ననుచుం
బోనీ సిద్ధుఁడు గాన న, నూనం బగుసిద్ధశయ్య కుచితుఁడ యనుచున్. 163

క. అట్టియెడ నచ్చట న్నా, పట్టముఁ గని పుచ్చుకొనియెఁ బౌలస్త్యసుతుం
డిట్టివి యుఁ దనకుఁ గొన్ని యెు, గట్టిగ నీజోగిబంటు గదె యనినను చున్. 164

తే. బంటుగాకున్న నిది యిందుఁ బాఱవైచి, వెళ్లునే యని నవ్వె నవ్విబుధకాంత
యంతనన్ని యు నయ్యె నత్యుతిప నచట, నడఁచి తని నన్ను దట్టించి యడిగెనతఁడు.

సీ. కినుకలోని నెల్లంత యు ను బెదరించుచుఁ బిలుపీఁకు నేయఁ దత్ప్రియవధూటి
వీనితోనిదియేమి విడిచిపెట్టుము వీఁడు తను నట్లు డించి వెళ్లిన నెడగని
యాయింతి డాఁగి యెం దరిగెనో యెచటఁ జూపెడు నంచు నను విడిపించి దాని
మన మిఁక వెదకుద మని తాను నాతండు నేఁ దోల్తఁ బాఱిపోయిన తెరువునఁ
జనియెఁ గడుదవ్వుగాఁ గుచస్తబక మొకటి, వరుని భుజముతో నొఱయునవ్వలితదంస
భాగమునఁ దన కోమలపాణిఁ జేర్చి, యనుపదంబున రోమాంచితాంగియగుచు.

ఉ. ఏనును వారివెంబడిన యేఁగితిఁ బాయక యింతనంత నెం
దేని మనోభవక్రియల నింపున నేమఱిపెట్టి పోవునో
యానలకూబరుండు మదుదగ్రకృపాణము నంచు దాని న
న్యూనగురుప్రసాదమహిమోన్నతిఁ గాంచుటఁ బాయఁజాలమిన్. 167

చ. అది యును గాకయావిపినమంత యు నెంత యు సావధానతం
బదిలము గాఁగ నప్పడఁతిఁ బాయక యప్పుడు దూరదృష్టిచే
వెవకి కనంగలేక కడు విస్మయమందుచు నేమి మాయయో
యిది విని వీరికైన నొక యీగడ వెళ్లనొ యంచు నేఁగితిన్. 168

క. అంతట నాయిరువురు న, త్యంతము నంగాంగసక్తి నాత్మలు గరఁగం
గంతుక్రీడలు గైకొని, రెంత యు నెడగలుగ నేఁగి యేను నిలిచితిన్.

శా. ఆలీల న్రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుం గేలి భి
న్నాలంకారము లొక్కరొక్కరికి నిం పొనట్లుగా దిద్దుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్లోలత్వంబున నుండ నచ్చటికి నాలోలత్వదశ్రేణిచా
ప్పాలోకించుచు రంభ వేఱొకతె డాయన్వచ్చెఁ జిత్రంబుగన్. 170

ఆ. వచ్చి జిచ్చవడియె నచ్చెరు వందుచు, నచ్చకోరనయన వచ్చు టరసి
యద్భుతంబు నొందె యక్షేశసుతుఁడు న, వ్విధముఁ జూచి యేను వెఱఁగుపడితి 171

ఉ. అంతట యక్షరాజసుతుఁ డాకరణిం జనుదెంచి యున్న యా
కాంతప్రకారనుం దనదుకాంతప్రకారముఁ గొంతప్రొద్దు వి
భ్రాంతి మహావధానమునఁ గ్రమ్మఱి క్రమ్మఱి చూచి నెందు నొ
క్కింతవిభేద మేర్పడమి కెంత యు నద్భుత మావహిల్లఁగన్. 172

క. ఈమాత్కెఁ జూడ నను న, క్కామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనియెదు నీ
వేమి యిది నాకుఁ జెపుమా, నీమది యని యతని నతని నెలఁతుక పలికెన్. 173

వ. ఇట్లు పలికిన నతండు. 174

గీ. నీదుప్రతిబింబ మదియొ దానిప్రతిబింబ, మీవొ యే మని చెప్పుదు నిగురుఁబోఁడి
యేర్పఱుపరాకయున్న వా రీవు నది యు, దీని కరుదంది చూచెదఁ దిరిగి తిరిగి. 175

క. తున నేమిచెప్ప నాదం, డదొలంగిన దాని నిజఁ దడంబడకుండ
న్మదిలోన నేర్పతించుట, సుదుర్లభ మటన్న నతనిసుదతి గలఁగుచున్. 176

సీ. అక్లైనఁ బ్రాణనాయక నినుఁ గౌఁగిటఁ బాయ నేవెటతు నీమాయలాఁడి
యీరూపుతో మన కెడసేయ నేతెంచినదియొ తొల్లి యు నొక్కయసురజంత
జనకనందనవు రామునకు ను నెడనేయఁ గడఁగి వచ్చుట వినఁబడుచునుండుఁ
గావున దీని నిక్కడఁ జుట్టుపట్టున నుండంగ నిచ్చిన నొప్పకుండు
వట్టిమొగమోట చాలించి గట్టిగాఁగ, నదర వైచుముఁ జనుమంచు నార నీవు
గదలెదుసుమంచు సంభ్రమం బొదవ నపుడు, శాంతుకంఠంబునొకకేలఁగౌఁగిలించె.

క. క్రొత్తగ వచ్చినరంభ యు, నత్తెఱఁ గంత యు ను గని కరాంగుళి నాసన్
హత్తించి తలఁ గగల్చుచు, నుత్తలపా టేర్పడంగ నుస్సురు మనియెన్. 178

ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ డోపడంతి నీ
వెక్కడనుండి వచ్చితివి యేటికి నుస్సురు మంటి నీవు నీ
యక్కజ మేల వచ్చె ను మదంగనరూపముఁ దాల్చి తేగతి
నక్కసి వో బిశాచివొ కరం బిది చిత్ర మెఱుంగఁ జెప్పమా. 179

క. అన నయ్యంగన నా కే, మన నో రున్నయది మీర లనినంత యుఁ జె
ల్లున మీ కౌఁగాములు దె, ల్ప నుపాయం బొకటి గానఁబడునందాఁకన్. 180

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. రక్కసి వన్నెఁ గా ననఁగరాదు పిశాచి యు నాదు సాదరూ
పెక్కుడఁ దాల్పనేరిచియొ యి మ్మెయి నెంత యు హత్తుకొన్న యీ
చక్కనిముద్దరాలు తనసత్యము లోక మెఱుంగ నింకఁ దా
రక్కసియో పిశాచియొ తిరంబుగ నేర్పడిపోవునంతకున్. 181

క. విను మాయేర్పాటు తనం, తన యగుచున్నయది యెట్లుఁ దప్పదు సత్యం
బనఁగా దైవం బనఁగా, జనులకు లేకున్న నెట్లు జగములు నడుచున్. 182

క. దైవం బనఁగా నా కిఁక, నోవల్లభ వేఱ యొక్కఁ డున్నాఁడే యా
దైవమవు నీవ చేయుం, గావలసిన నీవ చేయఁగల వేర్పాటున్. 183

సీ. అల్లప్పు డొకచోటఁ జల్లనిసురపొన్ననీడ మెచ్చుచు ను నాతోడఁ గూడి
యందుఁ బల్లవశయ్యఁ గంధర్వకేళి నిం పొందుచోఁ బడమటియందు నొక్క
వనిత యాక్రందనధ్వని వినఁబడుట యు నీవు డిగ్గున లేచిపోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొకయిట్టి డాపలివంక నేఁగుట యు ను
జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని, యెచట నె ట్లిది హత్తెనో యెఱుకపడద
వేగిరింపక నీవ భావించుకొనుము, కల్లనిజములు క్రమముగఁ గానవచ్చు. 184

చ. అనుడుఁ గుబేరసూను మొగ మారసి తత్ప్రియ యొక్క కేల నా
తనిమెడఁ గౌఁగిలించియ యుదంచితహాసముతోడ ని ట్లను
న్మనచరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులసాని చెప్పిన
ట్లె నిజముగాఁగ నివ్వెరవిలాసిని యెచ్చటనుండి చూచెనో. 185

గీ. అచట నపుడట్లు నినుఁగూడి యలరినది యు, నట్లు నీవేఁగుచో వచ్చినది యుఁ దాన
యగుచుఁ దోఁప సం దదికి యె ట్లాడనేర్చె, మగువ గాదుర యిది పెనుదగర గాని.

ఉ. ఇప్పగిదిన్మదాకృతి వహించి నిను న్ననుఁ బాయఁజేయ నే
చొప్పున నైనఁ దాఁ గలయ జూచుదురాశలమాయలాఁడి వా
తప్పక యింత తత్తదుచితంపుఁగుయుక్తులమాట లెన్ని యే
నొప్పఁగ నాకుకో నెఱుఁగ కుండు నె యిట్టివి చెప్పనేటికిన్. 187

క. విను వల్లభ కన్నుండం, గనుపాపం దివియ నేర్పుగల మునిము చ్చీ
వనిత తగ దిచట నుండ, న్వెనుక ను దిద్దుకొనవచ్చునే యొక పైనన్. 188

వ. అని యచటఁ దన్ను నిలువనీక పోఁదోలుటకు నిజవల్లభుని సత్వరంబుగా బోధించు నాచంచలాక్షి పలుకులకు నలుక బలియ మనంబున సైరింపలేక యాకంబుకంఠి దాని నధిక్షేపించుచు ని ట్లనియె. 189

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. త్రుళ్ళఁగ నేటికి నిలునిలు, మి ల్లలికినఁ బండు వగునె యింతటిలోనే
వల్లభునకుఁ గడు నచ్చిన, యిల్లాలవె యేను లాఁతినే పోఁదోలన్. 190

క. మగఁ డాపట్టెంబునఁ దల, దెగఁగొట్టినఁ గొట్టుఁగాక తెకతేరగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రా, వగ నాకాణాచి యైన వలపులపంటల్. 191

క. ఈరీతిని మద్వల్లభుఁ, గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండ
న్స్వైరించుట కొఱగా దిది, రా రమ్మిఁక నోర్వఁ జుమ్ము రావే యనుచున్. 192

క. వెడవెఱవు లిచటఁ జెల్లవు, పుడమి నహహా దొంగ లానఁబోడిచినఁ గోక
ల్విడుతురె గణింతునే యె, క్కడిగతిమాలినపిశాచికవో నీమాటల్. 193

వ. అనుట యు నాయింతి సైరింపక. 194

మానినీవృత్తము. అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే యనుచుం
గంతు లడంచెద లె మ్మని పల్కిన గంతు లడంచెద లె మ్మనుచు
న్వంతుల నేమిఫలం బనిపల్కిన రంతుల నేమిఫలం బనుచుం
బంతము చూడఁగదే యని పల్కినఁ బంతము చూడఁగదే యనుచున్.

సీ. ఒట్టుసుమీ యన్న నొట్టుసుమీ యంచు నే మేమి యనిన నే మేమి యనుచుఁ
గానీగదే యన్నఁ గానీగదేయంచు నిం కేల యనిన నిం కేల యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు నా నంటి వనిన నా నంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు నీవెంత యనిన నీవెంత యనుచు
నొకతెమగనికి నాసించు టొప్ప దనిన, నొకతెమగనికి నాసించు టొప్ప దనుచుఁ
బట్టి యాడె నారంభతోఁ బ్రథమరంభ, ప్రియుఁడు నిలుమన్న నిలువక పెద్దరొదగ.

చ. జగడపుఁగూటిసత్తరువు సారెకుఁ గోరుచు వీరివారినిం
దగిలెడు తంపవాలజడదారి పొరిం బొరిఁ గుంచె వీచుచు
న్నిగులఁగ వీణమీటుచు ను నేఁడు పడంతులయొద్ద నుం గడు
న్నెగడెను విందు గద్దె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్ 197

క. వచ్చినఁ గుబేరసూనుఁడు, నచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికి
న్నిచ్చల మగుతాత్పర్యం, బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. 198

క. నలకూబర నీ కిం దే, చెలువ ప్రియవధూటి నాకుఁ జెపుమా దానిం
దెలియుక దీవింపఁగరా, దలకుఁ డొకరొకళ్ళ ప్రేమ ననుచు న్నిమ్మున్. 199

మ. తవకం బెం బ్రిబిసు నీకు లేదు తనసౌందర్యంబె సౌందర్య మం
చు ను గర్వించుచు నున్నరంభ మదముం జూడంగ లే కిట్టిదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిని నీవే సృజియించితో యిదియు తా నీతోడఁ గ్రీడింపఁగా
దనమే నొక్కటి చాలదంచుఁ గడఁకన్ ద్వైరూప్యముం దాల్చెనో. 200

గీ. ఎట్లయైన స్త్రీపేరు యీయువపురంధ్ర, సమమగునో కాదో చెప్పుమా చాలఁదడవు
. వీరిఁ బోలించి తప్పేడక విరియఁజిమ్మ, లేక కనుఁగొంచునుంటి నే నాకసమున. 201

క. అనుట యు నే నెక్కడ వీ, రిని బోలించితి నయో విరించితనయ నా
కును వీరిలసవరూపత, యును బోరును వెలిఁగొనన్పుచున్నది మిగులన్. 202

వ. అని పలికి మున్ను దానందు నొక్కరంభఁ గూడి క్రీడించుచుండి యప్పు డనతిదూరంబున వనితాకృతం బైనయాక్రందనంబు వినంబడినఁ గారుణ్యసంభ్రమంబున నద్దిక్కునకై చనుట యు నంతం దనదృష్టిపథంబునం బలాయమానుం డగునన్నుం దతిమి పట్టుకొని యొకకొంతదవ్వు జరుగఁ గొంపోవుట యు నచ్చటికిఁ దనకాంత గూడ వచ్చుట యుఁ దద్ద్వార్థనంబున నన్ను విడిచి యిచ్చావిహారంబుల నది యుం దానుఁ గొంతప్రొద్దు పుచ్చుట యు నంత రెండవరంభ వచ్చుట యు దానివచన ప్రకారంబు ను గలహాభంగులుం జెప్పి యానలకూబరుం డాయిద్దఱురంభలయందు.

సీ. తా నటమున్న క్రొత్తగఁ దీర్చినట్టి కస్తూరికాతిలకంబుసొంపుతోడఁ
గన్నె గేదఁగిఱేకు లన్నువగాఁ గొనల్గాన్పింప నిడినకీల్గంటుతోడ
బంగారుపసమించు పనినిపుప్పొడిరేఖఁ జూపట్టుపాపటసొబగుతోడ
సరిపాటుగాఁగఁ గేసరములు గ్రుచ్చిన కురువిందవిరిగుబ్బసరముతోడ
నొప్పుమీఱుచు నున్నట్టి యొకతెఁ జూపి, యీసరోజాయతాక్షి యు నేను నున్న
చోటి కింతకుము న్నాపద్ఘాటి వచ్చె, ననుచు రెండవయింతి నమ్మునికిఁ జూపె 204

ఉ. చూపిన నాలతాంగి యుజపూనన నంజలి చేసి యోమహా
తాపస యల్లనాఁడు మను ద్వారక చేర్పిన నాడిపట్టియీ
యోపలు కింత చేసె నన నవ్య యు నట్ల యనన్మునీశ్వరుం
డాపుపుఁబోఁడ్ల నిద్దఱ యథార్థము పల్కితి రంచు నవ్వుచున్. 205

క. ఆమాటలు సరిదాఁకె క, దా మాకీవీక్షణోత్సవాతిశయంబుం
బ్రేమమునఁ జూపఁగగ్గెను, వామేక్షణలార పోయివచ్చెద ననుచున్. 206

క. అనుట యు నలకూబరుఁడో, మునివర యిద్దఱు యథార్థముగఁ బల్కితి రం
చు ను బల్కితి రెట్లొకొ యిది, వినవలయుం దేటపఱచి విచ్చేయుఁ డనన్. 207

సీ. నాఁడు తానాత్మసౌందర్యవైభవపతి వాల్లభ్యమహిమగర్వమున నాడు
కొనువాక్యములు నేను వినలేక సవతి యేఁకతిఁ గల్గునో మీఁదుగంటివె యని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నట్టిమాటఁ దలంచి యాపలు కింతసేసె నటంచుఁ దార్కాణసేసె నొకతె
యొకతె రంభాహూపయుక్తిచేఁ బ్రియుఁ గూడఁ గాంక్షించి యొక కార్యఘటనవేళ
నాదియందున నా చేత నది వరచుగఁ, దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు
హృదయమున నిల్పి యాపలు కింతసేసె, ననుచుఁ దార్కాణ సేసె రెండును నిజంబు.

క. నా వని యిపు డీభావం, బీవనితకు నీవనితకు నిది యనుచు బయ
ల్గావించి తథ్యమిథ్యా, భావంబులు మీర లేరుపఱుపఁగవలయున్. 209

క. నావుడు ను దథ్యమిథ్యా, భావంబుల కేమి నీకు భావింపఁగ స్వా
భావికమే యీయాకృతి, భావము నిజమెద్ది యీప్రపంచమునందున్. 210

క. నీవ ట్టురువడ నొక్కతెఁ, జూపి యొకతె గర్వమడపుచు న్వలయుఁగతిం
బ్రాపింపవచ్చు భోగము, నీపుణ్యం బిమ్మడించి నేఁడు ఫలించెన్. 211

ఉత్సాహ. అనుడు నోమహాత్మ పెద్దలైనవారిఁ దడవుగా
ననిచి యిట్టు నట్టు పలుక నొప్ప కేమి వచ్చునో
చనుఁడు నిలుపమెఱతు ననినఁ జనియె నాతఁ డట్లయా
ననుచు నుచిత లీల నుండు మనుచు నల్లనవ్వుచున్. 212

సీ. ఆశ్లేషనంబునఁ డంతట నెప్పటితనపువ్వుఁబోఁడిక్రైసండఁ గొనుచు
నిది యెంతలేదు నెమ్మని నట్టి విఘ్నముల్గఱిచేసి వనకేలి వఱవనేల
రమ్మంచు రెండవరంభఁ గనుంగొని నీవెంత నేర్పులు నెఱపితేని
మాయలే యని తోఁచు మాకు గావున నీదుసత్యమెఱిగింపఁజాలినట్టి
సాక్షిఁ దెమ్ము భామ్మని తిరస్కారసరణి, దోఁపఁ బలికెఁ దాత్కాలికదుర్నివార
మారకేళీకుతూహలమహిమచేత, నెచటి కేని యు నపుడు దా రేఁగఁదలఁచి. 2·3

ఉ. ఆసుదతిం గనుంగొని తపంగన యప్పుడు హెచ్చినట్టి పే
రీసున నీడించుచు నొకించుక నీకు ను సిగ్గు లేదకో
దోసము గాదె యిద్దఱు వధూవరు లేకతమున్న చోటికిం
డాసిన నిట్టియాసలఁ గడంగిన నే మని చెప్ప నావుడున్. 214

వ. ఆరంభ యమ్మాటలకు నలిగి రోషకషాయితవీక్షణంబుల నాపత్మలాక్షి నీక్షించి.

శా. ఓసీ నీకొఱ గామిదే యిది నిజం బూహింప కిట్లంగజ
వ్యాసక్తుం డగునాఘు చేష్టితముగా కైనం గుబేరుండు లేఁ
డో సుత్రాముఁడు లేఁడొ పద్మజుఁ లేఁడో ధర్మపుంబ్రాపు లే
దో సత్యంబు ను నిల్ప నింకేన కడుం బ్రదుశ్శంగ నీ కేటికిన్. 216

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనిన విని నాయకావర, ఘనగర్వము నిరసనంబు గడుఁ జిత్తములోఁ
దనరఁగ నవ్వులు కించుక, యను నైకొన కన్యఘాటి యుద్ధతిఁ బలికెన్. 217

క. అఱపు లుడిగి పో పో నీ, యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం
గఱచెదవుగాని తగునెడ, నెఱయిను మది యెట్టిదైవములు వినియెడినో. 218

వ. అనుట యు. 219

క. కానిమ్ము వేగిరింపకు, నీనుదుటనె ప్రొద్దు వోడిచెనే యేదైవం
బైన ను విన కిప్పుడె యిదె, నానిజ మేర్పఱచి నీ కొనర్చెద శిక్షల్. 220

వ. అని పలికి యచ్చోటు వాసి కొన్నియడుగు లరిగి యంతటఁ దనకోపంబు ను మించి దీపించుప్రియవిమోగదర్పితానల్పకందర్పహేతిఘాతజాతచేతస్తాపంబున కోపక యాపడఁతి కడుం గృశించి గళితకంకణ యగుచు నిలిచి యొక్కయుపాయంబు చింతించి తిరిగివచ్చి యి ట్లనియె. 221

క. నీ విచ్చో మెఱియతవై, కావరమున వలసినట్లు గయ్యాళింపం
గా వెఱది పెద్ద మెఱగా, నే వీరిని వారిఁ దగిలి యేలవచింతున్. 222

క. నీవు ను రా ర మ్మిప్పుడు, దేవసభం దేటి యేఁగుదెంత మనుచుఁ దా
నావనజాక్షిని డగ్గటి, తీవరమునఁ గొంగువట్టి తిగిచెం గినుకన్. 223

చ. తిగిచినఁ జూచితే నిను మదిం గణియింపక యెంతసేఁతకుం
దెగియె భయంబు దక్కి పెనుద్రిమ్మరిరక్కసిగాక భూమిలో
మగువయె యీగయాళి ప్రథమంబున నోర్చినతప్పు నూనె యీ
పగిది ఫలించె నంచుఁ బ్రియుఁ బల్కెఁ గరం బది సంభ్రమించుచున్. 224

క. పలికిన మనకేమీ విబు, ధులసభలోపలన తవదుదుండగ మెల్లం
దెలిపి తగుశిక్ష చేయుచ, మలిగి యిపుడు పదర నేల యని యతఁ డాడెన్. 225

గీ. అంతఁ బ్రతిరంభ చూచి నీయాత్మలోన
నింత యుండిన నీసత్య మెఱుఁగవలయు
దిఱుగఁబడిన ను విడువఁ జూ దేవసభకుఁ
బదమనుచు దానిఁ గూడి పోఁగదలుట యు ను. 226

వ. కొంత చింతించి యి ట్లనియె. 227

సీ. అప్సరస్త్రీలలో నగ్రగణ్యత్వంబు జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వసిమేనకాద్యుత్తమస్త్రీలు రావమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యున్నందు నిచ్చోట నేవారిచే వ్రేలఁ జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నలకూబరుండు ధన్యతరుండునా గలువతనంబుచే నీవు వన్నె దెచ్చి
యొప్ప నే యింకఁ గడపట నిప్పిలాచి, నాకు సరిచేసికొని దేవలోక సభను
నీవు నూ నీవు సుమ్మని యేవిధమునఁ, గలహ మాడెద నిది నీవు తలఁచి చూడు. 228

క. కోపము పాపమునకుఁబో, త్తి పెనుదగవునకుఁ దగఁగ నేకట్లాటల్
ప్రాపించునో పడంతుల, కోపురుషశ్రేష్ఠ యవి యు నొక్కబ్రదుకులే. 229

వ. అది యు నుం గాక. 230

క. రంభకు నహహా యొకప్రతి, రంభ గలిగి తిగిచితెచ్చె రచ్చల కని నం
స్తంభింపనీరు హాస్యా, రంభణ మీపోరు నిర్జరవిటు ల్నగుచున్. 231

క. నానడకలకు ను యోగ్యము, కానిది యిపు డిచట నైనఁ గలహమ బ్రదుకై
లైన నగుఁ గాని యిఁక నీ, యాన ధరణి విడిచి దివికి నను గటు వెట్టన్. 232

క. ఈకలహ మపుడు వినఁబడు, నాకంబున సురలయాననము లేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ, నాపు మరుఁడు నిన్ను నిలువున బ్రాకునికిన్. 233

వ. అనుడు రెండవకొమ్మ యమ్మాట లాకర్ణించి యోకాంతుండ యాకాంత నేర్పు చూచి
లే వేల్పులకడకు నేతెంచినఁ డనమాయు బట్టబయలం బడు నని యెడుతలంపున రాఁ
గూడక సురలయాననంబు లేగతి నాలోకింతు నని నాకగమనంబు పరిహరించె నం
దు ను ధరణి విడిచి దివికి నను గటు వెట్ట నని తొడిఁబడ నీమీఁదియాన పెట్టుకొను
ట ఖేచరత్వంబుఁ గలిమి యు సందియంబ యింతతడవు ప్రియకాంత యనుచు నెట్లు
నమ్మి తని పల్కిన నది వివేకమార్గంబ యగు నని నలకూబరుండు తద్వాక్యంబులకు ని
రుత్తర యైయున్న తనచండ చెలువ నుండనీక యోసి మాయలాఁడివి గదె యని మె
డపట్టి పాయంద్రోయుట యు నది యు సందుగా నాయిందుముఖి నందంద దట్టిం
చి యిట్టివెడసేఁతలచేత నాథుని కడసేసి చేతోజాతహేతిఘాతంబులపాలుపఱచి
తని పలికి యాతరళాక్షిని హేతిఘాతనిమిత్తంబుచేతన కాయవియోగంబు నొందు
మని శపించె నలకూబరుండు ను దత్కాలం బెట్టిదియు కాని యాఁగాములు వివేకిం
పలేక యిది యిట్టిశాపంబునకుఁ దగు నని పలికి యోసి నీపె రెద్ది యెట్టిదాన వని
యడిగె నప్పుడు తత్ప్రతిరంభ నైఁపక. 234

శా. ఇంపాఁక న్నినుఁ జేరనీక నను నె ట్లైంతే మనోజవ్యథం
గుందంజేయుట చాల కేమడిగె దీగొంటున్ వృథా యంచు నా
కందర్పత్వరఁ గానశే వనుచు నాకంజాక్షిఁ బోద్రొబ్బెఁ దా
నెందు న్నిల్వఁగనీక పేరలుకతో నెంతేఁ గడుం దవ్వుగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

235

వ. అని చెప్పి యాసిద్ధుఁ డాసుఖాసక్తి కిట్లనియె.

గీ. అట్లు పోఁ ద్రొబ్బుట యు నతఁ డాత్మ నిచ్చ
గించుకొని యుండెఁ గాని తా నెంచఁడయ్యె
రంభ యాఁగాము లాప్రతిరంభమీఁది
ప్రేమఁ గామునకు ల్వ్రాతనప్రియులుగారె. 236

క. అనుట యు నీ వం దేయింతిని సత్యపురంభ యనుచుఁ దెలిసితి వాలా
గున భంగ మొంది యారక, చను టరయఁగ నదియు కపటసతి కావలయుఁగా.237

క. త న్నట్లు పలికి ద్రొబ్బఁగ, మిన్నక చన నంత నోరు మెదపక యదిరా
ము న్నాడినమాటలవిను, సెన్నఁగ నిది గనియె యతఁ డుపేక్ష యొనర్చెన్. 238

క. అది యట్టిద కానిమ్మా, తుద చెప్పను సిద్ధపురుష తొల్లి రొయిచటఁ గ
న్నది విన్నది గా దద్భుత, మిది వినవలయు నన నాతఁ డి ట్లని పలికెన్. 239

సీ. ఇటమీఁద నింక నొక్కటి యద్భుతము విను మోహనమోజానన యాపడంతి
నారీతి నెంత యు మారంబుగాఁ గఁ బోఁద్రొబ్బి యేలెంచి యాలోకయజాక్షి
ప్రియుఁ జూచి మగవారి ప్రేమ లిట్టివి గదా యెట్లు నమ్మఁగవచ్చు నిచ్చలోనఁ
ప్రాణేశ యటు దండవాసినమాత్ర నీత్రిమ్మరి నెచోప్పటఁ దెచ్చుకొంటి
నిన్ను నేమన నున్నది నిరభిమాన, గుణత నినుఁ జేరు న న్ననుకొనుటగాక
నాపనా యిన్ని పా ట్లించు నాకులమతి, నడ రెఁ గన్నుల బొటబొట న శ్రులొలుక.

చ అడలిన నాదరంబునఁ దదశ్రుజలంబులు కేల నొయ్యనం
దుడుచుచు నాయెడం గలదె దోస మొకింత యు నెంచిచూడ నో
పడతుఁక దాని నీవ యనుభ్రాంతి గరం బిటు లాదరించియే
ర్పడినఁ బరిత్యజించితిని బట్టఁగరా దిది తప్పుగా మదిన్.

మ. అని యింతి న్నలకూబరుం డురముతో హత్తించుచుం దుఃఖ మా
ర్చి నికుంజంబునకు న్రతిక్రియకు నై చేర్పంగ వే ఱొక్కఁ డం
తన వచ్చె న్నలకూబరుం డచటికి న్నారూపముం దాల్చి వం
చన నెవ్వాఁడుర చేరినాఁ డట దురాశ న్రంభ నంచు న్వెసన్. 241

గీ. ఇట్టు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల, నుల్లమున వెఱఁ గందితి నొకటివెనుక
నొకటి రాఁజొచ్చె మాయలీయుర్వి మహిమ, తెలియఁగుగాదుగదాయని ధృతిచలింప.

సీ అ ట్లేఁగుదెంచుచో నతని గన్గొనిరంభ బెదరు నాశ్చర్యంబు మది జనింప
విభున కి ట్లనియెను వల్లభ యిది యొక్కమాయాప్రపంచము చూడు మద్భుతంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీదురూపముఁ దాల్చి భేద మొక్కించుక యును లేక శాసించుచున్నవాఁడు
తనరూపము నీవు ధరియించినాఁడ వంచున్నవాఁ డిది గెల్వ యుక్తి చెప్పుమ
యపుడు నారూపుతో నది యన్ని వెతలఁ, బెట్టె నది గడచితి మన బెట్టిదముగ
నిపుడు నీరూపుతోడ వీఁడేఁగుదెంచెఁ, దిరుగఁ డొకమాత్రమున విచ్చుబిరుసుఁ జూడు.

క. మనమునభిమతఖేలనములు, మనమున సైరింప కెన్నిమాయ లకట యే
దనుజుఁడొకో మాత్సర్యం, బొనరఁగఁ జలపట్టి పన్నుచున్నాఁడు కడున్. 244

వ. అని పల్కుచుండె. 245

శా. అంతం జేరఁగ నేఁగుదెంచి యతఁ డొయ్యబ్జాక్షి యేమంచు వి
భ్రాంతిం బల్కెదు కల్ల యున్నిజము వీడ్పాటొందఁగా నిప్డు నీ
కాంతు న్నన్నుఁ బరిగ్రహింపుము మదాకారంబు వీఁ డెవ్వఁడో
యెంతే నొప్పఁగఁ దాల్చె వంచితవు నీవే తన్మహామాయచేన్. 246

మ. మది నామాటలు నమ్మవేని యునికన్ సమ్మిద్ధజిన్ ధైర్యసం
పద పెంపారఁగ దవ్వుల న్నిలిచి యోపద్మాక్షి వీక్షింపు మే
నిదె ఖండించెద వీని మామకమహాహేతిప్రకాండంబుచేఁ
దుద శోధించెదుగాని నీవుఁ గలయుక్తు ల్మీఱ నాసత్యమున్. 247

చ. అన విని చాలఁ దల్లడిలి యాయుక నాయకకంఠము నయం
బునఁ దనకౌఁగిటం బొదివె భూరికృప న్ననుఁగావరే ప్రియు
న్మనుపరె వేల్పులార యొకమాయపురక్కసుఁ డాక్రమించి తాఁ
దునుముచునున్నవాఁ డలుకతోన నిరాయుధు నంచు నేడ్చుచున్. 248

చ. అది గని వాఁడు నవ్వి యిది యారవివేకము గట్టిగాఁగ న
న్నె దనుజుఁ జేసితే ముగుద నీవు దలంకకు నేనిరాయుధు
న్మదమతి పాఱువానిని బ్రమత్తుని జంపెడువాఁడఁ గాను నా
కెదిరిచి నిల్చునో యనుచు నీతనిఁ ద్రుంచెద నంటి నిత్తఱిన్. 249

వ. ఎదిరించి నిల్వనోపునేని తనకైదు వెచ్చట నున్నది తెచ్చుకొమ్మను మోహాత్మ
నెమ్మనంబున నితండ నిక్కపునలకూబరుం డని యు యుద్ధంబున జయాపజయంబు
లెంచినట్టు లావు లోడింబడ నితని కొక్కటి యయ్యెనేని యే నేమియగుదాన నని
యు విచారించితేని నితని తథ్యమిథ్యాభావంబు తేర్పడునందాఁక నేను నుయు
ద్ధంబునకు వేగిరింపక సహించెద నింకను మాయురుపురవాక్యప్రకారంబులు విని యు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీ వెఱింగిన పూర్వరహస్యంబు లడిగి యు మఱి యు నుచిత మగు తెఱంగులవలన మాళ పటాకపటవర్తనంబులు దెలిసికొనుము నాకుం బ్రియవనిత వైననీవు నాయెదుటన యిట్లు పరుని కంఠాలింగనం బొనర్చి యుండ నిచ్చలోన మచ్చరంబు పెచ్చుపెరుఁగ క యుండఁడు పెచ్చుపెరిఁగెడుమచ్చరంబు సత్యాసత్యవివేచనపర్యంతంబు నిలువ క ట్లొనర్పనో యెఱుంగరాదు కావున నాత్మహితంబుఁ గోరితేని యతని విడిచి యెడగలుగ నిలిచి నాపలుకులు వినుమని పలికిన. 250

క. ఆచెలువ తనదు ప్రియునిం, గాచుకొనఁగ నప్పు డజియె గతిగా మది నా లోచించి చూచి మఱి త, ద్వాచాగతి నలని కెడగఁ దాఁ జని నిలిచెన్. 251

క. అతఁడు నోతొయ్యలి యిపు, డీతని యాకత్తి గిత్తి యేను గణింప న్నీతిలకు మన్న మానవు, భీతప్రకృతి వని యెప్పెఁ బ్రియ యటుచనఁగన్. 252

శా. ఆరీతిం గడ కేఁగి తా నిలిచి ప్రేమాంచత్కటాక్షంబులన్ ఘోరానూయనిరీక్షల న్వరునఁ గాంతుం దత్సమాకారు వ న్నారీరత్నము చూచుచుండె నెచట న్వ్యర్థంబు లత్యుజ్జ్వలా కారశ్రీసమత ల్జనించు ననురాగంబు ల్మమత్వంబుచేన్. 253

సీ. రెండవనలకూబరుం డంత రంభఁ గన్గొని చెల్వ భావించుకొనుము నీవ యమరేంద్రుఁ డంప నిందరుగుదెంచితి కద మణికంధరుని తపోమహిమఁ జెలప నతని నేచెట్లగట్టితి వీతఁ డెచ్చోటఁ లంకించుకొనియె నలంఘ్యమైన విరహతాపంబునఁ బొరలుచు నీరాక కెదురు చూచుచున్నయే నటుండ నకట సురకార్య విఘ్నమో యనుభయమున, వెంటరాలేనిపాప మిప్పుతలు దెచ్చెఁ దేరకాఁ డిట్లు నిన్నుఁ బ్రాంతిని బొరల్ప, బాసనేయుంగ వలసె నే భర్తననుచు. 254

మత్తకోకిల. వెంట వచ్చిన నీవు నాపయి వేడ్కఁ జిక్కి తపక్రియ న్గెంటఁజేయు నెఱుంగకుండినఁ గీడు వాసవు చేత నే వెంటరా కటు నిల్చిన న్ననవింటివానికిఁ గోప మీ రెంటఁ జింతలు కొంతప్రా ద్దొనరించిన న్విరువీఁకు గాన్. 255

మత్తకోకిల. అంతఁ గంతుని పంత మెంత యు నంతకంత కనంతవి భ్రాంతిఁ బర్వఁగ నోర్వ కట్టటు కాని యింద్రుని యల్కఁ సై రింతు నంచు ను సాహసం బొనరించి యే నిటువచ్చితిం గొంత వెండి యు నింద్రు నెంచుచుఁ గొంచితి న్నిను డగ్గఱన్. 256

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. తపసి తపఃక్రియ ల్వెఱచి దైవతకార్యము నిగ్రహించి నీ
వెపుడెపు డేఁగుదెంతు నిను నెప్పుడు కౌఁగిటఁ జేర్తునంచు నే
నపరిమితాళ నోజలరుహాసన యివ్వనిచేరవ బ్రయా
సపడుచు నిల్చుకొంటిఁ బికసంచయపంచమవంచితాసువుల్. 257

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడొ, యిక్కరణి న్మోసపుచ్చి యేలుకొనంగా
నక్కడ వల్లవనిశంకల, నక్కట నేపాడుకాఁపు లాగతి నుంటిన్. 258

ఉ. ఇంతకమున్న నారదమునీశ్వరుఁ డచ్చటి కేఁగుదెంచి నీ
వెంత యు మన్మథార్తిఁ బడి యేమిటి కిచ్చట నున్న వాఁడ వో
భ్రాంతుఁడ నీదురూపమున రంభ నొకం డవలం గరంబు వి
భ్రాంతిని ముంచుచు న్వివిధభంగుల నేలుచు నున్నవాఁ డనన్. 259

క. విని వచ్చితి నేనమయం, బున నేగతి సందుకొనియెఁ బోలఁతుక యితఁ డీ
తని తెలుఁగుఁ జెప్పు మన నే, మని చెప్పెద ననుచుఁ జూచె నది ప్రియు మొగమున్.

తే. చూచుట యు నేమి చూచెదు శోభనాంగి, నిన్నుఁ జెందిన పాపెల్ల నన్నుఁ జెంద
కుండు నే నాఁటియలనారదోక్తి యరయ, నాఁడు నీతోడ నమ్మునినాయకుండు.

క. నినుఁ బోలువనిత నీకును, వనజముఖీ యితనిఁ బోలువాఁ డితనికి నెం
దు ను గలిగి కలంచునొయి, ట్టినిగాఢపుసొంపు మడముతీవులు చను నే. 262

క. అని పలికెఁ గాదె యది వృథ, చను నే నైన నులతాంగి శంకింపకు నీ
మనమున నీగతి నిప్పుడు, తునిమెద నాఖడ్గమున ను దుర్దములీలన్. 263

వ. ఆఖడ్గం బపు డల్ల యచటి కేళినికుంజంబునం బెట్టినవాఁడ నిదె తెచ్చుకొనియెద న
ని పోవం జూచినఁ దత్ప్రతిభటుండు నీ కింతభీరంబు గలిగినం బోరు చూరంబు చే
సి యిటు నటుం జననేల నిరాయుధు నంటేని నేను నాయుధం బిదె విడిచితి నని
విడిచి యడ్డంబుగా వడిచిన జెడిదంపుటీరసంబు ను వీరరసంబు ను ఘోరంబు లగు
చు నుల్లసిల్ల మల్లయుద్ధం బాయిద్దఱకుం దద్ద యుం బ్రవర్తిల్లె నప్పు డొండొరుల
యుద్దండదోర్దండచండాస్ఫాలనాభీలఘోషవిజృంభణంబులు కుంభినీధరగహ్వరస
ముద్ధతప్రతిధ్వానంబులచేత నినుమడించి ప్రళయజలధరవర్గనిర్గళితంబు లగుబలుపిడు
గులమ్రోఁత ననుకరింప నిశ్శంకనిరంకుశాహంకారహుంకారగంభీరారావంబులయా
ర్భటులు నిర్భరసముద్భటంబులై దిగ్భిత్తులఁ బిక్కటిల్లుచు బ్రక్కలింప నొక్కొక్క
రి మిక్కుటపువిక్రమంబుల పెక్కువ లెక్కగొననియక్కజపుఁబెనుక్కన మిక్కిలి
శౌర్యనిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి యాగ్రహంబు సెలఁగ నొడ్డారిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచు గడ్డుఱికనీక యడ్డంబుగా నొడ్డుకొనియెదు నెదిరిపిడికిలి పాయందట్టి బెట్టి
దంపుటుఱఁపిడిం దొడింబడఁగఁ దీసి కీలాగరిష్ఠనిష్ఠురముష్టిఘాతప్రయోగనైపుణంబు
ల దీపించుచుఁ గోపంబున నేపుచూపెడు నాటోపంబుల నాఁపరానియనూనంపుబిఱు
సు నుం బఱసఁదనంబు ను హెచ్చఁ జెచ్చెరఁ జొచ్చి పట్టికొని హెచ్చరికం గచ్చు
వదలక పెరిఁగెడియచ్చలంబులు బలఁబు ను బ్రబలంబుఁ జేయ గళంబులఁ ముంజేతు
ల్గిడి పెడమఱ నొక్కి యెక్కవిఱిచి పడవైచి యుఁ బడవైచిన విడువక తొడన
పఱనిం బడందిగుచుచు దిగిచిన బిగివదలక పయింబడి కదలమెదలనీక పొదివి ప
ట్టుచుఁ బట్టిన నిట్టట్టు పెనంగి పట్టువదలించి కరంబుల నురంబుల నడిమి కిమిడిం
చి యెడముకొని బడిబడింబొడుచుచుఁ బొడిచినఁ బొడువనీక కడిందికడిమి నడంగం
బట్టి పగతుచేతులు తొడల నిఱికి పరాక్రమించుచుఁ బరాక్రమించిన ను విక్రమంబు
దక్కక వెనుకటిదట్టికట్టు పిడికిటఁ బొడివి యెత్తి తెఱపిగొని పఱపి మోకాళ్లు వక్షు
స్స్థలంబుల నాని వెల్లకిలఁ ద్రెళ్ళ బిళ్ళమీఁటుగాఁ జిమ్ముచుఁ జిమ్మి యుప్పరపువేగం
బుతోడన లేచి పైఁబడఁ గడంగిన నెడయాక పదంబులు చాఁచి యెదు రొడ్డుచు
నతిముఱి నొక్కింత తఱిఁ గని యద్భుతరయంబున దిగ్గన లేచి మెడ యొడిసిపట్టి
గ్రుడ్లు వెలికుఱుక నొక్కుచు నొక్కినఁ జిక్కువడక యొకకేలఁ గోకకట్టు నొక్క
కేలఁ దొడ యుఁ బట్టి కూలవైచి మఱియు మల్లచఱిచి క్రమ్మఱ లెమ్ము రమ్మని గ
ర్జిల్లుచు గర్జిల్లిన నూర్జితరయంబున మగుడఁ దలపడి పౌరుషంబు సేయుచు వెండి
యుం బాయుచు డాయుచు ననేకప్రకారంబులఁ బోరుచుండ. 264

గీ. అట్టియెడ ను బచ్చపట్టుదట్టీచేత, నొప్పఁతెనదుప్రియుని నుజ్జ్వలంపు
శీవినెఱపుచంద్రకావిదట్టీచేతఁ, బఱని గుఱుతెఱింగె సురవధూటి. 265

క. ఇక్కరణి నించుకంత యు, నెక్కువ తక్కువలు లేక యిరువురు సరిగా
నుక్కునఁ బోరాడి శ్రమం, బెక్కుడుగాఁ జేసి నిలిచి రెడగా నంతన్. 266

ఉ. రంభ యు వారిరూపు ననిఁ బ్రౌఢి యుఁ దుల్యతఁ బోల్చి సంశయా
రంభ మొనర్ప నెవ్వరిఁ దిరంబుగ నమ్మక హా నిలుండు సం
రంభము మాని యేనుఁగుప్రాక్తనవర్తన మొక్కటిన్ వహ
స్సంభవ మైనదాని నరుస న్వచియింపుఁడు మీర లిత్తఱిన్. 267

క. దాన న్వత్యాసస్యత, నే నామతికొలఁది నిశ్చయించుకొనఁగ నె
వ్వానికి నెయ్యది యుచితం, బానిఱతి నతఁడు పోవు టగ్నం బనిరొకన్. 268

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని యాపనిత యాడుమాటకు వార లియ్యకొన నిద్దఱం బాయం బాయం బిల్చి యొక్కఁడు వినకుండ నొకనితోడ మనకుఁ దొల్లి కళాపూర్ణుం డనువాని ప్రసంగం బె చ్చటఁ గలిగెఁ దత్ప్రకారం బేమి నీవు వింటి వని యడుగుట యు నందు ద్వితీ యుండు దానికి సమ్మతింబు గా నుత్తరం బిచ్చెఁ బ్రథముండు వెలవెలంబాఱుచు నూరకుండె నయ్యతివ యు నతనిం జూచి కటకటా యిందాఁక నేను నిన్ను నిక్క- పుఁ బ్రియుం డనుచు నమ్మియుండితి నీవ కపటరూపధరుండవే యని యద్భుతంబు ను జుగుప్స యు భీతి యు నాకారంబున దీపింప నతని విడిచి యితరునిం బరిగ్ర హించె నతం డమ్మాటకు విలోకించి యతని నల్పావశిష్టాయువుగా శకించె నప్పుడు రంభ యుక్కపటవర్తనం జూచి నీ వెవ్వండ వెవ్విధంబున నిట్టిరూపంబు ధరియిం చి నన్ను వంచించి తని యడుగుట యు నత్యనలకూబరుఁడు. 269

సీ. ఇందాఁక నినుఁ జేరనీక న న్నిట్లలయించుట ఛాలక యింక నిలిపి
వాని నే మడిగె డెవ్వఁడు గాక నీ కేమి యిది కాకదంతపరీక్షణమ్ము
నామన్మథార్తి యెన్నఁగ వలదే చాలు రా ర మ్మటంచు నారంభ నపుడ
తోడ్కొనిచనియె ను వేడ్కతో మోముఁదామరవికసింపఁ గా సురపథమున
నంత నితరుండు చింతతో నంతనింతఁ, గొంతవడి నిల్చి దీనతఁ గోమరు దలుగఁ
జనియె మణికంధరునిపర్ణశాలదిశకు, నల్లనల్లన మిక్కిలి నలసగతిని. 270

వ. అట్టియెడ మున్నతండు తనకేళికానికుంజంబునం బెట్టిన నాపట్టెంబుఁ బుచ్చుకొని తత్సంతోషంబున నుబ్బుచు నిచటికి వచ్చితి నిది యిచ్చినప్పుడు మద్గురుండు నాతో డ దీని నెవ్వరి క్రేయంబూనితి వవశ్యంబును వారిని వధియింపక మాన దని యా నతిచ్చినవాఁ డేను నిమ్మహాయుధంబు కలభాషిణి కంఠంబు వ్రేయు నట్లు పూన్చి తిం గావున నప్పటికిఁ దప్పిచని యు మీఁదట నవశ్యం బగు నని పలుకుచు నంతం గలభాషిణిం జూచి కడనుపలుకక తక్కుట యు నాకలభాషిణి యతని నీక్షించి సంకోచం బేల భవితవ్యతావశంబునఁ గానున్న యర్థంబు కాక మాన దనుట యు నమ్మాటకు మెచ్చుచు నతండు. 271

క. నీవు వివేకధురీణవు, గావున నిమ్మాట యంటి గాక యవశ్యం
భావి యగుదుఃఖము ను జను, నే వ్రాయువ్వంగ నిజము నిష్ఠుర మెందుఁన్. 272

గీ. ఇంక నీవృత్త మెఱిఁగింపు మేను బలిమిఁ, బట్ట మొఱవెట్టు నిను డించిపాఱిపోయి క్రమ్మఱఁగ వచ్చిమఱినిన్నుఁ గాననెచట, నుండితది మొదలొక్కని చెప్పుమావిదయనిన.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. మేఘాంభోనిధికామధేనుసురభూమీజాతచింతామణి
శ్లాఘాలంఘనజాంఘికత్వసముదంచద్దానలీలా సఘం
టాఘోషానిశఘోష్యమాణపరిపూర్ణశ్రీకటాక్షోదయ
ద్రాఘీయోధనసంపదూర్జితయనంతప్రాభవస్ఫూర్జితా. 274

క. కంజముఖీలోచనజీ, వంజీవాజీవ మృదునవస్మితశోభా
మంజులముఖచంద్ర సదా, రంజితవిద్వత్కవీంద్ర ప్రణుతోపేంద్రా. 275

స్వాగతము. నిర్విరామధరణీభరణాంకా, గర్వితారిజయకర్మవిశంకా
సర్వదిక్చరవిశంకటకీర్తీ, శర్వరీరమణసన్నిభమూర్తీ. 276

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్య
తనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతంబైన కళాపూర్ణోద
యంబను మహాకావ్యంబునం దృతీయాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమాకమఠాయనమః.

# కళాపూర్ణోదయము.

---

## చతుర్థాశ్వాసము.

శ్రీసౌభాగ్యవిభూతివి, లాసాలంకార నిత్యలలితాకారా
భాసురయశఃప్రసూనసు, వాసితసకలాశ కృష్ణవసుధాధీశా. 1

సీ. ఆవధూమణి నవ్వి నావర్తనము నీవ చెప్పితి వింక నేఁ జెప్పవలెనె
గురుసత్త్వుఁ డగు నలకూబరుచేఁ బట్టువడి నీవు ననుఁ జూపఁ గడఁగి యట్లు
వచ్చుచో నెదురుగా వచ్చినరంభ నేఁ జిమ్ము నిన్విడిపించి యిమ్మెయిఁ జని
యభిమతం బైనయ ట్లంగజలీలావిహారంబు సలిపితి నంతలోన
నరుగుదెంచిన యదియ సుమ్మావ్యరంభ, యారమణిఁ బ్రాణవిభుఁడుఁ జేరనీక
యవ్విధంబునఁ బోరాడి యంతమున ను, దగ్గతిని శాప మొందినదాన నేను. 2

చ. అనవిని వారలందఱు ను నత్యధికం బగువిస్మయంబున
న్మనుఁగుచు నెట్టిటూ చెపుమ ముద్దియ యేగతి నట్లు రంభరూ
పు ను ధరియింప నేర్చితివి పొందుగ నెమ్మెయి సంముకొంటి వా
యనఘుని నట్లు గూడఁగఁ జిరాభిమతం బెది నీకు నావుడున్. 3

సీ. ఆకాంత సిద్ధు నాలోకించి నిన్ను నవ్విధమునఁ దఱిమెడు వేళఁ జనదు
ప్రాణేశువెంటన యారంభ గదలి తా నేతెంచనంతట నిట్టి యొకటి
యెదురుగా వచ్చుట కంత యు శంకించి యటముందు పోవక నచట నిల్చె
నప్పు డేనీక్షించి యదియ వచ్చిన యట్లుగాఁ దదాకృతి గట్టిగాఁగఁ దాల్చి
వచ్చితి నతండు నినుఁ బట్టితెచ్చుచోటి, కాచెలువ రాక మసలుట యతని కెఱుక
పడకయునికి నాకృతిభేదభావము నాదు, లాగతిన యున్కి నాచేఁత లమరె నట్లు.

గీ. ఆచెలువరూప మె ట్లెట్ల యగుచునుండఁ, దాల్చనేరుపు ము న్నొకతఁడని నాకు
నారదుం డిచ్చె నది యు విపులగఁబడియెఁ, గద యతఁడ చెప్ప నీకుమాకలహవేళ.

క. ఆమ్మెయిఁ జెప్పియు నతఁ డపు, డమ్మాయారంభ యిది యటంచు ననుఁ బ్రకా
శమ్ముగఁ జేయక కాచు, న్యమ్మున మన్నించె మన్మథాకృతిఁ గనుదున్.

వ. అది యెల్లఁ జెప్పనేమి కడపట నిట్టిశాపంబునకుఁ గారణం బైనయారూపు రోసి
యది యంత యు నుజ్జగించి యవశ్యభోగ్యం బైన తచ్ఛాపఫలం బిద్దేవిసన్నిధి నను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భవించినఁ బరోపకారం బగు నని వచ్చితి నని చెప్పి కలభాషిణి యమ్మణిస్తంభున
కి ట్లనియె. 7

తే. నీదుగుఱుఁ డన్నయట్లు నీనిశితఖడ్గ, మవితథోద్యమ మగుట సువ్యక్త మయ్యెఁ
దిరుగ నిన్ను ను నన్ను ను దెచ్చె దైవ, మిచ్చటికి ధన్య నైతి నీయిష్ట మెందు.

చ. అది యటు లుండె నాపదు ప్రయాసము లూరక పోకయుండ న
ట్లొదవెఁ బ్రియు న్భజింప నని యుండఁగఁ జెప్పితి వీవు దానికిం
గొద గలుగంగ నత్యనలకూబరుఁ డొక్కఁడు వేఱ వచ్చి యా
తుద నతని న్నపించె నని తొల్తటియాకపటాత్ముఁ డెవ్వఁడో. 9

క. అన విని యేమి యు మిక్కిలి, యనఁబోయెదు సుమ్ము తరుణి యట్లవురూపం
బున నున్నవాఁడ నేఁ జు, మ్మని మణికంధరుఁడు పల్కె నల్లన నగుచున్. 10

వ. ఇట్లు పలికినం గలభాషిణి యాశ్చర్యంబు నొందుచు. 11

క. విని నీ వపు డె ట్లారూ, పు ను దాల్చితి చెప్పు మనఁ దపోవాతి గావిం
చిన నేర్పునంద రంభ యు, ధనదసుతుఁడు గూడె ననిరి తత్సఖు లెదు రై. 12

సీ. అని రంభ నట్లు గూడిన వాఁడ నేనె యేర్పడ విను మట్లు తపంబు చెఱచి
ముసు నన్ను నది గూడి తనరెడు తనమానసము నలకూబరాసక్త మగుట
ప్రకటంబు గాఁగ గోత్రస్థలితత్వంబుచే నెఱింగించిన నేను రోసి
దాని వీక్షించి యెందేనిఁ బోయెద నని వీడ్కొని చనుచు నవ్వేలఁది రతులఁ
దనియమిఁ దచాత్మరంజన దనరఁ గలయు, వలయు నని యంతమ త్తపోవ్యయము చేఁద
దీఱువిభురూపుఁ దాల్చి వే తిరిగివచ్చి, పొసఁగఁ బల్కి రమించితిఁ బూర్ణ రతుల.

వ. అత్తెఱంగున నద్దివ్యాంగనతో రమించుచునికిం జేసి తత్ప్రకారంబున నొదవిన నీతో
డిక్రీడ లనుభవించి యమ్మాయారూపంబునకు సస్యఃఫలంబుగా నట్టిశాపంబుఁ దె
చ్చుకొని యంతట బుద్ధిమంతుడ నై యెప్పటిపర్ణశాలకుఁ జని యెల్లమాయలం జాలిం
చి నావీణె యు రత్నమాలిక యుఁ బుచ్చుకొని యచ్చటిమహిమలు తొల్లి యెఱిం
గినవాఁడ నై యిం దేమివిశేషంబులు దొరకునో యని వచ్చితి నని చెప్పి నగుచు ని
ట్లనియె. 14

చ. నెలఁతుక రం భపొందు విడనేరక యెంతఘనప్రయత్నత
న్నెలకొని యే రమింప నది నీవయితేమని చెప్ప నీవు న
త్యలఘుతరప్రయత్నపరత న్నలకూబరుఁ గోరి కూడి రం
జిలఁగ నతండ యేనయితిఁ జిక్కితి వెట్లు ను నాదుకోర్కికిన్. 15

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. జలజదళాక్షి యేను మునిశాపభయంబున నెందు నేరికిం
దెలివిపడంగనీక మది ధీరతఁ ద్రిప్పెదుఁ గాని నీపయిం
గలదుసుమీ తలంపు మన గానకళాభ్యసనంబువేళల
న్ఫల మిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునం దుదన్. 16

చ. అనుడుఁ గృతార్థ నైతిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లువం
చనమునఁ గూడునో యనువిచారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె నీకుఁ దగ నన్నతలంపున నీతలంపు నేఁ
గనమిని ద్రిప్పెదున్ హృదయకాంక్ష నినుం గనుఁగొన్న వేళలన్. 17

శా. నీసౌందర్యవిలాసభాసురతనూనిర్నిద్రసౌభాగ్యము
న్నీసంగీతవిశేషకౌశలము నీనిర్దోషనానాగుణో
ల్లాసంబు న్నను నప్పు డెంతపరమాహ్లాదంబు నొందించునో
యాసుద్దుల్ హృదయైకసాక్షికము లేమన్నన్ వృథా యిత్తఱిన్. 18

ఉ. ఆవిధి నుండునంతట నొకప్పుడు నిన్ను ను జూచుచో మణి
గ్రీవుని పేరు దోఁచె మదికి న్మణికంధర యేకదేశసా
మ్యావగుణంబుచే నతని నాతనియన్న ను మద్దిచెట్లుగా
దైవతమౌని తిట్టినవిధంబు మనంబునఁ బాఱె నంతటన్. 19

ఉ. దానన గుండె గుబ్బుమన దానెరియ న్విడిచెం ద్వదంగసం
గానుభవేచ్ఛ యి ట్లిడినయట్టిది యాదిగ నాదుచిత్త మో
మానినిశీల యంతట సమంచితతావకరూపరేఖచా
ప్పేనొకకొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్. 20

క. శాపభయంబున నెఱయఁగ, నీపైకోరిక మరల్చి నిధిపతిసుతు నే
పాపపువేళ ను జూచితి, నో పయిసాబ గేను మఱికనుఁగొన గుఱిగాన్. 21

క. ఆయక్షతనయుఁ డని ని, న్నే యేఁ బొందితిఁ దుద న్వినిర్మలభాగ్య
శ్రీ యే మని చెప్పెదుఁ బడఁ, బోయినఁ బూపాన్పునఁ బడుపోలిక యయ్యెన్. 22

ఉ. శ్రీయుత మైనదివ్యమణి చేతికి నబ్బఁగఁ బాఱవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గృశించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొనం దుదఁ దన్మణి యబ్బె నన్న న
న్యాయితతత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్. 23

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఇట్టి మాట లిప్పు డేనాడుకొనుట యు, ననుచితంబు వారవనితపలుకు
లిచ్ఛకంబు లనక యెవ్వరు నమ్మెన, రది యుఁ గాక దృష్ట మన్యవాంఛ. 24

వ. అని లజ్జాశోకంబులడర నతాననిముఖి యైన కలభాషిణిం జూచి మణికంధరుం డిట్లని యో యో యుత్తమవిలాసిని నిన్ను నితరవారవనితలయ ట్లసత్యవాదినిగాఁ దలంప నంతవింతవాఁడ నే నీపలికినట్లు నీకు మున్ను నాయందుఁ గోరిక గలుగుటకు గుఱు తొకటి యున్నది యది యెద్దియుం లేని వారదుండు కడపట నిన్ను నింటికి నను పుచు నేను విన నీతోడ. 25

గీ. కొమ్మ నీవాత్మలో మును గోరినట్లు, కాంతు రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయువానిని గూడి రమింపఁగలవు, నమ్ము పొమ్మిఁక నీభవనమున కనియె. 26

క. నలకూబరుఁ గూడెద వని, పలుకక యి ట్లనిన సత్యభావణుపలుకు
ల్ఫలసిద్ధిని నరయఁగఁ దొ, య్యాలి నను మును నీవు గోరు టనృతం బగు నే. 27

క. ఆకోరిక శాపభయో, ద్రేకవిశేషమున నెఱయఁ జెగు టకుదు ను గా
వో కామిని లోకమున వి, వేకింపఁగఁ గలవ యిట్టివి యు నొక్కొకచోఁ. 28

వ. రంభాసాన్నిధ్యశోభితాభినవవిలాసభాసురుం డైననలకూబరుని రూపున వత్తునట్టిచి త్తంబునకుఁ దదన్యం బెట్టిది యైన ను మఱి యింపు గామియుఁ జిత్రంబు గాదు పురుషులందు నొక్కొకవేళగుణంబున నిట్టివి గలవు తత్ప్రకాశకం బైనది యొక్కక థ గల దది పాపనాశం బై యొప్పుచుండుఁ గావునఁ దాత్పర్యంబున నాకర్ణింపుము తన్మూలంబు మొదలుకొని చెప్పెద నని యి ట్లనియె. 29

సీ. కాంత యేఁ దొల్లి యనంతదేవవ్రతోద్యాపనకొఱకు ననంతపద్మ
నాభునిసన్నిధానమునకు వచ్చితి వచ్చి యచ్చటఁ గరం బచ్చపడఁగఁ
గవితచే నద్దేవు వివిధభంగుల నుతిసేయునత్కవుల నీక్షించి యిట్టి
సౌభాగ్య మేగతి సంభవించునొ యనువాంఛతో నచ్చటివారివలన
నీమ్మగేంద్రవాహనసుద్దు లెల్ల వినుచు, నచటి కిద్దేవి యనతిదూరాంతరస్థ
యగుట యు నెఱింగి యేతెంచి తగ శిలాతు, రోక్తసాహసవిధి నిష్ట మొంది తిరిగి. 31

వ. అరిగి యద్దేవుని యగ్రమండపమున.

ఉ. అంతము గాఁగ గౌతమకణాదమతంబులు భేదవాదిసి
ద్ధాంతము జైమినీయ మురగాధిపశాస్త్రముఁ గాపిలంబు న
త్యంతము నాకళించి యవి యాత్మల మెచ్చనిపాంచరాత్రరా
ద్ధాంతవిధానవర్ధనసమర్థకృతార్థమతిప్రదీప్తులన్. 32

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. శ్రీమహితాష్టాక్షరీమంత్రజపపరాయణుల నారాయణధ్యానపరుల
దేవతాంతరచింతనావిముఖులఁ గామరోషాదిరహితుల రూఢమతులఁ
జీవచిదీశ్వరతత్త్వవిదులఁ ద్రైలోక్యపావనచరిత్రుల బుధవంద్యపదుల
నకళంకశీలుర నఖిలశ్రుతిస్మృతిశాస్త్రపురాణవిజ్ఞానఘనులఁ
దమకుఁ జక్రికి నిత్యసిద్ధంబు లైన, శేషశేషిత్వములు చింత చేసికొనుచు
నతనిదాస్యంబు గతి గాఁగ నరయు పరమ, వైష్ణవులఁ గంటి సభరియై ప్రవర్తిలంగ.

క. కని యే దండనమస్కృతు, లనేకము లొనర్చి వార లడుగఁగ నాపే
రు ను గంధర్వత్వంబు ను, వినిపించి హరిస్తవేచ్ఛవిధముఁ దెలిపితిన్. 34

గీ. తెలిపి యోసుబోధవిలసితులార మీ, రాయనంతశయనునట్లు నాకు
నాకవిత్వసేవఁ గైకొనుఁ డని తగు, వర్ణనకుఁ గడంగ వారు చూచి. 35

సీ. ప్రకృతిపూరుషులందు బహిరంతరముల ను నెప్పుడుఁ జలింపక పరిపూర్ణుఁ డగుచుఁ
దనకు నాది యు ను మధ్యంబు నంతము సమానుఁడు నధికుండు నెందు ను గలుగక
సర్వజ్ఞుఁ డై సర్వశక్తి యై సర్వనియంత యై సర్వాత్ముఁ డై వెలయుచు
సర్వంబుఁ దనకు శేషముగ సర్వమునకు శేషి దా నగుచు లక్ష్మి యు ను దాను
రుచి యు రవి యుఁ జంద్రిక యుఁ జంద్రుండు వోలె
నయుతసిద్ధత్వ మొప్పంగ నాదిమిథున
మనఁగ సకలవేదాంతవేద్యతఁ దనర్చు
పరమపదనాథుఁ బొగడు నీప్రౌఢికొలఁది. 36

క. అని యట్టిటు నాచేఁ ద, ద్వినుతులు సేయించి మెచ్చి విశ్వహితార్థం
బు ను జెప్పించిరి త్రిజగ, జ్జననీపరమపదనాథసంవాదకథల్. 37

క. చెప్పించి యాకవిత చేఁ, నిప్పుడు గాకున్న నీకు నీకనొకమేనం,
దప్పక యొదవుఁ దిరంబుగ, నప్పరముని పరమభక్తి యని రథికదయన్. 38

వ. ఏను ను దాసుశం బైన మదీయకవిత్వధార శారదాపీఠంబునందలి యందఱివినుతి
కెక్కునందాఁక మిక్కిలి మెచ్చుకొనరా దని యచ్చోటికి నంత నరిగితి నని పలికి
యింకఁ బ్రకృతకథ వచ్చుచున్నది యాకర్ణింపు మట్లుశారదాపీఠంబునకు నేఁ జను
నప్పుడు తత్సన్నిధియందు. 39

సీ. ఋగ్వేదఘోషసమృద్ధి పెం పొకచోట నొకచోట యాజుషాభ్యుదయమహిమ
సామగానధ్వానచాతుర్య మొకచోట నొకచోట నాధర్వణోక్తిగరిమ
గృహ్యసూత్రనిపాతఖేలనం బొకచోట నొకచోట శబ్దతంత్రోపచయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్యౌతిషసిద్ధాంతసంఘర్ష మొకచోట నొకచోట ధర్మశాస్త్రకలనంబు
లుభయమీమాంసలప్రసంగ మొక్కచోట, నొక్కచోటను బటుతర్కయుక్తికథలు
యోగసద్గోష్ఠి యొకచోట నొక్కచోటఁ, గావ్యకలకల మొప్పారఁ గనుచు నంత.

సీ. పదవర్ణసౌష్ఠవప్రకటనం బెంత యు నింపుమీఱంగ రు వ్విచ్చి యిచ్చి
తగనుదాత్తాదిభేదములు గొంటకపర్వఁ గనుబొమ్మచేష్టలఁ గలిపి కలిపి
యెడనెడలఁ గవల్లిఁ దడబడకుండంగ గుఱుతులు మాటిఁ బాదుకొలిపి కొలిపి
నిజశిష్యులో బుద్ధి నిలక విస్వరములు పలికిన బుగ్గలు నులిమి నులిమి
యొక్క మండపమున నుజ్జ్వలబ్రహ్మవ, ర్చసముతోడ బ్రహ్మచారులకును
బరమనిష్ఠనువృత్తిపరత వేదముఁ జెప్పు, చున్నయట్టి యొక్కయొజ్జఁ గంటి. 41

క. కని డగ్గఱఁ బోయిన నా, యన రా ర మ్మనుచు నెవ్వ రయ్యా మీరల్
ఘనతేజంబున నొప్పెద, రనుచుం జోటిచ్చి మత్కులాఖ్యలు వినియెన్. 42

క. విని పూజ్యులు వచ్చినయపు, డనధ్యాయ మని యప్పుడు వటుప్రకరం
బును జనుపుమన్చి నాతో, ననుగుణవిహితోపచారుఁ డై వర్తిలెఁగన్. 43

సీ. మెఱుఁగారుచుంజియు మేని కోమలికంబుఁ గడుఁ దిట్టగుణముగు లెక్కడు మొగంబుఁ
బసపుగోచుల యొప్పు బ్రహ్మతేజంబు ను జాఱుకృష్ణాజినధారణంబుఁ
దళుకు జన్నిదము మేధావిబొట్టు ను జిన్నిపట్టెవర్ధనము ను జిట్టితడుపు
మొలవంకయుంగరంబుల సొంపు దండపుఁగోల యు సన్నపు వ్రేలసిగ యు
నొప్పు బ్రహ్మచారి యొకఁ డేఁగుదెంచెఁ బు, స్తకముఁగొంచుఁ మిగుల సంభ్రమమున
నొజ్జ యతనిఁ జూచి యోరి యేమిర కడు, నాలసించి తనియె నిన నతఁడు. 44

వ. ఏ నాలసించుటకు నిమిత్తంబు చాలఁ గలదు మీ కేమి యు వినఁబడదు గావల
యు వినిపించెద వినుం డని పలికి యి ట్లనియె నట్లు మీరు నన్నిచ్చిన నేఁ జనునప్పు
డుశాలీనుండు తమ పువ్వుఁదోఁటలోన నొక్కలతాగృహంబునందుఁ దనపాదఁబు
లు సుగాత్రి పిసుకఁ దోడఁ దొడలమీఁద నిడుకొని యొత్తుచుండ నిష్టసల్లాపంబుల
నలరుచుండి నన్నుం జూచి నగుచు నుపాధ్యాయులు పుస్తకంబునకుఁ బంచిరే య
ది యిక్కడను యిదే డాఁచినాఁడ నని తనయుపరిభాగశాఖఁ జూపి కొంచుఁ బో
దువు గాని యటఁ గూర్చుండు మని యెదుట నున్న యొక్క విహారవేదికతోడి లే
మావినీడఁ జూపినఁ గూర్చుంటి నంతఁ దనయింతిమూఁపునఁ జే యిడి యాయ
మ కిట్లనియె. 45

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అమృతము సేవించితివో, రమణీ యేమైన సిద్ధరసముఁ బ్రాఁగితివో
కొమరుం బ్రాయము మిక్కిలి, గొమరొందెడు దినముఁ గ్రొత్తక్రొత్తగ నెలమిన్.

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మంద్రు మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగ బొలుపొందుటకు నిమిత్తముఁ జెప్పుమా. 47

వ. అనుట యు నవ్వనిత చిఱునవ్వుతోడ నాయనఁ జూచి. 48

లయగ్రాహి. ఏ నెఱుఁగ నేమియును దీనికి నిమిత్తము ననూనమమతామహిఁ జేసైనఁ దోఁచు
న్లేని కొమరుందనము లేని చెలువంబునను నో నెలఁత యీగతిని లేనియవి గావి
మ్మేనిపస లీవెఱుఁగ వేని వినిపింతు విను దీనికి నిమిత్త మది యేనయనుచున్నా
ళీశుఁడు సుగాత్రిఁ దనపైనొరగ వంచి చెవిలో నొకటి యేమనుచు నొసగుచుఁ జెప్పెన్.

ఉ. చెప్పిన మోముఁ ద్రిప్పి కడుచిత్రము నొందుచు నాథుఁ డక్క్రియం
దప్పక చూచి యేనొకటి తన్మను వేఁడిన సమ్మతించెఁ దా
నప్పలు కేమి సేయునొకొ యాజగదంబ యిఁక న్నినుం డడిం
జెప్పెదనంచు మోము చెవిఁ జేరిచి యేమియొ చెప్పెఁ జెప్పినన్. 50

క. ఘనరోషుఁ డగుచు నతఁ డా, వనితయుఁ దో నడుగ దేర వడిఁ జని యాచే
ర్పున ను శతతాళదఘ్నం, బను పేర న్వెలసియున్న హ్రదమున నాతికన్. 51

క. పడఁతి యు నాపుంగతి తన, యడుగుందామరల కాక యన్యము గలదే
విడిచెద నే తను ననుఁ దా, విడిచిన నని పాతి యుఱికె విభుఁ డుఱికినచోన్. 52

క. కడు నెడ గావున నది యి, క్కడ వినఁబడదేమొ పీటఁ గలవారెల్ల
న్వడి నేఁగి వలలఁ జేస, మ్మడు గిటు నటు వరసి యిపుడు మగిడిరి వగతోన్. 53

వ. ఏనునుం దిరిగి శాలీనుండు మున్ను చూచినచోటి పుస్తకంబుఁ బుచ్చుకొని వచ్చితి
నని చెప్పిన. 54

క. విని యావిప్రవరేణ్యుం, డనయంబు ను శోకవిస్మయవిషాదముల
న్మునుఁగుచు నాశుభదంపతు, లను జెందెనె యకట యితరుల తెఱంగనుచున్. 55

చ. అదె శతతాళదఘ్న మనుసార్థపు-నామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందు ను బడ్డవారికిం
బ్రదుకులె యంచుఁ దప్పదు పురాకృత మెవ్వరికైన నంచుఁ గొం
త దడవుగుండె నే నపుడు తద్ద్విజముఖ్యునిఁ జూచి యొయ్యనన్. 56

క. అనఘా యాశాలీనుం, డనఁగ సుగాత్రియన నెవ్వ రాదంపతుల
న్వినుతించెదు కడు నుత్తము, లని తత్కథఁ జెప్పవలయు నంటి ననుటయున్ 57

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అమనస్కులచరితము గా, దే యీపుస్తకములోనిది యు మాకు నీకున్
శ్రేయస్కర మది వినుటయుఁ, బోయెం దద్దర్శనంబుఁ బుణ్యోత్సవముల్. 58

వ. అని యాబ్రహ్మచారి తెచ్చినపుస్తకంబుఁ బుచ్చుకొని శిరంబున మోపుకొని కన్నుల నద్దుకొని తిరుగ నతనిచేతికి యిచ్చి చదువు మనుట యు నతం డి ట్లనుచుం జదివె.

సీ. కాశ్మీరభూమికిఁ గర్ణికయగుశారదాపీఠమున శారదను భజించు
పూజరిబ్రాహ్మణపుత్త్రి యొకర్తు సుగాత్రి నాఁ బరఁగెడుకాంత గలదు
దానివరుండు శాలీనాహ్వయుం డిల్లటపుటల్లుఁ డత్తయింట ను వసించు
నాతండు నెనకడ కాకన్యప్రథమసంగమవేళఁ గడు నలంకారకలితఁ
జేసి యనిపి దానిచెలు లింతటంతటఁ, బొంచి యుండఁ దద్విభ్రూమణాది
మహిమఁ దలఁకి పట్టి మదిని సంకోచించె, దరుణి యుండి యుండి తిరిగిపోయె.

ఉ. పోయినఁ దద్విధం బపుడు బోంట్లు తదంబకుఁ జెప్ప భూమిలో
నేయెడ లేనిచంద మిది యేమినిమిత్తమొ యంచు మంచిలేఁ
బ్రాయపువాఁడు గర్లె బళిరా యితఁ డంచు నెపైన నేఁటికిం
బోయెనొ కాక యెల్లి తమపోకలు చూడమ యంచు నవ్వఁగన్. 61

క. ఆమన వినఁ బ్రేలెడరుసుఁ, డీ యిట్లు గయాళులార డిగఁబడుతురు ల
జ్జాయుతులు సర్వము ను దము, నేయెడ హాస్యాస్పదం బొకింత వారసిరన్. 62

గీ. అని పలికి రెండుమూఁడునా ళ్ళట్ల యనిపె, నల్లునొద్దకుఁ బుత్రిక నపు డతండు
నాది నేభావమునఁ జూచె నట్ల చూచె, వట్టి రాకపోక లొనర్చె వానినతి యు.

వ. ఆంత లజ్జావతికిఁ దజ్జననియనుమతిఁ బ్రియవయస్య లేకాంతంబున ని ట్లనిరి. 64

గీ. పొలఁతి యాలిమగనిపోఁడుము లేమి యుఁ, గలిగినట్టిచొప్పు గానరాదు
మీతెలంగు చూడ మే ల్మేలు దంపతు, లిరువురు ను వివేకు లేమిచెప్ప. 65

క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైన ను, గాంతకు సిగ్గుపడఁ జెల్లుఁగా కకటకటా
కాంతుఁడు సిబ్బిలికాఁడై, కాంత యు న ల్లైన నెట్లు కాఁపుర మింకన్. 66

గీ. నలినవదన యెన్ని నా ళ్లైనఁ జిన్నకూఁ, తురవు గావు నీవె తొడఁగి పలికిఁ
దగినసేవ సేయ కగునె యూరక యుండ, నాతఁ డేమి యు ననఁ డనుచు నిట్లు.

క. మగవాఁడు భాగ్యవంతుఁడు, మగువకు నొప్పగునె యిట్లు మానపు బిగి గ
ట్టిగఁ దాల్పఁ దనంతన యూ, డిగ మిటు నటునేయ నతని డెందము గరఁగున్. 68

క. గారామునఁ దోడ్తోడన, రా ర మ్మనఁ డనుచు మగిడి రా నేటికిఁ గ
ర్పూరంబులోడిబాగా, లీరాదో యాకు మడిచి యీరాదొ చెలీ. 69

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. వెంగలివి గాక నీ వో, యంగన భోగములపంటయామని యగునీ
బంగారువంటిప్రాయము, సంగతిసేయక యట రిత్తశయ్యకు నొసఁగన్. 70

క. యౌవనము గలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁ బతులభోగంబులు గా
కావిభవములకుఁ గోఱరే, యౌవనజాతాక్షి ప్రాయ ముడిగినవెనుకన్. 71

క. అన విని యా పెడమాటల, నను నేటికిఁ జంపెదరు విన నైఁపవు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ, డొసఁటిచి చూచెను దదీయయుక్తులతెఱఁగున్. 72

వ. చూచి యెందును ఫలంబు గానక యాసుగాత్రి యాయన నింకేమిప్రపంచంబుఁ జే
సిన నెఱయ నెడసిపోవుట తక్కఁ బ్రయోజనం బేమి యు లేదు నాకు ను మంగ
ళసూత్రం బీపాటిసుస్థితి నుండుటయు పదివే లనుచు నెంచుకొని యు వే ఱొక్క
లాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబు లని వివిధాలంకారంబు లెప్పుడు
నేమఱక తాల్చుచుఁ దనతల్లి యతని నేమి యు నిట్ట ట్టాడకుండం బ్రార్థించుచుం
డె నది యు ను దత్ప్రార్థనావశంబునఁ బెక్కుదివసంబు లెడనెడఁ గూఁతుచేత
నివారితదురాలాప యగుచు నోర్చి యంత నొక్క నాఁ డమ్మైలుంగుఁబోఁడితోడ.

ఉ. ఇట్టి నిరర్థ మెందుఁ గన మేమనఁబోయిన నీవు మిక్కిలిం
దిట్టెవు వాదుసూపదకు దిక్కగుచు న్మగమొల్క నీ కిఁకం
బుట్టునొ యంటిమే నితనిపోఁడిమిఁ గంటిమ పట్టిగొడ్డుతా
క ట్టితఁ డెంత యున్న నినుఁ గాటియ పెట్టుట వెళ్ళఁగొట్టినన్. 74

ఉ. పూవులతోఁట కైన నటు వోయి విచారముచేసి ర మ్మనం
గా వలయుం గదా యనుచు గారవ మొప్పఁగ నట్లు పిల్చి ము
న్నావిధి కంపి యంతఁ గలయట్టిపనుల్సకలంబుఁ జేయ నే
ర్పావహిలంగఁ దా నతని నంతటఁ గట్టడసేసెఁ జేసినన్. 75

గీ. దివిజనుత యైనశారదాదేవిపూజ, కుపకరించుకార్యం బిది యొప్పు ననుచు
నధికమోహంబుతో నతఁ డాదరించి, నంతతంబు తదేకనిష్ఠతఁ దలిర్ప. 76

క. సమధికమధుమదగరిమా, సముచంచలచంచరీకసంచయసంచా
రమనోరమసుమనోరమ, నమరఁగ నాపూవుఁదోఁట ననిశముఁ బెంచెన్. 77

సీ. నీ రెత్తువేళల నీ రెత్తుఁ బాదుపాదునకుఁ గాలువలు పొందుగ నమర్చి
త్రవ్వటంబులతటిఁ ద్రవ్వటంబులు పెట్టుఁ దగినట్టికట్టు గుద్దలి గడించి
యెరువుఁ జల్లెడువేళ నెరువుఁజల్లు గతాభిమానుఁ డై గంపలఁ దాన తెచ్చి
యంట్లొత్తుపనను నంట్లొత్తు నెలమిఁ గాన్పించు లేఁగొమ్మలు వంచివంచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయనోయంగవలయుచో నాయనోయుఁ, గ్రొమ్మినాఁటంగ దగునెడఁ గ్రొమ్మినాఁటు
నొకటి విసువక యంతకంతకు నుహెచ్చు, వాళితోడ ను శాలీనుఁ డవిరతంబు. 78

లయగ్రాహి. అంగపరిభేవము నెఱుంగ కతఁడీగతిఁ గడంగి తులసీవనముఁ జెంగలునలుంగె
దంగులును జంపకములుం గురవకంబులు లవంగములు జాదులు ను లుంగతతులుం గొ
జ్జంగులు ను మల్లెలునురంగములుఁ బాటలములుంగదలికాచయముఁ దుంగతతులు న్నా
రంగములు నాడిగ ధరం గలుగునట్టి హృదయంగమబహుద్రుమకుసుంగములు పెంచెన్.

చ. రవికిరణాళి కెందు ను జొరంగ నగోచరమైన నీడచే
నవిరళపుష్పరేణుయుత మైపొలుపొందు మరందవృష్టిచే
నివముగానంగఁ దద్వనసమృద్ధిఁ గనుంగొని యవ్వసుంధరా
దివిజకులప్రసూతుఁడు మదిం బరితోషము నొంది యత్తఱిన్. 80

క. ఎంత యుఁ బ్రొద్దున లేచిని, తాంతాచరితస్వజాతి ధర్మఁ డగుచు ని
శ్చింతుఁ డయి గురుపరంపర, చింతించి తదుక్తజపము చేసి ముదముతోన్. 81

గీ. నియమమునఁ బుష్పములు గోసి నేర్పుమీఱఁ, బలు దెఱంగుల వింతవింతలుగ మాలి
కలను బొందులు గందుకంబులు రచించి, బ్రహ్మయిల్లాలికిని సమర్పణము సేయు. 82

వ. అప్పుడు సుగాత్రి పాతివ్రత్యధర్మనిష్ఠకతంబున. 83

గీ. తల్లి మాటలచే నిట్లు తనవిభుండు, తనువు బడలంగఁ బూఁదోఁట పనులు సేయఁ
జూడ నోర్వక తాను నచ్చోటి కరిగి, తోడుపడియెద నని చూచు వ్రీడ నుడుగు.

వ. అప్పు డొకనాఁడు శాలీనుండు తోఁటకుం జని యుండ నాసమయంబున. 85

క. దళదళ మెఱుపులు మెఱయఁగఁ, బెళపెళ నుఱుముచుఁ బెళిల్లు పెళిలునఁ బిడుగు
ల్నలుఁగడఁ బడ బెడిదపుధా, రలు గలబలువాన జలధరంబులు గురిసెన్. 86

చ. మిగుల జగంబు బెగ్గడిల మించెఁ దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనాఘసముదగ్రనిరర్గళఘర్ఘరార్భటీ
లగనఘనోచ్చలజ్జలఝళంఝళనిర్ఝరఝర్ఝరీభవ
న్నగవిగళచ్ఛిలాగణఘణంఘణఘోషణభీషణంబుగన్. 87

సీ. ఉదధిసమేతపీఠోద్వాంతబాడబజ్వాలాయితోగ్రళంపాలతంబు
నిర్ఘాతరవసకంద్రీకృతాజాండబహిర్జలభ్రమదధారోర్జితంబు
నిర్జాడ్యగర్జితస్ఫూర్జథూర్జస్థితప్రళయభైరవరటత్పటహరవము
జంఘాప్రభంజనజాతసంఘట్టన పరిగళత్తారకత్కారకగణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగుచు ఘనఘనాఘనసంఘ మవ్విధమునఁ, బూని హోరున జెడిదంపువాన గురియఁ
గరము భూనభోంతరము చీఁకట్లుగొనియె, నఖిలలోకంబు నుదకమయత్వ మొందె.

క. అటమున్న మొగులు బలియుచుఁ, జిటపొటమని పొటపొట చినుకులు పడఁజొఁ
చ్చుటయాదిగాఁగఁ దనపెని, మిటి దడియునొ యని సుగాత్రి మిగులవగప్రలోఁగెన్.

చ. అపుడు మనంబులోన ననయంబుఁ బతిం దలపోసి యిట్టి ఘో
రపుఁ బెనువాన నెట్లయితొ ప్రాణవిభుండ యటంచు నీకుఁ బా
పపుఁబువుఁదోఁటపా ల్పెచటఁ బ్రాప్తము లయ్యె నటంచు నెంతయు
న్విపులతరార్తిఁ జేడ్పడుచు నింగిఁ బొరింబొరిఁ దొంగిచూచుచున్. 90

క. ఓశారద యోపరమద, యాశాలిని యోమదంబ యారసి మత్ప్రా
ణేశు నటు చూడుమా నీ, వే శరణము గాని యేను వేఱొం డెఱుఁగన్. 91

శా. ఈదేహంబునఁ బూర్వదేహములయం దేనిన్ వ్రతధ్యానదా
నాదిప్రోద్భవ మేమియేమి గల దాయాపుణ్య మీవర్ష పీ
డాదోషంబు ను మత్పతిం బొరయకుండ న్మానుపుం గాత నే
నాదుం గావుతఁ దన్నిమిత్త పతిపాపాక్రాంతికిం బాత్రమున్. 92

వ. అని హృదయంబునఁ దమ కులదైవతంబైన సరస్వతిం బ్రార్థించుచు నంతట నిలు
వంజాలక తద్వర్షఘోరతయుఁ గైకొనక యత్యంతసాహసంబునఁ దల్లియు నె
ఱుంగకుండ నిల్లు వెడలి తనదు పాతివ్రత్యధర్మంబుచేత వృష్టిబాధఁ బొరయక తొ
లంగుచుండం బొలువ వెల్లియైన జలపూరంబు పాయయిచ్చుచుఁ దెరువు విడువఁ
బ్రాణవల్లభుం డున్నవనంబున కరిగి కడనయుండి పరికించి యప్పటి యవ్వాతవర్షో
పద్రవం బొక్కించుకయు లేక యాత్మసంప్రార్థితబ్రాహ్మీప్రసాదవిశేషంబున నెప్ప
టియట్ల శుభవర్తనంబున నున్న తనభర్తను దదాశ్రమంబును జూచి నాతల్లి
యోసరస్వతి నీభక్తవాత్సల్యచింత ప్రకటించితే యని తత్కారుణ్యంబునకు నుబ్బ
చుఁ గ్రమ్మఱి గృహంబునకు వచ్చి తనవచ్చుటయుం బోవుటయు నెవ్వరికి నెఱు
కపడనీక క్రీడావశంబున నడఁగి మడఁగి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లుచుండె నప్పు
డప్పువ్వుఁదోఁట గాటంపు గాలివానచేత నేకీడు నుం బొరయకునికి జనులు వెఱఁ
గందుచుండి రాసుగాత్రి యుఁ మఱియుఁ గొన్నిదినంబులు లజ్జపెంపున వల్లభుని యి
డుమపాట్లకోర్చి యోర్చి. 93

ఉ. అంతట లజ్జ క్రిందుపడ నత్యధికంబుగ మించి మానసా
భ్యంతరపూర్ణ మైనపతిభక్తికతంబునఁ దల్లిమాట యొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్కింతప్పియుఁ దాను గైకొనక యెప్పటియట్ల యలంకృతాంగి యై
యెంత యు నింపుతోడఁ జనియెం బ్రియుఁ డున్న వనంబులోనికిన్. 94

క. చని యాతఁడు దాఁ జలి పెడు, పనులకు నీయకొనకున్న బలిమిఁ గడంగెం
దనసొమ్ములెల్ల నొకమఱుఁ, గున నిడి పిరిచుట్టు చుట్టుకొనినవలువలోన్. 95

సీ. తోరంపుఁజనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ దగుచోట్లు గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
త్రేఁ గైనపిఱుఁదు బల్విడిఁ జలింపంగ ను వడి నిట్టు నట్టు ను నడిచి నడిచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ మళ్లకు మడవలు మార్చి మార్చి
నడుములేఁదీవియ నకనకగుడువ నింపునఁ దగుమోఁపులు మోసి మోసి
చిఱుచెమటఁ బేర్చు వింతక్రొమ్మెఱుఁగుతోడఁ, గొమరుమే నొప్పసారెకుఁగొప్పువదల
నేమిటికినైనఁ దా మున్న యేఁగి యేఁగి, యెల్లపనులు నొనర్చె నిం పెసక మెసఁగ.

గీ. పడఁతిసంభ్రమించుచునిట్లుపనులు సేయఁ, బిఱుఁదుఁ జాలిండ్లుఁగొప్పుఁగంపించుచొప్పు
గనుఁగొనుచు నేర్చుకొనుగతిఁ గాంతుమదిని, బెల్లు శరముల వైచె దర్పించి మరుఁడు.

చ. అపు డతఁ డట్లు పేర్చుకుసుమాస్త్రునియుద్ధతి యాఁపలేక వె
ట్టిపడుచ యెంతమాన్చిన నెటింగెడుదానవు గావు నీకుఁ దోఁ
టపనుల కెంతదూర మకటా యనుచుం దనయుత్తరీయ వ
స్త్రపుకొనికొంగునం దుడిచెఁ దన్వికపోలపు ఘర్మబిందువుల్. 98

చ. తుడిచినఁ బోక మన్మథుని దుర్జనతామహిమ న్నొరింబొరిం
బడఁతి మెఱుంగుచెక్కులఁ బర్వెడుఘర్మముఁ గాంచి యంత నా
బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగితంచు నె
య్యుడు తమకంబుతోడఁ దలగ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తటిన్. 99

క. తదనంతరంబ మిక్కిలి, పొదిగొన్నచిగుళ్ల జొంపముల సొంపగుపూఁ
బొదరింటికిఁ దార్చి సతి, న్మదనమహారాజ్యభోగమహిమం దేర్చెన్. 100

గీ. అట్లు దేర్చుచు సతి నతఁ డపుడు విడక, కౌఁగిట బిగించెఁ బైపయిఁ గామఁడడర
నివి మిగులఁగ్రొత్తలింటికి నేఁగవలదె, యనిప్రియముఁ జెప్పివిడిపించుకొనియెసతియు.

క. విడిపించుకొని మఱుంగున, నిడిన తనదు భూషణంబు లెల్లను బ్రేమం
దొడిగి గృహంబున కల్లన, నడచెఁ బతిచరితభావనల మన మలరన్. 102

క. పసివాళ్లు వాడి యప్పుడు, వసంతసమయంపు టెండవలన న్నెటివోఁ
గసుగందులు గందిన నవ, కుసుమలతికవోలె మిగులఁ గోమలి యొప్పెన్. 103

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఇవ్విధంబునఁ బతియనుగ్రహంబువడసి భాసిల్లు సుగాత్రిగృహంబునకుఁ జనియెఁ నప్పు
డప్పడంతి సఖులు ముఖవికాసాదులవలనందన్మనోరథసిద్ధి యెఱింగి నర్మాలాపంబుల
వినోదించు చుండిరి తల్లియుం బ్రమోదంబు నొంచె నంత నాఁటి నిశాసమయంబు
న నయ్యంబుజాక్షికిఁ దద్వయస్యలు కౌతుకాతిశయంబున నెప్పటికంటె మిగుల న
లంకరించి కేళికాభవనంబున నున్న తత్ప్రియుని కడ కనిపి రప్పుడు. 104

సీ. గతిసంభ్రమంబునం గరము బెడంకుచు నకనక ల్గుడుచు నెన్నడుము సొబగుఁ
గులుమాపుదడిమంపుఁ గోకలోఁ దోలఁకెదుకంపమాన నితంబ కాంతి సొంపు
బిగువుపయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ ద్రుళ్లు చన్నుల నొప్పు ముళ్లపేరుఁ
జెమట చిత్తడిఁ జిట్లి యమరు కస్తురిచుక్కబొట్టుతోడి పసుపుబొట్టు సిరి యుఁ
గునిసి సారెకు వడఁకెడు గొప్పకొప్పుఁ, గలిగి యాకె దన్నొకటి యుఁ జలుపనీక
తోడఁ బయవులు వాలుచుఁ దోఁటపనులు, సేయురూపు మదిఁ దా హత్తి పాయకునికి.

ఉ. అప్పటి తద్విలేపనపటాభరణాదుల వైభవోన్నతు
ల్లెప్పలు విచ్చి చూడక చరింపనియట్టిపరాకుచేతఁ దా
నెప్పటియట్ల యుండె నతఁ డింటికడం దడ వుండి యుండి నా
యొప్పమి యేమి సంఘటిలె నొక్కొ యటంచు విషాద మొందఁగన్. 106

గీ. తొలుదొలుత నట్లు సాధ్వసాద్భుతకరంబు, లగుచుఁ మరుసుద్ది లేకుండ నెగయమిాటి
పెక్కునాళ్ల తద్వాసన ప్రిదులనీని, ఘనవిభూషాదు లపు డింపు గామి యసుదె.

గీ. తిరిగి యసుగఁజూచి యరిగి యే నెచట నె, వ్వారిదాన నచట నూరక పడి
యుండ దైవ మెద్ది యొనరించె నది యగుఁ, గాతమనుచుఁ దలపుకడన యుండె.

ఉ. ఆలలితాంగి చాలఁ దడ వచ్చట నమ్మెయి నుండి సాహసో
ద్వేలతనంతఁ జేరి కడుం ద్రిమ్మటచే శ్రమబొందినాసగాఁ
బోలును బోదునా నిదుర వోయెదరే యని కప్పురంపుఁ దాం
బూలము తావి బుగ్గరని ముంచుకొనం జెవివండఁ బల్కినన్. 109

క. పైకొన్న పరాకున నతఁ, డేకోర్కిన వచ్చి తనియె నింతి యు వగతో
లోకమువారలు పతికడ, కేకోర్కిని వత్తు రనుచు నెంత యు సొలసెన్. 110

క. ఓనాయక యితరంబులు, పోని మ్మాపాటియైన బుద్ధి గలిగి నా
మానసములోనికోర్కుల, పూనిక యడిగితిరి లోకపూజిత నైతిన్. 111

మ. అకటా యే మని దూఱుదాన మిము నాథా వేగుజామయ్యెఁ బొం
దికగాఁ బాదము లొత్త ర మ్మనుటగానీ యొంటి యేమోకదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీకటాక్షణికిఁ జేసెదె మ్మనుటగానీ కొంత నెయ్యంపుఁబూ
నీకతోఁ గన్నులు విచ్చి చూచుటయుఁ గానీ లేద యొక్కింతయున్. 112

ఉ. నేఁడలతోఁటలో నపుడు నిబ్బర మైనమదీయభాగ్యముం
బోఁడిమి యేమిపాకమునఁ బొందెనొ మీకృప యట్లుగాంచి పె
న్వాఁడిఁ దనర్చు నాచనువు న్నిము నిమ్మెయి నంటఁ గాని యే
నాఁడు ను బుణ్యసాధ్వికి గుణం బిదిగా దని నే నెఱుంగుదున్. 113

వ. అని పలికి యంతరంగంబున నంతకంతకుం బ్రబలుకంతుసంతాపంబున వంతనొందు
చుఁ గొంత చింతించి. 114

క. రాయైనఁ గొంత చేల్నా, రాయణ మీమనసుకంటె రహి నిఁక నెపుడు
న్నీయంతఁ దడవెపరె యని, యాయంగన యతనిపాద మల్లన పట్టెన్. 115

ఉ. పట్టి యొకింత యొత్తుచును పాన్పుకడన్ వెసఁ గూరుచుండి పూం
బట్టున నొప్పనూఁచువుల పై నిడి యొత్తి తదంఘ్రి యంతఁ జ
న్కట్టుపయిన్ ఘటించుచు ను గన్నులు చేర్చుకొంచుఁ జెక్కిట
న్గట్టిగ నద్దుకొంచుఁ దన గాటపుఁ గూరిమిఁ దెల్పె మిక్కిలిన్. 116

క. ఎందుఁ బరాకునుఁ గమికి, న్సందియమందుచు నిదేమిచందముకో యం
చుం దనడెందము గొంపల, మందఁగ నిందుముఖి యతని నల్లన పలికెన్. 117

ఉ. చిత్తము నే త్రోకర్తపయిఁ జేర్చి మరల్పఁగ నేర కేమొ మీ
రత్తరళాక్షిఁ జెప్పుకొనుఁ డాయక నావళ మైనఁ బంపుఁ డేఁ
డెత్తు నవశ్యము న్మఱి యు దేవరనుంబలె నవ్యధూటికిం
దోత్తగుచుం బను ల్సలుపుదు న్నిజ మాడెద దైవసాక్షిగన్. 118

క. తుదఁ జిక్కుశేల మీమది, కొద దీఱినఁ జాలు నమ్ముకొనవలసిన వ
చ్చెద సమ్మికొనుఁడు నన్నే, హృదయేశ్వర యేమిచింత యిది దెల్పఁదగన్. 119

వ. అని యిట్లు పలుకుచుం బాదసంవాహనసేవలు సలుపుచుండ. 120

చ. అది యొకయించుకైన సరయంగ నెఱుంగక యాతం డత్తఱి
స్మదిఁ గడు నాఁటియున్న ప్రథమంపుఁ పదాకృతియొప్పిదంబు లా
చెదరినవన్నె యాననులు సేయుఘనత్స్వర యావినీతి యా
పదిలపుఁ బ్రేమ యాగతులభంగులుఁ జాల వింశి గొల్పఁగన్. 121

క. ఆనతి యుసుదత్నయుగ, లీనంవాహనము విసువు లేక చలుపుచున్
భాసురపాతివ్రత్యను, జ్ఞానక్తిఁ దనన్య మెన్న కన్నిసి గడపెన్. 122

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అంతఁబోలునాఁటి నుట్లను త్యాదరమున, భోయిపూఁబోఁటఁబను లెల్ల ,జేయుచుఁబతి
మన్ననలు గాంచి యెంచెఁ దన్మతికి నట్టి, సొంపులే గాని భూషణా లింపు గామి.
గీ. ఎంచి దినము నట్ల యేఁగి యాతోఁటలో, నట్లు పనులుసేసి ప్రాణవిభుని
నట్ల నిష్ఠురతుల నలరించెఁ దద్విధం, బంత నంత యును దదంబ యెఱిఁగి. 124
వ. కూఁతుతో నేఁకతంబున నున్న వేళ ని ట్లనియె. 125
ఉ. అమ్మ సరస్వతీనరమహాత్వ్యమున జ్జనియించి తీవు నా
కిమ్మగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు వంశ మెల్లఁ బూ
త మ్మగు నీదుచర్య నని ధాతపడంతియె యానతిచ్చె స్వ
ప్నమ్మున వచ్చి తావఁ గుణంబులు చూచిన యట్ల గట్టిగన్. 126
క. పెనిమిటికి దేశాంతరి యై, చనిన నృపవీయ మైనసంతతి నాము
ప్పున కయ్యెడు ననుదు ను ద, జ్జనసంబున కెదురుచూతు సతతము నాత్మన్. 127
సీ. అయాళ విఫల మైపోయెనో యనియెడుబుద్ధిని జేసి యొప్పుతి యేను
నీపతి నిటమున్న నిన్నుఁ జేపట్టక యుండు కాలంబున నోర్వలేక
పసివి యేమాడిన పనివహింపక నీవు నన్నుఁ గోపించు చందంబు దలప
నిలఁ బతివ్రతలలో నీలువుగలయట్టిగల్గిన కొన వాకించి యు ను లేదు
చిన్ననాఁడు ను బ్రియు నొకచిన్న మంత్ర, మాటగూడిన పని తాపమగ్న వగుదు
తద్గుణను లెన్ని రేపాటి తడవిన విని, యలరు దొండొకఁ బఱపి నెచ్చెలులు వగఁగ.
సీ. మఱచి తప్పి యు నన్యమహిమ విపుర్శింపఁజూడ వీవన్యునిసొబగు వేడ్కఁ
బతిభక్తియుండుఁ గీడ్పడనీవు వేఁడుదు తిప్పుప్తి యేకైవతెంబుఁ గనిన
నభిపుఁడుపార్శించ పార్శింతు చింతింపఁ జింతింతు చిక్కినఁ జిక్కి దెపుడుఁ
గడుఁజనవిచ్చినస్వర్వింపనీక యుండిన భేద మొందవు డెందమున ను
నిండుఁగడవరీతి నుండు దెపుడు ను గం, భీరతకుఁ గలంగి చేగనీక
పతివ్రవాసవేళఁ బాటించుకొనవు నె, మ్మేన గరగరికలు మెఱుఁగుఁబోఁడి. 129
క. రాతిరిపగళ్ళు ధ్యానసే, వాతాత్పర్యమున మన్నవార లటుండ
నీతోడ మాటలాడుం, బాతివ్రత్యమునఁ గాదె భారతి కృప తోన్. 130
క. ఓతల్లి కొదవ యొక్కటి, నాతలఁపునఁ దోఁచినది వినన్వలయు గుణా
న్వీతుండు గాని సుతుఁడు ప్ర, సూతుండగునఁట యకాలసురతక్రియలన్. 131
ఉ. నాఁటికి నెట్టిదై వఘటనంబుననో నిను నొల్ల కొంతయుం
గాటపుఁగోపము న్పెనుపఁగాఁ దను నన్మెయి నంటఁగాక పూఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దోఁటకు శీతగాంధ్రుఁడు మనతోఁ బ్లిటివారలు లేరె నీవిధం
డేటికిఁ బోవఁగావలయు నీ వటు పోవఁగ నేల కూఁతురా. 132

క. ధవళాక్షీ వయసునఁ బి, న్నవు గాని వివేకగుణమున న్మిక్కిలి పె
ద్దవు నీకుం దెలియనియ, ట్టివిధినిషేధమ్ము లెక్కడివి తలపోయన్. 133

వ. అని పలికిన మొలకనగవు మొగంబున నిగురొత్తఁ దల్లిం జూచి సుగాత్రియిట్లనియె.

చ. వరునకు సెద్ది యింపది సువర్తనగాఁగఁ దదప్రియంబ బస
చ్చరితము గాఁగ నెన్నుదు నిసర్గము నాకిది మానరాద యీ
శ్వరుఁడును వేదముం గురుఁడు సర్వము భర్తయె యేఁ దదాజ్ఞ సు
స్థిరమతిఁ జేయుచు న్విధినిషేధము లెవ్వియుఁ గైకొనం దుదిన్

క. విను మెయ్యది యు నిషిద్ధం, బని విడుచుట లేదు విహిత మనిచేయుటలే
దనుమానింపక యెద్దియుఁ, బెనిమిటి యొల్లనిది విడుతుఁ బ్రియమొనరింతున్. 135

సీ. అని తల్లితోడ ని ట్లాయింతి పలుకఁ దత్పతిభక్తిమహిమ కెంత యు న మెచ్చి
వాణి ప్రత్యక్షమై వాత్సల్యమున మిక్కిలిని గారవించి తజ్జననిఁ జూచి
యీసాధ్వివర్తన కి ట్టట్టు వంకలు దిద్దఁ జూడకుము సుస్థిరత నొప్పు
పతిభక్తిచే నిజపాపంబ కాదు నీయుభయవంశముల పాపోత్కరములు
వెలయు నిర్ధూతములుగ నీసెలఁత చేసె, నిదియకా దింకనిమ్మీఁద నీసతికథ
వెలయు మత్ప్రీతికరముఁ బవిత్రము నయి, నేన వెలయించుదాన నంచానతిచ్చె.136

క. అని యిట్లు చదివి పుస్తక, మును గట్టి న్పటువు విప్రపుంగవుఁడు ననుం
గనుఁగొని యిదిగోనయ్యా, యనఘము వారలచరిత్ర మని యి ట్లనియెన్. 137

వ. ఆసుగాత్రిశాలీనులయందు నరవిందభవుని కాంత కెంతదయయో యేమొకొ యింగము నాకు
నద్దేవియ కలలోనవచ్చి యీపుస్తకంబు నిత్యంబు ను ప్రాతఃకాలంబునఁ జదువుకొ
నుమని యిచ్చె మఱియు నవ్వీటం జదువ వ్రాయనేర్చినవారి కెల్లనారాత్రియంద
యట్ల యిచ్చినది యందఱు నిది యొండొరులతోడఁ జెప్పుకొని వెఱఁగు పడిరి నిన్న
నేనాపుణ్యదంపతుల సందర్శనంబుకొఱకుఁ దత్కుసుమోద్యానంబులో వారలచే
తం బ్రత్యుత్థానార్ఘ్యపాద్యాదివిధుల నుపచరితుఁడ నగుచు నచ్చట నీపుస్తకంబు
మఱచి వచ్చి నేఁడు శేపకడఁ జదువంబోయి తలంచుకొని యది తెచ్చుటకుం బంపిన
నిట్టిఘోరంపువార్త వచ్చె నని వెండియు నయ్యుత్తముల ప్రాదపాతంబునకుఁ
బెక్కులాగుల వగచె నేను నాయధ్యాపకుని వీడుకొని యప్పటికి నప్పురంబు తత్ప్ర
ఖంగాకులం బగుట యరసి నావిద్య యొరసి చూచుట కిది సమయంబు గా దని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాగలోకంబునకరిగి యంతఁగొంతకాలంబునకు సంగీతవిద్య సవిశేషంబు గానభ్యసింప వేడ్కఁ బుట్టిన నారదమహామునిం గొలిచి తిరుగ వారకొంటిననిచెప్పి మణికంధరుం డా కలభాషిణి యట్లు శాలీనుని చిత్తంబు జానపదత్వముగ్ధత్వదోషంబునం జేసి మున్న త్యంతాపూర్వవస్త్రభూషణాద్యాడంబరంబునం దలంకిఁ తదలంకృతపత్నీరూపంబు నకు నెఱుఁగఁ గొలుపకుండుటయు వెనుకఁ దోఁటపనుల నాకులితం బైన యత్తన్వి విచ్ఛిత్తి విలసితాకారంబున వత్తి యితరంబు నెఱుంగమి భవదీయవృత్తంబునకుదృ ష్టాంతంబు లని పలికి సుముఖాసత్తిం జూచి. 138

గీ. నీకులస్థానవార్త గణించిచూడ, నాసుగాత్రిచరిత్రంబు నంతవట్టు
నీవెఱుఁగకున్కి యె ట్లన్న నేలయెఱుఁగ, నాసుగాత్రిన యే నని యాకె నగియె.

క. అమ్మాటకు వా రందఱు, నెమ్మనముల జోద్యమంది నీ వాసతివే
నెమ్మెయి బ్రతికితి వేమిక, తమ్మున నిమ్మాఱుపేరఁ దాలిచి తెనుడుక్. 40

సీ. శతతాళదఘ్నసంజ్ఞిత మైనయట్టి పెన్మడువున నే నట్టువడియెదుతతి
మత్పతిపాదపద్మము లాత్మలోనఁ దిరంబుగా నిడి తదన్యం బెఱుఁగక
మునుఁగుచో నడుమఁ గోల్మాసలి మ్రింగె నదిమ్రింగినవెన్క నతిగించుకొనఁగలేక
మఱునాఁడు తత్తీరమహిఁ బడి పొరలుచు వెడలఁ గ్రాసినది యవ్వేళయందు
నచట నున్నవా రిది చెప్పి రంత నేను, నెల్లజనులు ను వెఱఁగంద నింటికేఁగి
వాణికిని మ్రొక్కుకొనుచుంటివదలకపుడు, పతిఁ దిరుగఁగూర్ప నింకనీభార మనుచు.

సీ. దేవి నాలీలఁ బ్రార్థించుచుండఁగ వచ్చె నరలు నా కప్పుడె నాథుసేవ
యెక్కడి దీవాణి యెటు సేసె నట్లు గాని మ్మది యని విరాగమ్ము పొడమ
వేదాంతశాస్త్రకోవిదుల గోష్ఠిని గొంతయోగశాస్త్రజ్ఞులయొద్దఁ గొంత
ప్రొద్దుపుచ్చుచు యోగములకు నంగములైన యాసనాదులకు సమర్థమైన
ప్రాయ ముడివోవుటకు వెతపడుచు నుంటి, నా కపుడు సుముఘాసత్తి నామమొదవె
సుముఖు లన శాస్త్రవిదులు నిత్యము ను దత్స, మీపవర్తన గలిగి యే మెలఁగుచునికి.

గీ. అట్టిపేరఁ బ్రసిద్ధ నై యంతలోనఁ, దల్లితగు లూడఁ దీర్ఘయాత్రగ ధరిత్రిఁ
గ్రుమ్మరుచుఁ దుద నిద్దేవిగుణములు విని, యిచటఁ జేరితిఁ గడమ మీ రెఱిఁగినదియ.

క. అమ్మాడ్కిని బాత్రివ, త్యమ్మున నతిగని యు నిట్టిదశ నొందితి నేఁ
గ్రమ్మఱఁ బ్రదికి యెుకింత యు, నమ్మకుఁగునఁ గాంతుఁ డేమియయ్యెనొ యెఱుఁగక్.

ఉ. అనుచుం గ్రాహముమ్రింగియుండ మఱునాఁ డాలీల నక్లిష్టమూ
ర్తిని రానేర్చిననీయసంకుచితపాతివ్రత్య మోయుత్తమాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గన నీనాథుని బ్రోవఁదన్నె పెటుఁ శంక ల్మాను బ్రాపించె దా
తనిపాంచుం దువ నాతఁ డే నని మణిస్తంభుండు నూపెం దనుక్. 145

సీ. చూపి యే బ్రదికినచో పెల్ల విను మట్లు నీమాటఁ గడు నల్గి యేమిక ర్మ
వశతనో యాయల్కవడి యాఁపలేక వేగోద్ధతిఁ జని నీట నుఱికితిఁ గద
యావెన్క నొక్కించుకంత సేపునకు జలస్తంభవిద్యావిలాసగుప్తు
నొక సిద్ధు నింటిలో నున్నట్లు యున్న మహాత్ము తేజోవిఘూతాంధకారుఁ
జేరితిం జేరి యటమున్ను దూరపాత, సంభవం బైనయుప్పరిభ్రాంతి చేతఁ
బ్రక్క లెనయంగ రోఁజుచు నొక్కక్షణము, నిలిచి కనుఁగొంటిని సమాధినిష్ఠు నతని.

గీ. అంతఁ గనువిచ్చి చూచె న స్నాతఁడేను, బ్రణుతిచేసితిఁ జేసి తత్ప్రణుతి సరణి
వెంబడిని జెప్పితిని నావృత్త మతఁడు, నింతికోపివే యనుచు నొక్కింత నవ్వి.

క. ఇది మిక్కిలి యేకాంతపు, పద మని యిట్లున్నవాఁడఁ బరుల ననుపఁగూ
డదు క్షణము నిందు నని మ, ద్వదనము దెస యంతఁ జూచి దాక్షిణ్యమునన్. 148

సీ. నాఁ డెల్లఁ దనయొద్ద నను నుంచుకొని నాదుగురుభక్తి తెలిఁగుఁ గన్గొనుచు నలరి
నాకు జయస్తంభనపుమణి యొకటి యుఁ డా నెక్కుసింగంపుఁదత్తడి యు ను
దద్వశీకరణౌషధజ్ఞానము ను వాసవిద్య యు నివ్వాలు వేడ్క నిచ్చి
పొమ్మని యనిపినప్పుడు గాదె యీపట్టె మెవ్వరి బ్రేయంగ నెత్తఁబడును
వారిఁ జంపు ను దుద ననువాక్యమునకుఁ, గడునలరి మ్రొక్కి యతనియాకర్ణమున
నటకు మును వచ్చినట్టి సింహంబు నెక్కి, మదను యొక్కింత దాఁకించుమాత్రలోన.

శా. గంభీరప్రాదమున్నడి స్వేడలి యాకాశంబునం బోఋనా
కుంభిద్వేషిని మెచ్చి యెన్ని గల వీక్షోణి న్విచిత్రంబు లా
కుంభద్వస్తువు లెల్లఁ జూతు నని పోచు స్వేడ్క నుంటి న్వయ
స్తంభంబు న్మణిచేతఁ గాంచుట మణిస్తంభుండు నా నొప్పచున్. 150

గీ. అతివ నాదుగుపవు లంగీకరించిన, యట్టిది యని మిగులనాదరమున
నేను నాఁడు మొదలుగా నిట్టిసిద్ధనే, పమున వలయుచోట్లు సంచరింతు. 151

క. ఆవేడ్కలతమి నెప్పుడు, నీవిధమె తలంప నంత నీవు నెఱుఁగు ది
చ్చో వచ్చియున్న తెలిఁగులు, నావుడు నవ్వారిజాక్షి నగి యిట్లనియెన్. 152

స్రగ్ధర. ఆకాలీనుండ వీవే యగుట కలిగెనా యల్లనాఁ డంతక్రోధా
వేశం చేతేర నీ వేవికటపుఁబలుకు న్వింటి నాచేతఁ గర్ణా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భ్యాసంబుం జేరి చెప్పఁ బ్రథమమున వయఃప్రస్తుతు ల్చేసి గూఢం
బై శోభిల్లంగ నీ వే మని పలికితి మా కానతి మ్మంతవట్టున్. 153

సీ. అని కలభాషిణిం గనుఁగొని నీవిటు రమ్ము నీ కారహస్యమ్ము మును పు
చెప్పి తాఱ్ఱాణగాఁ జెప్పింపఁ దగు మతి యాయనచే నని యప్పడఁతి
చెవిలోనఁ జెప్పంగఁ జేరి యోహో యది గా దుపాయ మతఁడు గట్టిగాఁగ
దూరశ్రవణశక్తిఁ దోడ్తోడ వినియెడు నటుగాన వ్రాసి నీ కది తెలిపెద
ననిన దూరదృష్టిని గను నది యుఁ గూడ, దనుచు మణికంధరుని జూచి వినుము నీవు
మును పతనిచేతఁ జెప్పించుకొను తదర్థ, మంత నేఁ జెప్పెదను గాని యనుడు నతఁడు.

వ. అమ్మణిస్తంభుని నేకాంతంబునకుం దోడ్కొనిపోయి యతనిచేతఁ దొల్లిటితఱ్ఱపకా
రణంబు ను నటమునుపటి రహస్యవాక్యంబులను జెప్పించుకొని వచ్చి సుముఖాసత్తిం
జూచి యింక నీ వే మని చెప్పెదో చెప్పు మనుట యు నవ్వనితామణి యి ట్లని చె
ప్పె నట్లు కాలీనుండు మదువునం బడుటకుమునుపు నాతో నేకాంతంబున నుండి ప్ర
సంగవశంబున. 155

క. అమృతము సేవించితివో, రమణీ యేమైన సిద్ధరస మబ్బెనొకో
కొమరుం బ్రాయము మిక్కిలి, కొమరొందెడు మిగులఁ గ్రొత్త క్రొత్తగ నెలమిన్.

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మండ్రు మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగఁ బొలుపొందుటకు నిమిత్తముఁ జెపుమా. 156

క. అని యడిగిన నే నెయ్యది, యు నిమిత్తం బెఱుఁగ నను మూరక యి ట్లం
టిని గాని యేన చెప్పెద, విను మని మొగము చెవిఁ జేర్చి విభుఁ డి ట్లనియెన్. 157

చ. అనిశము నీదు యౌవనశుభాకృతిఁ గౌఁగిటఁ జేర్చు వేడుకం
దనియమిఁ జేసి వేఁడితిని దక్కక నీకు ను గర్భ మెన్నఁడుం
జనితము గాక యుండ నలశారదఁ బూజయొనర్చు వేళ వా
రనికృప నట్టు లిచ్చితి వరం బని యాయమ పల్కె నత్తఱిన్.. 158

క. దానన సుమ్మీ నీకు, న్మేన న్సౌందర్యగుణసమృద్ధి దలిర్పం
గా నవయౌవన మెప్పుడు, గానఁబడుట యనుడు నేను గడు వెఱఁగొందన్. 159

గీ. నాదుసంగంబునన నీకు నందనుండు, గలుగువర మిచ్చె నాకు నన్నలువసతి యు
నేన వేఁడిన నొక్కనాఁ డిదియు నదియు, నొనరు పెట్లొకొ యంటినయ్యనఘుతోడ.

క. నావుడు నాయిష్టమునకు, నీవు విరుద్ధముగ వరము ని ట్లడిగితె య
ద్దేవి నని దుర్దమక్రో, ధావిలమతిఁ జని యతండు ప్రహదమున నుటికన్. 161

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని చెప్పుట యు మణిస్తం, భునిమాట యు నది యు నైక్యమున శోభిల్ల
న్వని మణికంధరుఁ డోమా, నిని సందియపడకు మితఁడ నీవిభుఁ డనియెన్. 162

సీ. ఆవఘూటి యు ను సద్యఃకందళత్ప్రపాలంకృతం బగుసద్విలాస మమరఁ
బతిఁ జూచి సంతోషభయభక్తివినయంబు లుదయింపఁ దగురీతి నుపచరించి
యిందాఁక నెఱుఁగ కే నేమి యంటినో మిమ్ము ననుచుఁ గన్నీళ్ళు రానడఁచుకొనుచు
నడపుల మాటల నగవుల మాయందుఁ దొంటికై పడి కొంత దోఁచుచున్న
పసుధ మానిసిఁబోల మానుసులు లేరె, యనుచు నుండుదు భాగ్య మట్లునికిఁ జేసి
యిప్ప డీయన్న చే ఫలియించె నది యు, సజ్జనులగోష్ఠి యిహపరసాధకంబు. 163

క. అని మణికంధరుఁ గనుఁగొని, యనుమండుదు మునుపు నిన్ను వేములు నిచ్చో
టన దూరశ్రవణబలం, బున నీయన నీదుగానమున్విని పొగడన్. 164

శా. గంధర్వుండవు జాతి యెంచఁగ శుభాకారంబు చంద్రప్రపా
సంధానక్షమ మద్వితీయుఁడ విఁకన్సంగీతసాహిత్యధౌ
రంధర్యం బరయం దపస్వి వసురప్రద్వేషిభక్తుండవు
న్బంధం బొక్కటి గల్గె శాప మనఁగా నాయన్న నీకుం దుదన్. 165

గీ. అనినఁ దచ్ఛాపగతి కాత్మయందు వగపు, దనరఁ గలభాషిణి మణికంధరుని జూచి
మును గళాపూర్ణకథ నీవు వినవె ధనదు, పట్టిచే నంత యు బ్లేల తిట్టువడితి. 166

చ. అన నతఁ డెందు నే నెఱిఁగినట్టిద కా దని నీకు నెచ్చట
న్వినఁబడియున్కొ నో యది వివేకము సేయఁగలేక పల్కె ది
ట్లనుడు మదిం దలంచుకొని యా నవు నీవెడగాఁ గఁ బోయి యుం
టి నిజము దత్ప్రసంగము ఘటిల్లినయప్డని పల్కె యత్తఱిన్. 167

సీ. నారదుప్రథమసందర్శనం బైనట్టినాఁడు తత్కథకుఁ బ్రశ్నప్రసంగ
మేతెంచినవిధంబు నాతపస్వి యు నపూర్వం బిదియని యద్భుతంబు నొంది
భూతభవద్భావిభువనవస్తువు లెల్ల నిజయోగదృష్టిచే నెమకి కాంచి
తన కది చెప్పరా దని పల్కుట యుఁ జెప్పరాక యుండుట యుఁ గారణముగాఁగ
నతఁడు దెల్పిన బహుసంపదాదిఫలము, దాను వినినంతవట్టొకింత యు ను విడక
బూసగ్రుచ్చినరీతి నాపువ్వుఁబోఁడి, చెప్పినది విని వార లచ్చెరువునంద. 168

వ. అప్పుడు. 169

క. మళయాళపుబ్రాహ్మణుఁ డొకఁ, డలఘువ్రతనామధేయుఁ డచటికి నంప
త్కలనా కాముఁడు జపవిధి, తలఁపున నేతెంచి వినియెఁ దత్కథవిధమున్. 170

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. విని యాకళావూర్ణుఁ డన నెట్టిఘనుఁడో తత్కథ యంత యు ను వినఁగలుగు టెపుడొ
సంపదర్థంబుగ జపము చేసిన నఖ్యాపూర్వపుకథవినుపుణ్యమబ్బు
నది వినునట్టిభాగ్యంబు సాధించినఁ దన్మహత్వంబుచేత ను సమస్త
భోగవైభవమాత్రములుగాక దీర్ఘాయువు ను బుత్రపౌత్రాదిఘనవిభవము
గలుగునఁట కడుమంచిమార్గంబు దొరకెఁ, దత్కథాశ్రవణార్థ మీతల్లి నేఁ బ్ర
సన్నఁ గావింతు ననుచుఁ దాఁ జలుపఁ దొడఁగె, మహిత మగుభువనేశ్వరీమంత్రజపము.

క. మనమునఁ గలభాషిణి యుం, దనతాపముఁ దలఁచుకొని వృథాహతి నెచ్చోఁ
జనఁబడునో తడసినినం, చు ను సిద్ధుని నతనివాలుఁ జూచి ఘనధృతిన్. 172

క. ఏల్ల యిఁకఁ దడయ నీబలు, వాలునియమమునకుఁ ద్రిదివవారాంగన యా
భీలపుతాపమునకు నను, కూలంబుగ నడచి చేర్చుకొను రాజ్యంబున్. 173

సీ. ఆమణిస్తంభుఁ డాయకఁ జూచి యీసుముఖాసత్తి యోహరినాక్షి తొలుత
నేను నీపైఁ గత్తియెత్తిన నిన్నుఁ బ్రేయకయుండ నీజగదంబమీఁది
యానవెట్టిదె యటుగాన నే వెఱతు నీపయిఁ దెగ మనుపటిపాల్లైచాలు
నని మణికంధరుఁ గనుఁగొని నాదువా లొసఁగెదఁ గొని యీపయోరుహాక్షి
చెప్పినట్లు చేసి చేకొను మత్యంత, విపుల మైనరాజ్యవిభవలక్ష్మి
ననుచుఁ బలికె నతనివనిత యు నోమణి, కంధర యిది మంచికార్య మనియె. 174

వ. అనిన నతం డతనితోడ వెండి యు ని ట్లను నలకూబరుతాపానుభవంబునకుం గాచు
కొని యున్నవానికి నీదుష్కర్మంబున సాధించినరాజ్యవైభవం బేమికీర్తి సుకృతం
బులకు సాధకంబు నయ్యెడు నని చింతింపవల దనివార్యం బైనతాపానుభవంబు ప
రోపకారంబు నెక్కింప నుద్యోగించి తనయంతన చేరి యత్యంతప్రార్థనంబు చే
యుచున్న యిన్నెలంతచేత మహాదేవికి సంతర్పణము సేయుట దుష్కర్మం బనరా
దు కావున నప్పడంతి చెప్పినచొప్పున నడపు మని యత్తెఱంగున మఱి యుఁ బెక్కు
ప్రకారంబుల నొడంబఱచిన నెట్టకేలకు నాదయాళుం డియ్యకొని నియమపూర్వకం
బుగా నవ్విధికిఁ గడంగెఁ గలభాషిణి యు మణిస్తంభునకుఁ దదంగనకుఁ బ్రణామం
బు చేసి కన్నీళ్లు గ్రుక్కుకొనుచు నిక్కలంకపాటు తక్కిన భయంబునకుఁ గాకు
సుందు మిమ్ము నెప్పుడు గురుభావన నారాధించుచుండలేమికిం గాని యనుటయు
ను సుముఖాసత్తి యు నోయమ్మ మఁన నెమ్మనంబులకూర్మి యింతటన పోయెనే
మీఁదట నైన నీపతి యు నీవుఁ గోరినట్లు మమ్ము గురుభావంబున నడుపుకొనితెుద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రనినఁ గలభాషిణి పునఃపునఃప్రణామంబు లాచరించి ముకుళితకరకమలయగుచు ని ట్లనియె. 175

శా. పూతం బైనమదీయపుణ్యయుగ మోపుణ్యాంపుటిల్లాల నీ
పాతివ్రత్యముచందము న్విన మది న్భావింపఁగా నెట్టిదు
ర్నీతిప్రక్రియవారికైన నఁ గృపతో నీవచ్చినం గల్గుఁ ద
త్పాతివ్రత్యము నాకు మీఁద నయినం ద్రాపింప దీవింపవే. 176

క. నాపుడుఁ బరమపతివ్రత, వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ, బోవుఁడు మముబోంట్ల నీవిభుఁడును నీవున్. 177

ఉ. అట్టిటు చంచలింపకు ధృఢాత్మత నుండు మటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచునున్న దాన వతిభవ్యనికాశము నుబ్బుఁ జూడ ని
న్గట్టిగ నెన్న దేవతవు గాక నరాంగనవే మృగేశ్వరా. 178

చ. అని తనుఁ బల్కు నజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రముం
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెదరే యటంచు సా
తని బలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరుచేతి కిచ్చి యో
గ్యనియమగంధమాల్యయుతి యై కలభాషిణి నిర్విశంకతోన్. 179

క. తగ నాశక్తికి నభిముఖి, యగుచుం బద్మాసనస్థయై కూర్చుండె
న్మొగ మోతె యు వికసింపఁగ, బిగివదలక పావలుమదిగ భీరత మెఱయన్.

ఉ. కాంత యనంతరంబ మణికంధరుఁ గన్గొని నీ విఁక న్విని
శ్చింతత దేవి కర్పణము సేయుము కొంకక దద్దరిల్ల కొ
క్కింత యు శంక లేక మెఱయింపుము చూచెద నుద్ధతద్విష
త్సంతతికంఠఖండనవిచక్షణదక్షిణబాహుశౌర్యమున్. 180

క. సమరంబున నెదిరించిన, సమదాహితవీరవరులఁ జక్కాడఁచుట నై
జము మీకు నిట్టియెడల, న్భ్రమయక చేమఃఅవకునికి పటుశౌర్యమనన్. 181

క. అని తెలిపెడి కలభాషిణి, మనసు తెలివి కరుదుపడుచు మణికంధరుఁ డే
మని చెప్ప నెట్టకేలకుఁ, దనమది నూల్కొల్పి నడపెఁ దద్వచనంబున్. 182

వ. అప్పుడు మృగేంద్రవాహన యతని నుద్దేశించి యోమణికంధర నీవు దయాకులత్వం బునం జేసి యాబలి సమర్పణవిధానం బొకించుక విలంబనంబునం జేసి సలిపితివి గావున జన్మాంతరమాత్రవ్యవధానంబున సద్యోయోగానుండ వగుచుమహారాజ్యవైభవంబు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనుభవించెదు కలభాషిణి యం బ్రాణభయంబు లేశంబు ను లేక మ్మత్ప్రీణనతా త్పర్యధైర్యాదిగుణంబులచేత ను మిక్కిలి మెప్పించెం గావున మామకప్రసాదవిశే షంబునం జేసి యిపుడు పునస్సహితమస్తక యు నిజపురీవర్తిని యం నై తన బం ధుమిత్రాదుల నలరించు నని యానతిచ్చె నిచ్చెలువ యు నట్లు బ్రతికి కనువిచ్చి న లుదిక్కులుపరికించి యప్పుడు దా నున్నయది ద్వారకానగరవేళవటిభావణా యమాన స్వభవనారామభూమి యై యుండుటకు వెఱఁగందుచు నిది యంత యు మృగేంద్రవాహనా మహాశక్తి కృపావిలసనంబు కాఁబోలు నని యగ్దేవిం గొనియాడి తన గమనాగమనప్రకారంబు సఖీప్రముఖనిఖిలజనంబులకు వినిపించి ఘనతరాద్భు తంబులుగావించుచు నుండె నిట మణికంధరాదులు నవ్వరవర్ణినీశరీరఖండంబులు నదృశ్యంబు లగుటకు వెఱఁగంది యయ్యాదిమశక్తిసూక్తిమహిమ పలుదెఱంగులం బ్రశంసించి రంత మణికంధరుండు మృగేంద్రవాహనకు దండప్రణామంబు కావించి సుముఖాసత్తిమణిస్తంభులం దగువిధంబుల వీడ్కొని శాపానుభవకాలంబుం బ్రతీ క్షించుచుం గృష్ణదత్తం బైన తనరత్నమాలిక యచ్చట జపపరుండైయున్న యలఘు వ్రతునకు గృష్ణార్పణబుద్ధిని సమర్పించి విపంచి యగ్దేవిగృహంబున నొక్కవలభివిశేష వివరంబున నన్యులకుం గానరాకుండ గుప్తంబు చేసె. 183

క. అమ్మణికంధరుఁ డంత మ, నమ్మునఁ జేరేఁచుచున్న నలకూబరశా
పమ్మునఁ జనియెను శ్రీశై, లమ్మునకు ను భృగునిపాతలంపటమతియై. 184

సీ. తన సుముఖాసత్తి తనకు శుశ్రూష సేయఁగ మణిస్తంభుండు నమ్మృగేంద్ర
వాహనా దేవినివాసంబునందు నత్యంతజితేంద్రియత్వంబు మెఱసి
యష్టాంగయోగవిద్యాభ్యాసనప్రౌఢిఁ దనరె నజ్జలజనేత్రయు ను బతికి
వలసిన పరిచర్య నలిపిన తుదను దదాజ్ఞ ను మునుపటి తనదుయోగ
వర్తనంబు ప్రేమ వదలక తత్పరి, శీలనంబు నెపుడుఁ జేయుచుండెఁ
దదనిశప్రయత్న తాత్పర్యమున నల, ఘ్రావకాశుఁ డగుచు నతనుఁ డుడుగ. 185

క. అంత మణిస్తంభుఁడు దన, యంతఃకరణంబునందు నలరారెడు దే
శాంతరవస్తువిశేషా, త్యంతదిదృక్షు న్దిగంతయాత్రాపరుఁ డై. 186

క. వరజనకాలిం దనకే, సరి నాకర్షించి యాత్మసతి యుం దానుం
బరమోత్సాహమునఁ గృతా, ధిరోహుఁ డై గగనమున యథేచ్ఛాగతులన్. 187

క. అరుగుచుఁ గనుఁగొనియెను ధీ, కరమకరతిమింగిలాదిఘనజలజంతూ
త్కరవిహరణభృశసాంద్రు, న్నిరుపమఘుమఘుమరవాపనిద్రు సముద్రున్. 188

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఇవ్విధంబున నయ్యంబుధిం గనుఁగొని తత్ప్రకారంబు కౌతుకకారణం బగుచు సోం
పుమీఱఁ దనవనిత కి ట్లనియె.

ఉ. శీకరబృంద మెంత యు నశీతమరీచిమరీచిజాలమై
శ్రీకృతధాళధళ్యమయి తేజరిల న్నిజధర్మ మైనర
త్నాకరభావ మీజలధి యంబుజలోచన చూచితే కనుం
బ్రాకట మై తనర్పఁ దనబాహ్యవిభాగమునందుఁ జూపెడున్.

ఉ. ఓలలితాంగి చూడు కడునొప్పెడు నీరము నిండఁగాఁగఁదాఁ
గ్రోలి తిమిప్రకాండము శిరోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధార యలవేలుపుటేటిపయిం గుతూహల
శ్రీల మరున్నదీవిభుఁడు చిమ్మెడుచిమ్మనగ్రోవినీ రనన్.

తే. ఉగ్రతిమిశిరోరంధ్రనిష్ఠ్యూత మగుచు, నెగయుసత్కణౌఘమది యెంచు మిగుల నొప్పె
నబ్ధిపేరిటికుండలితాంగభోగి, యుస్సురనఁ దనపడ గత్తెనో యనంగ.

ఉ. ఔర్వము పేర ఘోరవిరహానల మెంత యు నంతరంబునం
బర్వఁ దరంగబాహువులు బారలుచాఁచుచు నీపయోధి యో
పర్వసుధాంశుబింబముఖి భాసిలెడుం గడు నుల్లసద్రసా
ఖర్వసుపర్వసింధువు ను గౌఁగిట నెంత యుఁ జేర్చ్చకై వడిన్.

మ. వికచాబ్జానన యీపయోధి శశి యావిర్భూతకాలంబున
న్సకలద్వీపవతీగణంబు యుగపత్సంప్రాప్తి నవ్యోల్లస
న్మకరీభంగపయోధరత్వమునఁ గన్పట్టన్రసోజ్జృంభణా
ధికతం జేయుచు నాచరింపఁ గడఁగుం దివ్యాపగాశ్లేషమున్.

చ. ఉదకముఁ గ్రోలఁ బ్రాలెడుపయోదము పొంపుకేళిసంభ్రమా
భ్యుదయగళద్రమాకబరిపోలికనొప్పెఁ దటిద్విలాసము
ల్తదభివృతాంగకస్ఫురణలం దలపింపఁగ నీపయోధి యొ
ప్పిదము శయించినట్టి మురభేదితెఱంగు వహించెఁ జూచితే.

క. అనిపలుకు తినదుపలుకుల, కు మ ముసిముసినగవుతోడఁ గోమలి లజ్జా
పనతముఖి యయునఁ దద్విల, సనజృంభితకుసుమశరవశంవదుఁ డగుచున్.

గీ. తనమభావంబుఁ దెలుప నవ్వనిత మీకు, వలసినవిధంబునం బ్రవర్తిలుటగాక
యిందు నాకు స్వతంత్రత్వ మెక్కడిదని, యనియెననుటయు నాసిద్ధుఁడాత్మ నలరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాలిని. కిసలయకుసుమౌఘాకీర్ణనానావనాంతో, ల్లసదభినవకుంజశ్లాఘ్యభాగంబులందు
న్బిసరుహదళనేత్రన్బ్రేమతోఁగూడి నానా, ప్రసవశరవిహారప్రౌఢిఁగ్రీడించుచుండెన్.

క. అలఘువ్రతావ్యయుం డగు, మళయాళపుబ్రాహ్మణుండు మహనీయసము
జ్జ్వలనియమంబున జపవిధి, సలిపెం బూర్ణముగ రెండుసంవత్సరములన్.

ఉ. శీతలసత్యభాషణవిశేషవిలాససమార్జితాఖిల
శ్రోతృజనానురంజన విరోధినరాధిపగర్వభంజనా
నీతికలాతికౌశలవినిర్జితభార్గవదేవమంత్రివి
ఖ్యాతవిభూతిగర్హణ నిరంతరకల్పితవిద్వదర్హణా.

క. నరసింహప్రభునందన, నరసింహబలారిగమఘనస్థేమబలా
నరసింహకృపాస్పద కీ, ర్నరసింహాసనపదస్థనతిక్ష్మద్రవిణా.

తోటకవృత్తము. మానసుయోధనమంజులనిత్యా, సూనయశోధన యుజ్జ్వలకృత్యా
దానసుబోధన ధర్మదకృత్యా, దీనమహాధన దీపితసత్యా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్య
తనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబైన కళాపూర్ణోద
యం బను మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

శ్రీమదుమారమణాయనమః.

# కళాపూర్ణోదయము.

## పంచమాశ్వాసము.

క. శ్రీప్రఖ్యాతినిరాకృతి, వైదుష్యసుపుష్యదర్థవైభవ యపరి
చ్ఛేదప్రాభవ యాచక, ఖేదప్రశమనవిలోల కృష్ణనృపాలా. 1

వ. అవధరింపు మవ్విధంబున నలఘువ్రతుండు భువనేశ్వరీమంత్రజపంబు రెండుసంవత్స
రంబులు పరిపూర్ణంబుగాఁ జేయ నంతట మృగేంద్రవాహన యోబ్రాహ్మణుండ నీ
యభీష్టంబు వేఱొకచోట సిద్ధించు నని పల్కె నప్పలుకులు వినంబడునంత నతం
డాకస్మికోద్ధూతతీవ్రవాతనిపతితుం డగుచు ననేకజనపదవ్యవహితం బైనయొక్కపు
రంబునడుమ రాజస్థానమధ్యంబునం బడి తదీయక్షోభాకులత్వంబున నొక్కింతతడ
వుండి మూసినకను లెప్ప లంత విచ్చినలుదిక్కులుం బరికించి తనపతనప్రకారంబునకు
వెఱఁగుపడుచుఁ జుట్టున నున్నసభాసదులఁ గొందఱను గన్గొనెదురఁ రెండవదేవేంద్రుం
బోలె నపూర్వవైభవంబున నున్నయొక్కరాజును నతనియగ్రభాగంబునఁ బసిండితొ
ట్టియలలోపలఁ బొత్తులలోనున్న యొక్కచక్కనిబాలికనుం జూచి యొక్కింతతడ
వు నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు నుండి పదంపడి దిగ్గన లేచి మణికంధరదత్తం
బైన తనరత్నమాలిక యాశీర్వాదపూర్వకంబుగా నారాజునకుఁ గానుక పెట్టుట
యు నతండు నత్యాదరంబునం గైకొని కొంతసమీపంబునం గూర్చుండ నియమించి
యప్పటికిఁ దక్కులనామమాత్రంబు లడిగి తెలిసి యిప్పటినీయాగమనప్రకారం బ
త్యద్భుతం బది చెప్పెదవుగాని యిటుమాటలాడక యొక్కింత నిలువు మని పలికి
యిప్పటికానుక లెవ్వి యైన ను దీనిసొమ్ముల యని యమ్మణిహారంబుఁ దనయొద్ద ను
న్నయాశిశువునకుఁ బెట్టించె. 2

క. అత్తఱిన తదీక్షుల నా, పొత్తులలో శిశువు చిబుకము గళంబుపయిన్
హత్తు నది చూచి తెలిదళు, కొత్తుచు లేఁజెక్కు లమర నొయ్యన నగియెన్. 3

క. తిరుగా రెండేండ్లకు నీ, సురుచిరహారోత్తమంబు జూడఁగ నాకుం
దొరకె ను గనుఁగవ చేసిన, యురుపుణ్యము నేఁడు వెండి యు ను ఫలియించెన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనిన విని యేమిచెప్పంగ నచట నున్న, వార లెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి
ప్రతిమలు ను బోలె నతినిశ్చలత నొకింత, తడవు గనుపట్టి రత్యద్భుతంబునొంది. 5

ఉ. ఎంత యు విస్మయంబున మహీశుఁడు బాలిక మోముఁ జూచి య
త్యంతము వింత లీపలుకు లారయఁగా నిది యెట్టిదేవతా
కాంతయొ కాక యేవిధపుఁగారణజన్మయొ యింక మాటలా
డింతముగాక యంచుఁ దనడెందమునం దలపోసి యి ట్లనున్. 6

క. ఓయద్భుతంపుబాలిక, నీయుదయం బరయ రెండునెల లయ్యెనొ కా
దో యెట్టు పలికి తిప్మైయి, నేయెడ రెండేండ్లక్రింద నిది చూచితివో. 7

క. అన విని యిటు మునుపటి నా, జననంబున నేను దీనిఁ జాల గుఱుతుగాఁ
గనుఁగొన్న దానఁ గావున, ననఘా యామాట యంటి నని యది పలికెన్. 8

వ. అమ్మహీపాలుండును నబ్బాలికను జూచి నీవు కారణజన్మవు గాని సామాన్యం బైనమ
నుజశిశువవు మాత్రంబు గావు కావున నీతెఱం గంత యు నెఱుంగనందాఁక డెం
దం బమందకౌతుకసంరంభంబున సంభ్రమించుచున్న యది. నీపూర్వజన్మవర్తనంబు
లెవ్వి యేమికారణంబున నిచ్చటఁ బుట్టితి వెఱింగింపవలయు నని ప్రార్థించుటయు
నది తనపూర్వజన్మవర్తనంబు ను దజ్జన్మనిమిత్తం బైనతత్పూర్వవర్తనంబు ను సంస్మర
ణసంబంధపరంపరావశంబున సమస్తంబు ను గరతలామలకంబుగా నాకళించి తనప
లుకు లాస్థానం బెల్ల సావధానం బగుచు వింజమాఁకిడినట్లు వినుచుండ నన్నరేంద్రచం
ద్రునకు ని ట్లని చెప్పం దొడంగె. 9

సీ. వినవయ్య యోకీర్తిధన యిట మునుపటిపుట్టువు గాక తత్పూర్వ మైన
పుట్టువునందు నంబుజగర్భదేవి పెంచినయట్టి ప్రోదిరాచిల్క నేను
నాకుఁ దజ్జన్మంబున న్పాప మొక్కటి తగుల రెండవ మేను దాల్పవలసెఁ
దచ్ఛాపమూల మంత యు నీకు వినిపించెదను విను మిది నిమిత్తముగ నైన
నొకయపూర్వకథ సముజ్జ్వలరసభావ, మాయురభ్యుదయకులాభివృద్ధి
హేతు వతిపవిత్ర మిప్పుడు వినిపింపఁ, గలిగె జిహ్వకలిమిఫలము నొంద. 10

మత్తకోకిల. అంబుజాసనురాణివాసమునందు నేను వసించుకా
లంబునం దొకనాఁడు మోద మెలర్ప నాయన వాణితో
నంబరాభరణాంగరాగసమంచితాకృతివైభవా
డంబరంబు కరంబు వింతపెడంగునం గనుపట్టఁగన్. 11

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. భవనారామమునకుఁ జని, నవనానాఖేలనము లొనర్చుచు నరవిం
దవనామోదభరాలస, పవనామోదములచేత భావము లెసఁగన్. 12

గీ. తరుణసంతానకచ్ఛాయఁ దలిరుఁబాన్పు, నందు నాసరోజరమున నభిముఖముగఁ
బవ్వళించెను దనపాదపల్లవంబు, లూరువులఁ జేర్చుకొని వాణి యొత్తుచుండ. 13

ఉ. అంతట నంతకంతకు నిరంతర మైతనరారు మారదు
ర్దాంతతఁ గాంతఁ బాన్పునకుఁ దార్చెను దన్మధురాధరామృతా
క్రాంతి రసోద్ధతిం దన మొగంబులు నాలుగు నొక్కమాటె య
త్యంతముఁ దత్తరిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్. 14

సీ. ఆలీలలకు నవ్వి మేలు మే లంత యు నీవింత లన్యాయ్య మింత గలదె
మీ మొగంబులు నాల్గు నీమాడ్కి నువ్విళు లూరిన నేకాస్య నొకతె నేను
జాలుదునే యివి చాలించెదరొ మఱి యేమైనఁ గలదొ యం చామృగాక్షి
మెడ బిగించుచు నించు కెడగ వక్త్రము నిల్పి యధరంబునను పాణి యడ్డ మిడుచు
మొలకనగవు ను గోపంబుఁ జెలువుఁ జిలుకు, దళుకుచూపులు చూపులోఁ దర్జనముల
వక్రితభ్రూలతాతాండవంబుసిరుల, మిగులఁ గెరలించెఁ బ్రియుమతి మెఱయుమరుని.

ఉ. ఆయజుఁ డప్పు డంగనముఖాబ్జము బల్మిని వంచి మోవిపైఁ
జే యటు పాఱఁద్రొబ్బి పలుసేర్చి నొకించుక నాటునట్లుగా
నాకునకుం గళాభిదుర మై మది నిం పొనరింప మోహనం
బై యుదయించె నొక్కమధురాంచితశబ్దము కంఠసీమలోన్. 16

వ. అంత నావాగ్దేవి యావిధంబున నొదవినకళామర్మభేదనసామ్రాజ్యసంపదనుభవావస్థ మానలాఘవశంక నప్రకాశంబుగాఁ గడపి పుచ్చుటకు నుపాయంబుఁ జింతించి తద్విరోధకారిణి యైనవిభునియభిమతకేళికి విఘాతంబుగ నధరపీడనాసహత్వనాటితకంబున నలుకఁ గల్పించుకొని యవ్వలిమొగంబుగాఁ బొరలె నే నప్పుడు తదీయభావం బంత యు నాయుశ్లేషనయనాంతమీలనాదు లైనశాస్త్రప్రసిద్ధలక్షణంబులచేత నూహించితి నజ్జలజభవుండుఁ దద్విరహదశావికలితధైర్యుం డయ్యు నుల్లంబు నల్గుట నట్టు నెట్టుకొలిపి యి ట్టటు దెల్పుటకుం జొరకుండి యంతటఁ బురోవర్తిశాఖాసమాసంచితసమంజసరత్నపంజరంబున నున్న నన్నుం జూచి యోచిలుకచెలువ యుబుసుపోదు కథ యొక్కటిఁ జెప్పవుగా యనుట యు నేను నోదేవ దేవరముందఱ నెట్టికథ యు నేను జెప్ప భాజనంబనే మీరు చెప్పితిరేని వినియెద ననుడు నట్లేని వినుము చెప్పెద నని యి ట్లనియె. 17

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కాసారసంజ్ఞతోడను, భాసిల్లుచునున్న యొక్కపట్టనమున ల
క్ష్మీసంపద నొప్పెడుసువి, లాసుఁడు రా జొక్కరుఁడు కళాపూర్ణుఁ డనన్. 18

క. ఈజగములఁ గల తనసరి, రాజుల నందఱ ను జయధురంధరుఁడు మహా
రా జితఁ డొనరించెను నిజ, రాజితలీలాకళాపరాజితు లనఁగన్. 19

క. అతఁడు సద్యోయౌవనుఁ, డై తోడన యొకస్వభావుఁ డనుసిద్ధునిచే
నూతన మొకమణి యు నను, ద్యోతితశార్ఙ్గము మెఱుంగుఁదూపులుఁ బడసెన్. 20

గీ. ఆమణికళాక యరుణమై యద్భుతంపు, రంగు గలిగినయది యా మెఱుంగుఁదూపు
లక్షయము లాశరాసన మతనువిజయ, గౌరవానీకసంప్రాప్తికారణంబు. 21

సీ. అంతట నొకఁడు మదాళయుం డనుజగతీనాయకుండు రూపానుభూతి
యనుభార్య యు ను దాను దనమంత్రిధీరభావాఖ్యుండు దోడు రా నట యదృశ్య
నొక్కింత పాలయుట యు ను దత్కళాపూర్ణుఁ బాత్మకోదండవిహారపటుత
ధీరభావునిఁ గడుదూరంబుగాఁ బలాయనము నొందించి మదాళయాఖ్యుఁ
దనకు శరణుచొచ్చినవానిఁ దత్కళత్ర, యుక్తముగ దాసుఁగా నేలియాఁడిగంపుఁ
బనులు సేయించుకొనుచు నింపెనయ నిలిపె, నతఁడు వర్తిలుచుండెఁ దదాజ్ఞలోన.

వ. అని చెప్పిన నప్పలుకులు స్వభావిలాసలోలలోచనాంచలకషితకర్ణిక యగుచు నాక
ర్ణించి యించుక నగుచు శారద నన్నుం జూచి యాకళాపూర్ణుండు మఱి యేమి
యయ్యె నతనికిఁ దల్లిదండ్రులెవ్వ రడుగు మనికఱప నేను నట్ల యడుగుట యు న
జ్జగద్గురుం డి ట్లనియె. 23

సీ. అభినవకౌముది యనుకాంత చే నంత వరియింపఁబడియె నవ్వారవిలాసుఁ
డాతనికిని సుముఖాసత్తి యనునది తండ్రి యు మఱి మణిస్తంభుఁ డనెడి
వాఁడు తల్లి యు నన వాణి హాసంబుతోఁ గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగిలించి
యింతలోనన యార యెన్నితబ్బిబ్బులు దద్దఱిల్లకుఁ డుంచు ధవునిఁ జూపు
చుఱచి యెట్లెటు లారాజుజనని మగఁడి
యు ను జనకుఁ డాఁడువాఁడు నా యనుచు మఱి యు
మిగుల నవ్వుచుఁ జెప్పఁ డామీఁదు ప్రాణ
రమణ మఱి యేమి యయ్యె నారా జనుట యు. 24

క. అనర్మలీలచేత శ, తానందుం డధికసంభృతానందుం డై
తా ను ను మే లొప్పఁగ న, మ్మానిని మెడఁ గౌఁగిలించె మక్కువ మీఱన్. 25

గీ. వదనములు నాలుగిటికిని వరుసఁ గలియ, మెలపుతోడన కంఠంబు మలఁచి మలఁచి
యొసఁగెఁ దదధరపానమహోత్సవంబు, గళము గౌఁగిలితోన చెక్కులు నిమురుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. చెలువ యు నంత నం దొకటిచే జనితాధరపీడ యై మదిం
గొలఁది యెఱుంగ రెండు నని కోపముఁ జూపుచుఁ జాలుఁ జాలు న
వ్వలఁ జెపు దేమియయ్యె ను భవత్కథితుం డలరా జటంచుఁ గౌఁ
గిలి విడిపించి మోము లిరుఁగేలను బాయఁగఁ బట్టెఁ బట్టినన్. 27

ఉ. దానఁ బ్రకాశితంబు లగు తత్కుచకుంభవిజృంభణంబు లేఁ
గ్రానుబెడంగుఁ గొంతవడిఁ గన్గొని చొక్కుచు నంత మోవితీ
పానె నజుండు పెంపే యుఁ బ్రియత్వముతో విని యెల్ల నేర్తు రౌ
నా నృపుఁ డేమి యయ్యెఁ గథ యానతియిం డని పల్కె వాణి యున్. 28

సీ. ఏమి యు నేల యయ్యెడు నమ్మహారాజు సత్వదాత్మం డనుసచివుఁ డంత
రమణిలో నంగదేశమునందుఁ గ్రముకకంఠోత్తరం బనుపట్టనోత్తమమునఁ
దన్నుఁ బట్టముగట్ట నున్నతసామ్రాజ్యవైభవశ్రీసముజ్జ్వలత నొప్పె
నతని యాపురికి మదాళయుండు పసిండికోట పెట్టించి యెక్కుడుగ నతని
దయవడసె నంతఁ దనదు భార్య యును దాను, నునుగ కభినవకాముదీయుతుని నతనిఁ
గొలుచుచును దన్మణివిలోకగుణమహత్వ, మునను మధురలాలన యనుతనయఁగనియె.

సీ.. కని తన్మణీగుణంబునను మెచ్చుచుఁ బ్రథమాగముంను ద్వితీయాగమునఁ దృ
తీయాగముంను దురీయాగముంను నాఁ బ్రఖ్యాతి నొప్పువారలు నలువురు
తత్పురోహితులు సత్వరము గళాపూర్ణుఁ జేరి యాతఁడు దాల్చు చాపమణినిఁ
బర్యాయమునఁ దారుఁ బట్టి తత్సంస్పర్శమహిమచే నానందమగ్నులైరి
యతఁడు తద్వశీకృతాత్ములై వారౌక్ల,యించి యునికిఁ దనదుహృదయమునను
నియతిపళతఁ జాలఁ బ్రియమగుచునికిఁ ద, త్క్రియలకెల్ల నిచ్చగించియుండె. 30

వ. అంత వారిలో నొక్కరుండు మిక్కిలి మందెమేలమ్మున నమ్మణిని గరంబు నొక్కిపట్టుట యుఁ గళాపూర్ణుండు కోపగించుకొని వారిఁ బాయందోలి తదపరాధంబునం జేసి తత్స్వామి యైనమదాళయుని కనకప్రాకారంబు నొల్లక విఘటితంబుగాఁ జేయించె నతండు ను దానికిఁ దలంకక యందుల కేమి యెల్లైన మ దనవాఁడ నతని దేశంబునంద యెం దైవ ను బ్రదికెద నని కళాపూర్ణు సేవ విడిచి కుటుంబసహితంబుగాఁ గ్రముకకంఠోత్తరపురంబు వెల్వడి యొక్కించుక చనుచుండె. 31

సీ. కట్టెదుట ను బూర్ణకలశద్వయం బతిశోభనస్ఫూర్తిమై సొంపుమీఱఁ
గని వేడ్క నుబ్బుచుఁ జని సుఖంబున మధ్యదేశంబున ను జిరస్థితిఁ దనర్చు
క్రముకకంఠోత్తరాఖ్యపురంబు వెడలునప్పుడు ప్రయాణశోభమునఁ గృశత్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును బొంది తేరని ముద్దులపట్టిని. మధురరాలసఁ దలంపఁగ నెఱుఁగఁడ
యప్పు డేమిసెప్ప నాతఁ డాపువుఁబోఁడి, యెట్టివారిని గణియింప దంత
మీఁదమీఁద సుఖనిమిత్తంబు లాదవుచో, నతుమఁ జెందు నిజజనంబుపీడ. 32

గీ. క్రముకకంఠోత్తరపురోత్తమమున కంత, నరుగుదెంచె ను దిరిగి మదాళయఁందు
నిజకుటుంబయుక్తముగ నన్నిసువుభాగ్య, మెట్లు ప్రేరేఁచెనో మటి యెందు నిలక.

క. ఈపగిది నేఁగుదెంచి క, ళాపూర్ణుని గనుఁగొనం జెలంగ నిజకృళ
త్యాపగమొల్లాసిని యై, యేపునఁ దత్ప్రీతి యెంతయెంత యుఁ దెలిపెన్. 34

సీ. అంత మదాళయుం డట్లు దేటి కరంబు పొదలెదుసుతఁ గళాపూర్ణునొద్దఁ
దగ నిల్పి యతనికిఁ దత్ప్రకారముఁ జెప్పి యిట్టిచిత్రవుహాత్వ మేరికైనఁ
గలదెయెందును నీకకా కంచు భార్యయుఁ దాను దన్మహిమ యంతయును రమణఁ
బొగడుచు నింపునఁ బొదలి రత్యంతంబు నతనిపురోహితు లపుడు వినయ
పరతఁ బ్రథమాగమాదులు తిరుగఁ జేరి, రాకళాపూర్ణ నాతండు నాత్మ నిచ్చ
గించుకొని యుండె నోతటిచ్చంచలాక్షి, సుప్రసన్నత్వ మెంత యు సొంపు మీఱ.

గీ. మధురలాలస యంతఁ గ్రమంబు తోడఁ, దల్లిదండ్రుల ప్రోదిని దరుణి యగుచు
నాకళాపూర్ణచేత ననన్యసదృశ, మైన యౌవనఫలముఁ దాననుభవించె. 36

క. నిరవధికప్రేమోదయ, దురపహ్నవకందళన్మృదుస్మితశోభా
సురుచిరకృత్రిమరోష, స్ఫురణంబున బొమలు ముడుచుచు స్సతి పతితోన్. 37

చ. అటు దలఁ డార యెంతటిమహాత్ములు మీరలు నాదుమీఁదనా
కటకట మీవచోరచనకౌశల మోభువనప్రపంచనం
ఘటనధురీణ యన్న వగి కామిని యిం దిపు డేమిగాంచి యీ
కిటుకు గడించి పల్కె దటేఁగింపుము కల్గిన నాకు నావుడున్. 38

సీ. చెల్లఁబో మీసేవ సేయుచు నింతమాత్రము నెఱుంగఁగలేన ప్రాణనాథ
యాదంటమాటలు నిట్టిభావంబుల విధము నే నిచ్చినవిద్య లకట
యిప్పటిమనవృత్తి మీకథ సర్వంబు తుదముట్ట నేమిచెప్పెదరో యనుచు
నూరక యిందాఁక నుంటి నంత యుఁ జెప్పెదను నది వినవలసిన వినుండు
కోలఁ దఁగాసారపురముగాఁ బలికియుండుఁ, బొలుచునామోమునీడనంపూర్ణశశియు
ననుతలంపునఁ బలికితి రపుడు దానిఁ, బ్రకటముగఁ గళాపూర్ణుఁ డన్రాజు గాఁగ.

వ. ఆరాజు=అకళాపూర్ణుఁడు ; సకిరాజుల నెల్ల లీలాకళాపరాజితులం జేసె ననుట=ఆవద
న ప్రతిబింబచంద్రుఁ డెల్లముఖచంద్రులకు నెక్కుడయినసౌందర్యము గలవాఁ డని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యతిశయోక్తి; మీమహత్వవిశేషంబుఁ దెలిపితిరి. ఇది యంతయు విస్పష్టంబు; మఱి యతండు, స్వభావుం డనుసిద్ధుని చేత ధనుర్బాణంబులు నొక్కయరుణమణిశ లాక యుం బడసె ననుట=భ్రూలతావీక్షణంబులు నధరంబు ను స్వభావంబు చేతన కలిగియున్నవి యనుట యని యెవ్వరి కెఱుంగఁబడదు? మదాళయుం డనువాఁడు రూపానుభూతి యనుభార్య యుం దాను ధీరభావుం డనుమంత్రితో నలవోక య టుల వలసినమాత్రఁ గళాపూర్ణుం డాధీరభావుని దనధనుర్విలాసంబునం బలాయనం బు నొందించి మదాళయు నతనిభార్యతోడఁగూడ నొక్కించుక ప్రవర్తించెననునది=మ త్ప్రతిబింబంబు నిజభ్రూవిలాసంబున ధైర్యంబుం బాఱఁదజిమి మీహృదయంబును దృష్టిసహితంబుగా నాకర్షించి విడువ దనుట యై కానిపించుచున్న యది; అంత! ని ష్పలుకులకు నాకు నవ్వువచ్చినది. మత్ప్రతిబింబంబునఁ దోఁచినఁ జూచి యానవ్వును శేఁతవెన్నెలతో సామ్యాతిశయంబు దోఁపఁ దదభేదవ్యవసాయంబుఁ గల్పించి యభినవకౌముదీశబ్దంబునఁ బలికి యది స్త్రీలింగత్వసామర్థ్యంబున స్త్రీనామధేయం బై కాంపింప నభినవకౌముది యనుకాంతచేత నతండు వరియింపఁబడెనంటిరి; ఆకళాపూర్ణునకు సుముఖాసత్తి యనునది తండ్రి యు మణిస్తంభుఁ డనువాఁ డు తల్లి యు ననుట యాప్రతిబింబంబు శోభనముఖసామీప్యంబు కారణంబు గాఁ దత్కాసారమధ్యమణిస్తంభగర్భంబున నుదయించె నని చెప్పుట కాదె? అందు స్త్రీపురుషత్వంబులు మీర లేమితడఁబాటునో విజ్ఞోదుపడఁ గల్పించి పలికి న నేను హాసౌత్సుక్యంబుల నాఁపలేక మీ కభిముఖంబుగాఁ బొరలినఁ గాసారమ ధ్యవిద్యోతమాన ప్రతిబింబంబు వోయి మన్ముఖంబు మీకు నెదుటఁ గాన్పించిన నది మదీయదేహంబునందుఁ గంఠోపరిభాగంబునం గనుపట్టుటం జేసి యాకళాపూర్ణుం డంగదేశంబునఁ గ్రముకకంఠోత్తరపురంబునం బట్టంబుఁ గట్టుకొనియె నంటిరి. అది యే మదీయాత్మాధీనంబు గావున సత్వదాత్ముం డనుమంత్రి పట్టంబు గట్టుటగాఁ జె ప్పితిరి; సత్వదాత్ముం డనఁగ=నమీచీనత్వదాత్ముం డనుట తోఁచుచున్న యదియ; అంతట మీరు మత్కంఠపరిరంభణంబు గావించి యది యుష్మదాత్మాధీనం బగుట ను మీ బాహువులు. సువర్ణ వర్ణంబు లగుటను మదాళయుండు క్రముకకంఠోత్తరంబున కుఁ బసిండికోటఁ బెట్టించె నంటిరి; మీయాత్మ యు దృష్టి యు నెట్టిమమతావశం బుననో మన్ముఖంబునం బాయక వర్తిల్లుచు మధురాధరేచ్ఛ యార్జించుట యరసి మదాళయుండు రూపానుభూతిసహితుం డై యాకళాపూర్ణునకు సేవఁ జేయుచుఁ దన్మణిశలాకమహత్త్వంబున మధురలాలసఁ గనిన దన్మణిశలాకమహిమకు మెచ్చ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుఁ బ్రథమాగమప్రముఖు లయిన మదాశయుని పురోహితు లమ్మణిశలాకం బట్టి చూచుచుఁ దత్సంస్పర్శనమహత్వంబున నానందమగ్ను లయిరనుట=చుంబనేచ్ఛానంతరంబున మీముఖంబులు నాల్గును మదీయాధరపానంబున నింపొందె ననుట గాదె? ఆముఖంబులు ఋగ్యజుస్సామాథర్వణప్రాదుర్భావకారణంబు లగుటను మీయాత్మకు నధీనంబు లగుటను గ్రమంబునఁ బ్రథమాగమాదినామధేయు లైన మదాశయుని పురోహితులంటిరి. అంతట నేను మీముఖచేష్టలచేత నధరపీడ జనించినఁ గోపించి వాని వారించి కాఁగిలి విడిపించుకొనిన నది కళాపూర్ణుండు తనతాళిమణిశలాక యాబ్రాహ్మణులయందు నొక్కరునిచేతఁ గొంత పీడితం బైనఁ గనలి వానిం బాయఁ దోలించె ననియుఁ దత్స్వామి యైన మదాశయుని కనకప్రాకారంబు విఘటితంబు చేయించె ననియుఁ బలికితిరి; అంత దేవరచిత్తంబు దృష్టిసహితంబై మన్ముఖంబును విడిచి పరిరంభవిశ్లేషప్రకాశితంబు లైన యితరావయవంబులకుఁ బోయిన నమ్మదాశయుండు నిజభార్యాసమేతుం డగుచు నాకళాపూర్ణునిసేవ విడిచి తదాశ్రయం బైనయంగదేశంబునకుఁ బోయె నంటిరి; అట్లు పోవుచు నెదుట నొదవిన పూర్ణకలశద్వయశుభనిమిత్తదర్శనంబున నుబ్బుచు నేఁగి మధ్యదేశంబునం జిరనివాసంబు గావించె ననుట ఐక్షోజయుగళసందర్శనంబున నానందించుచు నరిగి వలగ్నభాగంబు నవలంబించి తడవు నిలిచె నని పలుకుట గాదె? ముఖంబుఁ బాయుట యాదిగాఁగ నధరేచ్ఛ యడంగినఁ బ్రయాణక్షోభంబున మధురలాలసకృశత్వంబు నొందె నంటిరి; అంత దృష్టిసహితంబుగా మీయాత్మ తిరిగి మన్ముఖమునకు వచ్చుట యు దానఁ జుంబనేచ్ఛ మగుడఁ బరితుష్టి నొందుట యు నది ముఖపానంబుచేత సఫలమగుట యుఁ గ్రమంబున మదాశయుండు కుటుంబసహితంబుగా మరలి కళాపూర్ణుని సేవకు వచ్చె ననియుఁ దత్కారణంబున మధురలాలసకృశత్వంబు మానె నని యు ను నది యావనంబునఁ గళాపూర్ణు ననుగ్రహంబు వడసె నని యు ను మీ కాముకత సముచితవచనరచనలఁ దేటపఱచితిరి; ఇది యంతయు నిట్లు యగునో కాదో యానతీయవలయు ననిన నతం డెట్లు తప్పదని నగుటయు నతనియథార్థవాదిత్వంబునకు మెచ్చుచు ని ట్లనియె. 49

క. ఇమ్మగుపరిహాసపువా, క్యమ్ములయెడ బొంకువినముగా మీవలన
న్నిమ్ముఁ గనినహరిపొక్కిటి, తమ్మి కడుపుచల్లనై సదా మనపలయుర్. 41

క. అని పలికినతనప్రియభా, మినిపలుకులకు ను బ్రమోదమేదురహృదయుం
డు ను దత్పరిరంభణపరుఁ, డు ను నై యాపద్మజుఁడు గడుం బొలుపొందెన్. 42

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అని సరస్వతికిని గనకగర్భుఁగు రహ, స్యమునఁ జెప్పినట్టిసరసపుఁగథ.
యేర్పడంగఁ జెప్పి యి ట్లని పలికె నా, శిశువు వినుజనులకుఁ జిత్ర మొదవ. 43

గీ. తమయభీష్టకేళితమినొ తిర్యగ్జంతు, వనియొ ననుగణింప కవ్విధమునఁ
జెప్పుకొనఁగ వింటి నప్పల్కు లేను నా, నడుమఁ గదలి పోవ జడిసి యుంటి. 44

ఉత్సాహ. అంత బంజరంబు వెడలి యట్టు నిట్టు నొయ్యనం
గంతు లిడుచు జాజీ జాజీ కడకుఁ బొలఁగి వచ్చితిం
జింతసేయ మింతతడవుఁ జిలుకయున్కి యనుచు నా
యింతి కొంత యలుగ నున్న నేమి యనుచుఁ బల్కినన్. 45

సీ. అంతట నొకసమయంబున నంభోజసంభవుసేవ తా జరపుకొఱకుఁ
జనుదెంచునిర్జరేశ్వరునివెంట ను రంభ చనుదెంచి భారతీశ్వరునిఁ గొల్వ
నంతఃపురంబు కక్ష్యాంతరంబులు కొన్ని చొచ్చి యేతెంచి యచ్చోట నొక్క
పంజరంబున ను మున్నటియట్ల వాగ్దేవిమణితవిశేష మాత్మకు సుఖముగ
నొయ్యనొయ్యవ వర్తించుచున్ననన్నుఁ, జూచి దగ్గఱ వచ్చి యాసొంపు మిగులఁ
జిత్ర మిది యయ్యవారిసంసేవవేళ, నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె. 46

ఉ. ఏను ను దాఁపురం బెఱుఁగ నేర్పడఁ జెప్పితిఁ దత్స్వరోదయం
బైనతెలుంగుఁ దత్ప్రభవ మైనకథాకథనంబు నంతట
న్నానఁగనీక యవ్విబుధమానవతీమణి ప్రేమతోడఁ బై
పై నడుగ న్వివేక మొకపాటియొ చిల్కల కేమి నేర్పినన్. 47

గీ. ఇట్లు చెప్పి యంత నే నవ్విలాసిని, పలుకు మనఁగఁ దొంటిపలుకులకు ను
రెండుమూఁడుమార్లు వెండి యుఁ బలుకఁగ, నచటి కేఁగుదెంచె నజునియతివ. 48

వ. ఇట్లేగుదెంచి కనుబొమలు ముడుచుచు నన్ను నవలోకించి. 49

చ. తలఁకక రోసి యేమిటికి త త్తలపెట్టినదాన విచ్చటం
దెలియము గాని నీవు పెనుద్రిమ్మరికూఁతలదాన వే కటా
బళిబళి యావికారములు భ్రాంతి యవిష్ణుత జాగిలంబ వై
యిలపయిఁ బుట్టు మంచు శపియించె మనంబున నల్క హెచ్చఁగన్. 50

క. రంభ యుఁ దత్కోపపుసం, రంభమునకు వెఱచి యొక్కరత్నమయోరు
స్తంభము మఱుఁగున నొదిఁగె వి, జృంభితతద్రోషభాష వినఁబడ నంతన్. 51

సీ. నలువ యేతెంచి యెన్నఁడు లేని యింతకోపపుఁబలు కిది యేమి పడఁతి యనుచుఁ
దనభార్యఁ బలికె నవ్వనిత యుఁ గోపంబు మించి శోభిలుమృదుస్మితముతోడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏవరుగా యీచిల్కవిధము మున్నుద్యానవనములో మన మాడుకొనినయట్టి
యాకథమాట లాద్యంతంబు రంభతోఁ జెప్పుచున్నది యేను నప్పలుకులు
వింటి నిపుడువచ్చుచు గోడవెనుక నిలిచి, యనుడునదియేమియొకొఁగునిట్లదయవృత్తిఁ
దిట్టుదురె యంచు నతిఁ బల్కి యట్టిశాప, గతికిఁ గుందెడున న్నఁతఁగరుణఁ జూచి.

వ. మాయమ్మశాపంబునకు నొంగా దన నెవ్వరికి నెట్లువచ్చు నది యట్లనుభవించి తద
నంతరజన్మంబున మదాళసయుం డనుజగతీపతికి మధురలాలస యనం దనయ వై జని
యించి కళాపూర్ణుండనురాజునకు భార్యవై యనన్యసాధారణం బైనయైశ్వర్యభో
గంబు లనుభవించుచు సహజం బైనపరమపాతివ్రత్యంబున సకలధర్మంబులను సా
ధించి కృతార్థ వయ్యెదు విచారింపకు మని పలికిన శారద యవ్విభునిం జూచి యిది
యే మయ్యా వెండి యు మదాళసయుండు ను మధురలాలస యు ను గళాపూర్ణుం
డు నంచుఁ బల్కుచున్నవారు దేవరకు నిప్పుడు నవియు కలవరింత లై యున్నవి
యనుచుఁ బలికి నవ్విన నతండు భవదీయవదనవర్ణనాసంబంధికథలయందు నాకుఁ
గలవరింతలు సంతతంబు ను గలుగుట నిజం బైనయది యట్లు గాదు మేదినిమీఁద
నింకఁ గళాపూర్ణుం డను రాజు పుట్టఁగలం డతని కిది పత్నియుఁ గాఁగల దనుట
యు నేఁ దత్కథ వినవలయు నానతి మ్మనిసరస్వతి వల్కిన ని ట్లనియె. 53

సీ. కాంత మున్నీవన్న యాకథ యీకథ య నాఁగ నమ్ము వాచ్యత తోఁచినట్టినామ
జాతిక్రియాదికసకలపదార్థవాక్యార్థాంతరము లెవ్వి యవియ యందుఁ
గలయవి యిందుఁ దత్కథకంటె భేదంబు పరికింప నొనరించెఁ బడసె నిలిపె
నను నివి మొదలైనయట్టి భూతార్థంబు క్రియలపట్టున నొనరించుఁ బడయు
నిలుపు నను నివి యాదిగాఁ గలభవిష్య, దర్థవచనంబు లైనక్రియాపదంబు
లును మకొనుటయె వానియందు ను దలంప, నోసుధాంశువిలాసప్రహాసవదన. 54

ఐ. మఱి యు శ్రోతృజనాపేక్షానుసారంబునఁ దత్తన్నిమిత్తోపాఖ్యానంబులచేత నిది
య కొంత విస్తారంబు నొందఁగల దది చెప్పఁ బనియేమి ప్రధానకథాభాగం బింతి
యె కావున. 55

సీ. అనిన సరస్వతి యద్భుతం బంది యొక్కింత విచారించి కాంతుఁ జూచి
యారాజునకు సుముఖాసత్తి యనునది తండ్రి యు మణిమణిస్తంభనాముఁ
డగువాఁడు దల్లి యు నయ్యెద రే యన్న నం దేమి సందియం బదియు నీదు
చేష్టావిశేషంబు చేతన కాఁగల దని బ్రహ్మపలికె నయ్యబ్జముఖి యు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిగుల వెఱఁగంది యంతట నగుచు మీరు, సృష్టికర్త లెట్లైనను జేయఁగలరు
మదికి వలసినయట్లు చేయుదురు గాని, పట్టి కొడిమెలు నాకును గట్టఁజనదు. 56

క. తలపెట్టకుఁ డేఁక నెన్నఁడుఁ, గలనైనను నుత్ప్రసంగకారణమున వ
ర్తిలినట్టి యీకథాస్థితి, యిల నిట్టివి గోరఁ దివియ నేరైపాటుల్. 57

సీ. మన మంత నేకతంబునఁ జెప్పుకొనినట్టి కథ యిదె తొన యిక్కడ ను బుట్టె
నింతమాత్రముగాక యిటమీఁద నీకథ పృథివిపైఁ గలుగఁ జెప్పితిరి మీరు
తొలుతన యిది బ్రహ్మవలన వచ్చినయది యనఁగఁ దన్మూల మెట్టిది యి యనఁగ
వాఙ్ముఖప్రతిబింబవర్ణన మనఁగ నిట్టిప్రసక్తి నిది సంఘటిల్లె ననఁగ
వచ్చె నగుఁబాట్లు నాకు మీవలన నాథ, నన్ను మన్నించి యింకనైనను దడవక
మీర లూరకయున్న నెవ్వారునంత, వినరుగాన గుప్తంబు గావింపవచ్చు. 58

మ. అనుచుం బైపయిమాట గాక యిది యాహా యాత్మశృంగారశో
భనలీలాయశ మేరి కప్రియము నీపల్కు న్మనోవర్తనం
బును నేకం బగునేని నాలుకతుద న్మక్కంటికొమ్మా విలా
సిని యేనమ్మెద నంచు బ్రహ్మ నగిపించె న్నేలుమాట న్సతిన్. 59

మ. ఘనయత్నంబున నవ్వడంచికొనుచుం గంజాక్షియు న్నాథ యే
మనినం గోపము వచ్చుచున్నది సుఁడీ యత్యంతము న్నన్నిఁకం
జెనకం బ్రాకుఁడు చాలు నవ్వు లని వైచెం గాంతుమీఁద న్నిజ
స్తనగుచ్ఛప్రతిమల్లహల్లకదళోద్యత్కందుకం బంతటన్. 60

మ. అనయంబుం జల మొప్పఁగా మఱి యు నాయబ్జాసనుం డట్ల యా
డెను మానుం డిది యంచు వాణి యు ను వేఁడెం జేరి తా నొక్కచే
తన కంఠంబు ను గౌఁగిలించి యొకచేత న్గడ్డము న్బట్టి చె
క్కునఁ జెక్కొనుచు నొక్కచన్మొన యురఃకోణంబుతో రాయఁగన్. 61

తరల. అతఁడు నేల వినంగదో జలజాక్షి ప ల్కెటులున్న నీ
కత ప్రకాశిత మాట నీ మదిఁ గాంక్షితంబ యవశ్యమున్
క్షితిఁ బ్రసిద్ధము గాఁగ నున్న విచిత్రసత్కథ నీకన
మ్మతమె య ట్లగునేని యేమహిమం బ్రసిద్ధతఁ గల్గెడున్. 62

సీ. వివరింప సకలవస్తువుల ప్రసిద్ధి వాఙ్జాలమూలంబు వాఙ్జాల మెల్లఁ
ద్వ్యస్మయం బి ట్లుండఁ దనయు నీమది కసమ్మత మైనయట్టిది మహి వెలయునె
యాకళాపూర్ణమహారాజు కథ తావకీనశృంగారలీలానిమిత్త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మగుచు మన్మథజాతమగుచు నవశ్యంబుఁగరము ప్రసిద్ధంబుగాఁ గలయది
నీకుఁ బ్రియ మని వేఱ వర్ణింప నేల, నీ విపుడు పల్కు పల్కు స్వాభావికంబ
పతులయనురాగ లీల లేపగిదినైన, వెలయఁగోరి యుదాఁచు టింతులగుణంబు. 63

వ. అనిన విని యాభారతీదేవి యావారిజాసనుం జూచి మీర లింతచలముఁ గొని సమర్థింప నాకు నోఁగా దనసేల యదియునుం గాక యారాజు వాలాయంబుగా ధరణిం బుట్టఁగలం డఁట రాజ్యంబు నుం జేయు నఁట యతనిచరిత్రం బెల్లను వెలయుంగల దఁట యిది సిద్ధంబు దాని సంగడిన యస్మద్రహస్యకథ వెలయుటకు నికుమంబే యనుట యు నతం డిది మునుపున్న నది వెనుకనుం గా వెలయు నని పలుక నల్లెని వెలయుభంగు లెవ్వియో యెఱుంగవలయు మీర లెక్కడ నుడువకుండుఁ డని ప్రార్థించి తడవ ననిపించుకొని తన్నుఁ గనుంగొని యిది యిప్పుడు వారాంగనాజన్మంబునఁ బుట్టనున్న యది యందు నేతద్భోధళంక నెఱయఁ దనిపలికి రంభయనునది యిప్పు డెందుఁబోయె దానికిఁ దగినబుద్ధి చెప్పవలయు ననుడు నప్పుడంతి గడగడ వడంకుచుఁగంబంబుమఱుంగు వెడలివచ్చియడుగులకొఱఁగిన శేరెమ్ము నీవీకథ యెక్కడం దడవిన నాలా గెఱుంగుదుగద యని పలికిన నలువ నగుచు నీలాగు మఱి యెన్వరు నే మెఱింగెదరు; ఈకథ యింకఁ జెప్పినట్టివారు ను విన్నట్టివారు ను ధాత్రియందుఁ బుత్రపౌత్రప్రపౌత్రాది బహుసంతతిఁ దనర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంపదభివృద్ధిశోభితశుభసౌఖ్యంబులు గాంతు రిదియంతయు నావశ్యంబుగ మదీయాశీర్వాదం బని పల్కిన. 64

చ. సతి పతిఁ జూచి మీ చలము సాగినఁ జాలును మీర లన్నప
ద్ధతియ కడు న్నిరర్గళత ధాత్రిఁ బ్రవర్తిలనిం డటంచు నిం
పతిశయిలంగ నవ్వె నపు డచ్చటు వాసి తదాజ్ఞ నేను నీ
క్షితిపయిద్వారకాపురిని జెందితి జన్మము వారకాంతనై. 65

క. అని యీజన్మంబునఁ గల, తనవర్తన మించుక యు ను దప్పక యుండ
న్వినిపించి విచిత్రజ్ఞా, ననిధానము శిశువు రాజునకు ని ట్లనియెన్. 66

క. కలభాషిణి యనుపేర, న్వెలయుదు నే వాణిశాపవిథిఫలమూలీ
లలఁ గడప నొదవె నంతట, నలినజునదయోక్తిఫలము నా కీతను వై. 67

గీ. శక్తిగుడిలోనఁ బ్రాగ్జన్మసమయమునను, నాకు నిద్దివ్యహారసందర్శంబు
కలిమి విఁటిగదా యని తలఁచి యిపుడు, గ్రమ్మఱంగ రెండేండ్లకుఁ గంటి ననుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అలరుచుఁ బ్రమదాశ్చర్యం, బులు మనమునఁ దనర వినయమున నుత్థితుఁడై
యలఘుప్రభుఁ డాబాలిక, కిలఁ జాఁగిలి మ్రొక్కి లేచి యిట్లని పలికెన్ 69

క. తొలుతటిజన్మమునందు ను, గలభాషిణి యనఁగఁ బరఁగి కావించిన నీ
యలఘుచరిత్రలలో నా, తలఁపున నొకవర్తనంబు దార్కొనియెన్. 70

గీ. అనుడు నీ కేమి తార్కొనయయ్యెఁ జెప్పు, మనుచు నానృపుఁ డడుగ నయ్యతివవలనఁ
దగఁ గళాపూర్ణ వినిన చందము జపంబు, తెఱఁగు నానభఁ బడినరీతి యును జెప్పె.

ఉ. చెప్పి యతండు బాలికకుఁ జేతులు మోడ్చుచు నీదు వాక్యము
ల్దప్పవ యందు నామధురలాలస వైన విధంబ యిప్పుడీ
యొప్పిక నీకు నాథుఁడుగ నున్న మహామహు నానృపాలు నా
కెప్పుడు చూడఁగాఁ గలుగు నింత యుఁ జెప్పుము నీవె నాఫుడున్. 72

గీ. క్షితిసుపర్వ యేను జెప్పిన నిఁక లెన్న, యుండ దది యెఱింగియున్న వారు
వీర లెల్ల నడిగి వీరు చెప్పఁగ విను, మనియె శశు వతండు నాదరమున. 73

గీ. ఆసభాపతిఁ జూచి యాయమ్మ యాడు, పలుకువింటి నృపాల యేర్పఱపవలయు
నాకు మీ పేళ్లు మీవర్తనముల నేత, దీయనామపర్తనములు దెలియఁబడఁగ. 74

మ. ఇది యేలోకమొ యేపురంబొ మఱి మీ రెవ్వారొ యీబాల యె
ట్టిదియో యేమి యుఁ గాన కెంత యు ను నా డెందంబు విభ్రాంతతం
జెనర న్నాకిప్పుడె యున్న వాఁడఁ దెలియం జెప్పించుకో వేళ గ
ల్గద యింకాఁకను దత్కథాకథనలీలాభవ్యవైచిత్రి చేన్. 75

సీ. అనుడు నజ్జనపాలుఁ డట్లయా వేళ గల్గదయన్న మాట నీకత యు నాకు
నడుగఁగ నెడలేక యంతకంతకు నద్భుతపుఁ గథ లాడవ నిందాఁక నఘు
వింటిమి కొంత నీవృత్తాంత మిపుడు మావిధ మింకఁ జెప్పెద వినుము తెలియ
నేఁగళాపూర్ణుఁడ నివిరె స్వభావుఁ డిచ్చినయట్టి మణి యు ను సింగిణియును
నమ్ములు ను వీరు ప్రథమాగమాదులైన, యట్టి నలువురు మఱి సత్త్వదాత్మఁ డాతఁ
డాతఁడు మదాళయుండు రూపానుభూతి, యల్లయది యాకెబిడ్డ యీయది శశువు

చ. తనగురుఁ డమ్మదాళయుఁడ తప్పక యట్లు మము న్భజించి నుం
జని చనుదెంచినాఁ డిపుడు నాఁడకుం దను నట్లు నాదుద
ర్శనమున సేవదేఱె నని జాఱు యుఁ దాను ముదద్భుతంబులం
దనరుచు నిట్లు ముందట నతం డిడినాఁడు పసిండితొట్టెలోన్. 77

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. దీని పేరు మధురలాలస యనం బరఁగు నని యాయా పేర్ల వారి నందఱిం జూపి చెప్పి యిది యంగదేశంబు నగు నీపురంబు న గ్రీమకకంఠోత్తరనామధేయంబ నే బని యించినదియుఁ గాసారపురంబ యది యిచ్చటి కనతిదూరంబున నున్నయది యి న్ని యుం జెప్ప నేల వెరసుమాట యొకటి గల దని యి ట్లనియె. 78

సీ. అజుఁడు వాణికిఁ జెప్పినట్టి యాకథలోనివారిపేళ్లు ను వారివర్తనంబు
లొకటి యుఁ దప్పక యుండ మాపేళ్లు ను మావర్తనములు నై యిదికి మిగులఁ
బరమాద్భుతం బొనర్పఁగ శారదావదనప్రతిబింబాదినామకర్మ
కల్పనాకేళిప్రకారమాత్రము లైనయస్మదాఖ్యానక్రియాదికముల
తోడ నెందు నొకింత విజ్ఞోడుపడక, సమ మగుటయెట్లో యనువిచారముగలిగియు
నముముఁ దత్కథలకును విఘ్నంబు సేయఁ, జనమి నూరక యుంటిమి వినుచు నేము.

క. అంతటఁ దత్కథ తుదవృ, త్తాంతముచేఁ దీఱె మాకు నాసందేహం
బంత యు ననుట యు ను మహీ, కాంతున కి ట్లనియె నతఁడు కడుఁజోద్యముగన్

గీ. అజుఁడు చెప్పిన కథలోనియట్ల తండ్రి, గూఁడుమానిసి యు ను మగవాఁడు దల్లి
యును మహీపాలనీకు నాయుల్లమునకు, నిది వెఱఁ గొనర్చుచున్న దియెఱుఁగఁ జెప్పుము.

క. అన నాతఁ ను దద్వాక్యం, బనయము చిత్ర మగుచున్నయది యాశిశువా
త్మ నెఱుంగని యది లే దీ, యనుభావము చూడ నడుగు మది తెల్వివడన్. 82

క. ఆవాక్యము నీబాలిక, యౌవనఫలకథ యు నవిదితార్థము లెందు
న్భావింప నొకటి పోనఁగు, న్భావి యగుట ను మొద లిది వినం దగుఁ దెలియన్

క. అలఘువ్రతుఁ డపుడు కృతాం, జలి యై యాశిశువుఁ జూచి సర్వము నీకుం
దలఁపఁగ విదితమ యాభూ, తలపతి జన్మము తెలుంగు దయఁ దెలుపఁ దగన్.

వ. మున్ను నీకారణంబున నీకళాపూర్ణ కథాకర్ణనఫలమహత్త్వంబు వింటిఁ బదంపడి యిట్టి నాజపంబునకు ఫలం బైనయితనికథ వినికి యు నీకృపనే కలిగె నంతమాత్రంబు ను గాక యీకళ్యాణచరిత్రుని బ్రత్యక్షంబు చూడఁ గంటి నత్యద్భుతం బైన యీతని జన్మప్రకారంబు ను సవిస్తారంబుగా నానతి యిచ్చి నన్నుం గృతార్థునిఁ జేయు మనిన నమ్మధురలాలస యి ట్లని వినిపించె. 85

సీ. భూవిబుధోత్తమ నీవు మృగేంద్రవాహనగేహమునకు మున్నట్లు వచ్చు
నపుడు మణిస్తంభుఁ డనుసిద్ధుఁడు ను సుముఖాసత్తి యనియెడు నతనిసతి యు
నాతోడి సంభాషణమున వర్తిలుచుండి రెఱుఁగుదు తగ నని యేర్పడంగఁ
దత్పూర్వవృత్త మంత యుఁ జెప్పి యి ట్లను వారలు యోగప్రవర్తనమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నమ్మహాశక్తి భవనంబునందుఁ గొన్ని, నాళ్లు విజితేంద్రియతఁ బ్రవర్తిల్లుచుండి
రది యు నీకు ను దెలిసినయదియె యంత, వా రచటువాసి చని యొకవనములోన.

గీ. రతిసలిపి రందు సిద్ధుఁ డోయతివ నీవు, పురుషుఁడవు గమ్ము నారీత్వము ను భజింతు
నే ననుచు విపరీతరతేచ్ఛఁ బలికెఁ, బలుకుట యు నావరమున నజ్జలజముఖి యు. 87

క. స్త్రీత్వము నీవొందుము పురు, షత్వము నేఁ దాల్తు నని నిజప్రియుఁ బలికె
న్సత్వరత నట్లు వారల, స్త్రీత్వము పురుషత్వము విపరీతము లయ్యెన్. 88

వ. అప్పుడు. 89

మాలినీవృత్తము. ఎక్కడనుండియొ కల్గెను సిద్ధున కేమఱుపాటఁ గృశోదరమం
జొక్కపు గుబ్బలు గొప్పకొప్పులు సోగకనుంగవ యొప్పిదమం
జక్కని ముద్దుమొగంబు నితాంతలసత్కబరీభరమై భవము
న్మిక్కిలిఁ గోమల మైనశరీరము మీఱఁగ నాఁడుదనంబు పసల్. 90

గీ. చాల నద్భుతముగ నాలలితాంగి యుఁ, ధవుని రూపాకింత దప్పకుండఁ
బూనె నాక్షణంబ నూనూఁగుమీసలు, గుఱుచపల్లజడలుఁ గొమరు మిగుల. 91

గీ. నలువు గిలువు దంపతుల కొకప్పుడు దడం, బడఁను గాని యెట్టియెడల నట్లు
జగతి నాఁడుఁదనము మగతనము ను దడం, బఱచుకొనుట యెందు నెఱుఁగఁబడదు.

గీ. స్త్రీత్వపురుషత్వనళ లిట్లు చెందువేళ, వారి కొండొరుపై దృష్టి వర్తిలుట ను
దొరకె నొండొరుచూపు లొండొరులకట్లు, భావనయె ప్రధానం బెట్టిపట్ల నరయ.

గీ. అమ్మెయిం బరస్పరాకృతివ్యత్యయం, బగుటఁ జూచుకొని మహాద్భుతంబు
హృదయమున వహించి రిది యేమిమాయయొ, కోయటంచు వారు గొంతతడవు.

సీ. అంతట నాసుముఖాసక్తి యాత్మలోఁ దన్నిమిత్తంబు ను దలఁచుకొనుచుఁ
దననాథువదనంబుఁ గనుఁగొని యిప్పు డే ననినట్టిమాటమహత్వమ యిది
తప్పదు మును జరత్కాయ మే నలశక్తి సన్నిధి వీడ్కొనుసమయమున ను
నను సత్యవచనఁగా నొనరింప నాయమఁ బ్రార్థించితిని వృథయై చన దది
శాసనస్తంభలిపిరీతిఁ జర్చసేయు, ననిన విని యింక నేమియు ననకు మెద్ది
యాడఁబోవఁగ నె ట్లౌనొ యనుచుఁ బలికె, నమ్మణిస్తంభుఁడు భవిష్యదర్థవశత.

వ. ఇట్లు పలికి వెండి యు ని ట్లనియె. 96

గీ. నీకు గర్భంబు గాకుండ నాకు నాకుఁ, గొమరు నీకూటమినిగలుగుటకు నీకు
వరము లిచ్చిన యవ్వాణివాక్య మెట్లు, ఫలితముగనున్న దిదియొ యెఱుంగఁబడదఁ జనదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అది యు ను గాక యంగనల కంగజసంగరకేళికావిశే
షదశలయందు నెక్కుడట సౌఖ్యగతు ల్మగవారికంటె నా
కిది యు నెఱింగికో నిపు డభీష్టము గావున నిట్టులుండఁ గో
రెదనొకకొన్నినాళ్లు విహరింపుము నీవు ను బూరుషాకృతిన్. 98

వ. అనిన విని సుముఖాసత్తి యాయనకు నీవేరూపంబున నుండు మన్న నీదు వాక్యంబు నాకు వేదవిధిసమానంబు గావున నీపల్కినచొప్పున చేసెద నని తదుక్తప్రకారంబునఁ దనపురుషరూపంబుతోడ నడపుచుండె మణిస్తంభుండును నట్టినారీరూపంబునమదన క్రీడలునలుపుచుండెనప్పుడుతమసుముఖాసత్తిమణిస్తంభనామధేయంబులు స్త్రీత్వపురుషత్వంబులవెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొని రంతనాకృత్రిమపనితతనపురుషుండు ను దాను ను నానావిహారయోగ్యంబు లైనయారామప్రదేశంబులు చూచువేడ్కఁ దనసింహంబు నాకర్షించి తదారూఢలై దానియభీష్టసంచారవేగంబునకు సంతసిల్లుచు నంతరిక్షంబునం జరియించుచుండి యెదుట నొక్కపురంబుఁ గని తనహృదయవల్లభున కిట్లనియె. 99

క. పుర మల్లదె యద్భుతగో, పుర మై వరణమిషలసితపుణ్యస్త్రీనూ
పుర మై విభవములకుఁ గాఁ, పుర మై శోభిలెడు నగరమునఁ గనుఁగొంటే. 100

చ. కలకలహంససారసబకప్రముఖాంబువిహంగమండలీ
కలకలనాదలీలఁ దనకైరవతామరసాటలక్ష్మి జో
కలకలమానసాభ్యుదయగౌరవము ల్సరిగా పటించుఁ దాఁ
గలకల నవ్వుచున్న పరిఘావలయంబు విధంబుఁ జూచితే. 101

క. ఈరమ్యపరిఘనడుమ, న్సారపుశృంగములతోడ సాలము పద్మా
కారత నొప్పఁగ నిది కా, సారపురం బంద్రు కొలనిచాడ్పున సునికిన్. 102

క. తోరణము లింద్రధనువుల, తోరణము లొనర్ప నొప్పులోరపుఁబురము
ల్సారపురీతుల నీకా, సారపురీతులకు రావు చర్చింపంగన్. 103

ఉ. తోరపు వస్తుసంపదలతో రమణీయతనొప్పు నిప్పురం
బోరమణుండ రత్నఖచితోజ్జ్వలసౌధవిహారిణీసక
ర్పూరసువీటికారుచిరభూరిసుగంధసమేతవాతసం
చారకృతావిహారసురసంపదపూర్వమనఃప్రమోద యై. 104

క. ఇచ్చోటికిఁ దొల్లి యు నే, వచ్చియెఱుంగుదు ను దీని వైభవమహిమం
బచ్చెరు విందు వసింపఁగ, నిచ్చ యడుచున్నయది యధీశ్వర నాకున్. 105

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అని పలికి యంతట నదీ, నిన దిగవలయు నని యపుడ నేలకు డిగ్గం
దనసింహవాహనముం బ, ట్టి నిజేచ్ఛం దాను దాని డిగి నడిచి చనన్. 106

వ. అప్పట్టున నేను రాజు సత్వదాత్ముం డనెడువాఁడు వాహ్యాళిం బోయి తిరిగి యరుగు
దెంచుచు నాపూఁబోఁడిరూపలావణ్యంబు లాపోవక నిర్నిమేషుం డై నిరీక్షించి త
దనంతరంబున. 107

క. ఒంటరి రాజులఁ గప్పము, గొంటె తన్మే లేర్చి కలికి గుబ్బెతలను వా
రింటఁ గల రంతకంటె ను, గంటికి నిం పైనవాలుఁగంటిం గంటిన్. 108

క. అరరామ గాక నాయిం, టను కా దిటువంటి చెలువ నాకంబున గ
ల్గునె చెప్పనేల సకలా, వనితలనాయకులయిండ్లవనితలసుద్దుల్. 109

క. ఆసిద్ధునిసంబంధం, బీసౌందర్యైకనిధికి నేరీతినొకో
దోసం బిట్టటు భావన, చేసినఁ దెలియదను వారు చెప్పిననింకన్. 110

మ. అని చింతింప యశృంఖ నచ్చెలువ తన్నావేళ నీక్షించినన్
ఘనసైన్యంబులు గొంతమించఁ దనతుష్కారంబు తేజీఁ జివు
క్కున దాఁటించి సుదింది చిత్తరువుబాగు ల్మీఱ నాడించె శో
భనవల్గద్వల్గనాగ్రిమరుచిస్ఫాకుంత్కిరీటంబుతోన్. 111

వ. ఇవ్విధంబున ఘోటకంబు నొక్కింతవడి యిట్టట్టుఁ ద్రొక్కించి యాకించిదుదం
చితరత్నకంకణక్రేంకారంబులు గంపళింపఁ గంఠం బప్పళించుచు నిలిపి యప్పుడు.

సీ. కేయూరమాణిక్యకిరణము ల్మెఱయంగఁ జెలికాని మూఁపునఁ జేయిఁ జేర్చు
రత్నాంగుళీయకప్రభ పేరెములు వాఱఁ గేళిపద్మంబుఁ గెంగేలఁ ద్రిప్పు
లలితదంతాగ్రకాంతులు దొలంకఁ గరండధరునితో రిత్తమంతనము నడపుఁ
దెలినవ్వుడాలు ముత్తియపుఁ జౌకట్ల బెంచఁగ నర్మసఖునితో సరసమాడు
మణికిరీటంబు చాలించి మగుడ దిద్దుఁ, గలుచ కొనగోర మీసలు నులి యడల్చు
నాచకోరాక్షి తనుఁజూచు టరసి యరసి, భావజవికారములు కడుఁ బరిఢవిల్లి.

ఉ. కంతువికార మీకరణి గాటము గాఁ దనయందుఁ బ్రస్ఫుట
క్రాంతిగ నున్నచో నొకఁడు కానుక యిచ్చిన పూవుబంతి బా
హాంతరసీమ నద్దుకొని యామృగలోచనఁ జూచెఁ దాన న
త్కాంత యొకింత జాఱుపయ్యెద ఘటించుచు మోము వంచఁగన్. 114

వ. అంత నశ్వంబు డిగ్గి తా నొక్కరుండ యాసిద్ధునిఁ జేరం బోయి మహాత్మా మీర
లెచ్చటినుండి వచ్చితి రెందుఁ బోవుచు న్నవారు మీనామధేయంబు లెవ్వి యి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్వనిత నీ కేమి యగు నని యడిగిన నతండు తమ వచ్చిన తెఱంగు చెప్పి యేమణిస్తంభుం డను వాఁడ నాపూఁబోఁడి సుముఖాసత్తి యనుపేరం బరఁగు నని పలికి యిది తనభార్యయని యెఱింగించిన నీకురంగలోచన యేతెఱంగున నైన సన్నిధి నున్నం జాలు నటమీఁద భాగ్యవశంబున నైన యట్లయ్యెడుఁ గాని యనిచింతించుచు నతండతనికిం గపటవినయంబునం గృతాంజలియై. 115

చ. హృదయము రంజిలంగ మిము నెంత యు భక్తిని గొన్నినాళ్లు మా
సదనమునందు నుంచికొని శక్త్యనుసారకృతోపచారసం
పదఁ బరిచర్య సేయుటకు మామది నున్నది వేడ్క మీర శే
తదభిమతం బొనర్పు టుచితంబు మహాత్మక సిద్ధశేఖరా. 116

క. అనిన మణిస్తంభుం డం, గనవదనముఁ జూడ నట్లకాని మ్మెందుం
డిన మన కేమీ యని భ, ర్తను బలికె న్నగుచు నాకురంగేక్షణ యున్. 117

క. ఆరీతి ననుమతించిన, వారలఁ దోడ్కొనుచుఁ జనియె వసుధావరుఁ డిం
పారెడు నవమణిమయశిబి, కారూఢులఁ జేసికొని నిజాలయమునకున్. 118

సీ. ఇట్లు దోడ్కొని చని కరం బింపుమీఱు, నట్టిమణిగేహములు పైఁడిపట్టెమంచ
ములు ను సొమ్ములుఁ బరిమళమ్ములు ను జేటి, కాజనంబులుఁ గడునధికముగ నిచ్చె.

క. ఇచ్చి పలుమాఱు వారల, యచ్చటికిం జని వినీతుఁ డై కొలుచుచుఁ దా
నచ్చెలువను దనయొద్దకు, వచ్చుట కడిగించెఁ దగినవారలచేతన్. 120

గీ. ఆలతాంగి యుఁ దన కప్పటి కొక్కింత, గర్భజననశంక గల దటంచుఁ
జెప్పి సిద్ధసుతుని సిద్ధున కీక యేఁ, గలయ నన్య యనుచుఁ గడపి పుచ్చె. 121

క. ఆవారిజముఖి కంత, న్వేవిష్పదయించెఁ జిక్కె నెమ్మేను గను
న్నాభవము మృద్భక్షణవాం, ఛావర్తనఁ జెందె గర్భసంసూచనగాన్. 122

కవిరాజవిరాజితము. కడుఁ గృశమైన సునాభిని మధ్యముఁ గన్గొని కన్గొని యేమొ బలం
బెడలఁగఁ జిక్కెఁ గరం బపు డంగము లెల్లఁ దదీయకృశత్వముఁ బో
గడఁగుటయుం బొదలె న్గతినం బగుకాంతచనుంగవ మున్నగఁ దా
బడలదు తత్పరిపుష్టితటిం గనుపట్టు మొగంబుల నవ్వొదవన్.

మ. కడుఁ దోరంపుఁ బయోధరంబుల మొన ల్గప్పారుచుం బర్వన
ప్పుడు తద్వక్త్రసుధాంశుబింబ మనయుంబుం బాండురశ్రీఁ గనం
బడియె న్గార్తికపూర్ణిమాతిథిబలె న్భావించి చూడంగ నె
ర్య్యెడనున్ స్థానగుణంబునం గలుగవే యేమేనియుం జిత్రముల్. 124

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అంతఁ గడుఁగెంపు పాదతలత్త్యాళవదలె, వళులుపిరియఁగఁ జూపెఁ జేరలఁ దమి పై
నాభివికసించె గతుల మాంద్యంబుమించె, నతికిఁ బ్రొద్దులనెల చొచ్చె జడత హెచ్చె.

క. ఈరాజోత్తముఁ డంతట, నారమణికి నుద్భవిల్లె నైదుగ్రహంబు
ల్సారగుణత నుచ్చస్థా, నారూఢిం దనర భవ్య మగులగ్నమునన్. 126

సీ. సకలదిక్కులు ను బ్రసన్నతఁ గాన్పించెఁ జలువనెత్తావిగాడ్పులు చరించెఁ
గుసుమవర్షంబు లోకుల కద్భుతము చేసె శుభలీల దివ్యదుందుభులు మ్రోసె
సర్వామరులజయశబ్దము ల్వెలసిల్లెఁ బరఁగఁ ద్రేతాగ్నులుఁ బ్రజ్వరిల్లెఁ
బరమసాధుజనంబు భావంబు లుప్పొంగెఁ గలుషచారిత్రుల బలిమి గుంగె
శౌర్యగాంభీర్యధైర్యసౌజన్యనీతి, సత్యకీర్తిప్రతాపాదిసకలసుగుణ
పుంజరంజిష్యమాణభూభువనుఁ డగుచు, నిమ్మహారాజవరుఁ డుదయించునపుడు.

వ. బ్రహ్మదేవుం డితనితల్లిదండ్రులకు నాగంతుకంబు లైనవర్తమానస్త్రీత్వపురుషత్వ నామధేయంబులు చూడక సహజస్త్రీత్వపురుషత్వనామధేయంబు లవలంబించి యవ్విధంబునవ్విభునకు మణిస్తంభుండు తల్లి యనియు సుముఖాసత్తి తండ్రియనియుఁ బలికినవాఁ డతనివాక్యంబున కన్యథాభావశంక గలదే యమ్మణిస్తంభుండు పుత్రోదయం బైనయనంతరంబ తనతొల్లింటి మగతనంబు తనకును సుముఖాసత్తి యాఁడుఁదనంబు సుముఖాసత్తికిని గలుగునట్టులా మెచ్చేతం బలికించి యాభార్యయుం దాను దమతమ పూర్వనామధేయంబులతోడన తిరుగ యోగాభ్యాసభాసురులగుచుఁ గాసారపురంబున నయ్యున్న వారలీరహస్యంబు వారివలనం దార్కాణగాఁ దెలియవలసినఁ దెలియుండని పలికి యి ట్లనియె. 128

ఉ. ఎప్పు డితండు తల్లి కుదయించెం గరంబు విచిత్రలీలమై
నప్పుడ కల్గె యౌవనము యౌవన మెప్పుడు గల్గె నిచ్చెఁ దా
నప్పుడ వచ్చి యొక్కమణి యమ్ములు విల్లు స్వభావసంజ్ఞతో
నొప్పెగు సిద్ధుఁ డిందుఁ బ్రథమోత్తమభావముఁ గాన రెవ్వరున్. 129

సీ. అంతఁ గళాపూర్ణుఁ డనునామ మితనికి నిడియె నాసిద్ధలోకేశ్వరుండు
అప్పుడ తత్పట్టనాధీశుఁ డతనిసద్యోయౌవనాదిమహోన్నతి విని
యితఁ డెవ్వఁడో మహాద్భుతవైభవుఁడు దివ్యపురుషవర్యుండు గాఁబోలు నితని
తల్లి నేనితరసాధారణంబుగఁ జూచి కామించి పాపంబుఁ గట్టుకొంటి
నిది మఱవఁ జేయఁదగు నేమి యిచ్చి యైన, ననుచు నాసాధ్వి కడకేఁగి యమ్మనిమ్ము
నెఱుఁగ కొనరించినట్టి నాయొగ్గు లెవ్వి, గల్గినఁ గృతార్థచిత్తవై కావు మనుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. తత్ప్రియంబుగా నితనికి నిజాధిపత్యం బెల్ల సమర్పించి తాను మంత్రి యై కొలిచి యుండె నని చెప్పిన నలఘువ్రతుం డాబాలికం జూచి స్వభావుం డనఁ బరఁగు నా సిద్ధుఁ డెవ్వఁ డేమికారణంబున నమ్మణి యు శరచాపంబు లితనికిఁ దెచ్చి యిచ్చె నని యడిగిన నది యి ట్లని చెప్పె. 131

సీ. ఓవిప్రవర యాస్వభావాఖ్యసిద్ధుండు విను సుముఖాసత్తి జనకుఁ డాతఁ
డాపుత్రి జనియించినట్టిపిమ్మటఁ దనకాంతను విడిచి దేశాంతరియయి
తిరుగుచు మాహురీపురమున కేతెంచి యందు దత్తాత్రేయు నఖిలయోగ
విద్యారహస్యకోవిదు మహామహుఁ దపశ్చర్యచేఁ దనకుఁ బ్రసన్నుఁ జేసి
కనియెఁ దత్కృపచేత యోగప్రకార, ములు సమస్తంబు తద్యోగవిలసనమున
భావమెప్పుడు దనయందుఁ బాదుకొలుపు, చునికిఁజేసి స్వభావాఖ్యయొనరఁదాల్చె.

ఆ. అనుచు వినయ మొప్ప నలఘువ్రతుండు కే, ల్మోగిచిసకలబోధములకు నిధివి
నీవెఱుంగనియవిలే వెవ్వి యోగము, లెప్పవలయు ననిన శిశువు పలికె. 133

క. విమలాత్మ క వినుము ప్రశ, స్తముజీవాత్మపరమాత్మసంయోగము యో
గమనఁ దదంగము లెనిమిది, క్రమమున వినిపింతుఁ దత్ప్రకారము దెలియన్. 134

వ. ఆయోగాంగంబులు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణధ్యానసమాధు లనం బ్రసిద్ధంబులై యుండు నందు నొక్కటొకటి యనేకభేదంబు లగునవి యెఱింగించెద వినుము. 135

మ. యమము. న్సత్యదయాక్షమాధృతిమితాహారార్జవబ్రహ్మచ
ర్యము లస్తేయ మహింస శౌచమనఁబొప్పారున్ ధరిత్రీసురో
త్తమ యందుం దశభంగు లై పరుల బాధంబెట్ట కింపారు బొం
కమి సత్యంబు పరార్తి కోర్వమి దయాఖ్యం బెంపుమీఱుం గదున్. 136

క. విను మొరులతప్పులందుం, గనలక సైరించి యునికి క్షమ యనఁ బరఁగున్
ధనబంధువియోగాదుల, ను మనస్సు కలఁగమికిని గొలు ధృతియనన్.

క. ఎనిమిదికబళంబులు యతి, కినుమడి వనవాసి కతని కినుమడి గృహికి
న్వినుము లఘుభోజన మితరుల, కనఘ మితాహార మనఁగ నభినుతి కెక్కున్.

గీ. విహితకర్మంబు లెందుఁ గావించునెడల, మతినిషిద్ధకర్మంబులు మానునెడల
వాఙ్మనఃకాయకర్మప్రవర్తనంబు, నూనె యార్జవ మన మహీసురవరేణ్య. 139

సీ. సన్న్యాసికిని బ్రహ్మచారికి నైష్ఠికుం డగువనస్థునకు నోయనఘచరిత
స్త్రీసంగమంబు న ద్రికరణంబులయందు నొకయప్పుడును జేయకునికిబ్రహ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చర్యంబు బుతుకాలభార్యాభిగమనంబుఁ దక్కినపోంట్లతోఁ దద్వివర
మును మానుట యు గృహస్థునకు ను బ్రహ్మచర్యంబింక నస్తేయ మనఁగ నెందు
చౌర్యమెఱుఁగమి యెపుడు నేజంతువులకు, నె గ్గొనర్పక యునికి యహింస యనగఁ
శౌచమున రెండు దెఱఁగులై శాస్త్రములను, బాహ్యమును నాంతరంబునాఁ బ్రబలుతి కక్క.
గీ. అందు బాహ్యశౌచమనఁగ మృజ్జలములఁ, జేయఁబడినయది ప్రసిద్ధి కెక్కు
నాంతరం బనంగ ననఘ ధర్మమున న, ధ్యాత్మవిద్య చేత నయినశుద్ధి. 141
క. వినునియమంబులు పది తప, మును సంతోషాస్తికత్వములు దానేశా
ర్చన సిద్ధాంతశ్రవణము, లు ను హ్రీ యు ను మతిజపంబులును వ్రతము నన్. 142
గీ. కృచ్ఛ్రచాంద్రాయణాదిక క్రియలఁ గాయ, శోషణము సేత తపము సంతోషమనఁగ
నిప్పుడమి లాభము న గల్గ హృదయవృత్తి, నదిలుచాలునం చునికిసు మ్మనఘచరిత.
క. విను పుణ్యపాపములు గల, వనియెడు విశ్వాస మెద్ది యది యాస్తిక్యం
బనఁబరఁగు న్న్యాయార్జిత, ధనమర్థులకొసఁగు టొప్పు దానం బనఁగన్. 144
క. ఈశార్చన మన హరిఁ బర, మేశం బూజించుట యు ను నెపుడు ను రాగా
వేశాగతహింసాప్రమము, ఖాశంకలు లేని హృద్వచోంగస్థితియున్.
సీ. అనఘాత్మ వినుము సిద్ధాంతశ్రవణమ న వేదాంతశాస్త్రంబు వినుచు నునికి
వైదిక లౌకికవర్తనలకు దూర మగునింద్యకర్మంబునందు లజ్జ
యెయ్యది యది సుమ్ము హ్రీశబ్దవాచ్యంబు, విహితసదాచారవిధులమీఁది
శ్రద్ధ మతి యనంగఁ బ్రస్తుతి కెక్కు ను వేదబాహ్యము గాని విమలమంత్ర
ము ను గురూక్తమార్గమున జపించుట యు న, ధీత మగుశ్రుతిస్మృతీతిహాస
ముఖ్యవాఙ్మయంబు మనుకొని యావర్త, నంబు సేత జప మనంగఁ బరఁగు. 146
క. వినుము విశిష్టాచారం, బు ను ధర్మప్రముఖనిఖిలపురుషార్థకరం
బు ను నగునుపవాసాదిక, మనఘాత్మక సుప్రసిద్ధ మగు వ్రత మనఁగన్. 147
క. ఈయమనియమంబులు గల, ధీయుతుఁ డధికారి వసుమతీసురవర ని
శ్రేయసకరాసనప్రా, ణాయామాద్యుత్తరప్రయత్నంబులకున్. 147
వ. ఆసనంబు లనేక భేదంబులం బ్రవర్తిల్లు నం దుత్తమంబు లయిన కొన్నిటిని వివ
రించెద.

క. విను జానూర్వంతరభా, గనివేశితపాదతలుఁడుఁ గడుబుజుకాయుం
డు ను నై కూర్చుండఁగ నో, యనఘాత్మక వెలయు స్వస్తి కాసన మనఁగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. వామపృష్ఠపార్శ్వమునన వామగుల్ఫ, మమరఁ బార్శ్వాంతరమున గుల్ఫాంతరంబు
నునిచి గోముఖాకృతి దృఢాసనత నునికి, యమలగుణ గోముఖాసన మనఁగ బరఁగు.

సీ. దక్షిణపాదంబు దక్షిణాంకమున నదక్షిణపాదం బదక్షిణాంక
మున నిడి యిరుగేలు వెనుకగా వీడ్వడ నిగిడించి బొటవ్రేళ్లు దగులఁబట్టి
యురముపైఁ జుబుకాగ్ర మొనరంగ హత్తించి దృష్టి నాసాగ్రసుస్థితము సేసి
యునికి పద్మాసన మన నొప్పు నిందుఁ గొందఱు చిబుకవ్యవస్థానియమము
చెప్ప రొకకొంద ఱూరుసుస్థితిగనదుఁగు, దోయి యుత్తానముగ నిడి తొడలనదుమ
నట్ల పాణులు నిలిపి నాసాగ్రదృష్టి, యగుచు నునికి పద్మాసనం బం(డ్రు బుధులు.

తే. అనఘ తుదఁ జెప్పినట్టి పద్మాసనవిధి, యందుఁ జిబుకాగ్రము నుహృదయమునఁ జేర్చి
రాజదంతమూలంబున రసన చేర్చి, వాయుకర్షణ మొయ్యనఁ జేయవలయు. 153

క. కుడితొడపై వామపదం, బిడి యితరము మీఁద నితర మిడి నిశ్చలతం
గడుఁ గుదురై కూర్చుండుట, పుడమి స్వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా. 154

శా. అండాధస్థిత మైనరేఖ యుభయోపాంతంబుల న్గుల్ఫము
ల్రెండు న్వీడ్వడఁ జేర్చి బాహుయుగము ల్వ్రేళ్లుం గడుం జిక్కనై
యుండ జ్జానువులందుఁ బూన్చి వివృతాస్యుం డై సునాసాగ్రవీ
క్షుం డైయుండెడు నట్టియాసనము మించు న్సింహసంజ్ఞాక మై. 155

మ. తనగుల్ఫంబులు రెండు నంటి యుగళాధశ్శేఫసీపార్శ్వవ
ర్తన నుండ న్ఘటియించి హస్తములఁ దత్పార్శ్వంబు లత్యంతయ
త్ననిరూఢిం గ్రహియించి వర్తిలుట యోధర్మాత్మ భద్రాసనం
బనఁ బ్రఖ్యాతి వహించి యుండు నది సర్వారోగ్యదం బెప్పుడున్. 156

క. తగ మేహనంబుపై న, వ్యగుల్ఫ మిడి దానిపైఁ దదన్యం బిడి గ
ట్టిగఁ గూర్చుండుట యోభ, వ్యగుణా ముక్తాసనాఖ్య మై పెంపొందున్. 157

క. కొందఱు సిద్ధాసన మని, కొందఱు వజ్రాసన మని కొనియాడుదు రిం
పొందఁగ దీనిని మఱి యొక, కొందఱు గుప్తాసన మనుకొంద్రుమహాత్మా. 158

చ. కరతలము ల్ధరిత్రిపయి గట్టిగ రెండు ను నూఁది వానికూ
ర్పరముల నాభిపార్శ్వములఁ బన్పడ నాని శరీర మెల్ల నం
బరమున దండలీలఁ గనుపట్టఁగఁ జక్కగఁ జాగి యున్కి సు
స్మరయ మయూరసంజ్ఞ మగునాసన మోధరణీసురోత్తమా. 159

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. జగతిపైఁ బాదములు రెండుఁ జక్కఁ జాఁచి, పాణులఁ దదగ్రములు బిగఁబట్టి నుదురు
జానువులఁ జేర్చి యున్కి యోసాధుచరిత, తాపసేంద్రులు పశ్చిమస్థానమండ్రు.
క. ఈయాసనములు మిక్కిలి, గాయలఘుత్వము ను సకలగదనాశనముం
జేయుచుఁ బాపనిశాయము, పాయం దోలుచు ను బరఁగు భవ్యచరిత్రా. 161
సీ. ధౌతి నేతిక పాలభాతి వస్తి త్రాటకములు నౌలియు నాఁగ నమరుయోగ
షట్కర్మముల దేహసంసిద్ధికలితుఁ డై పరఁగ నీచెప్పిన భద్రసింహ
పద్మాసనాదులఁ బరిచయం బమరంగఁ బ్రణవసంఖ్యాభేదగుణనిరూఢిఁ
గొమరొందు పూరకకుంభకరేచకంబుల విశేషంబుతోఁ బొలుపుమీఱు
చున్నయట్టిప్రాణాయామ మోమహాత్మ, సలుపఁజలుపంగ మారుతజయము గల్గ
నంతకంతకు సంసిద్ధి నతిశయిల్లు, నాఁడునాఁటికి మేనిలోనాడు లెల్ల. 162
తే. విను మహానంబునకు రెండు వ్రేళ్లయెడను, బైనెసఁగు పాయువని యున్కిపట్టునకును
బైని తొమ్మిది వ్రేళులపాటియెడను, ధరణిసురవర్య నాడికందంబు వొలుచు. 163
తే. ఉండుఁ దనువున డెబ్బదిరెండువేలు, నాడు లొకటియు నూఱు గణ్యంబులందు
నందు బదునాల్గు శ్రేష్ఠంబు లందులోన, మూఁడు నతికెక్కు నందును ముఖ్య మొకటి.
వ. పదునాల్గు నాడులలోపల సరస్వతీప్రముఖంబు లైన యేకాదళనాడులు జిహ్వాది
వ్యాపారకారణంబు లై పరఁగు నిడాపింగళలను నాడీద్వయంబు వామదక్షిణ
నాసారంధ్రగామిను లగుచుఁ బ్రాణాయామసాధనం బై ప్రవర్తించుఁ బ్రధానతమం
బైన సుషుమ్నాహ్వయనాడి బ్రహ్మనాడియనం బరఁగుచు నాడికందమధ్యవర్తిని యై
బ్రహ్మరంధ్రగామిని యై యుండు నందుఁ బవనంబుఁ బ్రవేశింపఁ జేయుట యుత్తమ
యోగం బనం బరఁగు నింకఁ బ్రత్యాహారప్రకారంబులు విను మని యిట్లనియె. 165
సీ. ఇంద్రియార్థములందు నింద్రియంబులఁ బ్రవర్తిలనీక గుదియించి త్రిప్పు టొకటి
యవియెందుఁ జరియించె నదిసమస్తంబు నాత్మయకాఁగ మనసులోఁ దలఁచు టొకటి
నిత్యకర్మంబు లన్నియు నాత్మయంద సంతతము చిత్తముచే నొనర్చు టొకటి
తనువునఁ గలపదునెనిమిదిమర్మసీమలఁ గ్రమంబున గాడ్పు నిలుపు టొకటి
యోగశాస్త్రశీలయుతులు ప్రత్యాహార, భేదరీతు లనుచు నాదరమున
సాంప్రదాయకముగఁ జలుపుచు నుందురు, రోవసుంధరాసురావతంస. 166
సీ. పాదాదిగా జానుపర్యంత ముర్వి యూర్వాదిగాఁ బాయుపర్యంత ముదక
ముదరాదిగా వహ్ని హృదయాబ్జపర్యంత మగ్ని యగ్న్యాదిగా నందుమీఁద
భ్రూమధ్యపర్యంతము మరుత్తు మరుదాదిగా మూర్ధపర్యంత మోమహాత్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నభము వర్తిల్లు తానక మవి యైకు సేవింప వేఱ్ఱేలుగ విహితగతిని
ధాతృవిష్ణురుద్రేశసదాశివాఖ్య, దైవతముల పృథివ్యాదితత్త్వపంచ
కమున ధారణ మొనరింపఁ గావలయు ను, బ్రణవమున ను బ్రాణాయామభంగు లమర.

గీ. అని మఱి యు ను దద్రహస్యవిశేషంబు, లన్ని యు ను వచించి ప్రాణముఖ్య
పవనగతుల తెఱఁగు పదు నెనిమిదిమర్మ, ములు ను నాడు లందుపొలుపుఁ దెలిపె.

వ. తెలిపి యింక ధ్యానప్రకారంబు విను మని యి ట్లనియె. 169

క. అప్రతిమముగ విజాతీ, యప్రత్యయవాసనానిరాసంవిచ్ఛి
న్నప్రవహాదురుసజాతీ, యప్రత్యయరూపమగుచు ధ్యానము వెలయుఁ౯. 170

క. అది సగుణధ్యాన మన, స్సదమలగుణ వినుము నిర్గుణధ్యాన మన
న్విదితముగ నిరుదెఱంగుల, మొదలిటియది చేయ నితరము ను సిద్ధించు౯. 171

చ. సగుణమనంగ నింక విను శంఖసుదర్శనముఖ్యచిహ్నితం
బగుపురుషోత్తమాకృతిఁ దదన్యము నిర్మలనిత్యచిన్మయం
బగుపరమాత్మరూప మది యబ్బుట దుర్లభ మెట్టివారికి
న్సగుణవిలాసచింతనము సల్పఁగఁ జల్పఁగ దాని భూసురా. 172

క. మానసము విష్ణునందు, న్లీన మగుచు నించుక యుఁ జలింపక యుండం
బూనుట సమాధి యగు వి, ద్యానిరతా యుక్తరూప మది భావింప౯. 173

వ. యోగవిద్యాప్రకారంబు దీనిమహత్వంబునం జేసి యత్తెఱంగున భావంబు దన యం
దుఁ దిరంబుగా నిలుపుచు నాసిద్ధుండు స్వభావుం డనంబరఁగె. 174

తరల. అతఁడు నిత్యము నాత్మయోగసమాధికి న్విజనస్థల
స్థితి మనంబునఁ గోరి పెక్కులు దేశము ల్తిరిగుచుం
గతివశంబున జన్మదేశము గాంచి యందుఁ గడు న్వివి
క్తతల మంచు వసించెఁ దా శతతాళదఘ్నప్రాదంబులో౯. 175

సీ. అట్లువసించి యోగారూఢి నుండుచోఁ దనయల్లుఁ డాలిపైఁ గినుకవలన
మడువున నారీతిఁ బడి తన్నుఁ జేర వయస్తంభమణి మొద లైనయట్టి
వానిఁ గొన్నిటి నిచ్చి తా నంపెఁ గాని యప్పుడు దనబంధుత్వము ను దెలుపఁగఁ
బోయిన బంధంబు పోనీక తగిలించుకొన నేల ఘనుడఁగ నసుతలఁపున
నంత నెంత యు బహుకాల మరుగ నతఁడు, నియతిపశమునఁ దద్యోగనిష్ఠ వదలి
ప్రాదములోపల వెలువడి యరుగుదెంచె, సకలబుధసేవ్య మైనశ్రీశైలమునకు. 176

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. కీలితయోగవైభవుఁడు సిద్ధుఁడు వేడుకమించఁ గాంచె శ్రీ
శైలము నీలలోహితలసన్మణిచిత్రితసానువైభవో
త్తాలము సేవకేప్సితఫలదానవిధాననవీనదేవతా
సాలము నిత్యవర్ణగుణజాలము ముక్తిలతాలవాలమున్. 177

ఉ. పెల్లగిలెన్ సుచేయుమల పెంపడి ఘూర్ణిలె మందరంబు దా
విల్లయి వంగె మేరుగిరి వింధ్య మిల న్మఱుఁగంగఁ గ్రుంగె రూ
పెల్లఁ దుషారమాత్ర మగు టెన్న హిమాద్రికి సాజ మై ప్రవ
ర్తిల్లె ను గాన శ్రీనగము శ్రీనగ మన్ఘనకీర్తికిం దగున్. 178

సీ. నవపుష్పవనము నానామణుల్ గ్రుచ్చిన పచ్చపట్టుగ బాయిబాగు నెఱప
ధాతుస్థలంబు లాతతకుంకుమాంగరాగప్రకారంబునఁ గానిపింపఁ
దెలిడాలు పచరించు సెలయేటికాలువల్హారవల్లరులసోయగముఁ దాల్ప
బహువిధోపలయుతోపత్యకాభాగభద్రాసనలీలల నతిశయిల్ల
నపరధరణీభృన్మూర్ధసమాదరార్హ, పాదకటకంబులమరంగఁ బ్రణుతిఁ గన్న
యన్నగేంద్రునికిని గిరీటార్పణకరి, యైనయడిగంపుఁగత్తె మధ్యాహ్నలక్ష్మి. 179

క. సిద్ధమణు ల్గనుగనులు, న్సిద్ధౌషధమూలికావిశేషపుఁబనులు
న్సిద్ధరసధునులు గూడి ప్ర, సిద్ధిగఁ జెన్నారూపు శ్రీగిరి యయ్యెన్. 180

క. పాతాళగంగ యనిరొందు, కైతవమున నన్నగేంద్రు కాలికడియ ము
ద్యోతించు గండశైల, వ్రాతమిషస్థితనగాంతరప్రతిమలతోన్. 181

చ. ఘనపరిరంభసంభ్రమవికాసములం గనుపట్టినట్టి మి
న్ననుహరిపేురంబు దనయందు సదార్కొనకుండ నొత్తి ప
ట్టిన నిధిగర్భబాహునవళీవిఁ బ్రవర్తిలు నన్నగంబు శో
భనఖచరద్రుమావిరళపల్లవతల్లజశోణపాణి యై. 182

వ. ఇవ్విధంబున నతిపవిత్రవిచిత్రమహిమంబున నతిశయిల్లుచున్న నగోత్తమంబు నత్యంత
భక్తియుక్తుం డగుచు నధిరోహణుం డగుచు మల్లికార్జునమహాదేవసేవావిధానం బ
నూనంబున నడిపి యదృచ్ఛావిహారంబున సంచరించువాఁ డందు నంతట భృగుపా
తంబున కాయత్తపడుచున్న మణికంధరుం జూచి నీ వెవ్వండ వీసాహసోత్సాహం
బునకుం గారణం బేమి యెఱింగింపవలయు ననుట యు నతండు తనపేరు సుం జాతి
యుం దెలిపి తద్భృగుపాతోత్సాహపర్యంతంబుఁ దనపూర్వవృత్తాంతంబు సకలంబునుం
జెప్ప నందు వినంబడిన నిజపుత్త్రీజామాతలవృత్తాంతంబున నుత్కంఠమానమానసుం డ
గుచు మఱియుం దద్విశేషం బతనికి నెఱుకపడినంత యడిగి తెలిసి తాను సుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్రిజనకుం డగుట వినిపించి తనవర్తనం బంతయుం జెప్పి శారదాదేవి యాసుగాత్రి శాలీనులకు నిచ్చినవరంబు లెట్లుఫలితంబు లగునో యని యొకింత చింతించి యవి య ట్లట్ల సఫలంబులు గాక మానవుగా యని నిశ్చయించి మణికంధరున కి ట్లనియె.

సీ. నారదుపరిచర్యచే రుక్మిణీకాంతు శిక్షను సంగీతసిద్ధిఁ గనుట
యమ్మానికరుణచే హరిభక్తితీర్థయాత్రాది పుణ్యంబుల నతిశయిలుట
నసుమఁ బ్రమాదంపునడకఁ జేకుఱినశాపము రాజ్యఫలముగాఁ బనుపఱచుట
యధికపుణ్యప్రాప్య మైనగంధర్వజాతిని సముద్భవమంది తేజరిలుట
యూహ సేయుంగ నీ వింక నొందుజన్మ, మమితసాద్గుణ్యసంపన్న మగుట ధ్రువము
పుణ్యవాసన లూరక పోవునూవె, యెట్లుఁ దమతమఫలముల నిచ్చుఁగాని.

క. సుగుణగణైకనివాసం, బగుజన్మము నీకుఁ గలిమికాదిమహేతూ
పగమంబ చాలు నిచ్చుట, భృగుపాతంబునకు నే నపేక్షిత మింకన్.

చ. అనుచు నతండు శ్రీమహితు లై శుచివర్తను లైనవారికిం
దనయుఁడ నై జనించుట యె తర్పితమంచుఁ దలంచినాఁడ నా
విని యెటులైన నెంతయుఁ బవిత్రచరిత్రత నీకుఁ గాన్పడం
దనరినవారు మత్పిత యుఁ దత్సతి యుం దలపోసి చూడఁగన్. 186

ఉ. వారలు తల్లిదండ్రులుగ వాంఛయొనర్చుట మేలు గాదె యిం
పారఁగ దాన నాకును దబిఖం బగు టొక్కటి యెక్కు డాప్రియం
బూరకపోదు నీమదికి నోపని యట్టి మహోపకార మో
సారగుణాఢ్య యేఁ జలుప శక్తుఁడ మీఁదట నీకు నెంత యున్. 187

సీ. తొల్లి యొకపుడు మద్గురువుల నే నాత్మ పరిరక్షకొఱకు నను బట్ట నొకటి
కావలయు నటంచు దైవసంప్రేరణ నడిగిన సృజియించి యట్లు నాకు
నొసఁగుచు నిది యమోఘాస్త్రమం బని పల్కి వారలు నన్ను నీవంశ మిఁక ను
క్షత్రవంశంబు గాఁగల దని రావాక్య మరసిన నీవు నా తల్లినకును
గొడుక వై పుట్టుటకె యనుకూల మగుచు, నున్నయది క్షత్రధర్మ మత్యుజ్జ్వలముగ
జగతి యేలెడు తక్కినసందియంబు, లన్నియు ను మాని నామాట యాచరించు.

సీ. అనుచు నట్లేని నాయాత్మచందము విను మ ట్లేను మాఱుమే నత్త నందు
రాజ నొటకు ను గారణములు నున్న వింక ను బవిత్రులయింట జననమొందు
కాంక్షచే నిప్పు డీశ్వరిచేశ్వరపుఁ జటి నుఱుకుచున్నాఁడ ను మఱియుఁ గొంత
మదిలోని మెరమెర మాన దేమిటికి నంటేని నెంతటిరాజ నైన నెట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పావనులయింటఁ బుట్టిన బహిరబహిర, రాతివర్గజయం బజస్రమును గలిగి
వర్తిలుట యబ్బురముగాన వగపుగలదు, చిత్తమున నాకు నోమహాసిద్ధవర్య. 189

గీ. అదియుఁ గాక రాజ్యమన్మహాభూతంబు, సోఁకినప్పు డెట్టి సుజనులకు ను
లేని చీఁకుదనము లేని మూఁగతనంబు, లేని చెవుడుఁ గొంతయైనఁ గలదు. 190

గీ. వేదశాస్త్రాది సకల సద్విద్యలందు, నెందుఁ గొద వించుక యు లేక యొసఁగునట్టి
బ్రాహ్మణుల గోష్ఠిచే నట్టి రాజ్యదోష, ములునివారింపనగునని తలఁచితేని. 191

ఉత్సాహ. భోగ్యవస్తుతృష్ణ లేనిపుడమి కేనిదానము
లోభ్యయోగ్యములు ను గామిఁ జేర నొల్లరుత్తమద్విజు
ల్మఋగ్యతములవారి వెదకి మెచ్చఁ గొలిచి తెచ్చికో
భాగ్య మతని కబ్బుటరుదు బ్రదుకె యది యు నక్కటా. 192

వ. అట్లుత్తమద్విజుల చిత్తంబు నారాధించి చేర్చుకొనియెద నన్నఁ దద్వివేకం బె
న్నినాళ్లకుఁ గలుగవలయు నవి యే యెంచి చూచిన నొక్కటొకటియు మిగుల నస
హ్యంబు లగుచు హృదయశల్యంబులై యున్న యవి నీవు సకలకార్యఘటనాతిస
మర్థుండవు నాకు నివ్విచారంబు వాయు నొక్కతెరువు సూపి రక్షింపుమని మణి కం
ధరుం డాస్వభావాఖ్యసిద్ధు నెంతయుం బ్రార్థించె నతండు నతనికి విషాదనివార
ణంబుగా నిట్లనియె. 193

క. సతతముఁ బెంపొందు జయో, న్నతి యొసఁగెడు నొక్కవిల్లు నవశరములు నీ
మతికిఁ దగినవి సృజించెద, క్షితి దత్తాత్రేయుదయ కకృత్యము గలదే. 194

శా. నీకింక స్సృజియించి యద్భుతప్రమాణిక్యంబు నే నిత్తుఁ దా
నాకర్షించును నీదు సేవ గొన సర్వామ్నాయశాస్త్రాదివి
ద్యాకారార్థత నొప్పువారి నది యాత్మాలోకమాత్రంబునం
జేకూర్చు న్సకలాశ్రితాళి కఖిలక్షేమాయురారోగ్యముల్. 195

క. అని యపు డొక సింగిణి వి, ల్లును వాఁడిమెఱుంగుటమ్ములును గెంజాయం
దనరారు మణిశలాక యుఁ, దనమాహాత్మ్యప్రకాశితముగ సృజించెన్. 196

గీ. ఇట్లు సృజియించి దీని నీవెప్పు డుపయ, మెంది తటమున్న యట్ల నీకొనఁ నిత్తు
నేను గనిపెట్టుకొనివచ్చి యివియొసవుట, యెట్లొయెన్ని నాళ్లొకొ యనియెన్న వలదు.

వ. అని పలుకుచుండ. 198

సీ. అప్పుడు చేరువనరుగుచుఁ దద్వాక్యములు విని శివరాత్రిపుణ్యకాల
శోభితమల్లికార్జునదేవభజనోత్సవాయాతులైన సదాశయుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నితని భార్య యుఁ బురోహితులు నచ్చోటికి నరుదెంచి యాసిద్ధవరుని నాను
మడిగి యెఱింగి మహాసమ్మదమున సాష్టాంగప్రణామంబు లాచరించి
మాకు ఫలితమయ్యె మల్లికార్జునదేవు, సేవమహిమ యిపుడు సిద్ధవర్య
నిన్ను వెదకి వెదకి కన్నులు సాఫల్య, గరిమఁజెందె నిచటఁ గనుటఁ జేసి. 199

వ. అని పలికినంతలో నృపాలుండు. 200

మత్తకోకిల. ఏమదాశయుఁడ న్మహీశుఁడహైహయాన్వయుఁడ ని
శ్భామ యీ యనఘాత్మ మత్ప్రియభార్య వీరు పురోహితు
ల్ధీమహత్త్వగుణాభిరాములు దివ్యతేజులు బుగ్యజు
స్సామతుర్యమహాగమక్రమసంప్రదాయధురంధరుల్. 201

క. ఓయనఘాత్మ కదత్తా, త్రేయమహామునిని మాహురీపురనిలయుం
జాయ యు నేను ను పిరిన, హాయతఁ గొలిచితిమి బహువిధారాధనలన్. 202

గీ. కార్తవీర్యార్జునుఁడు చక్రవర్తి యగుచు, నంత ఘనుఁ డాట నాయోగి నాశ్రయించి
కాదె తద్రాజకులజుఁడఁ గాన నేను, నమ్మునీంద్రుఁ భజించితి నవ్విధమున. 203

వ. ఆదత్తాత్రేయుం డంతట నాకుఁ గలలోనం గానిపించి మదీయభక్తుండు న్వభావుం
డనుసిద్ధుం డొక్కరుండు గలఁ డతనివలన నీకాంక్షితార్థంబీడేఱు నతని సందర్శ
నంబు సాధించునది యని చెప్పిన నేను దేవరయున్నచోటు ను స్వరూపంబును నెఱుం
గక యనేకవిధంబుల నరయుచు నిచ్చటికి నిద్దేవతామహోత్సవంబునకు వచ్చి యిప్ప
టిమీమాటల దత్తాత్రేయశబ్దంబు వినంబడుట నిది తెలిసి పోదముగాక యని చేర నే
తెంచితిమి మాకుం జిరప్రార్థితం బైనభవద్దర్శనంబు దొరకె నీఁక మాయభీష్టంబులు
సిద్ధించిన ట్లయ్యె నన విని యాసిద్ధుండు తను బ్రసిద్ధునిం జేయఁ బన్నిన గురువుల ప
న్నుగడకు నద్భుతసంతోషంబు లంతరంగంబుల నెంత యుఁ గందళింప నింత భక్త
వత్సలుండవే యనియమ్మునిందలంచి కేలుమొగిచి యంతనారాజునుంజూచి యిట్లనియె.

క. ఏ నెవ్వఁడ నీకోరిక, లీనై ననుమద్గురూక్త మిదియంటేఁ గదా
యానియతిచేత నె ట్లైవి, గానున్నవి య ట్లొదవెడుఁ గానీ చెపుమా. 205

క. అనుమ జయంబు ను సంతతి, యు ను నాయభివాంఛితంబు లొయంచితవ
ర్తన యనుచు విన్నవించెను, జననాయకుఁ డతనికపుడు సంయమి వరుఁడున్. 206

వ. ఆటమున్ను దాసృజించిన ధనుర్బాణంబులు మణికంధరునకుం జూపుచు ని ట్లనియె.

సీ. మానవనాథ యీమణికంధరునకు భావిభవంబునందు ను విజయసిద్ధి
గావించుకొఱకు నేసీవిలునమ్ములు నిటమున్ను గా సృజియించినాఁడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గావున నతని కొక్కనికిఁ దక్కఁగ నన్యరాజుల కెందుఁ బరాజితుఁడవు
గాక నీవు జయింతు గట్టిగ నన నట్లు కానిండు మీకృపగలిగినదియె
చాలుఁ గడమకు మఱి యేన చాలుదు మణి, కంధరునికి ధనుస్సాయకముల నపుడు
గాఁగలజయంబు తదితరకర్మకత్వ, మునను సిద్ధింప నేర్చునే యనియె రాజు. 208

మ. అనఁ దద్గర్వపుమాటకుం గనలి యాయస్త్రప్రభావంబుచే
నిను నీజన్మమునం దికెందు గెలుచు న్నిస్సంశయం బట్టు గె
ల్చిన మాత్రంబు న గాక యాడిగము నీచేతం గళత్రంబుచే
త ను జేయించుకొనంగలం డనియె సిద్ధశ్రేష్ఠుఁ డారాజుతోన్. 209

ఉత్సాహ. అనుడుఁ దమపురోహితు ల్మహావిభూతితోడ నా
తనికిఁ గేలు మొగిచి యోయుదాత్తచరిత యేమి యీ
యనకుఁ దెలియు మూఁడుమాట లాఱుతప్పు లేమి మీ
కొనరఁబల్కఁ గలమె యస్మదుక్తి తెఱఁగు లెంతు రే. 210

గీ. మీరు గుఱువుల రగుటను మిమ్ము వెదకి, కొనుచు వచ్చుట యొకటియే గుఱిగఁజూచి
యీనృపతి కోర్కు లీడేర్పు మెట్టులైన, ననుఁడు వారలఁ జూచి యి ట్లనియె నతఁడు.

ఉ. తప్పదు నాదుమాటలు విధాతలిఖించిన వ్రాఁతసుం డిలం
దప్పక యెల్ల రాజులను దాను జయించెను మీకృపాలుఁడే
చెప్పినవానిఁ దక్క నిఁక నేవ యు వానికిఁ జేయఁ జాలఁ జెం
పొప్పఁగ నాఁడు దాను దన యుల్లమునందు విముక్తమానుఁడై. 212

క. మీనరపతి తుసిగలసం, తానపుఁగోర్కియు ఫలించుఁ దత్సేవతతిం
దానును భార్యయు నేలిక, పూనిన యొకమణివిశేషమును గనుఁగొనఁగన్ 213

వ. అనిన విని వార లొకింత చింతించి.

శా. మాభోగంబులె యాత్మభోగములుగా మామాటయే మాటగా
శోభవ్యాత్మక మస్మఁదా నడుపుకొం చున్నాఁ డితం డిమ్మహా
సౌభాగ్యంబుగ నున్న మాకును దగ న్సంసేవ్యుఁ డెవ్వాఁడొ దా
నీభావంబున నీతఁ డట్లు పరుఁ దా సేవించుకాలంబునన్. 215

మ. అనిన న్మహిభర్త యేలికయె మీకారాధ్యుఁ డావేళ నా
తని భూషామణి మీకు నెంత యుఁ బ్రమోదస్ఫూర్తి గావించుచుం
డనను న్మీరలు నిమ్మదాశయుఁడు దత్సంగత్యనిత్యోత్సవం
బునఁ బూర్ణోన్నతు లన్నియు న్మఱచి యుంపు న్గాంతు రత్యంతమున్. 216

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. కావున మణికంధరుండు వసుంధరాపతి యగుచు జన్మించునందాఁక యభీష్టవిజయ
విహారంబుల నీరాజు ప్రవర్తిల్లఁ గలం డటమీఁద మదుక్తప్రకారంబునం దత్సే
వ సేయం గలండు మీరుం దన్మణిస్పర్శమహిమంబున మహానందంబు నొందెద రని ప
లికి స్వభావనామసిద్ధుండు వారి నందఱి ననిపి తాను ను మణికంధరుని వీడ్కొని ని
జేచ్ఛం జనియెఁ దద్వచనప్రకారంబున మదాళయుండు ను సకల శత్రుజయంబునఁ
దేజరిల్లెననిన విని యలఘువ్రతుండు మణికంధరుం డట్లు సిద్ధుని వీడ్కొని యటమీఁ
ద నేమి చేసెఁ దద్వృత్తాంతంబు వినవలతుం జెప్పు మనుట యు. 217

ఉ. కావ్యకళారసానుభవకాళలనూతనభోజరాజ సం
స్తవ్యవవీనగానసరసత్వమహత్వమరుత్తనూజ క
ర్తవ్యవివేచనారచన ధార్మ్యగుణావరధర్మరాజ శా
స్త్రివ్యరసానుపాలన బుధవ్రజపాలన పుణ్యఖేలనా. 218

క. కించిదుదంచితరాగద్రు, గంచలరుచినూతనాతపాండురరేఖా
వంచితసకలప్రతిభట, సంచయగర్వాంధకార జలధిగభీరా. 219

మణిగణనికరము. సమధికవితరణచతురిమగరిమ, క్రమజితరవిసుతఘనశ్రితశరణా
శమదమముఖగుణసముదయకలనా, విమలితనిజమతివృతగురుచరణా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ
పింగళి యమరనార్యతనూభవ సౌజన్యధేయ సూరయ
నామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం
బను మహాకావ్యంబు నందుఁ
బంచమాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమారమణాయనమః

# కళాపూర్ణోదయము.

## షష్ఠాశ్వాసము.

క. శ్రీమత్పదనఖకాంతి, స్తోమప్రచితానతారిచూడామణినీ
షామోద్దామ ప్రభావ, స్థేమశ్రీకృష్ణ నారసింహునికృష్ణా. 1

వ. అవధరింపు మమ్మధురలాలస యలఘువ్రతుం జూచి నీవడిగిన మణికంధరుని వృత్తాంతంబు సకలంబు ను వినిపించెద విను మని యి ట్లనియె. 2

క. అచలధృతి నతఁడు లక్ష్ముల, వచనసరణిఁ దగిననియమనర్తన మమర
న్నుచి యై యాచటిడగ్గతి, యుచితస్థితి నిలిచి యుఱుక నుంకించుతఱిన్. 3

గీ. మథనసమయ ఘూర్ణమానాబ్ధిపోలెఁ బె, ల్లోఁతలడరఁ బరుసమూఁక లెల్ల
బిట్టుకలఁగి తల్లి బిడ్డ పట్టక పాఱె, నతని మది మహాద్భుతాకులముగ. 4

వ. అంత. 5

మ. బిగిచన్గుత్తులు గుత్తపుం బయిఁటలోఁ బింపిల్లఁ గూయంగ శీ
ఘ్రగతి న్నాభమ యొకర్తు వచ్చి యిదె యోగంధర్వ నీవొందెదీ
భృగుపాతంబు ఫలంబు నీపరసవారిం గావు మంచుం దగ
ద్గిగితాంతర మైనఖడ్గ మొకటిం దత్పాణి కిచ్చె న్వెసన్. 6

వ. తదనంతరంబ. 7

సీ. చుట్టుపట్టుల నున్నయట్టి పెన్మ్రాఁకులు బలువిడిమైఁ దూఁజిపాఱునవి యు
గండోపలంబు లుద్దండవేగాధికోద్ధతిఁ జెక్కలై తాలఁ దాఁకునవి యు
గరిసింహశార్దూలశరభాది మృగముల నుగ్గునూచంబుగా నులుచునవియు
నంతరిక్షమున నత్యంతంబుఁ దట్టమై పందిటి లాగుగాఁ బర్వునవి యు
నగుచుబలితంపు టిసుపక ట్లమర నొప్పు, వెండిగునపంబులో కాక వెండికట్ల
యినుపగునపంబులో యనఁ దనరి కురిసె, నెంతయును జిత్తజల్లుగ నేదుముండ్లు. 8

క. మణికంధరుఁడు తద్దా, రుణశిలలీవృష్టి మిగులఁ గ్రొత్తయగుచు వీ
క్షణమాల కత్యద్భుతకా, రణమై తనరారఁ జూచి ప్రమదం బలరన్. 9

గీ. చెలువ యీయపూర్వశిలలీప్రవర్ష మె, క్కడిది యీమహాసిఁ గార్య మేమి
నేయు మనుచు నాము చేతికి నిచ్చి తె, వ్వతెవు నీవు వినఁగవలయు నాకు. 10

ఉ. నావిని యింక నేమి యు విన న్రణకోవిద నీకొకింత యుం
దావల మెద్దీ యాకపట దైత్యుఁడు చేర్పన కేఁగుదెంచు నే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పో వశిఁ బర్వఁజొచ్చెఁ గడు ముందులవాన యెదుర్చ నింతట
న్నీవు మహాసిచేతన వినిర్భరవేగతఁ జక్కు సేయుచున్. 11

గీ. ఏదురూపుతోడ నిదిగో నోకించుక, దవ్వునందు వాఁ డుదగ్రవృత్తి
నీకు నెదురువచ్చు నాకష్టునిటు మించి, రాకయుండఁ దునుము రయముతోడ. 12

వ. అని సత్వరంబుగాఁ బ్రార్థించిన నాయింతిం జూచి. 13

మ. అమరవిరోధిఁ ద్రుంతు నిదె యంగన భీరుల కెల్ల భీతి దీ
ర్చుము వెనఁ బొమ్ము నమ్ము మనుచుం గదలె న్రయమొప్ప దర్పదు
ర్దమరిపుఖండకాండభుజదండమునందుఁ బ్రచండమండలా
గ్రము జళిపించుచుం గిరగిర న్దిరుగ న్నెగవైచి పట్టుచున్. 14

వ. ఇత్తెఱంగున నత్యంతోత్సాహసంభ్రమంబునం గదలి. 15

మహాస్రగ్ధర. శలలీసందోహముం దోస్సమధికలఘిమాశ్చర్యచాతుర్యచర్యా
విలసద్ఘోరాసిధారావిహృతి హతము గావించుచుం బోయి కాంచె
న్నలసంతానంబు మేనన్గురుపొడిచి కన్పట్ట నున్నట్టియేదుం
దులితానూనప్రమానద్యుతిసలిలవనీధుర్యధాత్రీధరంబున్. 16

వ. ఇట్లు కాంచి నిరంతరాసారం బైనతద్ఘోరశలలీవృష్టి తనకృపాణవిహరణవిచిత్రవేగం
బునఁ దుత్తుమురు సేయుచు నక్కపటదానవు నుద్దేశించి. 17

క. ఓరి యవివేకిరాక్షస, యీరూపవికారవృత్తి నేమి గలదు దు
ర్వారత నీదుజగద్రో, హారంభము నిన్నుఁ జెఱుప కకట విడుచునే. 18

సీ. దిగ్గజంబులకు ను దేఱిచూడఁగరాక యేపారుగజదైత్యుఁ డేమి యయ్యె
మొగులులోనుండి యమ్ములవాన గురియించు నింద్రజిద్దానవుం డేమి యయ్యె
విశ్వమంత యు నిండి వృద్ధిఁబొందుచు సురాహితకారి యగువృత్రుఁ డేమి యయ్యె
జగమెల్లఁ జాఁపచుట్టుగ ఘనశక్తిచే నెసఁగు హిరణ్యాక్షుఁ డేమి యయ్యె
వెండి యు ను లెక్కమాయల వెలయు నట్టి, వారు శంబరప్రముఖు లే మైరి వినవె
యకట యోరి దురాత్మ యీవికృతరూప, మేమిటికి వచ్చె నిదె వధియింతు నిన్ను.

చ. అన విని రక్కసుండు నగి యుక్కట యెక్కడివాఁడు వీఁ డచే
తనుఁడొ మతిభ్రమార్తుఁడొ మదస్ఖలితాత్ముఁడొ పుట్టువెఱ్ఱియో
తనభుజసత్వ మెక్కడ యధఃకృతదిక్కరివిక్రమప్రవ
ర్తను ననుఁ దాఁకు టెక్కడ విధాత కడుం జెడరేఁచెనో సుమీ. 20

వ. అని యతని నుద్దేశించి. 21

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. బ్రదు కొల్లకున్న రార, మ్మెదురుగ నిటువంటిమాట లిప్పైయి నేలా
పదరఁగ దొంతుల కోపని, గుదియలు నుం గలవె నీదు క్రొవ్వడఁగింతున్. 22

చ. అనుచు నొకింత మేమలచి యత్యధికోగ్రశరౌఘవృష్టిచే
మునుఁగఁగఁ జేయు దానిని సముద్ధతఖడ్గవిహారచాతురిం
దునుముచుఁ జేరి తద్గళముఁ ద్రుంచె వశిన్మణి కంధరుండు త
ద్ఘనకలజాల మాతెలిపిఁ దన్వసఁ దాఁకి గతాసుఁ జేయఁగన్. 23

క. అని చెప్పిన నలఘువ్రతుఁ, డనయంబును గుతుకయుక్తుఁ డై యెవ్వాఁ డ
ద్దనుజుం డాతని నాకీ, తిని దునిమించినది యెపతె తెలియఁగవలయున్. 24

వ. అనిన విని యాళువు వారిరువురి తెఱంగు ను వివరించెద విను మని యి ట్లనియె.

క. మహితాత్మక యాదైత్యుఁడు, మహిషాసురమాతులునికుమారుఁడు దుర్గా
నిహతుఁ డగువాని విని తా, నహితము దుర్గకు నొనర్ప నాత్మం గోరున్. 26

గీ. వాఁడు శల్యాసురుం డన వసుధఁ బరఁగు, శల్యరూపత నునికిఁ దచ్ఛలలచయము
గట్టపాఱలకైవడిఁ గానిపించి, పేర్చుట ఖనిత్రశలుఁ డను పేరు గలదు. 27

వ. మహిషాసురుని జంపిన నూకు తనమనంబునం బాయక యివ్విధంబున దుర్గయందు
బద్ధమత్సరుండై యారాక్షసుండు 28

చ. క్షితితల మంత యు న్వెదకి చెండుదునో వెనఁ గాళికార్చనా
వ్రతపరు లెంద ఱందఱ నవారణ నెయ్యెడలందుఁ జండికా
యతనము పేరులేక ఖిలమై చనఁ గూల్తునో యొరు ప్పెట్లొకో
మతినొకయప్పుడు న్విడక మండఁగఁబెట్టుచునున్న కోపమున్. 29

గీ. ఏమ గినుకఁ బూని యిట్లు గావింప నే, మనుచు నుడుకు నొకో బలాంతకుంపు
పేవ కోపమెందుఁ బెదవుల చేటు గా, కుడికి యేమి సేయనోపు నన్ను. 30

క. భార్గవు దీవనఁ గన్న య, నర్గళనద్విపులబలమహత్వము సుమనో
వర్గమునకు లోపదు నే, దుర్గాశక్తికిని వెఱవ దుర్దమశక్తిన్. 31

గీ. ఏయుపాయంబుచే నైన నెచ్చరిలఁగ, నీకరాక్షసకులము రమేశ్వరుండు
దునుము నను శంక యొక్కటి మనమునందు, నున్నయది దీని కెద్దియో యుక్తి యింక.

క. వీనికిఁ దగిన యుపాయము, గానంబడుఁ గాక శాంతి కందగు తనువుం
బూనిచరించుట మేలౌ, దానవకులుఁ డయ్యు నితఁడు ధార్మికుఁ డనఁగన్. 33

గీ. అనువిచారంబుతో నొకవనములోన, వాఁడు వర్తిలఁగా దైవవశత వచ్చె
నచటి కభినవకౌముది యనఁ తుషార, కరకిరణజాప్సరోజాతి కన్నె యొకతె. 34

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. వచ్చినఁ దద్విలాసవిభవంబున కద్దనుజేంద్రుమానసం
బచ్చెరువంది మున్నటిసమస్తవిచారముఁ దక్కి మిక్కిలిన్
హెచ్చినపచ్చవిల్తుపస నెంత యుఁ జంచలభావ మొందఁ దా
నచ్చపలాక్షి కిట్లనియె నద్దివిజప్రతిపక్షుఁ డర్మిలిన్. 33

ఉ. కోమలి నాకు నెట్టియెడఁ గొట్టినపిండి సమస్తలోకము
ల్నీమది కింపులైనయవి నిర్భరశక్తిని దేసమర్థుఁడ
న్నీమహనీయ రూపరమణీయతకుం దగునట్టు గాఁగ నే
నేమగరూపులైన ధరియింపఁగ నేర్తును గామరూపినై. 34

గీ. నన్ను నేలుకొనుము నావుడు నేమి యు, ననక తన్న నాదరావలోక
ములఁ దిరస్కరించి జలజాక్షి యటువాసి, చనుచునుండ నతఁడు కినుకతోడ. 35

గీ. నాతి యిట్లు వేఁడు నన్నాదరింపక, పోవునిన్ను నింకఁ బుఱుషుఁ డొక్కఁ
డెవఁడు నేతలంక నేరికి నెన్నిగుం, డియలు గలవు నాదు ప్రియునకేర. 36

క. అనివెఱపించిన నదితన, మనమునఁ జల మొదవ నిన్ను మడియించినవా
నిని దక్క నేవరింపను, విను మిదినాప్రతిన దీని విడ నేఁక ననియెన్. 37

చ. అను నఁ దదుక్తిక్రూరతకు నద్దనుజుండు గదుర్ ఘనంబుగాఁ
గినిసి యుఁ బోవనిచ్చె నొకకీడును జేయక యవ్విలాసిని
న్మనమున నెప్పు డేతెఱఁగునం దన కబ్బునొ దాని సంగమం
బని యడియాస యాకినుక కత్యధికం బగుచుం బ్రవర్తిలన్. 38

గీ. అదిమొదలుగాఁగ నాకన్యయరయుచుండె, వానిమడియింప శక్తుఁ డెవ్వఁడొ యనుచు
వాఁడు దను జంపఁ బూనినవానిఁ జంపఁ, దనకు వర మెట్టుసాధింతు ననుచునుండె.

గీ. అంతట మృగేంద్రవాహనయాలయమున, కతఁడు దైవవశంబున నరిగి యందుఁ
బ్రస్తరస్తంభలిఖితాక్షరములు చూచి, చదువుకొనుచోఁ దదంతరసరణియందు.

క. ఈమెఱుఁగుగండకత్తెర, చేమిడిదల యిచ్చుసాహసికుఁడు శిరంబ
ట్లేమగుడఁగ నమకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిన్. 41

క. అనియెడి యర్థముఁ గనుఁగొని, తనయభిమతసిద్ధి కది నిదానం బగుట
న్మనమునఁ గడు సంతోషము, దనరారఁ దదుక్తరీతిఁ దప్పకనచిపెన్. 42

గీ. నచిపి తత్ఫలసంసిద్ధినమ్మికఁ దన, కింకఁ నెదు రింక లేదని డెందమునను
గరము గర్వించి యపుడ యాఖిలుఁడు పూనె, నమ్మహాశక్తిబాగుడి నవనిఁ గూల్ప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అభినవకౌముది యను స, ర్వభూమిమండలమునందు వానిఁ దునుమఁ జా
లుభుజాబలాఢ్యు నరయుచు, శుభమగు తచ్ఛక్తి మహిమసుద్ది విని మదిన్.
క. తనకోర్కి కద్దియే నొక, యనుకూలం బైన త్రోవ యచ్చో సమకూ
రనొ యతని యిక్కడికిని దాఁ, జనుదెంచుచు నాఖనిత్రళలునిం గనియెన్. 45
క. కని యీఁ డిక్కడి కెచ్చో, టనుండి ప్రత్యక్షమయ్యె డగ్గఱ కెడగాఁ
జను తెరువు లే దొకో యని, మనమునఁ దలపోసె నంతమాత్రన వాఁడున్. 46
గీ. ఆచకోరాక్షిఁ జూచి యోయలఁబోఁడి, యేను బ్రార్థింపఁ గైకొక యిట్టివానిఁ
గాని వరియింపవంటివి గరవృత్తి, నల్లనాఁ డొకవనములో ననుచు బలికె. 47
చ. తన కపు డబ్బినట్టి వరదర్పము చే నతఁ డట్లు పల్కె నీ
సొనరఁగ మీర లెవ్వరు ను నూకొనకుం డిటు చూచి చెప్పెద
న్నిను వరియించునట్టి మహనీయ బలాఢ్యుని గాని యేవరిం
పననుచుఁ బల్కితిం గలదె పల్కిన కగ్గనియె న్వధూటి యున్. 48
తరల. అనిన నె గ్గననింక నెద్దియొ యంబుజాక్షి యెఱుంగనే
ననువుగా నలతాతికంబునందు వ్రాసిన వ్రాఁతఁ గ
న్గొనుము మూర్ధము గండకత్తెరఁ గూలఁదన్నియుఁ గ్రమ్మఱ
న్ననినయట్టి ననుం గనుంగొను మాట లెవ్వియు నేటికిన్. 49
వనమయూరము. నావిని సుపర్వలలనామణి వెసం ద, ద్గ్రావలిఖితాక్షరకదంబకము నార
ఝోవుని మస్తకము గొంతయదుక్రన, త్తావని యుఁజూచి కడునాకులతఁ జెందెన్.
స్రగ్ధర. ఈరీతిన్ ఖిన్నయై సాహృదయము వెత యూహించి వారింప దిక్కె
వ్వారు న్లేరింక నిద్దేవత కె యురుకృపావర్తన న్నన్నుఁ బ్రోవ
న్భారం బంచు న్వెసం దత్పదముల కెఱఁగం బయ్యనం బోయి గర్భా
గారంబుం జొచ్చి వాఁ డక్కడనె తనదురాకం బ్రతీక్షించుచుండెన్. 51
వ. ఇవ్విధంబునఁ బాదంబులం బడి లేవక తనతొల్లింటిప్రతిజ్ఞాప్రకారంబు ను ఖనిత్రళ
లలుండు పలికిన యుల్లసంపుఁబలుకులు ను నతనిగర్వకారణంబు ను వినిపించి యో
మహాదేవీ యేను వెనుక ముందఱ గానక కలవరపడి యున్నదాన నాకు నెట్టనఁ బ్ర
తిజ్ఞాభంగంబు గాకయుండఁ ద్రోవ యొకటి సంఘటించి రక్షింపు మని ప్రార్థించె
మృగేంద్రవాహన యు నమ్మహారాక్షసునిచేతి తనసద్యోమహోపద్రవంబునకు నివార
కం బగుచు నొదవిన యీయువిదరాకకు సంతసిల్లు చునికిఁ జేసి యుప్పటితత్ప్రార్థనం
బునకు శీఘ్రప్రసన్న యగుచు ని ట్లనియె. 52

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఈదనుజుండు దన్ను వధియింపఁగడంగినవానిఁ జంపు టో
పైదలి తప్ప దుక్తమగుపద్ధతి నిచ్చట నాత్మమస్తక
చ్ఛేద మొనర్చుకొన్న తనిఁ జెందు ఫలంబును మాన్పవచ్చునే
నీదుప్రతిజ్ఞకుం బరిగణించి ఘటించెద నొం డుపాయమున్. 53

సీ. అని కొంత చింతించి యద్దేవి యభినవకౌముదిఁ జూచి యోకమలవదన
వీనిసాహసకర్మవృత్తికి ఫల మెన్నఁ దను జంపఁబూనునాతనిని జంపు
టింతియ కాని తా నెట్లును వానిచే మడియకుండఁగ నియమంబు లేదు
కావున నధికవిక్రముఁ డగువాఁడు వీనిని జంపి చచ్చు నన్నియమశక్తి
నీప్రతిజ్ఞ యుఁ దలఁప వీనిని దునిమిన, తీవ్రశౌర్యు వరించు టంతియ కడమ్మ
యతని మఱుమేన నైన నీప్రతిన దప్ప, కుండ వరియింపవచ్చు నీకుచితవిధిని. 54

గీ. ఇంక నట్టివరుని నెన్నికమీఱంగ, నిశ్చయింపవలయు నీరజాక్షి
యని యొకింత చింత యొనరించి తదుపాయ, మాత్మఁ గాంచి మోద మలరఁబలికె.

సీ. మణికంధరుం డన గుణనిధి యొక్కగంధర్వకుమారుఁ డోతలిరుఁబోఁడి
తన కొక కారణంబునఁజేసి యొదవిన యవితథోద్యమము మహాసి యొకటి
యిదె నాదుసన్నిధి నిడి పోయినాఁ డని యాయింతి కాఖడ్గ మపుడు చూపి
నీ విది గొనిపోయి యావీరవరుచేతి కిచ్చి వే చంపింపు మిద్దురాత్ము
వీఁడునీరూపుపసఁ జిక్కి వెంటవెంట, వచ్చు నలయించుకొని పొమ్ము వానికడకు
నెంతవిసివియు నీమీఁద నించుక యు ను, దెగఁడితేఁడు డెందమునసీవు బెగడవలదు.

వ. ఇమ్మహాఖడ్గంబుఁ దొల్లి దత్తాత్రేయుండు స్వభావనామధేయుం డగుసిద్ధున కిచ్చె నతండు మణిస్తంభుం డనుతనయుల్లుని కిచ్చె నతండు ను నిక్కడ నొక్కప్రయోజనంబుకొఱకు గంధర్వుం డైనమణికంధరున కిచ్చె దానంజేసి యిద్దివ్యాయుధం బమ్మణికంధరునకు సంప్రదాయాగతం బగుచుఁ గార్యకారి యగు నితరులకుం బనుపు సేయదు గావున నతనిచేతికి యీవలయు నతండు నిప్పుడు శ్రీశైలంబున నొక్కశాపంబు కారణంబుగా భృగుపాతంబున కాయత్తపడుచున్న వాఁడు నీవు వేగంబ చని తత్ఫలంబు దీనిచేత నే యా వని యాభృగుపాతంబు మాన్పి యిద్దానవువధంబునకు నియోగింపు మాగంధర్వుండు రెండవమేనఁ గళావూర్ణుం డనం గాసారనామధేయం బగు పట్టనంబునఁ బుట్టఁగలం డతని వరియించి ప్రతిజ్ఞఁ జెల్లించికొనుము పొమ్మని యనిపిన. 57

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పయిఁట బిగించి కొన్నడుముపైఁ బిరిచుట్టుగఁ జుట్టి కుంతలో
చ్చయము దృఢంబుగా ముడిచి చయ్యన నచ్చటిమండలాగ్రము
న్భయమునఁ బూని వెల్వడియె శక్తినివాన మవక్రవిక్రమో
దయపరిభాసమాన యసుసర్పకవైభవలక్ష్మియోతునక్. 58

గీ. ఇవ్విధంబున వెలువడి యేఁగుదెంచు, నట్టియాయింతిఁ గనుఁగొని యసుర వెఱచెఁ
దనుఁదునుముఁబూని వచ్చెనోయనితలంచి, దానఁదన్నాళమగునోయన్నలఁపువొడమ.

చ. అతఁ డపు డాసుధాకరనిభాననఁ గన్గొనిసంభ్రమించుచు
న్మతి గలఁగంగ నిట్లనియె నాపయి వచ్చిన నీవు నిష్టదై
వతములయానసుమ్ము వరవర్ణిని యెందుఁ దలంక నేను దు
ర్మతివయి నీవు నాతఁ దెగి గ్రుస్గెదవో యని తల్లడిల్లెదక్. 60

సీ. అకుడు నయ్యింతి యోయసురేంద్ర నీవు నాహానికి నోర్వక యిట్లాన లిడఁగ
నకట నీమీఁద రానంత యెఱుంగనిదాననే యేను నీతలఁపుబడిన
నడిచెద నని తన్నుఁ గడచి చనంగఁ దద్వాక్యరీతి నిజాభివాంఛితమున
కనుకూల మైనఁను క్లైతోఁచుట యు నతఁ డక్కన్యవెనువెంట నంత నింత
నరిగనెందునుసెలువక యబ్జముఖి యు, మిగులనెడఁబాయ కొక్కొక్కమిసముతోడ
నప్పటప్పటి కొక్కింత యాలసించి, కూడ నిచ్చుచు నెలయించుకొనుచుఁ జనియె.

శా. ఆతండు న్మదిఁ దత్ప్రయాణపుతెఱం గాత్మానురాగక్రియా
రీతి న్మానవము న్మరింపఁ జనియె శ్రీశైలపర్యంత ము
ద్భూతానంగవిజృంభణంబువలన దూరత్వముం గాన కా
నాతిం జూచుచు మన్మథాతురుఁడు గాన న్నేర్చునే యేమి యుక్. 62

గీ. అంతట విసివి యతఁ డాలతాంగిఁ బిల్చి, నాతలంపువెంబడి నీవు నడిచె దనుచుఁ
బలికితిది యేమి చెపుము నీభంగు లిపుడు, వనిత నన్భ్రమయించెదో యనుచుఁబలికె.

చ. పలికిన నేను నీతలఁపుపద్ధతిగా కిపు డేమి మీఱితి వ
ర్తిలితిఁ దొడింబడ న్నినుఁ వధింపఁగ వచ్చెదనో యటంచు నా
కలుగుచు రాక మాను మని యానలు పెట్టఁగ నప్పడేను నీ
తలఁపుబడిం బ్రవర్తిలఁగ దానవ పల్కితిఁ దప్ప నిప్పుడుక్. 64

సీ. అనినఁ గ్రోధించి యేఁ బ్రాణభయంబున నీ కలిగెడువాఁడనే వధింపఁ
జాలక నిన్ను నీసరణిఁ గరంబు దవ్వనుసరించుట నన్ను ననదుగాఁగఁ
దలఁచెదు గాఁబోలుఁ దెలుప నేరికి నెట్లు తెలియ యుక్తమ యిది తల్లఁడిచూడఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గావున నాలావుఁ గనుఁగొనుమనుచు నాతరలాక్షి నప్పుడు దాఁకపండ
ఘోరశిలలవృష్టి గురియించె నొడలు వీఁగించి యతఁడు నికటోరులు గాఢ
గుహశరద్రుమములు గుదిగ్రుచ్చినట్లుగ, నిఖిలజంతుతతులు నేలఁ గలయ. 65

గీ. ఇత్తెఱంగునఁ దనశక్తి యెఱుకపఱచి, యిఁక వరింపక చనియెదే యీవు చనిన
చోటు లన్నియు నాబలస్ఫూర్తిచేతఁ, బిడుగుఁ బాఁతినచోఁ గయై పెంపడంగు.

గీ. దాన నఖిలభయనిదానంబ వగుదు నీ, యన్వయమున లేని యట్టిదిట్టు
గుఱువ నీకుఁ దగునె కోమలి యది యెంచి, యైన నను వరింపు మని యుఁ బలికె.

క. అన విని యిఁక నిట్టిటుఁ దడ, సినకార్యము దప్పు ననుచు శ్రీగిరికి వడిం
జనియె సతి యింతనంతం, దనుజుఁడు వెన్కొనియె శిలలతతులు గురియుచున్.

వ. అంత నాయింతి యు నత్యంతరయంబునం జనియె నప్పుడప్పర్వతంబునందు శివరాత్రి
మహోత్సవమునకుం జేరిన సకలదిగ్దేశజనసముదయంబునకు వానిరాక యెఱింగించి క
న్య గతులు చూచుకొం డని పల్కి మణికంధరుం డున్నచోటుఁ బరికించి వేవేగ
నేఁగి యతనిచేతికిం దనచేతి యమోఘఘోద్యమఖడ్గంబు నొసంగి యవ్విధంబున నా
శిల్యాసురునిఁ జంపించి యతనిచేతఁ బొలిసిన మణికంధరుని రెండవజన్మంబుఁ గనిపె
ట్టుకొని యుండె నతం డంతఁ గళాపూర్ణుం డై జనియింప నుచితగతిం జేరి తనపూ
ర్వవృత్తంబు వివరించి దివంబునకుం జనక యావజ్జీవంబు నవ్విభుం డునిచినచోటన
యునికికి నొడంబడి గాంధర్వవివాహవిధిని వరియించె నంతట మదాశయుండు స్వ
భావసిద్ధుని వచనప్రకారంబున సకలశత్రుజయగర్వితుం డగుచు నొండు నష్టంబు లే
క చరియించువాఁడు గతిపశంబునఁ గాసారపురంబుపై నేతెంచి యిమ్మహారాజునకుఁ
బరాజితుం డై తనభార్యయుఁ దాను ను దాసత్వంబునఁ బనులు సేయుచుండె న
క్కాలంబునందు వారికి నేతదీయమణిసంపర్కమహిమవలన నే నుదయించితి నంత
ట నాతల్లిదండ్రులు నేలికచిత్తంబున కెడసిరి తత్ప్రకారంబున సరస్వతీకనకగర్భు
ల సల్లాపకథయందు వినంబడినది యదియ యిట్టెడసి వార లీక్రమకంఠోత్తరపు
రంబు వెలువడి పోయి ప్రయాణక్షోభంబునం గృశత్వంబు నొంది తేఁటకయున్న న
న్నుం జూచి నన్నుం గొనుచుఁ దిరిగి వచ్చి నేఁ డింతకు మున్నుగా నొదవిన యేత
న్మాణిక్యవిలోకనమహత్వంబున నేనారోగ్యంబు నొంది మిక్కిలి యెలమిం బొదల
హృదయంబుల ముదంబు నద్భుతంబు నొందుచు నివ్విధంబున నవ్విభుసన్నిధి నిడి
మదీయదౌర్బల్యనివర్తనప్రకారంబు విన్నవించి సన్నుతించితిరి తత్పురోహితులు ను
మణిమహిమవశీకృతు లగుచు నిమ్మేదినీశ్వరుఁ గ్రమ్మఱ నాశ్రయించి యిదె యున్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వా రని చెప్పిన నలఘుప్రభుం డబ్బాలికకుఁ గేలు మొగిచి యోదివ్యమహిమశోభిని యాపురోహితు లెవ్వరు వారితెఱం గెఱుంగవలయు నని యడిగిన. 69

క. వారితెఱం గే మెఱుఁగను, సారగుణా వారు నీదుసత్పుత్రులు నీ
తోరపు భాగ్యము నిన్నున్, జేరిచె నని పలికె శిశువు చిఱునగ వెసఁగన్. 70

క. అపలుకున కత్యాశ్చ, ర్యాపూర్ణమనస్కుఁ డగుచు నలఘుప్రభుఁ డా
పాపం గనుఁగొని వారలు, నాపుత్రకు లనుట యెట్లు నవ్వక చెపుమా. 71

వ. అని సభాపతిం జూచి యి ట్లనియె. 72

గీ. అంటికుంచి యాడునట్టిప్రాయ మెకింత, నడచునంతలోన నాదుసతుల
పుణ్యశీలయుతులఁ బోకార్చుకొన్నట్టి, నాకుఁ బుత్రు లనుట నగవుగాదె. 73

చ. తలఁపఁగ వారిపోక యుసదక్కినయట్టిది గాదు వార్థిలో
పలఁ బడి యుండుఁ బడ్డనియొ పాటుగఁ దీర మునింగిపోయి రే
నలఘుతేదన్వయాకృతిగుణాదులమక్కువ నన్యసంగమే
చ్చ లుడిగినాఁడ పుత్రు లనుసంశయ మైనను గల్గ నేర్చునే. 74

గీ. నాకుఁ జూడ ధరణినాయక యది యసం, గతమ యీవిచిత్రకథలతల్లి
దీని కొనర నేగతిని బట్టితలలు వో, కాళ్ళు మున్ను పెట్టఁగలదొ కాని. 75

వ. అనుటయు నట్లు తప్ప దనుమ నవ్వి యవ్వసుమతీధవుండు నమ్మధురలాలస నాలోకించి యోబాలికాతిలకంబ యీసందియంబు దీర నీబ్రాహ్మణునిజన్మాదివర్తనంబు నితనికిఁ బ్రథమభాగమాదులు పుత్రు లైనప్రకారంబును వారు మదాశయునకుఁ బురోహితు లైనతెఱంగును నెఱింగింపు మనిన నట్ల సేసెద నని యబ్బాల యి ట్లని చెప్పె.

సీ. జనసాఖపాండ్యదేశమునందుసురగాఖ్యపట్టనంబుననొకబ్రాహ్మణుండు
సోమశర్మాఖ్యుఁడు శ్రుతిపారగుఁడు తపోయోగాధికుండు శ్రీయుతుఁడు గలఁడు
తత్త్వజ్ఞుఁ డయ్యు నాతఁడు గుప్తమాహాత్మ్యుఁ డగుచు గృహస్థాశ్రమార్హవిధులు
జగదనుగ్రహణార్థముగ నడుపుచు నందు నతిముఖ్య మని సంతతాన్నదాన
విధిని విప్రులఁ దనుపుచు వెలసె నతని, యాత్మజుఁడు యజ్ఞశర్మాఖ్యుఁ డతని కంట
దయ్యె వేదాదివిద్యలయం దొకటియుఁ, బరమయత్నంబుతో నెన్నిపాట్లు పడిన.

క. ఆదుఃఖము మఱపించుట, కై దివ్యాంగనల బోలు నతివలఁ గులశీ
లాదిగుణాఢ్యల నలువుర, నావరమునఁ బెండ్లిచేసె నతనికి గురుఁడున్. 78

క. ఆకోడండ్రకు సొమ్ములు, కోకలు నను లేపనములు కొదవ యుంచుకయుం
డ్లేక ప్రవర్తిల నడపెన, నాకులతం గొమరుడెంద మలరారుటకై. 79

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కడపటిదెసయం దాతఁడు, కొడుకుఁ బిలిచి యిట్టులనియెఁ గోడంద్రుఁ డిన
న్నడుపుము నీవె ల్లైనను, విడువక మన యన్నదానవిధినియమంబుల్. 80

క. దానను జతురాగమసం, తానం బుదయించు నీకుఁ దప్పదు మద్వా
చానియమం బిదియనుటయుఁ, గాని ష్టుని యియ్యకొనియెఁ గడఁకనతండున్. 81

ఉ. ఆతన తండ్రియాజ్ఞ దనయౌదలఁ దాల్చి యొకప్పుడు న్మదిం
బాయక పెంచునట్టి పితృభక్తిపసం గలమాన్నము న్హవిః
పాయసపూపసూపబహుపక్వఫలాదుల నంతకంతకుం
పైయరయంగఁ బెట్టె వసుధామరకోటికి నేకవర్షముల్. 82

చ. పయిఁబయిఁ బంచుకొల్చు విరిపైఁడి యు గట్టిదినుస్సుదాయి ఆ
ప్పయు మఱి బంటు బానిసలుఁ బైరముఁ బెత్తియుఁ జేను తోట్లులో
నయినసమస్తసంపదలు నన్నవితీర్ణికి వెచ్చపెట్టఁగాఁ
బ్రియులు ధరించుసొమ్ములకుఁ బేటనఁబెట్టె జలింప కంతటన్. 83

వ. ఇట్లు గడంగి పరమపతివ్రతలం దనసతుల నలువుర నుపలక్షించి. 84

ఉ. ఏకలకంఠిసొమ్ము హరియింతు ను ము న్నని చింతిలె న్సమ
స్తోకమనోనురాగత నతు ల్దను నంతట నాదుసొమ్మె మున్
గైకొను నాదుసొమ్ము మును గైకొను మంచుఁ గడంగి వేఁడఁగా
నేకలకంఠిసొమ్ము హరియింతు ను ము న్నని యట్లు చింతిలెన్. 85

వ. అప్పుడు. 86

ఉ. మంగళసూత్ర మొక్కటియె మాని సమస్తవిభూషణంబుల
న్రంగదభంగురప్రణుతరమ్యత నొండొరుమీఱ నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చి ముందట ను ప్రోవిడుకాంతలరూపు తొంటికం
టెం గరఁగించెఁ గాంతుప్రకటీకృతభక్తియె సొమ్ము సాధ్వికిన్. 87

గీ. వెచ్చ మన్నదానమ్మఁట వేఁడువాఁడ, ధీశ్వరుండఁట తాము పతివ్రతలఁట
యొండొరులమీఱి యెట్లసొమ్మొసఁగుటరుదె, యదితులంకృతికంటె రమ్యంబు గాదె.

ఉ. సొమ్ములు వేఁడి పుచ్చుకొనుచోట్ల సపత్నులమత్సరంబు లో
కమ్మున వెచ్చుటం గలదు గాని నిజాభరణంబు లెల్లఁ దా
రిమ్మెయి నాథువెచ్చమున కిచ్చుట కొండొరు మీఱుపుణ్యపుం
గొమ్మలు వీరె యంచు జనకోటి నుతించె ను వారి నత్తఱిన్. 89

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఇవ్విధంబునం దనుతమసొమ్ములే మున్ను పుచ్చుకొనుటకుం బ్రకరణైక్యంబు గానిపిం
పం బ్రార్థించునిజసతులయందు నెవ్వరి నతిక్రమింపం జాలక యాతం డందఱిం బ్రి
యంబునం జేకొని తదాభరణంబు లన్నియు నొకమాటె పుచ్చుకొని వెచ్చపెట్టం
దొడంగెం దత్కాలంబున. 90

క. మతిఁ గోరి జతురాగమనం, బతి నీ కుపయోగించు ననిన తేం బ్రిపలుకు సు
స్థితముగ దదాశకతమున, సతతము నతఁ డుండుఁ జదువుసంధ్యలదండన్. 91

క. దానికి ఫల మపు డేమి యుఁ, గానక యుండియు గురూక్తిక్రమ మెద్దియొ యె
వ్వానికిఁ దెలియ నటంచు ను, దా నెప్పటియట్ల వన్న దానమునడుపున్. 92

క. ఆయజ్ఞశర్మఁ దేను, మ్మాయలఘుప్రతుఁడు మేదినీశ్వర యాపే
రాయున్న దానసువ్రత, మేయెడ విడువకునికి యపుడితనికిఁ గలిగెన్. 93

ఉ. ఏ మని చెప్పవచ్చు నపు డింతులసొమ్ములు చెల్లిపోవఁ ద
ద్ప్రేమను నెక్కడం జదువఁ బెట్టెనొ గట్టిగ నిశ్చయించె నా
భామలఁ బట్టి యిచ్చి తనపట్టిన యట్టిక డింద నేమియుం
దా మతి కొన్నినాళ్ళు విహితంబుగ నిల్పుకొనన్నమంబులోన్. 94

వ. ఇట్లు నిశ్చయించి వారి కది యెఱింగింపక కపటమార్గంబుగ నమ్ముకొనునుపాయంబు
చింతించి యొక్కనాఁడు కొమ్మలతో నిట్లనియె. 95

ఆ. తామ్రపర్ణి రేవుపండ నోడలు డిగి, యున్నవియఁట యేను నువిదలార
యొకనిపొత్తుగూడి యోడబేరము వోయె, దను సదాన్న దానధనముకొఱకు. 96

చ. అనవుడు నిన్నుఁ బాసి క్షణమైన గృహంబున నుండనోప మే
ము ను నినుఁ గూడి వచ్చెదము మోదముతో మముఁ దోడుకొంచుఁ బో
మ్మన నిది లెస్స కార్య మని యంతటి కొక్కబెహారిచే రహ
స్యనియతి మూల్య మందుకొని యచ్చటికిం గొనిపోయె వారలన్. 97

క. విను మధిప యిట్లు గొనిపో, యి నతుంబున నొక్కనావ యెక్కించెఁ దుదం
దనకెక్కడ నెడలేకం, డ ను మునుపటిపదరుగట్టడఁ గలం బరిగెన్. 98

క. పదియైదు బార లెడగా, నది యాగతిఁ గదలి పోవ నపు డేమని చె
ప్పఁదు నరవర శోకమహా, భిదుర మితనిధైర్యగిరిని బిట్టు పగిల్చెన్. 99

వ. ఇట్లువిశకలితధైర్యుం డై. 100

మ. అతిదుష్టం బగునాథ సేచ్ఛకున నాహా యింతకుం దెచ్చె నే
సతులారా మిము నంచు రూపగుణవంశస్ఫూర్జిత ల్మీర లి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ట్లతికష్టస్థితి నోడబేహారుల పాలై పోవ నాచెట్ట ప
ట్టితి రేయంచు మహారవం బడర నేడ్చె న్శోకవేగంబునన్. 101

క. ఆరేఁడ్పు విని సతు ల్తము, నాయకు పంచించి యిట్లు నావపతి యుఁ గొం
పోయెడునో యని ఘనశో, కాయత్తత నలువురు ను మహాసంభ్రమతన్. 102

క. జడనిధిలో బడనుఱికిరి, పడ నెవ్వారలు ను నోడిచి పట్టంగానే
రెడఁ గానక హాహారవ, మడర మహాశోకసంభ్రమాకలితులుగన్. 103

ఉ. పట్టఁగలేమి కొండొరులఁ బల్మఱుఁ జాల దిసంతు గొట్టుచుం
దిట్టుచు నీటిలో నలలు తీవ్రరయంబున వైచియుం గడుం
దిట్టల నీఁతకాండ్ర జడధిం బడఁద్రోలి యుఁ దజ్జను ల్గరం
బట్టియెడ న్రయంబు మెఱయ న్వెదకించిరి వారిఁ బల్మఱున్. 104

వ. ఇవ్విధంబునం దడవుగా వెదకి ముదితలఁ గానరైరి వారిం గొన్నట్టి సెట్టి యంతట
నివ్విప్రుని బలాత్కారంబున నాక్రమించి నీయేఁడ్పు కతన నింత పుట్టె నని తన్మూల్య
ధనంబుఁ గ్రమ్మఱం గొని విడిచిపెట్టె నట్టి పాట్లం బడివ యితండు తనకు సుతు లని
యెడు నామాట నమ్మ కెట్లాడిన నుచితంబ. 105

క. అత్తలిరుఁబోండ్ల యవ్వలి, వృత్తము వినిపింతు మింక వినుమోభూపా
లోత్తమ వా రత్తెఱఁగున, దత్తఱపడి నీట నుఱుకు తత్సమయమునన్. 106

క. బలుమీ నొక్కటి నోర, న్సలిలం బెగఁగ్రోలుచుండఁ జని రాచెలువ
ల్నలువురుఁ దద్వదనములో, పలి కానలిలంబు వెంటఁ బార్థివతిలకా. 107

ఉ. అంతన దవ్వుగాఁ బఱచి యంబుచరంబు సరోమపూర్ణప
త్త్రాంతరతోయ మూర్ధ్వముఖమై ప్రవహింపఁగ మూర్ధరంధ్రని
ష్క్రాంతము చేసెఁ దజ్జలము రాజిలె వారుణకేతులీల నా
యింతులు వొల్చి రందు లిఖియించిన బంగరు తీఁగలోయనన్. 108

సీ. ఆపీతజలబలాహకములో గగనంబు దిరుగఁ బ్రాఁకు మెఱుంగుఁ దీఁగలనఁగ
సురనదిఁ జల్లఁ జూచు సముద్రుచేతి కాశ్మీరజంబాలంపుఁ జూఱ లనఁగ
బలుమీల చమురు జొబ్బిలఁ బొగలోఁ బర్వు తోయేంధనపుమంట తునుకలనఁగ
నదులకుఁ గూర్మియ న్పసిఁడిమే న్దైలుపువారిధినిల్పు తెఱఁగంటిరేక లనఁగ
విపులమీనసమస్తవివరనిర్గమితోర్ధ్వ, గామితతమహోదకప్రవాహ
సంగతిని బయోపసరణికి నెగయు నా, సతులు గానిపించి రతులలీల. 109

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. మిగుల దవ్వుగ నెగసి యు మగువలంత, నుత్తరంబుగఁ జనుచున్న యొకవిమాన
వరముమీఁదటఁబడిరందుగరిమజూద, మాడుచునుబోవు యువయుగ్మమరుదుపడఁగ.

వ. ఇవ్విధంబున నద్దివ్యవిమానంబు మీఁదం బడి యొక్కింత తడవునకు మూర్ఛ దేఱి కనువిచ్చిన యచ్చెలువల తడివలువలు చూచి యలఘుకారుణ్యంబున నద్దివ్యమిథునంబు దివ్యాంబరంబు లొసంగి యాఱడించి మీ రెవ్వ రెచ్చటినుండి యిచ్చటం బడితి రని యడుగుటయు నప్పడంతులు వడవడ వడంకులుగుడుచు కులుకు టెలుంగులతోఁ బలుకం దొడంగిన. 111

క. తాంబూలరాగకించి, చ్చుంబితతద్దంతకాంతి సొబగెంత యు ర
మ్యంబగుచు నందు దివ్యుని, తంబినిచిత్తమున కద్భుతం బొనరించెన్. 112

గీ. మున్ను తద్రూపలావణ్యములకుఁ దనదు, నాయకుని చిత్తమెట్లగునోయటంచుఁ
దలఁకు దివ్యవధూటి నాతలిరుఁబోండ్ల, పలుపరుసరొప్పు పలుకులు గలఁచె మిగుల.

గీ. ఇట్లు శంకిత యగుచు నాయిగురుఁబోఁడి, కాంతునీక్షించి వారల కత యటుండ
నిచ్చి నీపందె మాకుకొ మ్మేల యాల, సింప నీయాట యోడవచ్చినది యనిరు. 114

ఉత్సాహ. అని యొకింత వారిఁ జూచి యమ్మలార యిప్పుడే
ననినమాట మీకుఁ గోపమైన నయ్యెఁ గాని యా
యన ననుం బరాకు పఱచి యాట గెలుపు తనదిగా
వెనుకవాడు లాడ నేను వినఁగఁ జాల నని తగన్. 115

వ. విభునిఁ జూచి. 116

ఉ. ఆడితె నీదుపందె మని హస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
మ్రేడితపాండురద్యుతిసమృద్ధి గరం బమరంగఁ శారిక
ల్వేడుకతోడఁ బుచ్చుకొని వ్రేళ్లను నిట్టు నటు ల్పొరల్చి వి
భ్రాడకలంకకంకణవిరావము మీఱఁ గదల్చి వైచుచున్. 117

సీ. నిలు మహో బొంకకు నెత్తకమ్మ యంచుఁ బత్తు లెక్కడు నొయ్యఁబలుకుమనుచుఁ
జిక్కె నీసారె నాచే నంచుఁ జిక్కె నా దీనిపాలిటి కూడు దిన్న ననుచు
నడ దుగతివకుమీ సుదతి నీవంచు నా నిదె సారె దాఁకె నీయిచ్చ యంచు
నినుమాటు దంచిన నెనటిపోతలటంచు నొనట్ల యుడికెదు గాని యంచు
నిట్టి దంటమాటలు నేర్చి తెచట ననుచు, దంట నేనాట నీసంగతమునవంచుఁ
దమపరస్పరసరసవాక్యములు దనర, నెల్లఁతతోనవిభుఁడును దాను నెత్తమాడె. 118

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. క్షపఁగనవాసి కుందుట ను జక్కవజోళ్ల మనోనురాగ మే
ల పొగడ నక్షపాతిశయలబ్ధసుసంగమశారిక ల్తిణం
బపుడ వియోగమొంది యహహా వెనఁ జావఁ దొడంగెఁ దుల్యరా
గపుఁ బసయుం బరిస్ఫుటము కాదె తదీయము యెల్ల వారికిన్. 119

ఉ. సారెకుఁ బోటు దాఁకినను జాడ్యము నొందక జోడు విచ్చి పో
సారెఁ గడంకతోఁ బొడిచి చాటుచుఁ దీవ్రరణస్ఫురన్మహా
శారిఫలప్రఘట్టనలఁ జాలఁగ మచ్చర మెక్క నయ్యెడ
న్వారలు జోడులుం బలె నొనర్చిరి జూదపుఁబోరు మీఱుచున్. 120

గీ. అంతఁ బతి గెల్చి తత్పణ మైనయట్టి, యాస్యమద్యసద్యోదాన మధరసంజ్ఞ
నడుగఁదలయొయ్య నూఁచుచు నన్యసతుల, యునికిగనుసన్నఁ జూపుచునుత్పలాక్షి.

ఉ. ఆమధురంపుసొంపు కడు నాత్మఁ గెరల్ప నతండు చూడ్కి నే
వేమఱుఁ దా నపల్చి యు ను వేఁడి యు మ్రొక్కి యు బుజ్జగించి యున్
భామిని నప్పుడే తనదుపన్నిదముంబురికొల్పి వారు మా
ర్మో మిడి చూడకున్కిఁ దనమో మొకకొంత మలంచి తెల్పుచున్. 122

చ. చెలువ యు మున్న యాయితముసేసి సమీపమునందు నిడ్డ యు
జ్జ్వలమణిపాత్రికామధురసంబు నిజాస్యమునందు నుంచి తాఁ
జెలువునినోరి కిచ్చెఁ బెఱచెల్వలు చూచెదరో యటంచుఁ జం
చలితకటాక్షవీక్షణము సారెకు వారలపై నిగుడ్చుచున్. 123

ఉ. అంతటఁ బోక పేర్చుప్రణయవ్యసనం బెసకొల్పఁ గ్రోలి రా
కాంతుఁడుఁ గాంత యు న్మటి యుఁ గల్పకుజాసవముం బరస్పరా
క్రాంతమిథఃకపోలఫలకప్రతిబింబవిలోకనామృతా
త్యంతవితీర్ణనూతనరసానుభవంబున నేకపాత్రికన్. 124

ఉ. చెక్కునఁ జెక్కు హత్తి విలసిల్లఁగఁ దత్ప్రతిబింబవీక్షలం
జొక్కుచుఁ బెక్కువాసనలసొంపున నింపు జనింప జుట్టునన్
గ్రుక్కఁడు గ్రుక్కఁడే మధువుఁ గ్రోలుచు మోవులు నంజుకొంచు వా
రెక్కుడు గాఁగఁ దన్పిరి నిజేంద్రియపంచకదైవతంబులన్. 125

ఉ. సిబ్బితిపేరు పోఁ దుడిచి సీధుమదం బపు డన్నుకొల్పుచుం
బ్రబ్బఁగ మాట లక్షరవిభాగము చాలక యేమొ యేమొ త

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్బిబ్బులుగాఁగ వెల్వడి యభేదిల మానము సోలుచూపులు
న్నిబ్బర మైనకెంజిగి యుం నేత్రములం దుదయించె వారికిన్. 126

ఉ. అంతటఁ బానపాత్రమున నాత్మముఖంబు నధీశమోము నీ
మంతిని చూచి శౌరి పరమానిని పానసహాయమయ్యెనే
యింతటిలోన నీడ యది యెవ్వతె యంచు ను జివ్వాయాడ క
త్యంతముఁ దొట్రిలం బలికెఁ దన్మధువానక మానె నల్కతోన్. 127

వ. అప్పు డతండు. 128

ఉ. చేడియ లెస్సచూడు పెఱచేడియ యెయ్యది యిందులోన నీ
నీడయకాక యన్న నవనీసురభార్యలఁ జూపి యాకె నా
నీడలె వీరు నట్లయిన నీవు ననుంబలె నొరవీరల
న్వేడుకఁ జూతువో వలదు వీరికి నిచ్చట నంచు భీతిలెన్. 129

వ. ఇవ్విధంబున నవ్వధూమణి మధుమదంబున మదిచెదర యుక్తాయుక్తవివేకంబు లేక యాత్మలవలనం దలంకు పుట్టి యిలకు డింప నుద్యోగించి కించిదవనతవదనంబుతో నధోభాగంబు పరికించునపుడు నిజవిమానయానానుసారంబున గోదావరీసరిత్సమీప పరిదృశ్యమానధర్మపురినామ నగరవాస్తవ్యవారముఖ్యాకేలిసౌధంబు గగనంబుతో నొరయుచు సమీపంబున దీపింపఁ దదీయచంద్రశాలాప్రాంగణంబు చేర నాత్మీయ దివ్యవిమానంబు నిరోధించి యాగరితల నలువురం గ్రమంబున దాన కైదండ యిచ్చి యచ్చట దించి తనచేత ననుమతింపక యిట్టట్టు పట్టుకొట్టుచున్న వల్లభుం జూచి యుల్లంబునందక్కజ చింతవదలి పాదండు పాదండువీరలచేరిక జారభావంబునం గోరువాఁడు నాచేత నవశ్యంబు ను నొచ్చు ననుచు వాహనారోహణం బొనర్చిన యతండు వారు నిట్టిలలం షేమి యు లే దిమ్ముగుదల కాహారాదు లెట్లని విచారించె దం గాని యనుట యు నాయువిద యతనికి నాసౌధోత్తమంబులోపలి పలుదెఱంగుల యఱలు కరంబునం జూపుచు. 130

చ. అదె ఘృతతండులప్రకర మల్లదె చీరలు భూషణాదిసం
పద లవె రాజు శాక కులుపా యొనఁగూర్చినయట్లు మీ కెడు
స్మదితల కేమి యచ్చికము మాధవ నిం దొరు లెవ్వి ముట్టినం
బ్రదుకనివారు వా రనుచు భామిని యేఁగ నిశేచ్ఛఁ గాంతుతోన్. 131

గీ. ఆత్మవిభుచిత్తచలనశంకాంకురంబు, వలనఁ గాదంబరీమదాకులతవలన
వెడలు తద్వాక్యములచొప్పు విప్రసతుల, ప్రాణశీలాదిరక్ష యై పరిణమించె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అనుగుణ యట్లు పలుకుచు, నామేడ న్వారి నిలిపి యరుగుతెఱఁగుఁ దే
శ్స్వామిని యగుగణికామణి, దా మఱుఁగుననుండి చూచి తలఁకెడుమదిలోన్.

క. ఎవ్వారో దివ్యస్త్రీ, లివ్వరసౌధంబు నాశ్రయించి రిచటికిం
దవ్వైతి మిచటివస్తువు, లెవ్వి యు నాసించుటొప్ప దిఁక మా కనుచున్. 134

మ. తలపోఁత ల్వాడమంగ గూఢసరణిం దత్సౌధముం డిగ్గి యా
తలిరుంబోఁడి తదాభిముఖ్యమమరం దా మ్రొక్కి యిమ్మేడ నిం
పొలయ న్నిల్చినయమ్మలార యిపు డిం దున్నట్టి నాసర్వవ
స్తులు మీకిచ్చితి ధారవోసి యిదె యంచుం జల్లెఁ దోయాక్షతల్. 135

క. చల్లిమదీయస్మై వ, ర్తిల్లెడు నీచుట్టుపట్టుగృహవనముఖ్యం
బెల్ల ను మీసొ మ్మిఁక మముఁ, జల్లఁగఁ జలికాలఁ దన్ని పాకుం డనిరోన్. 136

క. అని యాయాబోటులఁ దన, జనులం బిలుచుకొని వెడలిచని యాసుద్దు
ల్వినిపించెఁ బట్టనములో, మనుజాల కంఏఱకు వెఱఁగు మనమునఁ దనరన్. 137

గీ. ఆమెఱుంగుఁబోండ్లు నపు డవ్విధం బెల్లఁ, జూచి యిది కరంబుఁ జోద్యమనుచు
దీనజనులపాల దేవుఁడెందును గలఁ, డనుచు సారెఁ జెప్పుకొనుచు నరిగి. 138

క. వారలు తమ తలవాకిటె, బోరఁదలుపు లెట్టిసమయములఁ దెఱవక తా
రారసి పదిలము సేయుచు, నారూఢస్థితి వహింతు రాసౌధములోన్. 139

క. శకునాదులచే నిజనా, యకపునరభిసంగమాశ లపుడుదయింప
న్వికలత నొందని ధైర్యా, ధికత న్వర్తిలి రభీష్టదేవాభరణలై. 140

చ. పురజను లప్పటప్పటికిఁ బుణ్యచరిత్రలవారల న్విభా
స్వరమణిసౌధమార్గముల వచ్చుచుఁ బోవుచు నుండఁ జూచుచుం
గరములు మోడ్చి మ్రొక్కుదురుగాని తదీయ సురూపలక్ష్మి కె
వ్వరుఁ బెఱపోక పోరు మును వార్తవిధం బెదనిల్పి పాయమిన్. 141

శా. గంధర్వాంగనలో మరుత్సతులో యక్షస్త్రీలో యిమ్మేడలో
నింధానద్యుతితో మెలంగుదురటే యెవ్వాఁడు పాపస్పృహా
గంధిస్వాంతతఁ జూచిన న్మనఁడటే కన్గొండటంచుం బ్రజా
బంధు ల్వేళలు గాచి చూతు రతితాత్పర్యంబున న్వారలన్. 142

సీ. నభమున మణివిమానమునఁ గ్రుమ్మరువార లీమేడఁ బెక్కునాళ్లిట్లు నిలిచి
యిలలోని జనములబలె వండుకొని వార్చుకొని గణికాదత్త మనుభవింప
నేమిటి వ్రతమొక్కొ యిదియెన్నినాళ్లొక్కొ యావేశ్య యెట్టిధన్యాత్మయొక్కొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యేము సమర్పింప నిప్డే కైకొని కరుణింతురో యని పొస లంతఁ జెచ్చి
పెట్టసాగిరి తద్వారపృథివి యలికి, ముద్గతండులఘృతపయోముఖ్యవిలతు
లప్పటప్పటికిని వారునవి పరిగ్రహించి రాజను లతిదూర మేఁగి మ్రొక్కి. 143

గీ. అంతఁ గొన్ని నాళ్లకాపతివ్రతలకు, నలువురకును శోభనత్వ మొదవ
గర్భలక్షణములు గాన్పించెఁ బరిపూర్ణ, గర్భత యుఁ దనర్చెఁ గ్రమముతోడ.

ఉ. గర్భములందు నుండి యుఁ బ్రకాశత నప్పుడు నే ర్పెలర్పఁగా
నర్భకు లొక్కవేళఁ జతురాగమసూక్తుల నొక్కవేళ శా
స్త్రాంభటి నొక్కవేళ నితిహాసపురాణోక్తుల నొక్కవేళ నా
విర్భవదర్థశాస్త్రముల వేడ్కఁ జెలంగెద రద్భుతంబుగన్. 145

వ. అంత. 146

క. జ్యేష్ఠానుపూర్వి నార్య, శ్రేష్ఠులు పుట్టిరి శుభోల్లసితలగ్నమున
న్నిష్ఠాగుణసౌభాగ్యగ, రిష్ఠుల కానలువురకు ధరిత్రీనాథా. 147

క. వారలకు యదృచ్ఛాసం, చారంబున నొదవి యొక్క సంయమి విహితా
చారము నడపుచు శుభసం, స్కారము లొనరించె జాతకర్మాదికముల్. 148

వ. నామకరణసమయంబున నతం డాశిశువులయనుభావంబుఁ దనదు విజ్ఞానదృష్టిం బరి
కించి వీరలు మూర్తిమంతంబులైనవేదంబు లని నిశ్చయించి యు జన్మాగమప్రకారం
బు ననుసరించి యు వరుస నన్నలువురకుం బ్రథమాగమ ద్వితీయాగమ తృతీయాగ
మ తుర్యాగము లనుపేర్లు గల్పించెఁ దన్మాతలు పూర్వకాలంబునఁ దమమామ పలికి
నచతురాగమసంతానశబ్దంబునకు నర్థంబు వీర యని తమలోఁ దారు నొప్పుచ్చుకొ
ని సంతసిలుచు నప్పటి సంయమీంద్రుని యొఱుకకు వెఱఁగుపడుచు నక్కుమారులకు
నుచితకాలంబున వచ్చి యు నుపనయనసిద్ధి యొదవించుటకు నాతపస్విని వేడుకొ
ని యట్లు సేయించి రాబ్రహ్మచారులు స్వయంప్రకాశితసకలవిద్యు లయ్యు శాస్త్రసిద్ధి
కొఱకు నతని యొద్దన యఖిలవిద్యలు నత్యల్పకాలంబులోపలన యధ్యయనంబు చే
సి రంతఁ దన్మాత లెంతకాలంబుగ నిట్లున్నను దమ పెనిమిటి సమాగమంబు దుర్లభం
బ యని విచారించి యచ్చోటు విడిచి యెచ్చటి కేని యుం బోవఁ దలంచి యది
తమకుమారులఁ బిలిచి తెలిపించిన వార లి ట్లనిరి. 149

క. పెద్దతలలేక మీరీ, నిద్దపు రూపముల నెచట నిల్చిన మనకుం
బెద్దటికము చాలదు పెఱ, సుద్దులు గల్పింతు రందుసుజనులు గలరే. 150

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కావున నిచటన మీరీ, దైవతవనిత లను గుట్టు దప్పక యుండం
ద్రోయుఁడు దివసము లేమిక, భూవరుఁగని వైభవంబుఁ బొందెదు దాఁకన్.

గీ. అపుడు గాని మాతండ్రియున్నట్టిచోటు, నరసి సంధించుకొనుటకు వెరవుపడదు
తిప్పదిదియని వారలు తపానివాస, మొరు లెఱుఁగకుండ వెలువడి యరిగిరంత. 152

వ. అట్లరిగి యాబ్రహ్మచారులు నలువురుఁ బురంబులోనం గొంతి సంచారంబు చేసి యప్పు
డచట యేలెడు రాజు మదాళయుండు గావున నతని వాకిటికిం జని యతండు సకల
విద్యావిశేషజ్ఞుం డనియుఁ దద్దర్శనంబు పురోహితుని యనుమతి లేక బ్రాహ్మణుల
కెవ్వరికి దొరక దని యు నతండు దాను విద్యాధికుండు కాకుండుటం జేసి నిజగౌరవ
శైథిల్యభయంబున నితరు లగువిద్యాధికులకు రాజగృహంబునఁ బ్రవేశంబు లేకయుం
డ దౌవారికాదిసకలపరిజనచక్రంబు ను వలకిట్టుకొని యుండుట యుఁ బ్రభువునకు
యాగేచ్ఛ గలిగి తనతోడ విచారించినఁ దద్రాష్ట్రివ్యాసవర్థుల నెచ్చటం గానమని
పరిహరించుట యు నచ్చటి జనంబులవలన విని మఱి యు ను. 153

సీ. ఎవ్వరి చేసుద్ది ద్రవ్వించి యెచ్చోట నేశాస్త్రమును కల్మి దెలిసికొనునొ
మను జేశుఁ డనుచు నేపనికిని వెల్పలివాక్ప్రగల్భత లేనివారిఁ గాని
చొరనీరు రాజమందిరము ను దౌవారికులు మఱి యట్టివారల ను ఏమ్ము
నరసి సేయుము గీమ మరసిన రాజులో సీవిల నేలంగ నెపుడుశుభమ
యనెడుమాటగా నాడుకొం డ్రనియువార్త, లేమి యడిగిన చేము మాయిండ్లలోనె
యుండుదు మెఱుంగమనుఁడనియునుదదర్థ, మానలిడికాని చొరఁగనీరనుచు వినిరి.

క. విని తదుచితము ను బ్రభువున, కు ను దమమహిమంబుఁ దెలుపుకొన ననుకూలం
బును గా నొకవాక్పద్ధతి, నొనరిచికొని నీచబాలయోగ్యాకృతితోన్. 155

ఉ. భూవరముఖ్యుసన్నిధికిఁ బోయెదు మామిడిపండ్లపుట్టిక
ల్దోవఁగఁ గూలిఁ బుచ్చుకొని మాధత గుల్కెడు గ్రామ్యచేష్టితం
బావహిలంగ నేఁగి ప్రతిహారజనంబుల కిష్టమైనవా
చావిధి కొప్పి చొచ్చి ప్రభుసన్నిధిఁ బెట్టిరి పండ్లపుట్టికల్. 156

క. పెట్టి వెనువెనుక కటుచని, య ట్టిటు భయచపలచేష్టు లైయరుగుచుఁ గ
న్పట్టెడియాబాలురఁ గృప, యుట్టిపడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్. 157

క. సంతోషమె కద యొయ్యెడఁ, జింతె యొకప్పుడు నొకింత చేకుఱదుగదా
కొంత మఱిఁగిడక కలిగిన, యంతె యు నిక్కముగఁ జెప్పఁ డనుట యు వారల్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

*క. మాయమ్మానసునీవే, రాయలవై కావదేవరాజేజేజే
మాయాతుమలానినయది, పాయకసంతోసమున్న ఫలమిలసామీ. 159

క. అన నమ్మాటలచందము, తనయప్పటివాక్యములకుఁ దగునుత్తర మై
యనయముఁ గ్రతుబుధసేవా, ఘనోపదేశంబు నగుచుఁ గాన్పించుట యుఁగా. 160

చ. విరివిగ నంతరంగమున విస్మయ మావహిలంగ వారి రూ
పరయుచు భస్మసంవృతమహాగ్నికణంబులు వోలె గూఢవి
స్ఫురణత నుస్కిఁ గాంచి పరిపూర్ణవినీతిసుమోదభక్తిత
త్వరత దలిర్ప లేచి నరపాలుఁడు సాఁగిలి మ్రొక్కె వారికిన్. 161

క. అని చెప్పఁ గళాపూర్ణుఁడు, విని యాతం డింతశబ్దవిదుఁడే యిట లో
త్తె రెఱుంగ మని చుపాళయుఁ, గనుఁగొనియె న్సబహుమానగౌరవదృష్టిన్. 162

వ. కనుఁగొని మదాళయుండ కూర్చుండు మని మమ్మాటుదాఁక ముదలపెట్టి యంతట బలిమిన కూర్చుండ నియమించి మధురలాలసం గటాక్షించి యటమీఁదఁ జెప్పు మ

---

* ఈపద్యముపైకిఁ దెనుఁగువలె నగపడుచున్నను సంస్కృతపదవిభాగము చేసి నఁగాని ప్రస్తుతమునఁ గవియభిప్రాయము తేలదు. ఎట్లనిన :—

పదచ్ఛేదము. మా-ఆయమ్-మాన-సునీవే-రాః-అలవా-ఏకా-అవత్-ఏవ-రాజే-అజే జే-మా-ఆయాతు-మలాని-న-యది-పాయక-సంతః-అసముత్-న-ఫల-మిల-సా-అమీ.

టీక॥ సు+నీవే=శోభన+మూలధనుఁడా, ఆయమ్=లాభమును, మా+మాన=సరకు సేయకుము, (గణింపకుము) రాః=ధనము, అ+లవా=అ+చ్ఛిదము, ఏకా=ముఖ్యము, అ వత్+ఏవ=తన్నునదియ, అజంయజతి=అజేట్=అజేజే=అజుఁబూజించు, రాజే=రాజుకై, మా=లక్ష్మి, ఆయాతు=చేరును, మలాని=పాపములు, న=చేరవు, పాయక=రక్షకా, సం తః=కోవిదులు, (పండితులు) (సంతి) యది=కల్గిరా=కల్గిన, అ+స+ముత్=సంతోషసహి తుఁడవుకాక, న+ఫల=(వారిని) చేరకుము, మిల=కూడుము, అమీ=(ఈ) పండితులు, సా=ఆలక్ష్మి.

దీనినిబట్టి "ఆయంబుసరకుసేయకుము" అను సీసపద్యమును బాడుఁడు.

ఈపద్యమున కిట్లు తెనుఁగర్థమును బెద్దలు చెప్పచున్నారు.

దేవరా=రాజా, జేజేజే=జయము జయము జయము, మాయమ్మానసు=మాతల్లియాన సుమా, నీవేరాయలవై=నీవేరాజవై, కావన్=రక్షించుట, మాయాతుమల=మాయాత్మల యందు, అనినయది=ఉన్నయది, పాయక=విడువక, సంతోసము=ఆనందము, ఉన్న ఫల ము=ఉన్నందులకు ఫలము, ఇలసామీ=రాజా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుట యు నది యి ట్లని చెప్పె నట్లు మదాళయుండు మ్రొక్కి యానలువుర నాన
నపాద్యాదివిధులం బూజించి నిజాస్థానజనులం జూచి. యిప్పటివీరలవాక్యంబులందు
నేమివిశేషంబు గలుగఁ దెలిసి యింత పూజించె నని మీమనంబుల నున్న దియేమొ
యవ్వాక్యంబులమహిమ వినుండు. 163

సీ. ఆయంబు సరకుసేయకుము శోభనమూలధనుఁడ ధనం బచ్చిదంబు ముఖ్య
మైనయట్టిది తన్వునదియ యేని కజాయజించువానికి లక్ష్మి చేరుఁ బాత
కములు చేరవు రక్షకా కోవిదులు కల్గి రాయనమోదుండవై యరుగకు
సమ్మిశ్రభావంబు నలుపును మా లక్ష్మి కోవిదు. లనియెడుదేవభావ
వయనఁ బదవిభాగవిరచనతో నర్థ, మరయఁ దోఁచుచున్న యదికరంబుఁ
దెలియఁజూడుఁ డేతదీయాంధ్రవచనసం, దర్భమున ను శబ్దతంత్రవిదులు. 164

వ. అని పలికి మదాళయుండు ప్రథమాగమున కభిముఖుండై వినయావినమితుండు ను ము
కుళితకరుండు ను నగుచు మీ రెవ్వ రిట్టిప్రచ్ఛన్నవేషంబున నేల వచ్చితిరి మీవిధం
బంత యు నాకుఁ దెలియ నానతీవలయు నని ప్రార్థించిన నతండు. తమతండ్రి
యన్న దాననియమంబు మొదలుకొని పూర్వవృత్తాంతంబు తమతల్లులవలన. విన్న ది
యుం ధారు గన్న ది యుం దద్దర్శనపర్యంతంబు సకలంబుఁ జెప్పిన నతండు నిజపు
రోహితదోషాయత్తతఁజేసి పూజార్హు లనివిచారింప నేరని తనదుర్వివేకంబునకు సిగ్గు
పడుచు ని ట్లనియె. 165

క. ఇది దెలిసియె కావలయు, న్మదాళయుం డనుచుఁ బేరు నాకు నిపుట యే
నిదిగోఁ గన నేరన కో, విదులఁ బురోహితునికపటవృత్తికి లోనై. 166

చ. అని యపు డమ్మహామహుల ప్రార్థనబల్మిని దక్కినట్టిదం
డనము నరేంద్రుఁడాతనికొనర్పక యాత్మ పురోహితత్వవ
ర్తనము ను మాన్పి తత్కపటతంత్రములోపనివారలై చరిం
చిన జనుల న్లఘుప్రబలశిక్ష వినీతులఁజేసె నెంతయున్. 167

గీ. ప్రార్థనం బొనర్చి ప్రథమాగమాదుల, ధర్మవిధిఁ బురోహితత్వమునను
నిలుపుకొనియె వారు నిజమాతృయుక్తులై, తగినగతిగృహీతదారు లగుచు. 168

వ. ప్రభునన్మానంబున నత్యంతవైభవంబునం బ్రవర్తిల్లుచు నతని కభిమతంబు లైనక్రతువు
లు సేయించుచుఁ దమజనకుని యునికి యురగపట్టనంబు మొదలుకొని పాండ్యకేర
ళచోళద్రవిళాదిదేశంబులం బరికింపం దగినవాఁడిం బనిచి యందు నలబ్ధవృత్తాంతు ల
యి చింతాక్రాంతు లగుచుఁ దల్లుల ననేకవిధిం గొన్నికొన్ని యాశలు చూపి యూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బొప్పచుండి రలఘువ్రతుండు ను నట్లు భార్యాపృథావిక్రయలజ్జితుం డగుచుఁ దజ్జ నపదంబుల సుహృజ్జనులకుఁ దలచూప నోడి దూరదేశాంతరంబుల యాయావరవృత్తి నర్థార్జనం బొనర్చుచుఁ దత్పరిమితాన్న దానంబు నడుపుచు నది నెఱయ న్నాగకున్న నన్న నర్జనంబు చేసి తాను గందమూలపయఃఫలాదుల దేహయాత్ర సలుపుచు నంత కాంతరప్రవర్తితస్వల్పాన్నదానాచరణంబులం దనియక బహుధనార్జనంబునకు ను పాయంబు వెదకుచు నంతట మృగేంద్రవాహనామహాశక్తి మహిమ విని తదారాధ నంబునకు నొకనివలన మంత్రోపదేశంబు సాధించి యద్దేవిసన్నిధికిం జని యచ్చటిభ వత్కథాశ్రవణఫలంబున నకలసంపదాయురభివృద్ధిపుత్రపౌత్రాదిలాభంబు విని యం దుఁ దనకుఁ బుత్రపౌత్రాదు లనుమాట యటుండినఁ దక్కినఫలంబు గల్గుట సిద్ధం బుగదా యనియెడుతలఁపున జపంబుచేత భవత్కథాశ్రవణంబు సాధించెఁ దుద న ది యత్యంతసంభావనీయం బైనపుత్రాదిలాభంబు ను గలిగింపక మాన దయ్యెం జూ చితే రోమణిస్తంభతనయ యిట్టిది సుమీ దేవరకథామహిమ యని పలికి మధుర లాలస యారకుఁడెఁ గళాపూర్ణుండు ను నలఘువ్రతుం జూచి నీసందియం బెల్ల ను దీరెఁ గదా, యని పలికి ప్రథమాగమాదుల నిరీక్షించి మీతండ్రికిఁ దగినయుపచా రంబులు నడపక యిప్పుడు ననుమానించినం బాతకంబు రాదే యని పలికెఁ బ్రథమా గమాదులు ను భయభక్తివినయసమ్మోదసంభ్రమంబులతోడ నలువురు ను లేచి వచ్చి యలఘువ్రతునిపాదంబులకుం బ్రణామంబులు గావించి యానందబాష్పపులకవిలసిత శరీరులు లైన యాజనకుని యాలింగనమూర్ధాఘ్రాణాదివివిధోపలాలనంబుల నానందిం చి యతనిచేరువం గొలిచి యుండి రప్పు డమ్మహాత్ముల తొంటియాంధ్రగీర్వాణభాషా శ్లేషవైచిత్రి చిత్తంబునం బాఱఁ గళాపూర్ణుండు వారలం జూచి యిట్టివిచిత్రకవిత మీమతులకు నిపుడు దోఁచునొకో యని కౌతుకసంబంధగంధమందరహసితంబుతో డఁ బలికిన నందుఁ బ్రథమాగముండు. 169

*క. కావినువారికిసరవిగ, భావనతో నానునతివిభావిసు తేజా
దేవరగౌరవమహిమన, మావలసినకవితమరిగిమాకునధీశా. 170

చ. అన బళిరా మహాకవిశిఖాభరణంబ మదుక్తభావనం
బున కిపు డిచ్చునుత్తరము పూని విచిత్రపుఁబద్య మయ్యె మే

---

* ఈపద్యము తెనుఁగువలె నున్నను దుదినుండి సంస్కృతపదవిభాగము చేసి యర్థము చెప్పకొనకున్నఁ గవియభిప్రాయము తేలదు. ఎట్లన :—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లని విభుఁ డాడె న ట్లది యటంచుఁ గపీంద్రుఁడు నవ్వె నవ్వె నా
యన పఠియింపుమా తిరుగ నన్నఁ దదుక్తికి మెచ్చె విప్రుఁడున్. 171

క. ఆరీతిం దమలోనం, దారే సరిపుచ్ఛకోనఁగఁ దత్పద్యచమ
త్కారం బపుడు సభాజన, మారసి యేమి యను నను గావ కద్భుత మందెన్. 172

వ. అంత నవనీకాంతుండు సభాసదులం జూచి యిప్పు డాపద్యంబు తిరుగం బఠియింపు
మనుట మఱి యను బఠియింపుమనుట కాదు వినుఁ డని యి ట్లనియె. 173

సీ. ఏలు మోనాయక యిల గిరులెంతకాల మ్మంతకాల మోసమ్మతుండ
మివుల శోభిల్లెదులవకుమారసమానమానుఁడ మహిమ ననూనమైన
గౌరవం బొసఁగు చక్రాన్నిప్రభు విట్లు గల్గఁగ నోయి పురుషుఁ డీగౌరవమున
నభినవతేజస్కుఁ డై వాణి రసములు గులికెడునట్టిది గలుగఁగాను
వినుతి సేయునివాఁడెయంచు ను మహార్థ, మున్న యది సంస్కృతంబునఁ జెన్ను మీఱఁ
ఐరుసఁదుదినుండి మొదలికిఁదిరుగఁజదువ, నా తెనుఁగుపద్యమునఁబుధులరసికొనుఁడు.

---

పదవిభాగము :—శాధి- ఇన- కుమ్- ఆగిరి-మత- వికనసి- (లవ మానమహిమ
వర గౌరవ దే) జాతే,- సువిభో,- ఇతి-నను- నా- అతః,- నవ- భాః,- గవి- రస-కి
రి,- వా- అనువితా.

టీక॥ ఇన=ఓనాయక, ఆ+గిరి=అద్రులున్నంతకాలము, కుమ్=ఇలన్ (భూమిని)
శాధి=ఏలుము, మత=ఇష్టుఁడా (సమ్మతుండ) వి+కనసి=మిగుల+శోభిల్లెదు, లవ+మాన=
రామద్వితీయపుత్త్రగౌరవా- నను=ఓయి, మహిమ+వర+గౌరవ+దే=గొప్పతనముచేఁ+
దక్కువకాని+గారవమిచ్చు, సు+విభో=చక్రాని+ప్రభువు, ఇతి=ఇట్లు, జాతే=కలుగ,
నా=పురుషుఁడు, అతః=ఈగౌరవమున, నవ+భాః=క్రొత్త+తేజముగలవాఁడై,రస+కిరి=
ఆనందము+గులుకు, గవి=వాణి (కలుగ) అ+నువితా+వా=నుతిసేయునివాఁడే ? స్తోత్రము
యనుట.

ఇపుడు దీనింబట్టి "ఏలుమోనాయక యిలగిరులెంతకాల" మ్మను సీసపద్యముం
జూడుఁడు.

తెలుఁగర్థమును బెద్దలిట్లు చెప్పుచున్నారు. (మొదటినుండి చెప్పవలయును)

అతివిభావిసుతేజా=అత్యంతమును మంగళకరమైన భావికాంతిగల, అధీశా=రా
జా, దేవరగౌరవమహిమన=మీగౌరవాతిశయము చేతనే, మావలసినకవిత=మాకుఁ గావ
లసినకవిత్వము, తాన్, వినువారికి, సరవిగ, భావనతో, మరిగి=(మరగి యని యుండఁ
దగినది) వశ్యమై, అనున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అనుచు వారు నట్లు మనోహరమున దాని, జదువుకొనుచుఁ దెలిసి సంతసిలుచు
నెరయ మెచ్చిరి కవినృపులయాశువిచిత్ర, మృదుకవిత్వకృతియుఁ దదుపగతియు.

వ. కళాపూర్ణుండంతట ననేకమణివిభూషణవిచిత్రాంబరప్రధానం బైనపారితోషికదానంబున బ్రథమాగమున నలంకరించె నప్పుడతనిమహామాత్యుండు సత్త్వదాత్మనామధేయుండు మధురలాలసకుం బ్రణామంబు చేసి యిట్లనియె. 176

ఉ. ఓకుచిరాత్మ రూపగుణయోగిని యే నటు పూర్వమైన నా
పేరుఁ గులాదులుం దెలిచి పిమ్మట నొక్కెడ నుండఁ దెచ్చి యీ
సారపురంబువారి దిదిరి సమ్మతి నాకును సత్త్వదాత్ముఁడ
న్పేరవి చెల్పవమ్మ మఱి పెద్దలఁ గానమె రూపదుఁ దక్షులౌట. 177

క. అని యడుగుచుండ బాలిక, కనునలుముచుఁ దేనవి విలిచి కటకట పాపా
రేను మొగ్గవాలు చందం, బున నను మొగనెత్తికొనుచుఁ బొత్తులఁ బాఁడన్. 178

క. అపుడది గని యింతన యీ, విపరీతపుఁ జేఁత లేల వినిపింపఁగదే
యిపుడే నడిగినయది చో, ద్యపుఁదల్లీ యనుచు మఱియు నాతఁడు పల్కెన్.

చ. కలుషుల పాపలై మనుల గానని యట్టికి తల్వ దింపఁగా
నెఱిఁగిన నీవు నాఁకలియు నెప్పులు నా యనుపాపు మాయలం
బఱచిన నేను పోమిఁక స్వభావపు దివ్యవిభూతితోడ నే
వెలుచు మమ్ముఁ బ్రోవు మనువారును నైరపురాణభాసదుల్. 180

గీ. ఇంక నేమియైన నెఱుఁగంగవలయు నం, గేమిపదము నీవు దెలిపె దనుచు
నమ్మియున్నవార మమ్మ యీపెడమాయ, లంద నేల మనిరి కొంద ఱంత. 181

క. అమ్మా కిఁక మఱియు నెవ్వా, రెమ్మెయిఁ దను వేఁడుకొన్న నెఱుకకలిమిలే
శమ్మును గాన్పింపక స, త్యమ్ముగ నాఁకటన యేడ్చె నాశిశువు గడున్. 182

శా. ఆవాక్ప్రౌఢియు నాసుబోధముఁ జిరంబై యున్కి యట్లబ్బుటై
నావేశం బపు డెద్దియో తదతిమాహాత్మ్యంబు రప్పించెఁగా
కావేళం దెలియంగలేని తగ సంప్రార్థించి తద్దివ్యబో
ధావిర్భావవిధానముం గటగటాయం చుండె సర్వేశుఁడున్. 183

వ. తదనంతరంబ యమ్మణిస్తంభనందనుండు రూపానుభూతిని మదాళయుం బిలిచి యీబాలిక కథలన్నియు వింటిరే కదా యీభాగ్యవైభవంబునకు నెందు నీడు లేదిది మొదలు నాకు మీర లత్తమామలై తికి సదినంబు లేదు మీరలింకం దక్కన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొలువు మాని యాశిసువు నింటికిం గొనిపోయి పోషింపుం డనుట యు నతనికి నత్య
దాక్ష్యం డి ట్లనియె. 184

గీ. పార్థివేంద్ర వారి పడుచు మెడ న్మణి, హార మెపుడు పెట్టి తపుడ నీకు
వార లత్తమామ లై రని యున్నాఁడఁ, దదనుగుణము లయ్యెఁ దత్కథలును. 185

క. ఈశిసువు సులక్షణము ల, నూనంబుగఁ జూడ నిది నృపోత్తమ నానా
భూనాథవధూమాళిను, ణీనిర్మిత నూపురార్చనీయాంఘ్రి సుమా. 186

చ. అని యతఁ డాడుమాటలకు నాత్మ గరింబలర స్దరిస్మితా
ననుఁ డగుచు న్మహీశుఁడు ఘనప్రమదంబున వారి నంతఁ దా
ననిపెఁ జనుండు మీరలు గృహంబున కాత్మజఁ గొంచు నంచుఁ గాం
చనమణిభూషణప్రముఖసంపద క్రొత్తగ వెంటనంపుచున్. 187

క. అమధురలాలసాకథ, లేమియు శుద్ధాంతమునకు నేఁగక యుండ
న్భూమిపతి యడఁచె నభినవ, కౌముదివిన నేల యనుచు ఘనయత్నమునన్. 188

గీ. అంత నలసుప్రతుని యథేష్టాన్న దాన, కరణపర్యాప్తబహుధనగ్రామదాన
ముల మిగులఁ దన్పి యనిపె నపుత్రకముగఁ, దత్పురంధ్రీనివాసపద్మమున కతఁడు.

క. క్షితిపతి చేసినగౌరవ, మతిమోద మొనర్పనింటి కాచందమున
న్సుతఁ గొనిపోయె ముదాళయు, సతి యుఁ బ్రయత్నంబుతోడ సతత్క్షేమన్. 190

క. పలువాఱుఁ దలయంటి తిగ, న్నలుఁగిడిఁ దోయిళ్లఁ జలము నంబోర్కాడిం
చి లలిం జన్నిచ్చుచు ను, య్యాలలూఁచుచుఁ బెనుపఁ దొడఁగె నావరిశిసువున్.

వ. బ్రహ్మవచనసామర్థ్యలబ్ధం బైన సహజపాతివ్రత్యంబు నంజేసి యాసమయంబున.

చ. పొలుపుగఁ దన్నువే నిమురఁ బుచ్చుటకై తమతల్లి ప్రేడియు
య్యెల నిడి యూఁచుచోఁ గువలయాధిపుపాటలు పాడినం గరం
బలుచు గేరికేరి నగు నన్యులపాటలు పాడినం గరం
బలయుచు నేడ్చు లోకు లవురా పతిభక్తి యటంచు నవ్వఁగన్.. 193

సీ. లీలఁ బొత్తులమీఁద లేచి కూర్చుంపుచోఁ దద్దయు నొకక్రొత్త ముద్దుఁజెలువు
క్షితిమీఁద లేఁతకెంగేలిడితడవుచో మొనలిడి యుండొక ముద్దుఁజెలువుఁ
నల్లనల్లన తప్పటడుగులు వెట్టుచో నిద్దంపుఁ బసపర ముద్దుఁజెలువు
గొదలుమాటలు తేనెసొలుకుచుఁ బలుకుచో మోహనంబగువింత ముద్దుఁజెలువుఁ
గలిగి యాబాల నవచంద్రకళ యనంగఁ, దివుట నామనిఁ దనరులేఁదీఁగ యనఁగ
నంతకంతకుఁ బ్రోదిచే నతిశయిలుచుఁ, బరఁగెఁ జూపరులకు ను గనుపండువగుచు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఎల్ల బంధువులకు నల్లాసపెల్లమై, యరిది గారవంబు నతిశయిలఁగ
దల్లిప్రేమఁ గరముఁ దనరారె ముంగిటి, ముత్తెమగుచుఁ గ్రొత్త క్రొత్త సిరుల. 195

ఉత్సాహ. చేతివ్రాలు చూచి యిది యశేషరాజ్యవిభవభో
గాతిశయము గలిగి యలరు నని యు మృదులచరణకం
జాతరేఖ లరసి రాజనతుల నతుల కర్హ యీ
నాతి యని యు నపుడు లక్షణజ్ఞు లాడుకొని రిలన్. 196

చ. గలగల మ్రోయు నందెలును గజ్జెలు మువ్వలుఁ బైడియుంగరం
బులుఁ బులిగోరు సంకులును బొద్దులు గాజులు రావిరేకయుం
జెలువలరంగ నెంతయును జెన్నుసలారుచుఁ గొన్నివాసరం
బులు ముదమందఁ జేసెఁ గడు ముద్దుల సేఁతలఁ దల్లిదండ్రులన్. 197

ఉ. విందులు విందులంచుఁ దను వేఁడుక నెత్తుకొనంగఁ బిల్వ నిం
పొందఁగ నేఁగి పైఁబడుచు నుబ్బునఁ గేరుచుఁ జెంగలించుచు
న్నందిలిపట్టి యాడు ఘన నాట్యము లాడుచు ముద్దుల న్మహా
నంద మొనర్చె బాలిక దినంబును జుట్టపుఁ బూవుఁబోండ్లకున్. 198

క. పుట్టకయ తొల్లి యెక్కడ, నిట్టివి నేర్చె తని చూప నెల్లను జెక్కు
ల్నుట్టుచు లాలింపఁగ నా, చిట్టికలికి చిందులాడు క్షితిపతి దడసన్. 199

మ. దినము ల్కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం బొమ్మపెండ్లిండ్లు గు
జ్జనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చి ల్గీరవంగింజ లో
మనగుంట ల్కనుమూసిగంతలను గంబాలాట లోనైన ఖే
లనము ల్మీఱఁగ బోంట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్. 200

సీ. ఆచిన్నపాప దా నంతయై యింతయై యోలి నొయ్యన బాల్యకేళిఁ దనరె
మగవారి యెదుటఁ బల్మఱు నుండుటకుఁ గొంకెఁ దలచుగా రాదయ్యెఁ దండ్రికడకు
నంగకంబుల బాగు లరసి యోమఁ దొడంగె సపలనీదయ్యె నెప్పుడును బైటఁ
గ్రేళ్లఁ బాపులఁ గలికితనంబు పస నేర్చెఁ బలుకుచో బొమలార్చు భంగు లెచ్చెఁ
ముదురఁ బ్రాయంపుఁబడఁతులమదనకథలుఁ బాడముచో సిగ్గుపడి పాఱిపోవఁ జొచ్చె
శైశవముఁ బాఱ నొత్తుచు జవ్వనంబు, క్రమముతో నంతకంతకుఁ గానిపింప.

గీ. స్తనజఘనభారములచేత జవ్వనంబు, మించి యిరుదిక్కులను నాక్రమించి బలియ
నడుమఁ జిక్కినబాల్యమో నాఁ గృశత్వ, మంతకంతకు నొందె నాయతివ నడుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. తోరపుఁ గచభారముఁ గుచ, భారముఁ గటిభారము న్విభాసిలుచుండ
న్నాయవి త్రిభువనరాజ్యపు, భారములు వహియించినట్లు బాలిక యొప్పెన్. 203

సీ. గురుతరస్తనకేళిగిరులను గంభీరతరనాభికూపమతల్లిక యు ను
జాతరోమాళిశృంగారధారాసరణి యు నంగుళీకిసలయచయంబు
సుకుమారబాహువల్లికలు ను రమ్యోరుకదళికాస్తంభప్రకాండములు ను
సలలితాధరబింబఫలవిలాసముఁ బుష్పవిసరపాండిమహాసవిభ్రమంబుఁ
గలిగి పలుకులు శుకపికకలకలముగఁ, గుంతలంబులు మధుకరికులము గాఁగ
శంబరారాతి కేళీవనంబుఁ బోలె, సుదతి యపుడొప్పె నొకవింత సోయగమున. 204

గీ. ఆలతాంగియు నాలోన నభ్యసించె, వివిధసంగీతసాహిత్యవిద్యలెల్లఁ
గావ్యరచన యొనర్చెఁ బ్రాగ్జన్మవాస, నాతిశయముచే ననతిప్రయత్నమునను. 205

వ. కళాపూర్ణుండు నమ్మధురలాలస ను మున్ను తల్లిదండ్రుల యింటన పెరుఁగనిమ్మని యనుచుట యాదిగా నభినవకౌముది విహారవిశేషంబులవలనను రాజ్యకార్యవ్యాసంగముల వలనను మఱచి మఱి యెన్నఁడుఁ దడవఁ డయ్యె మదాళయుండు నతనిచిత్తంబు తెలియం గెఱుంగక యూరకుండె నంత నామధురలాలసయు నవ్విధంబున జవ్వనంబు ప్రాపించి యంకురితమదనవికార యగుచు నాకళాపూర్ణపాణిగ్రహణం బభిలషించుచున్నంత. 206

చ. మునుకొని కూర్మి నెచ్చెలుల ముచ్చటవేళలఁ దద్గుణౌఘము
ల్వినివిని విన్నయర్థ మొకవేళ ను మానని నిత్యభావనం
గనికని కన్నయంతే యు ను గావ్యవినిర్మితిచేతఁ దార్చుచుం
గొనకొని మిక్కిలిం జనిచెఁ గోమలప్రేమము నామహీశుపైన్. 207

క. అంతటఁ బ్రత్యక్షంబుగ, గాంతుం గనుఁగొనఁగ బిగువుఁగౌఁగిటఁ జేర్పం
గంతువిహారంబుల న, త్యంతము మోదింపఁ గోరె నంగన మదిలోన్. 208

క. అనలుం గొనలుం బాఱుచు, మనమున నాకోర్కి తీఁగె మగువకు మిగులన్
ఘనముగఁ దత్కుసుమద్యుతి, పనుపడ వెలిఁబర్వె ననఁగఁ బాండిమ దోఁచెన్.

వ. అందు. 210

ఉ. ఒక్కతెఁ బిల్వఁబోయి మఱియొక్కతెఁ జేర్కొని పిల్చు వేన సొ
మ్మొక్కటఁ దాల్పఁబూని మఱియొక్కటి వీడ్వడఁ దాల్చు నర్థిమై
నొక్కెడ కేఁగఁ జూచి మఱియొక్కెడ కేఁగుఁ బయోరుహాక్షి దా
మిక్కిలిఁ జేర్పు భూవిభుని మీఁది పరాకునఁ జేసి నిచ్చలున్. 211

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఏమి కన్నులఁ గన్న హృదయేశురూపంబు దోఁపక యది మున్ను దోఁపకుండె
నేమి వీనుల విన్న హృదయేశుమధురోక్తి దోఁపక యది మున్ను దోఁపకుండె
నేమి మైసోఁకిన హృదయేశసంస్పర్శ దోఁపక యది మున్ను దోఁపకుండె
నేమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి దోఁపక యది మున్ను దోఁపకుండెఁ
గాంత కంతట నంతటికంతుకేళి, వివిధసంకల్పవాసనఁ బవలు రేలుఁ
దనపులకలుఁ గలవరింతలును మాట, వీఁకుపాటులుఁ జెలులకు వెలిఁ గొనఁగ. 212

గీ. తరుణి తాఁ బగళ్లు తామరసాక్షియు, స్వైరవాశ్ర నుచితనియతిఁ బరఁగ
నిర్వహించె రేలు నీలోత్పలాక్షియు, స్వైర నృపునిమీఁది ప్రేమ నంత. 213

క. సితకరుని శుక్లపక్ష, ప్రతిపత్కళఁ జూచి చూడ భామిని నెమ్మే
నితనుత్వముఁ బాండిమసం, గతి యును గడు నెక్కు డగుచుఁ గానంబడియెన్.

ఉ. వీణెమ్రుట్టుట ల్మిగులవింతలు పెంపుడుఁజిల్కబోదతో
రాణదలిర్పఁ బల్కుట కరం బపురూప మపూర్వ మెంత యుం
బ్రాణసఖీరహస్యములభ్రాంతి యుఁ గ్రీడలు గానివావి యా
యేణవిలోలలోచనకు హెచ్చినమన్మథచేష్ట నయ్యెడన్. 215

క. నిచ్చలు నీగతిఁ బైపై, హెచ్చి వియోగానలమున నెంత యుఁ దాపం
బచ్చుపడఁ బ్రవర్తిల్లఁగ, నెచ్చెలు లచ్చెలువఁ జూచి నెమ్మది గలఁగన్.

క. పెక్కుదినంబులనుండి యు, నిక్కన్నియవర్తనంబు లెల్ల నరయ వే
ఱొక్కగతిఁ దోఁచుచున్నవి, మిక్కిలి నూహింపుఁ డా నిమిత్తము మీరల్.

క. కొమ్మ గడుఁ జిక్కుచున్నది, నెమ్మొగమునఁ బాండిమంబు నిబ్బర మయ్యె
న్నెమ్మదిలోనివిచారము, మమ్మర మిది మన్మథకృతములు గావలయున్.

మ. మన మొక్కొక్కతె సమస్తగుణసంపన్నుం గళాపూర్ణు శో
భనరూపు న్వినుతింపకుంటె మది యిప్పాట న్సఖి న్నొంచె దు
ర్జనచూడామణి కాముఁ డిట్టికొమరుంబ్రాయంపుఁబూఁబోండ్ల నొ
క్కనిమిత్తం బిసుమంత గల్గిన గడుం గాటించు దుర్వారతన్. 219

క. కావున నిపుడీభామిని, భావజుఁ బారిఁ బడి మిగుల బడలుట నిజమీ
భావంబును మఱపింపం, గావలయును వనవిహారకలనల చేతన్. 220

గీ. అని విచారించి యాచంచలాక్షి మదికి, వేడ్కపుట్టించి తోడ్కొంచు వెలఁదు లేఁగి
రమితమకరందనిష్యందరమితమధురి, తాలిసంతాన మైన యుద్యానమునకు. 221

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అప్పు డయ్యుపవనంబునకుఁ దూఱరాక తాఱుకొనుచుం జూపట్టియున్న మెచ్చు న
చ్చెరువు వొచ్చఁ బచ్చపట్టుబల్లాడదట్టీలలీలఁ జాల నొఱపుచు నొరపుమిగులు మొ
గలిగముల గుమురులనఁ బొడవులుగ దీపించు తోఁపుగుజ్జారంబుల చెలువు నల
వరించు చివురుటెలమావితండంబులు ను దండతండంబులై మెండుకొన నొదవుమద
మునం బెనుపొదలు పొదల మెదలుకొదమతుమ్మెదలపదువు లిను. సరిపెణలపెనుపు
నఁ బనుపఱచుచుఁ గనుపట్టి దట్టం బగుచిగురుజొంపపుఁ గెంపుసొంపు సిందూరం
పుఁగెంపుమాళిచందంబు నందపఱప నుపరిభాగజాగరూకపల్లవప్రసూనదళపటలశబలి
మవిలసనంబు లలితకుముదమతల్లికల యుల్లాసంబు వెల్లిగొలుప వెలుతురులేని పూఁదే
నెసోనవాన ధారాప్రకారంబునం దోరం బగుచుఁ దనరారు మారుతప్రచారంబుల
నప్పటప్పటికి నుప్పతిల్లుపుప్పొడుల కేళిధూళిపాళికలపోలిక నేలికొనంగ నేనికబూ
మితులు పూని కానిపించుచున్న పొన్నలు ను నవిరళదళకిసలయవిలసితలతావితానం
బులు మరకతకురువిందనిచయఖచితంబు లగుసగతుల పగిదిఁ జూపట్ట సమకట్టుజల్లుల
మొల్లమి నుల్లసిల్లుచు నిరుగడల ప్రేలు నిడుసోగపూవుగెలలు ఘాలుపొంచ నగ్రభాగ
పల్లవంబు లింద్రగోపంబులుట్లారులరోజ రాజిల్లఁ దేజీలపోలిక భాసిల్లు వాసంతి
కాకుడుంగంబులు ను గడుదళంబుగఁ బొదిగి రొదుగం గలభంగులఁ జెంగలించుచు
నమరు తమలపాకుఁదీఁగెతుల్లికలమీఁద మించివెల్లితలచుట్టుఁగట్టడలు నెట్టుకొలుపు
తోలుంబట్టల పాదుగుళ్ళపైఁ గ్రొమ్మెకుగు నెఱిబిఱుసుచుంగుల నిక్కు టెక్కు ను
మిక్కిలిం గడలుకొలుపుచున్న యరవిరిచిగురు మొగిలియాకులతోడ వీరభటులజోకలు
జోకపఱచుచు శేఁబోఁకబ్రమాఁకులును వివిధజనకోలాహలంబులకరణిం బరిఢవిల్లు
శుకపికశారికానికరకలకలంబులు ను గలిగి విరహిసముదయంబుపైఁ గదలినకుసుమ
కోదండుదండువిడుసుం బోలె నాలోకనీయం బగుచుండ నందు నిందువదనలు మం
దగమనస్వభావంబు నశకరించు కుతుకరయంబునకుఁ బ్రతికూలంబు లగుచుం బిగువు
పాలిండ్లప్రేఁగునకుం బిఱుఁదులగరిమ యుఁ దరముగాక కర మలయంజేయుచుండ
నొండొరులం గడచుచు నుద్దవిడి నడచుచుఁ గూడమికిం గేలిచేయుచుఁ గ్రొవ్విరు
లు మించి కోయుచుఁ గమ్మగొజ్జెంగులకుం జేరుచుఁ గన్నెగేదంగులకుం బోరుచుఁ
బొన్నలకు మూఁగుచు బొండుమల్లెలకు నేఁగుచు సంపెంగలకు డాయుచు జాతిప
డుంగంబుల రోయుచు మల్లెలకు నిగుడుచు మరువంబునకు మగుడుచుఁ గురువేరు గొ
ల్లలాడుచు గంధంబులకు మల్లాడుచుఁ బొగడలకు జరగుచుఁ బోఁకపాళికలకుఁ ది
రుగుచుఁ దిలకంబులకుం జనుచు దిరిసెనపున్నలు గైకొనుచు నవమల్లికలఁ గ్రీడించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చు నారంగంబుల గ్రేడించుచుఁ గలిగొట్లకుఁ దత్తరిల్లుచుఁ గంకేళిమంజరులకు రం
జిల్లుచుఁ గ్రొమ్మావినీడ లాశ్రయించుచు గురువిందపందిరుల విశ్రమించుచు నీరంబులఁ
దూఱుచు నెందేని యుం బాఱుచుఁ బూఁదేనియలఁ దోఁగుచుఁ బొదరిండ్ల డాఁ
గుచుఁ గనిన నవ్వుచుఁ గప్పువిరులు రువ్వుచుఁ దీఁగెయుయ్యెలల నాడుచుఁ దియ్య
విలుకానిం బాడుచుఁ బరాగంబులు చల్లుచుం బయ్యెదలు విదుల్చుచు నందనిపూఁ
గొమ్మలకు నిక్కుచు నలఁతిమ్రాఁకు లెక్కుచుఁ గెంజిగుళ్ళకుం బదరుచుఁ గెరలు తేం
ట్లకు బెదరుచుఁ గోకిలస్వరంబు లాలించుచు గొరవంక లాలోకించుచుఁ జిలుకల
కుం బలుకు లందిచ్చుచుఁ జిన్నిరాయంచలనడలు మెచ్చుచుఁ బూబంతుల వే
ట్లాడుచుఁ బొనఁగ సుద్దులు గూడుచు గెలిచి పోనీక పట్టుచుఁ గేకిసలుగొట్టుచు
నొక రొకరిఁ జీరుచు నుబ్బునం గేరుచు నిబ్బరంపుఁదమిని దపకుఁ దమకంబు గ
మకంబు హెచ్చింప నింపుమీఱువిహారంబులచేత నడరుబడలికలం బొడము వెడ వె
డచిరుచెమటతడి యొడళ్లం గడుఁ బ్రబలి గుబులుకొను మృగమదఘనసారగంధసా
రకాశ్మీరవిలేపనపరిమళంబులు పరిమిళితదిగంతంబు లగుచు నంతటం జోడుముట్టి స
హజకృశత్వంబునకుం దోడు క్రీడలయలంత నెంత యు ఘనంబైనబడుగుఁదనంబునం
దడఁబడుచు వడవడవడంకులుగుడుచునడుములం దడఁబాటువలన నడిలఁబాఱు ని
లువుతావులం జిక్కం జెక్కుకొనుతటిఁ బొక్కిళ్ళం బ్రవేశించి సముదంచితకురువిం
దకందళసందర్భసంగతాంగుళీయకప్రచురరుచినిచయకషచితకరతలరాగంబు లడుగు
ల నిర్గమింప నినుమడించెనో యనఁగ నతిమాత్రసంచారసంక్షుభితంబు లగుచుఁ జర
ణతలంబు లత్యంతరక్తిమ యుట్టిపడుచుండ నిట్టట్టు పైఁటచెఱంగున విసరుకొన నె
సఁగుకరకంకణమణిఝణాత్కారంబులకు నులుకుకరణిఁ దఱచుటూర్పుల పెంపున
నుత్కంపమానంబు లగుచుఁ జెన్నొందుజక్కవకవల కెలంకులఁ జొక్కపుఁజెక్క
లకదలికలుముదలకించుచునిగుడునిగనిగలతరగలయందంబు సందిదండలతళుకులకుఁ జా
లికారంబు నెఱప నలయిక సొలయికల నొకవింతయొయ్యారంబు చూపుచూపుల
పనకుం జూపోపక రేపటినలీలం జాల వసివాళ్లువాడిన క్రీడావతంసితకర్ణనీలోత్పల
దళంబులు నిజప్రతిబింబకపటపరిదృశ్యమానసోదరాలింగనలోలుపంబులువోలెఁ జెక్కి
ళ్ల మిక్కిలి నంటుకొనుచుండ నొసల ననలుకొను కమ్మకస్తూరియుమ్మలిం బడి కదల
మెదలలేనినీలాలకజాలంబుల నిజబాలకళంకంజేసి వెడలఁ దివియ సందడించుచం
దంబున నంపంప క్రందుకొనియెడు నిశ్వాసవాసనాసమాకృష్టచంచరీకసంచయంబు
లకు నుపరి యుపశమించుమృదులంపుఁగలికిపలుకులు దమనిసువుల కొనరుమెలుంగులచ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వి కొనరక ముసురుకొను పసనిరాచిలుకగములం దొలంగందోలు కేలుకెంజిగురాకుల కు మాఱక లై కవియుకోకిలంబులచేత నాకులంబు లగుచు మైఁదీగెబాగుల వసం తాగమశ్రీవిభూషితవనదేవతావిలాసవిశేషంబు నభినయింప నాత్మసాదృశ్యసంభావ నాగర్వంబువెల్లునం ద్రుమ్మనుల్లఱుపుకల్లరితేఁటితండంబులకండక్రొవ్వు సైరింపక వానిజీవిక లాక్రమించి తదనుసరణంబున దయ వొడమి కొంత మగుడ విడుచువడు పు గనంబడఁగ నెడనెడం గులుకునడ బడిబడిందొరఁగువిరిగముల నమరెడియరఁటిడు కొప్పులయొప్పిదంబు చెప్ప నలవిగాక యతిశయిల్లఁ జెదరినసింగారంబులు ను జిగు రుంగొనలచేరులు ను నంటినపరాంగంబులు ను నకరువులలోడిపాపటలు ను వాడుదే ఱెడినెమ్మోములు ను వడఁకెడుకులుకుఁబెలుంగులు నుం గలిగి యపూర్వాశ్రమంబున సొంపుమీఱు చుం దదనంతరంబ.

క్రౌంచపదవృత్తము. చంచలవీచీసంచయలీలానలలితతరళితజలరుహపాళీ
సంచితహస్తోదంచితభంగీజనితమదనమతసరణిగుణవ్యా
ఖ్యాంచితగోష్ఠీసంచరణప్రత్యయసముచితహళహళికలతో రా
యంచలుమ్రోయంగొంచలుగూయన్వ్యవహితపరరవమయినకొలంకున్

ఉ. చేరఁగఁ బోయి రంగనలు చెల్వపుమోములసోయగంబు త
ద్వారిజలక్ష్మి గేరఁగ నవారితవారితరంగరంగలీ
లారతహంససారసకులస్థలదారవసారవంచనా
పారగనూపురాదిబహుభవ్యవిభూషణఘోష మొప్పఁగన్.

ఉ. అంతట నంతరంగముల నంబువిహారకుతూహలంబు ల
త్యంతము మీఱ మెట్లు డిగి రామగువ ల్మునికొంగు లూఁదుగా
ధ్వాంతరసీమఁ బట్టుచు జలాశయలక్ష్మిపయి న్నఖచ్ఛటా
కాంతులచేఁ బదాబ్జములు క్రొప్పపుఘూళి వసంత మాడఁగన్.

సీ. అలఁతిగాడ్పులచేతఁ దొలఁగు పయ్యెదకడ లిసువంకల ను జిక్కి నిటికొనుచుఁ
దరగల ని ట్టట్టు దరలు ముంగొంగులు తిరుగ జంఘల ను సంధించుకొనుచుఁ
మునుపుగాఁ జొచ్చినవనితలు చల్లెడియుదకంబునకుఁ జేతు లొడ్డుకొనుచు
నెడనెడ మిట్టించి పడుమీలబెళుకుల కులికిపా టొదవంగ నొసరిలుచుఁ
దొగలమఱుఁగునమండి బి ట్టెగయువిహగ, కులమురవళిక బెదరుచూపులు దలిర్పఁ
దమ్మికొలను ప్రవేశించుతలిరుఁబోండ్ల, విలసనము లెంతెంత యు వింత లయ్యె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆరమణీమణు లుగసి నట్లు ప్రవేశ మొనర్చువేళఁ ద
త్త్వారణవీచికాచలితకంజముల న్మధులోలభృంగము
ల్వారక సారెకు న్నెగసి వ్రాలుచు నొప్పెఁ దదంబుదేవత
ల్నెఱపుతోడ నాకుహరినీలపుటచ్చనగండ్లకై నడిక్.

లయగ్రాహి.

నెమ్మొగములం గరతలమ్ములఁ గుచమ్ములఁ గచమ్ముల ను జూడ్కి నయనమ్ములఁ బరాభూ
తమ్ములు ను బోలె విరితమ్ములు ను రక్తజలజమ్ములు ను గోకమిథునమ్ములు ను శైవా
లమ్ములు ను భృంగనిచయమ్ములు ను మీననికరమ్ములుఁ గలంగఁ జలనమ్ములు భజింపం
గొమ్మ లపు డెంత యు ను సమ్మదకుతూహలభరమ్ముల నొనర్చిరి కరమ్ము జలకేళిన్.

లయగ్రాహి.

ఓల యనుచు న్వలదు గేలి యనుచుం జలువఁజాల వనుచుం గడుఁబిసాళి వనుచుం బ
ద్మాళిఁగొని కొట్టుచును దోలివడిఁ బట్టుచును మేలములఁ దిట్టుచు గయాళితనమింకం
జాలు ననుచు న్బళిర గోలయనుచుం బగటనేల యనుచు న్మగుడ బాల వనుచుం గ
య్యాలకెనపెట్టుచును హాళిఁజలపట్టుచుసుమాళములఁ గిట్టుచును బాలికలు వేడ్కన్.

కవిరాజవిరాజితము. గుభులుగుభుల్లనుఘోషణఁ దోయజకుంతతతు ల్గలఁగుండుపడన్
క్షుభితఘనస్తనకుంభపరిచ్యుతకుంకుమచందనకుంతలనూ
నభరవిలాసమున న్బహువర్ణము నవ్యసుగంధగుణంబు కొలం
కభినుతిభాజన మై భజియింపఁగ నంబువిహారిణు లై పొసఁగన్.

మాలిని. తడిసి తనువుల న్చేవంబు గాన్పింపకుండం
గడు నడఁగిన చేల ల్గ్రి ల్మ్రుక్కళ్లప ట్టె
ర్వడఁ దెలుప ఘనాంభోభారతం గుంతలంబు
ల్మడమలపయి వ్రేల న్మత్తమాతంగయానల్.

వ. కాసారంబు వెలువడి నవీనవస్త్రాభరణగంధమాల్యంబుల నలంకృత లైరి మధురలాల
న యుం గాంతునిమీఁదిపరాకునఁ జెలికత్తియలబలిమిని వనక్రీడాదు లెట్టకేలకు ని
ట్టట్టు సలుపుచుండె.

ఉ. వర్ణనపాత్రచిత్రగుణవైభవశోభితుఁ డత్తఱిం గళా
పూర్ణుఁడు డేగవేఁటతమిపూన్పిన వచ్చి ముదంబునం దద
భ్యర్ణమహిం జరించు చోకపక్షికి బాఱినడేగఁ బిల్చుచుం
దూర్ణత నేఁగె నానిజవధూటి యుఁ బోటులు నున్నచోటికిన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అప్పుడు.

ఉ. నిద్దపుఁ జెక్కుటద్దముల నింపులుగాఁ బులక ల్జనింప న
మ్ముద్దియ బోటిమోఁపుపయి మో మరవోఁపఁగనిల్పి యత్తఱిం
దద్దయుఁ బ్రేమఁ జూచె నిజనాథు నతండును దానిఁ జూచె నా
యిద్దఱి చూపులు న్నడుమ నించుక తారొకని లజ్జఁ గ్రమ్మఱన్. 235

చ. వనజదళాక్షి చూచినను వల్లభు చూపు లతండు చూచిన
న్వనజదళాక్షిచూపులు ఘనత్రపచే వెనువెన్కకు న్వెసం
జనుచు నొకొళ్లొకళ్లకయి సారెకు వచ్చుచుఁ బొల్పుమీఱెఁ గ
న్గొన రతిపంచబాణుల వినోదపుటుయ్యెలచేరులో యనన్. 236

చ. వినుకలిచేత ము న్మిగుల వింతలుగాఁగ విరాళిఁగొన్నయ
వ్వనజదళాక్షి యట్లు తనవల్లభురూపముఁ గన్నులారఁగాఁ
గనుఁగొని యేమిచెప్పఁ గడుఁ గంతుశరాహతిఁ దాపమొందుచు
న్మనమునఁ గుందె నప్పు డటు నాథునిఁ గౌఁగిటఁ జేర్పలేమికిన్. 237

గీ. అతఁడు మధురలాలసయందు నాత్మ దగిలి, మగిడి శా కలయింపఁగ మరలి మరలి
యొక్కొక నెపంబుతో దానియొప్పిదంబుఁ, గనుఁగొనుచు నెట్టకేలకుఁ జనియెఁదిరిగి.

వ. అంత నక్కాంత యు నంతరంగంబునం గాంతుఁ జింతించుచు. 239

ఉ. అప్పుడుపాదపద్మములు హస్తతలంబున నొత్తఁగోరు నా
శ్రీమహనీయవక్షమునఁ జేర్పఁగఁ గోరుఁ గుచద్వయంబు నా
కోమలగండపాళికలఁ గూర్పఁగఁ గోరును గండపాళిక
ల్కాముని బారి కగ్గమయి కామిని తాలిమి చంచలింపఁగన్. 240

ఉ. అప్పుడు తత్సరోజముఖియాకృతిచందము బోటు లందఱుం
దప్పక చూచి యక్కట వృథావనఖేలల వాళి నించుకే
నిప్పుడుచుం దలంపము మృగేక్షణలార గణించి చూడుఁడా
యొప్పుడు నేవినోదములు నీచెలి కింపులు గా వొకింత యున్. 241

ఉ. ఈనళినాక్షిచింత సారియింత మొకింత పరాకుచేసి యుం
బూనికతోడ వచ్చి మనపోకడ లే మని చెప్ప నాటలే
కానినృపాత్మజం దలఁప గానను దీనివిచార మేమి యు
న్నానుట లేద మిక్కిలి ఘనం బగుచున్నది గాని యెన్నఁగన్. 242

వ. అది యు నుం గాక. 243

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్రగ్ధర. శ్యైనంపాతంవిహారాశ్రయణమధురవేషంబుతోఁ జూడ్కి వేడ్కం
బూనంగా నింతకున్మన్నరుసమణి కళాపూర్ణుఁ డేతెంచెఁ జేర్మిం
దా నిచ్చోటం జరించెం దరుణి యతని నత్యంతము న్వింత ప్రేమ
న్నేమఃప్రాం జూచినట్లుం గొ నది మొసలు సుండీకడుం దాప మొందెన్. 244

ఉ. కావున నీవసంతమదగర్వితకోకిలకీరశారికా
రావముఁ దేఁటిపిండురపురావము మెల్లని చల్ల గాడ్పుపూఁ
దావులసొంపుఁ గొంజిగురుఁదండము లేఁబొదరిండ్ల యొప్పులు
న్భావజు పక్షమై మిగుల బాలిక తాలిమిఁ గొల్లలాడెడిన్. 245

ఉ. ఇట్టిది గానలేము మన మింపలరం దరళాక్షికి న్మదిం
బుట్టిన పంచబాణువెఱపు ల్మఱపింపఁగఁ బూని వానికిం
బట్టపురాజధాని యనఁ బట్టగు తోఁటకుఁ దెచ్చుటొప్పు నే
ఘట్టకుటీప్రభాత మనఁగా నిదివో పరికించి చూడఁగన్.

క. అనునంతట నయ్యంగన, యనయముఁ బ్రబలమగునట్టి యంగజతాపం
బున నుస్సురస్సు రనుచుం, గను ఱెప్పలు దేలవైచి కడు సొలయుటయున్. 247

మణిగ. పడఁతులు చిడిముడి పడియెడు మదిలో, నకుగులు తడఁబడ నడరెడు నడుపుం
గడఁకల నడుములు గడగడవడఁకం, బడిబడిఁ బొడమఁగ బడలికఁ జెమటల్. 248

సీ. విరిదమ్మితావులు వెనచల్లుకొలని చెంగటఁ గమ్మపన్నీటికాలువలు ను
గడునివతాళించు కప్రంపుటరఁటుల యిరవులఁ బూవుఁ జప్పరముఁ బన్ని
వట్టివేళ్లను దడిగట్టి శ్రీగంధంపు టసలున మెత్తి తదంతరమునఁ
గర్పూరవేదిక గావించి చల్లని చెంగల్వరేకులు సెజ్జఁ దీర్చి
చిలుకఁ దేనియతోడి గొజ్జెంగపూవుఁ, దలగడ యమర్చి యందు నాచెలువ నునిచి
జగతిఁ గలసర్వశైత్యోపచారవిధులుఁ, జలిపి రందు నుగడఁగాన కలసి రంత. 249

ఉ. అప్పువుఁబోండ్లు వెండి యుఁ బ్రయత్నముతోఁ బలుమాఱు వీనులం
గప్పురమూఁది పూవిసనకఱ్ఱలు గొజ్జెఁగనీట మాటికిం
దొప్పఁగఁదోఁచి వీచుచుఁ జనుంగవపై నఱకాళ్లఁ బాణాల
న్లప్పలుగాఁగఁ జందన మలందుచుఁ గొందలమంది రందఱున్.

వ, అంత. 250

క. వికలుఁ జిగుళ్లు ను జొరవుగ, సిరిగందపుటన లాకింత చిలచిల మని వే 251
గిరిమ వఱువట్లు గొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముం గని కలఁకన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. చతుర యగునట్టిబోటి యానతిని జేరి, చలువచెంగావిపయ్యెద చక్కఁగఁ గప్పి
నేత్రయుగళంబు మీఁదఁ బన్నీటిచేతఁ, దుడిచి చెదరినకురులు దిద్దుచు ను బలికె.

క. ఎక్కడ మేనంటినఁ గే, ల్పొక్కెడునం తగుచుఁ గళలవోదలెడు భారం
బెక్కువు శైత్యక్రియలో, యక్కయిఁకం బోదు కోర్కి యడఁచిన నెపుడున్. 251

గీ. ఇంతి సిగ్గుగదా యని యింతదాఁకఁ, దలఁపు డాఁచి లోలో గుమారిలఁగవచ్చు
నది యుఁ గా కేను లాఁతినే యకట నీకు, రమణి నాపట్టునను దాఁపురంబు వలదు.

క. ప్రాణములకుఁ బ్రాణం బగు, ప్రాణసఖికిఁ జెప్పరానిపనులుం గలవే
యేణాక్షి కలిగ నేనిం, బ్రాణసఖి యను నుసుఱునొక్కపాటియ కాదే. 256

మ. అనిన న్మిక్కిలి సాహసంబున నభీష్టార్థంబు చెప్ప న్మనం
బున నుంకించుచు లజ్జచే నుడుగుచుం బూఁబోఁడి యొక్కింత సే
పు నితాంతాకుల యయ్యె నంతట ను దాఁబోనీక యాబోటి యుం
దవపై నానలు వెట్టిపెట్టి యడిగె న్యత్నంబు సంధిల్లఁగన్. 257

క. ఇమ్మెయి నిర్బంధించుచు, నమ్ముద్దియ యడుగ నృపవరాత్మజ యనుమా
న మ్మొక్కభంగి నుడువుచు, నెమ్మది నూల్కొల్పి పలికె నిజసఖితోడన్. 258

ఉ. ఓహరిణాక్షి నీకు నిఁక నుల్లము దాఁపగ నేటికి న్జగ
న్మోహనమూర్తితోడ నిటు న్మొకనాఁటినిశ న్విలాసన
న్నాహముమీఱ మద్విభుఁడు నాకలలోపల వచ్చి తేర్చెఁ గా
మాహవకేళి నద్భుతసుఖైకమయుం బది యేమిచెప్పుదున్. 259

క. అనుచుఁ దదుత్సవలీలలు, మనసునఁ బాఱుట యు వివశమతి యై మోడ్పుం
గనుఁగవలో నొక్కించుక, వనిత నిలిచి ఘర్మపులకవతి యై యంతన్. 260

వ. అనూర్మి నెచ్చెలిం గటాక్షించి. 261

క. చెప్పెడి దేమె లతాంగీ, యప్పురుషోత్తముఁడు నన్ను నట్లు రసాబ్ధిం
దెప్పలఁ దేలిచి నను విడ, నెప్పుడు నని యూఱడించి యెందే నరిగెన్. 262

గీ. అది యుఁ గాక యాధరాధీశుఁ డింతకు, మున్ను మనసమీపమునకుఁ దనదు
డేగఁ బిలిచికొనుచు శివితో రాఁడె యా, యొప్పు మిగులఁ దాల్మి నుమరఁ దోలె.

క. అది మొదలు వదల కొదవెడు, మదనదశావశత వివశమతి నైతినిఁక
న్మదితా చలువలు గెలువలు, నుదికి ననవ్యంబు లతనిమన్నన దక్కన్. 264

క. కటకట మీ రవివేకత, నటునిటు శైత్యోపచార మని యేటికి ని
చ్చటఁ దడసెద రిఁక వెన్నెల, మిటమిటఁ గాయంగ మేను మిగుల నెఱేయదే. 265

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ. కొఱవి చేతఁ బట్టుకొని చంద్రుఁ డదె వచ్చె, గ్రీష్మసమయభానురీతి మెఱయఁ
దనకు నేల యమృతధామాఖ్య గోముఖ, వ్యాఘ్ర మనఁగ నిట్టివాఁడు సుమ్ము. 266

క. చిలుకచదు వనుట చదివిన, ములుచకు దృష్టాంత మట్టినూథపుదుర్జా
తుల చిలుక తేలిచిన దయా, గలదే మది బెదరు పదరు గాక నిజేచ్ఛన్. 267

క. కోకిలములఁ దెలిసినఁ బలు, గాకులపాదిఁ బొదలునట్టికష్టపుఁబులుఁగు
ల్నాకు నసహ్యము లని యా, హా కూఁతలు మానఁగలవె యవి ప్రార్థనలన్. 268

ఉ. కావునఁ జంద్రు గింద్రుఁ జిలుకం గిలుకం బికముం గికంబు న
న్గావు మటంచు వేఁడకుఁడు నాత్రబతు కీరిపుజాతికిం బ్రియం
బే విపరింప మీకుబలెఁ బెంచినవారికి ముద్దుగాక పె
న్నావుపుఁబిల్లికిం గలుగునా మొగమోట యొకింత చిల్కపైన్. 269

గీ. వేయు నేటికి శీఘ్రంబ విభునిపొందు, నంఘటింపఁగఁ గలవేని జలజవదన
యాన నొక్కింత ప్రాణంబు లాఁపవచ్చు, నన్యథాచింత లెల్ల నిరర్థకములు. 270

చ. అన విని పల్కు నీవిభుసమాగమ మెంత యు శీఘ్రవృత్తినో
వనజదళాయతేక్షణ యవశ్యము గల్గుట కేను బూఁట నా
కు నవల మాఱుమాట యవికుంఠితలీలఁ దనర్చు నాదరై
కనిరతు దీనవత్సలత గావున నెమ్మది నమ్ము మెంత యున్. 271

క. అని పలికెడు చెలిపలుకులు, తన కమృతమునోలె హృదయతాపము నడఁప
న్వనజాక్షి నేవదేఱుచుఁ, జనియె న్నిజభవనమునకు సఖులుం దానున్. 272

ఉ. లోలవిలోచనాహృదయలుంఠనశూర తనూవిలాస నం
ద్యాలపురీనివాస నతతాత్మవికాసనృసింహమేదినీ
పాలప్రపౌత్ర నారవిభుపౌత్ర నృసింహునిపుత్ర సర్వధ
ర్మాలయ నిత్యవైభవమహత్త్మ కృష్ణనృపాలసత్తమా. 273

క. సంగీతాదికళారస, రంగన్నానసమహోతురంగమమదమా
తంగారోహణచతురిమ, సంగతవనితామనోజ సమధిక తేజా. 274

తరల. కురుకరూశవిదేహకోసలకుంతలాంగకళింగబ
ర్బరపుళిందకమత్స్యమాళవపాండ్యకేరళచోళగూ
ర్జరశకాది సమస్తదేశధరాతలేశసభానిరం
తరవిభాసురకీర్తినర్తన ధర్మనిర్మలవర్తనా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ
సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమారమణాయనమః

# కళాపూర్ణోదయము.

## సప్తమాశ్వాసము.

క. శ్రీరమణీయస్వగుణా, ధారంజితలోకహృదయ తతనిత్యదయా
సూరిజనారాధనసము, దారస్ఫూర్తినయ కొండమాంబాతనయా. 1

వ. అవధరింపుము. 2

ఉ. కర్ణరసాయనోల్లసితకమ్రయశోమహనీయుఁ డాకళా
పూర్ణుఁడు నట్లు కేళివనభూమిఁ గనుంగొను టాదిగాఁగ నా
పూర్ణసుధాంశుబింబముఖి పొల్పు మనంబున నిల్పి తద్గుణో
దీర్ణలతాంతసాయకవిదీర్ణమనోధృతియై యజస్రమున్. 3

క. తలపోయుచుఁ దనతలఁ పా, యెలనాగం బాయకునికి నితరవిచారం
బులు విడిచి తాపమునఁ గడు, నలఁగుచు నేకాంతగృహమున వర్తిలుచున్. 4

గీ. తనకు నర్మసచివుఁడు సుధీవారతా, రాదిశంసకుండు నైనయట్టి
యొక్కవృద్ధవిప్రు నొకనాఁడు పిలిపించి, కొంతతడవు నర్మగోష్ఠి నడపి. 5

గీ. అనుఁగుఁజెలికాఁడ యొకటి నిన్నడిగి తెలియ, వలయు నని యుండుదును నీవు వచ్చి యున్న
యప్పు డది యేమి యడిగెద ననుచు విడుతు, నడుగకుండినఁ బోదింక ననుచుఁ బలికె.

చ. మననగరంబు తూర్పుకడ మంజులరత్నవినూత్నకాంతితో
నన యను నొప్పునట్టివి మదాళియు నుప్పరిగ ల్గదా తదీ
యనవసువర్ణసాలముల కవ్వల నున్నది నిత్యసాంద్రనూ
తనకుసుమప్రవాళలలితం బగు కేళివనం బెఱుంగుదే. 7

క. ఇట మున్నొకనాఁ డేన, చ్చటి కరిగితి వేటడేగ చనినఁ బిలుచుచుం
గుటిలాలక నొకతె ను ముం, దటఁ గాంచితి నందుఁ జెలులుఁ దాను జరింపన్. 8

ఉ. ఆలలితాంగి రూపుపస యారసి చూడఁగ నెన్ని యాత్మలుం
జాలవు దానిసర్వగుణసంపద లెన్నఁగ నెన్ని జిహ్వలుం
జాలవు తద్విలోకనరసస్థితిఁ జొక్కఁగ నెన్ని కన్నులుం
జాలవు వేయు నేల యది చక్కఁదనంబులరాశి భూసురా. 9

క. ఎక్కడియుపమాకల్పన, లెక్కడియత్యుక్తిరచన లెక్కడిమతి నే
నెక్కడివర్ణన లెక్కడి, యెక్కడ వాక్కులకంత వింతబెడంగుల్. 10

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. భువనంబులం దెల్ల మివుల నెక్కుడుగ నీయిల యేమిపుణ్యంబు సలిపె నొక్కొ
యిలలోనఁ గరము మిక్కిలిగ జంబూద్వీప మేమిభాగ్యంబు వహించె నొక్కొ
తనరజంబూద్వీపమునను భారతవర్ష మేసుకృతంబుమున్జేసె నొక్కొ
ప్రఖ్యాతిగాఁగ భారతవర్షమున నంగదేశ మేతపము సాధించె నొక్కొ
యంగదేశమునందు నేయధికనియతిఁ, గ్రముకకంఠోత్తరపురంబుఁ గాంచె నొక్కొ
తద్వధూపాదవిన్యాసధన్య మైన, యట్టి యాపూవుఁదోఁటచే నతిశయిలఁగ. 11

చ. అపగతధైర్యుఁ జేసె నను నత్తఱి నాశుకవాణి వేణి చా
క్కుపుఁబస శాము బల్కి రుసుకత్తియుఁ బోలె నరాళపార్శ్వ మై
యాపరికృతప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేత డం
తపుఁబిడి క్రైవడి న్మొదలు తద్ద యునింపుజనింపఁ జేయఁగన్. 12

ఉ. అకమనీయవేణిభర మాపరు లాబొమతీరు సోయగం
బాకనుదమ్ము లామృదులపోనకపోలము లాముఖాంబుజం
బాకుచకుంభజృంభణసమగ్రత యాకృశమధ్య మానల
జ్జాకుతుకావలోకముపన ల్మదిఁ బాయవు నాకు నెప్పుడున్. 13

ఆ. ఇంక నీకు డాఁప నేల యాకాంతఁ గ, న్గొనుట యాదిగాఁగఁ గినిసి కినిసి
పంచబాణుఁ డిపుడు ప్రాణంబులకుఁ దెగి, నన్ను మిగుల నొంచుచున్నవాఁడు.

ఉ. ఆవలినాక్షి కన్నెగతి నప్పుడు దోఁచె మదీయదృష్టికిం
దానితెఱంగు నీ వెఱిఁగిన న్వినిపింపు మెఱుంగకున్న నీ
చేనయినట్లిఁకం దెలిసి చెప్పు మన న్మరుబారిఁ బడ్డవాఁ
డీవరనాథుఁ డన్యరస మేనొనరించెద నం దలంపులోన్. 15

వ. నవ్వుచు నావిప్రుం డిట్లనియె. 16

గీ. ఇప్పు డాయమ్మ కన్నెగా నిమ్ము గాక, మానని మ్మింత నిన్నేఁచుమాట వింటెఁ
జల్లనయ్యె నాయాత్మ యాతల్లియేల, వలయుఁ బదివేలు రాజ్యము ల్వసుమతీశ. 17

వ. ఇంత సంతసిల్లుచు నేల దీవించెద వంటేని. 18

సీ. ఓమన్మథా యంచు నోరయ విద్యాంసులగోష్ఠి కెన్నఁడు గడుగుఱుకులేదు
పారాజికులు చేరి పచరించు శుష్కవాచాలత విడుపనివేల మెపుడుఁ
తెవులు చిందఱవోవఁ దెలుఁగు కవీంద్రుల పోరంటిమే శనివారపుజడి
మఱి ప్రధానుల వట్టిమంతనా లెటు వనరానివి ప్రేగులలోని తీఁట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంతనంతఃపురంబున కరిగితేని, నీదు కొలువు బుధప్రకాశోదయంబు
మ్ము మన్నారె యను మాటమాత్రకైన, నెడగలదె నీకు మాకొలువిపుడు గాక. 19

వ. అది యు నుం గాక. 20

సీ. స్థలశుద్ధిగా వసుంధరఁ ద్రవ్వి పుడ్చి రే కట్టించుచు మ బచ్చకప్పురమునఁ
గమ్మపన్నీటి యగడ్తలు దీర్చిరే వెలిఁ బెక్కువరుసల విస్తరిలఁగ
బిసకాండములలోని పసి యార్చి నిలిపిరే మంచిగందమ్మున మదురుగోడ
నవచంద్రకాంతమండపములోఁ బన్నిరే తలిరాకు దళ్ల చెంగలువచవికె
యెన్నఁడైనను దొల్లి నీకిపుడు వోలె, నీమది న్నిల్వసాగనే యామృగాక్షి
వెతఁబడఁబట్టె దినమును వింతవింత, లైన యాపనుల్వ్రాడ మాకబ్బెఁగాక. 21

క. అన నతఁ డన్ని యు నయ్యె, న్నిను నెఱుఁగమె యటుపులకు ను నేర్పరివని నా
కును శెపు మేనడిగిన యా, వనితకులస్థాననామవర్తన లనుడున్. 22

చ. నరవర తిక్కలాదులు వినం దమకించెదు నాకుఁ జెల్వమా
విరహపుశీతలక్రియల వెచ్చము సర్వము నాయముం గొనం
ద్వరపడులాగొ యట్లయినఁ దద్ధన మెత్తుద మాళ్లమీఁదట
న్విరహపుఁబన్నె పే రిడి గణింపరు ద్రొవ్వన నెవ్వనిం బ్రజల్. 23

గీ. ఇదియు నారక యంటేఁగా కేలనీకు, మాకత ల్విన బఁటుకిల్లాకువోలెఁ
దొత్తుకొడుకులువోలెఁ దోడ్తోదిగంత, భూమిపతులంపుచున్నారు కామితములు. 24

సీ. ఇవె చందనపుఁ బ్రమాఁకు లెన్నికఁ గొనరయా కేరళదేశభూదారుఁ డనిపెఁ
గట్టాణిముత్యాలపెట్టె లయ్యా యివి పాండ్యదేశపురాజా పనిచినాఁడు
పన్నీరుచెంబులబండ్లయా యివి కామరూపదేశాధీశ్వరుండు పనిచెఁ
జంద్రకాంతంపు రాచలువలయ్యా యివి యతులము ల్కాశ్మీరుఁడంపినాఁడు
కప్పురపుగోన లివె తురుష్కపుని సేవ, యనుజనులక్రందు వాకిట నద్భుతంబు
నీకు విరహార్తి యగు టన్యనృపుల కెల్ల, నఖిలరాజ్యలక్ష్మివిరహార్తి యయ్యె. 25.

చ. తెలియదుగాక యన్యజగతీతలనాథులు నీకునింతకీ
తలవిధి వెచ్చము ల్నడుపుద్రవ్యములోన సగంబు చాలు నీ
తలఁపునఁ బాయ కి ట్లలఁచు తన్వికి నివ్వరియించులంచమీఁ
గలిగిన నేల తోఁచు నది కారణ మీగతినుండ వారికిన్. 26

క. అన నిట్టి పలువయలపుల, కును గోటికిఁ బడగ యెత్తి గుటియగు పెద్ద
ద్ద న్నిను నమ్మరాదు గాక, ట్లానరిచితే నిట్టిలంచమొసఁగరె నీకున్. 27

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని పలుకు జగతీవిభు మొగంబుఁ దప్పక చూచి. 28

గీ. ఇట్టిత్రానాలు దర్భలు పుట్టెడుప్పు, గడ్డపాఱ యు మ్రింగినగతిని బిఱ్ఱ
బిగిసి కూర్చుండుటలు లేక పెద్దతనము, గలదె యవి లేమి నను నీవు పలువ యంటి

ఉత్సాహ. అనుచు నలుక దెచ్చుకొనుచు నతఁడొకింత మేర వే
చనియె గంగిగోవువంటిసాదు బాపని న్నను
జను నె పలువ యనఁగ నింక సారె కనము భోక ర
మ్మనియె నృపతి యతఁడు దిరిగి యధిపుతోడ నిట్లనున్. 30

సీ. నీ విపు డనినట్ల మావచనమునమ్మఁగారాదు నిజము మీవార మగుట
రాజకుంజర యథారాజాతథాప్రజా యను పల్కు వృథసేయ నర్హ మగునె
యత్తమామలు మీర లైతి రింతటిమండి యని యల్లనాఁడు రూపానుభూతిఁ
దద్విభుఁ బిలిచి యాస్థానంబునందు నీవాడినమాట యేమయ్యెఁ జెపుమ
యామఱపుదోన మిట్లనీయాత్మఁ బొదివి, పీఁచుచున్నది యెట్లన్న వినుము తెలియ
దానఁ బరితప్త యయ్యె రూపానుభూతి, తనయ తదవాప్తి నీయాత్మతాప మొంద.

చ. అనుట యు నెట్టెటూ తెలుపవయ్య మహాత్మక యేల సేసె ది
ట్లనయము నింపుసొం పెసఁగ నమ్మెయి నాపువుఁబోఁట నేను గ
న్గొనినది యామదాళయతనూభవయే యది యింత వేగిరం
బుననె మనోజ్ఞయౌవనముఁ బూనెనె యద్భుత మెన్న నావుడున్. 32

గీ. ఏమి తెలుపు మనియె దింక ను సందేహ, మా నృపాల నీదుమనసు నింత
కొల్లలాడ సకలగుణరాశి మాయమ్మ, గాక వే ఱొకర్తు గలదె జగతి. 33

సీ. వివిధనిత్యాచారవిధిఁ గొంతతడవు షాడ్గుణ్యాదినయచింతఁ గొంతతడవు
గరడిసాదనల వేడ్కలఁ గొంతతడ విభఘోటకారూఢిని గొంతతడవు
దేవవిప్రార్చనస్థితిఁ గొంతతడవు వేదాంతవిద్వద్గోష్ఠిఁ గొంతతడవు
స్నానభోజనవర్తనలఁ గొంతతడ వింపుగొలుపు నాట్యనిరీక్షఁ గొంతతడవు
మంత్రిసామంతముఖ్యసమస్తజనులు, గొలువఁగొలువుండుమహిమలఁ గొంతతడవు
చనఁగఁ గాలంబు నీవిన్కి కనవు తోఁప, దేమొ తగిన జవ్వనమ యాయింతికిపుడు.

ఉ. ఆమెల్లప్రాయము నృవదువంచితకీర్తి యు గోర్చు రాచఁగాఁ
జాయుజుఁ డాకపై నలిగి కత్తులు నూఱుచు నుండు నంతట
న్నీయవలోకనం బొదవ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న వాఁ
డాయెలనాగ బోఁట్లు తెలియ న్వినిపింతురు నాకు నెంత యున్. 35

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. పాపపురాచజాతిగుణభంగు లెఱుంగుదు వేమి చెప్ప న
య్యో పెనుగోరము ల్త్రిభువనోత్తమరత్నము ముద్దుఁగూఁతుఁ బ్రా
ణాపద లంతఁ జెందుతఱి నైనఁ దలంపవు నీకుఁ దెల్ప నీ
వైపరికింప వంచు దురవాంకృతి నాయముఁ గన్నదంపతుల్. 36

క. ఆకన్నియవెత చూడఁగ, లేక సఖీజనులె యుమ్మలించుచు నెపుడు
న్నాకు వినిపింతు రొకతఱి, నీ కేఁ జెప్పుదునొ యనుచు నృపకులతిలకా. 37

సీ. ఏను ను సముచితం బైనకాలము ప్రతీక్షించుచుండుదు నీదుచిత్తవృత్తిఁ
దెలియక యాసుద్ది తలపెట్ట వెఱతు రూపానుభూతికిని మదాళయుఁడకు
మును నీ వనుగ్రహించినమాట తలఁపుచేసినఁ జాలు బొంక వీ వనుచుఁ దలఁతు
బ్రాహ్మణజాతిచాపలమున మఱి యుఁ గొంకుదు నీవిశాలి భంగులు గణింతు
నివి యితరమూలములొ యంచు నెంతునిపుడు, పిలిచియడుగఁ దదాఖ్యలే తెలుపనైతి
మనమదాళయుపుత్రియే యనుచు సులభ, తావగుణమున వదలుదో యనుచు నీకు.

గీ. తమ కసాధ్యమైనఁ దమితోడఁ గాంక్షింతు, రారనాళము ను ధరాధినాథ
తమకు సులభ మైన నమృతంబుఁ గైకొన, రెందుఁ బెగటిచెట్టు మందు గాదు. 39

క. ఇవి యితరులచొప్పులు గా, ని విశేషజ్ఞతఁ దనర్చు నీయందు ను గ
ల్గవ నిక్కువ మైన ను నా, యవివేకము తెలిఁగు లిట్టి వవనీనాథా. 40

గీ. అంత నాయింతి జాత్యాదు లడుగు టుడిగి, దానిఁ గూర్చిన నే లంచ మానె నీకు
ననుచు నీవాడ మదికోర్కి యధిక మగుట, యరసి తెలిపిత నిపుడు తచ్చరిత మెల్ల.

గీ. ఇంక సంబంధసాదృశ్య మెంచి చూడఁ, గొదవ గలయది గాదు దిక్కులఁ బ్రసిద్ధ
మైనయది శార్తవీర్యాబ్జనాన్వయంబు, దిగ్విజయకాలి యందు నీ తెఱవతండ్రి. 42

క. తనమహిమ నాశ్రయక్షితి, యొనరుచుఁ జనఁజూచి సుగ్రహుకులీనత యం
చు నుదాహరింతు రెఱుఁగుండి, యనుజుఁడు సుమ్మాతఁ డిమ్మదాళయుసతికిన్. 43

చ. కడునుతికెక్కునట్టి యధికంపుఁ గులీనతచే సతండు వ
ల్గడల జనాధిపుల్ దవకుఁ గన్యల నిచ్చెద మంచు నెందరే
బడిబడిఁ జెప్పిపంప నది పాటిగఁ బట్టక వారియాసుచే
నడపాడలేక పోయెనఁట యల్పము లయ్యెఁ గులాభిమానముల్. 44

క. జనివేళయందు నుశుభా, గ్యనిమిత్తము లగుచుఁ బెక్కు గ్రహము లునికి నా
తని కిడినారఁట సుగ్రహుఁ, డనుపే రాశాస్త్ర మేమి యయ్యెనొ యెఱుఁగన్. 45

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని యిట్టట్టు గాని మిస్ఫ్వ డింత యు మధురలాలస యుభయకులశుద్ధి చెప్పెదు ప్రకారం బింతియ యని పలికి యి ట్లనియె. 46

క. అవనితామణి నిప్పుడు, జీవితము న్నిలిపి ప్రోవఁ జిత్తము గలదే
నో వసుధాధిప పూనుము, వేవేగం దద్వివాహవిధిమంగళముల్. 47

క. అని పంచాంగముపుస్తక, మును విచ్చి కడుం బ్రయత్నమునఁ దిథి వారా
దినిరీక్ష చేసి ప్రశ్నన్, న్ని నిరూపించె న్గ్రహాదనిఖిలబలంబుల్. 48

వ. ఇట్లు నిరూపించి సంతసిల్లుచు దేవర సిద్ధసంకల్పత యేమి చెప్పెదు నెల్లియ మూయిర వురపేర నత్యుత్తమం బైన దివాలగ్నం బున్నయది వివాహోత్సవంబునకుం దగిన సకలసామగ్రియు సార్వభౌమునకు నెప్పుడైన నుం గలిగి యునికి చెప్పనలద యిప్పురం బ్రేపొద్దు ను విహితమంగళాలంకారంబ యని పలికి మఱి యు నతం డి ట్లనియె.

మహాస్రగ్ధర. ఫలము ల్హారిద్రపంకప్రమిళితమణిశోభ వ్యహింప న్గృహాశ్రీ
గళసౌభాగ్యాభినీతిక్షమితపురము పైఁ గంతము ల్మించి యొప్పం
బొలుచు న్నిత్యోత్సవద్వాస్ఫురితము లగుఁ దేఁబోఁక ప్రాఁకు ల్కరం బిం
పొలయుం గా దానఁ గాదే యొనరఁ గ్రముకకంఠోత్తరం బంద్రు దీనిన్. 50

శా. ఆయిన ద్దేవరపెండ్లికిం దగ విమూత్నాలంక్రియాసంపదం
బూనంగా వలదే పురం బిపుడు సొంపు ల్మీఱఁ జాటింపు స
న్మానం బొప్పఁగ మామ యింటికిని గన్యారత్నయాచ్ఛార్థ మ
న్యూనప్రజ్ఞులఁ బెద్దలం బనుపు మోయుర్వీశ ధర్మస్థితిన్. 51

చ. అనుట యుఁ సంతసిల్లుచు ధరాధిపుఁ డవ్విధ మెల్ల సత్వదా
త్మని బిలిపించి తెల్పి తదమోఘనయానుగతి న్నిజాగ్రభా
ర్య వనుమతింపఁ జేయఁ బ్రథమాగమముఖ్యులఁ బంపె నల్వురం
జనపతి పూన్కి వాసు దగుజాడను జెప్పిరి తద్వధూటికిన్. 52

వ. చెప్పి దీని కుత్తరం బెయ్యది చెప్పమనుఁడు నప్పరమపతివ్రత వారితో ని ట్లనియె.

గీ. చల్లఁదనముతోడ నెల్ల బంధువులకుఁ, దత్తదుచిత మధురతరగుణములఁ
జిత్తరంజనంబు చేయుట నభినవ, కౌముది యనుపేరు గలిగె నాకు. 54

గీ. చంద్రకిరణభవాప్సరోజాతిఁ బుట్టి, యట్టి పేరొంది వెలయు నేనకట యిపుడు
తగనతుల కెల్ల సామాన్యధర్మమైన, పతిమనోనుకూలతకును బాయఁ దెరువె. 55

క. కావున వన్నె మడిగెద, రావసుధాధిపున కేది యభిమత మదియే
భావాంఛితంబు నిక్కువ, మీవృత్తాంతంబుఁ దెలుపుఁ డేర్పడ నచటన్. 56

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అని పలికి వీడ్కొలుపుట యు వారలు చని యావిధంబు భూవిభునకు విన్నవించి తదీయనిదేశంబున మదాశయునిగృహంబున కేగి యాకళాపూర్ణమహారాజునకుం గలిగిన వివాహోద్యోగంబుఁ దెలిపి సుముహూర్తంబున సాక్షితాంబూలాది సముచితశుభవర్తనంబులు నడపి రంత మంత్రిజనులు తద్వివాహోత్సవంబునకు నాయత్తపడఁ బురంబులోనం జాటించిన. 57

సీ. ఎక్కడఁ జూచిన నిండ్లపైఁ బసిఁడికుండలు క్రొత్తమెఱుఁగిడి నిలుపువార
లేవంకఁ జూచిన హిమవారితో గంధసారంబు కలయంపిఁ జల్లువార
లేచోటఁ జూచిన నెలమి గోడలఁ దట్టుపునుఁగు జవ్వాదియుఁ బూయువార
లేదిక్కుఁ జూచిన నింపుగా మణివేదికలు కమ్మకస్తురి నలుకువారుఁ
బ్రేమఁ గప్రంపు ముగ్గులు వెట్టువారుఁ, గలువడంబులు మేల్కట్లు గట్టువారుఁ
బచ్చతోరణములు పొందుపఱచువారు, నై రహోరాత్రసంభ్రమం బలర జనులు.

ఉ. పెండ్లి నృపాలు నింట నని పేరఁటము ల్ప్రియమొప్పఁ జెప్ప నిం
డ్లిండ్లకు శోభనాక్షతలు హేమపుఁబాత్రలఁ గొంచు బెద్దపూఁ
బోండ్లు చరించి రాకులు ను బోఁకలుఁ గుంకుమపాళ్ళు నూనె యుం
బండ్లు ను గొంచు వాద్యపుశుభధ్వనితోఁ దగువారు వెంట రాన్. 59

సీ. కర్పూరమృగమదగంధసారాదులు విరివిగాఁ బసిఁడికొప్పెరలఁ గలిపి
మల్లికాకుందచంపకజాతివకుళాదిపుష్పము ల్హైరాశముగ ను గూర్చి
మంచివాసనల వాసించిన నెలవత్తిభాగాలు రాసులు వడఁగఁ బోసి
బంగారుచఱపల పసమించు తిమలపాకులమావటాలు కొండలుగ వైచి
తత్తదధికారపురుషు లత్యంతమోద, గరిమ నెవీథిఁ జూచినఁ గ్రందుకొనుచుఁ
బురములో గంధమాల్యతాంబూలముల న, శేషజనములఁ దనియంగఁ జేసి రపుడు.

గీ. అయిదువతనంబు సుతసమృద్ధి యును గలుగు, వతులు శుభవేళ మంగళస్నానవిధులు
నడుపఁ దొడఁగిరి బహువాద్యనాద మెల్ల, దెసల నెఱపంగ మధురలాలనకు నంత.

ఉ. క్రొత్తగ నల్కెఁ గస్తురిని గోమలి యొక్కతె యొక్కవేదిక
న్మత్తెపుముగ్గ వెట్టె నొక ముద్దియ తద్దయు వేడ్కమీఱఁగాఁ
బుత్తడిపెండ్లిపీఁట యొకబోటి రయంబునఁ బెట్టె దాని పై
నుత్తరపుంజెఱంగులుగ నొక్కతె గప్పె విశుద్ధవస్త్రమున్. 62

గీ. పెద్దముత్తైదు వొక్కర్తుఁ బెండ్లికూఁతుఁ, గాంత లిరువుర తూర్పుమొగంబుగాఁగఁ
బెండ్లిపీఁట పైఁ గూర్చుండబెట్టి నేర్పు, నెరయ సంపెంగనూనె యంటిరి ముదమున.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ప్రేమమున సంభ్రమించుచుఁ, గామిను లంతట ను బసపుగలిపిన శుభగం
ధామలకముఁ బెట్టిరి మఱి, హైమఘటాంబువుల జలకమార్చిరి సతికిన్. 64

సీ. దడిముంపుఁజేలలఁ దడియొత్తి పసపుఁగొంగుల తెల్లపట్టుదువ్వలువ గట్టి
తలవెండ్రుకలఁ బావడల నద్ది యద్ది శీఘ్రము తడియార్చి పువ్వులు ముడిచి
మలయజ మంగకంబులఁ బూసి ఘనవాసనాశేషముగ నది నలిచి వైచి
పాలిండ్లఁ గుంకుమపత్రవల్లులు వ్రాసి కమ్మకస్తురితిలకంబుఁ దీర్చి
ముగుద తొంగలిఱెప్పల మొదల మిగుల, సన్నమై కనుపట్టఁ గజ్జల మమర్చి
లాక్షఁ బాదాంబుజంబు లలంకరించి, యామదాశయతనయకు నతివ లంత. 65

సీ. తలుకుఁబిల్లాండ్లు బబ్బిలికాయలు ను మట్టియలు వీరముద్దెలు నందియలు ను
మొలనూళ్లు నొడ్డాణములు నేవళంబుఁ బుంజాలదండయుఁ బన్నసరము మొగపుఁ
దీఁగయుం వాణిముత్తెపుఁ బేస్లు సందిదండలు సూడిగములు గౌడసరములు ను
గడియాలుఁ బెక్కు జోకలయుంగరములు మంగర యుఁ గోలాటంపుఁగమ్మజోడు
చెవులపూవులు బవుకులు చేరుచుక్క, కొప్పువలయ ను సవరించి రొప్పమీఱ
భూషణములకుఁ దానొకభూషణమయి, పడఁతి యపుడొప్పెఁగన్నులపండువగుచు.

సీ. ఇట్లు కైసేసి యాయింతులు తజ్జనయిత్రిని బిల్చి నీపుత్రిసొబగు
లెస్సగాఁ జూడు మోలేము మాచూపాకలాగు నీచూపాకలాగు నీవు
రూపానుభూతినా రూఢికెక్కినదాన వెవ్వరు నీపాటి యెఱుఁగలేరు
రూపవిశేషంబు రూపింప ననుకు నాకొమ్మ నవ్వుచు నటుగొంతయొడఁగ
నేఁగి తనరూఁతుపింగార మెల్లఁ బెక్కు, మాఱు లెగదిగఁ గ్రేఁగంటఁ బాఱఁజూచి
యింతకంటె ను గయిసేయు నెవ్వ రింక, నేర్తు రనుచు ను వారల నేర్పు మెచ్చె.

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి వెక్కసం బైతోఁప వెలుఁగుపాటు
గరము లోలోన కప్పిపుచ్చుచు దృష్టి దాఁకునో యనుచు ను దల్లడిల్లి
పువ్వుదండలనెపంబునఁ గొంత యిది మాటుపఱచెద నని ముద్దుపట్టియకుఁ
దగునొక్కచెంగల్వదండ ను న్నమరించి యది గుబ్బచనుఁగవయందు మిగుల
వింతగాఁగ నొకానొక విలసనంబుఁ, జూవ నయ్యెంతిఁ గడుఁ దాను జూడ వెఱచి
కడమపూదండలెల్ల నొక్కటిగఁ బట్టి, బాల కపుడు సురాళించి పాఱవైచె. 68

వ. అట్టిసమయంబునం గళాపూర్ణుండు ను వివాహంబునకుం గట్టాయితం బై ప్రథమాగమాది భూదేవసముదయాశీర్వాదనాదంబులు వివిధపుణ్యాంగనాసంఘాతమంగళగీత గానస్వనంబులు ను, వందివైతాళికసూతమాగధస్తుతికోలాహలంబులు ను, సందర్శన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమయాపేక్షసామంతసేవాప్రబోధనాయాతవేత్రహస్తజనస్తోమవిస్తారితాలోక శబ్దం
బులు ను, సర్వసర్వంసహాజనజనితజయజయశబ్దంబులు ను, శంఖకాహళభేరీపటహఝ
ల్లరీపణవమర్దళతమ్మటప్రముఖనిఖిలవాద్యనిర్ఘోషంబులు ను మిక్కుటంబగుచు నొ
క్కమొగి నలుదిక్కులం బిక్కటిల్ల మిక్కిలి యెక్కుడగు వైభవంబున నగరువెడ
లి శుభశోభనాభరణభరణాభిరామరూపంబున దీపించునౌపవాహ్యంబు నారోహ
ణంబు చేసి భాసమానాసమాననానాదేశభూమీశభూషాసంఘర్ష రేణుపటలంబులు
ను, గరటిఘటాకరటతటోత్కటస్యందమానదానధారాప్రసారంబులు ను, సంకలితం
బు లగుచుం గుంకుమపంకాలంకారవానీరనిరవర్తితావిశేషసవిధానంబునకుం బౌనరు
క్త్యప్రసంగంబు నొసంగం గుసుమకిసలయవిసరవిరచితనీరంధ్రవందనమాలికాప్రబం
దంబు పందిరిచందంబు నందపఱచుచు వందిప్రక్కల నరుణకిరణమండలిచండిమ
బెండుపడి యుండుటం జేసి పీసరపోనిచలువచెలు వొంద మకరందబిందుకందళసందో
హంబులపొందునం జంద్రికాసౌందర్యధుర్యం బగుచు విస్తరిల్లుసమస్తపరివారతార
హారప్రభావిభవంబునకు సముచితంబుగం బరిపూర్ణచంద్రమండలాయమానం బగుధవ
ళాతపత్రంబు ధాత్రీజనంబులకు నేత్రోత్సవంబు గావింప నింపు లగుచు మిగుల దిగం
తరాళంబునం బ్రబలి గుబులుకొను గంధసారగంధోపాయనంబులు పచరించి వెల
యుచు మలయపవనుండు ను దండనుండంబై మెండుకొని దశదిశలు ను గుసుమైకమ
యంబుల యనిపించుచు నల్లసిల్లుమల్లికాకుందచంపకవకుళకురవకతిలకపున్నాగవన
మాలికాశోకముఖ్యవిఖ్యాతవివిధసురభిప్రసూనమాలికలు కానుక లగుచుం బొసంగ
వసంతుండు ను మునుమున్నగాం గొలిచి చిత్తంబు వడసియునికిం దనకు నవలంబ
ముగం గొలు వభిలషించుతలంపుతోడం దోడుచూపెడుకొలుకుం జెలుకువిలుతుం డిరు
గడలం బొంజుదీర్చిన శుకపికమధుకరప్రకరంబులగతి నతిశయిల్లుచున్న యుభ
యోపాంతసంతతవితర్దికానిచయఖచితమరకతకురువిందరాజావర్తహరినీలజాలంబులుని
జాలోకనాచరితంబులం జరితార్థంబు లగుచుండ నగణితవితానయవనికాదివివిధవిర
చనోల్లసితపల్లవప్రసవతల్లజమ్లానిపరిహారార్థంబుగం దగువిధంబున దీప్రభాగంబుల ని
బంధించిన మంచుందిత్తులతుంపర లతిమాత్రంబువలి పెపయ్యెదల యొయ్యారంబున శా
గుమీఱుచునికిభోగత్వరాయాసనముచితవేషవిస్ఫురితపురలక్ష్మీవక్షోజసాక్షాత్కారసం
తానంబు నుం బోలెం బ్రతిగృహద్వారవేదికావిశేషవిన్యస్తపూర్ణకలశవిలసనానుభ
వం బెడ తెగక పొలుపుమిగుల నగరుధూపధూమస్తోమసంరంభదంభజృంభితాంభో
వాహసంభ్రమంబునకు సాఫల్యంబు నాపాదించు ప్రాసాదభాసురసువాసినీవారధా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాయిశిలాజవర్ణంబులసంగడిసంగడికోలమెఱుంగులతెఱంగునరంగుమీఱుబంగారుజల
పోఁతబెత్తంబులనటన ఘటిల్లఁ గటికివారు సారెకు బరాబరి సేయుచు నేఁగుదేరఁ
జాఱుతరచతురిమ తురంగలీలానృత్తవర్తితశ్రవణభూషణవినిర్ముక్తముక్తావర్గనిర్గచ్ఛచ్ఛ
విగుచ్ఛంబులచేత నిఱుమడి ముమ్మడి యగుచు రంజిల్లువింజామరలు మంజుహాసావ్యా
తనరోచరాయమానగండస్థలసదేశంబులఁ గాళనికాశంబులై ప్రకాశింప నాశాళ
మణిఘృణిమతల్లికలయుల్లాసంబు నొల్లక యటు వెనుక చేసి నాసాగ్రంబునం దమక
భిముఖంబున మగిడి నిలిచినపుండరీకంబునకుం బుష్పంధయబాంధవంబు ను మకరం
దంబు మిసిమి యుం బరాగంబుపన యూ నసదృశంబుగా నొసఁగుచు విశేషాధిక
తం బ్రకటించు ముకుటమహానీలహీరచామీకరమరీచివీచికలవైచిత్రి లోచనపర్వంబు
నాచరింప సమీచీనతతజయసుధాసేకంబున నాకులఁ జిగుర్లుఁ బూవులు మవ్వంబు
లగుచు నామాలచూడంబుగా నుప్పతిల్ల నొప్పుచున్నవియో యనంగ నప్రతిమరం
గదంగులీయకకంకణాంగదఖచితగారుత్మతపద్మరాగమౌక్తికప్రభలకబలిమబలిమి ప్రబ
లబలబాహాస్తంభముల స్తంభజృంభణంబు సెఱప నపూర్వనిర్మలత్వయాచ్ఞాపేక్ష
నుంబోలె నక్షత్రమాలికలచేత బహిరుపాసితంబు లగుచు హృద్యంబు ప్రకటీకరించి
న ఖనీభూతకరుణారసరేఖభావంబున స్వభావనామసిద్ధవిక్రాణితశోణమాణిక్యశలా
కావిలోకనమోహనం బగుచు బాహాంతరంబునం గరంబుఁ గనుపట్టుచుండ నొం
డొంటిఁ గదిసి నానావర్ణవిలసదవిరళప్రవాళజాలకనూనసంపదలతోడిమతీఁగలు ద
డివకువున బెడంగు వడపెకువిచిత్రాంబరాభరణవిభూషితమృదుశరీరంబులు ను ద
దగ్రభాగంబున శోభార్థంబుఁ దెరలిన యరవిందపఙ్క్తియో యనంగ సోయగంబు
నం బొగడొందు నగుమొగంబులు ను దదుపరిక్రీడమానకలహంసవిభ్రమప్రాచుర్య
సూచనాచాతురి ప్రబలంబు లగుకబరీభరంబులు గలిగి యొప్పారువారనారీజనశ్రే
ణీకటాక్షవీక్షణంబు లక్షుద్రసారశాలిశయనమాకృష్యమాణరోలంబజాలంబులుంబో
లె వదనాంబుజంబునఁ బరిభ్రమింప నదభ్రవిభ్రమభ్రాజివాజిన ర్తనవర్తనోచ్ఛలితత
చ్చరణకటకనాదంబులకు ననూనువాదంబుగ నిజపాదమంజీరమాణిక్యలక్ష్మీకరపల్లవం
బులు వినయవినమితపరిసరచరకుకరూళకోనలమగధమచ్ఛిల్లకమత్స్యవత్సాదిరాజకు
మారులచెక్కుల నల్లనల్లన తాళంబు లొత్త నత్యంతంబు నింపొందుచు ముందటిభూ
భాగంబు నావరించు సమంచితరత్ననూపురపారిహార్యనిర్యాతనూతనప్రభాపటలప
రంపరలచేతనడుగులకు మడుఁగు లొత్తుట దోఁప గభీరగమనంబుల నడుచుగుడజీరక
హరిద్రాదిశుభద్రవ్యపరిపూర్ణభాజనరాజమానహస్తప్రశస్తపురంధ్రీలోకంబు లోకపా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వసత్వంబున విలోకనీయం బగుచు నొప్ప లోకాతిశాయివిభవాభిరాముండు ను రా
మణీయకవిశేషవిజితకాముండు ను గామనీయకాఖర్వసర్వగుణసంపదుద్దాముండు న
గుచు నుచితగాంభీర్యంబున మదాళయానిగ్రహంబున కరిగె నతండు నఖండవైభ
వంబున దవుదవ్వులన యెదురుకోలుచేసి నప్పు డొకించుకవడి యత్యంతసంభ్ర
మమున. 69

క. చెలరేఁగి రెండుదోయం, బులపేరంటాండ్రు చిత్తముల నెంత యు వే
డ్కలు మీఱఁ జల్లులాడిరి, తలఁకక యభినవశుభాక్షతవ్రాతములన్. 70

వ. ఆసమయంబున. 71

సీ. కడువేగమునఁ బెండ్లికొడుకు నెమ్మొగమున కరిగె నడ్డమువట్టెఁ గురువిభుండు
హాయను కేళ్ళుఱుకునో యనిరెండుగడలందు వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు
జతన యెచ్చరిక యం చతిరయంబున జేరి కైదండ యిచ్చెను జేదిభర్త
యశ్వలోచనముల కాత్మవస్త్రము కొంగు మాటుగా నొనరించె మగధరాజు
తమి నెదుర్కోలుసేయు మాతల్లిచెలుల, యక్షతలవాన సరకుసేయక చొరంగ
శత్రుశరవృష్టి గాదురా సామియన్న, నవ్వెఁ బుఁగ డుగ్రమని నవ్వె నర్మసఖుఁడు. 72

ఉ. శ్రీలా దలిర్ప భూరమణశేఖరుఁ డిట్లు మదాళయుం డెదు
ర్కోలొనరించి తెచ్చి మణికోమలపీఠిక నుంచి కూర్మియి
ల్లాలు పసిండిగిండి గొని యాదటఁ దోయము వోయఁగాఁ బద
క్షాళన మాచరించి వసనం జలిపె న్మధుపర్కముఖ్యముల్. 73

మ. క్రమ మొప్పారఁగఁ బెండ్లిపెద్ద లిరువంక న్వర్తిలంగాఁ బ్రగ
ల్భమనీషం బ్రథమాగముండు తమితో లగ్నాష్టకంబు ల్పఠిం
చి మనోజ్ఞం బగులగ్నవేళ శుభము ల్పల్కించె శాస్త్రస్థితి
న్విమలశ్రీల మదాళయాత్మజకు మాణిస్తంభికిం బ్రేమతోన్. 74

క. మంగళసూత్రముఁ గట్టెఁ గు, రంగాక్షికి నంతనంగరాజేంద్రుఁడు పు
ణ్యాంగనల పెండ్లిపాటలు, మంగలికోళ్లమృదుగీతిమధురిమ నెనయన్. 75

సీ. ఇరువంకఁ జెలు లెత్తులిడుచు నుబ్బింపంగఁ జెలువువ్వుతోఁ గొంతసిగ్గు వదలి
ఘనతరం బగుగుబ్బచనుదోయి మీఁది కొంత యు మిటారింప హస్తంబు లెత్తి
తదుదీఁగసాగుచు బడుగు నెన్నడుము మిక్కిలిఁ గృశంబుగఁ దత్తతిలుచు నిక్క
ముత్తైదువలు దగ నెత్తు బంగరుపళ్లెముల బ్రాలు దోయిళ్ల ముంచి! ముంచి
ప్రియుని చేవేగిరము నొకింత యు ను మించ, నీక సాటికి మాటికి నిందువదన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాలుపులియంగిఁ దలఁబ్రాలు వోయు కడఁక
చూపఱులచూడ్కి కౌతుకవింతసొబ గొనర్చెఁ. 76

ఉ. పావకుఁ డగ్రభాగమునఁ బ్రస్ఫుటకీలలఁ బర్వ లాజహో
మావసరోద్యతాంజలిఁ దదంగన శోభిలె నందుకోఁగ హ
స్తావలి యెత్తి యాడెడుగణాధిపుముద్దులు చూచువేడ్క నిం
పావహిలంగ మీఁద జపితాంజలిఁ బట్టు భవానికైవడిన్. 77

చ. అలఘుచు నాలతాంగి ప్రథమాగముపంపున లాజహోమ ము
జ్జ్వలశిఖియందుఁ జల్లుచు నుజాలఁగ నొప్పె సమీరలోలకో
మలనవమాలికాతిలకమంజులపల్లవతల్లజోల్లస
ల్లలితరసాలకోపరిగళత్కుసుమావళి నొప్పుచాడ్పునన్. 78

మ. చెలికత్తెల్ బుధవర్యసంబుకొఱకుం జేముట్టి పల్మాఱు నె
త్తులిడంగా మొగ మెత్తె నొయ్యనఁ దదస్తోకత్రపాభారము
న్నెల గోడ్తోడన పైకిఁ బుచ్చుకొను చున్కిం బోలె వ్రీడావతీ
తిలకం బాసతి నమ్రభావముఁ గ్రమోత్తీర్ణంబు గావించుచున్. 79

చ. మిఱుఁగ నూత్నపై మినుకుమిన్కు మటంచుఁ బ్రకాశ మొందెడుం
ధ్రువుఁ గనుఁగొంటె యల్లదె యరుంధతిఁ జూచితె యంచుఁ దత్సమీ
పవిశదతారలం గుఱుతు పల్మఱుఁ జెప్పుచు బోంట్లు తెల్పి తె
ల్పివనిత చేతఁ గంటి ననిపించిరి తత్కృతి విస్ఫురంజిలన్. 80

సీ. కలవంటకములు బూరెలుఁ దేనెతొలలుఁ జాపట్లు మండెంగ లొబ్బట్లు వడలుఁ
గుడుములు సుకియలుఁ గడియంపుటట్లు వెన్నప్పాలు వడియంబులప్పడాలుఁ
బొంగరంబులు సొజ్జెబూరె తాగులు సేవ లుక్కెర లరిసెలుఁ జక్కిలములు
ఖర్జూరగోస్తనీకదళికాసహాకారఫలములుఁ గొబ్బెర పనసతొలలుఁ
దేనియలు జున్ను మీఁగడ లానవాలుఁ బానకములు రసావళ్లుఁ బచ్చడులు న
వాజ్యమొలుపుఁబప్పులుఁగూరలనుపమాన్న, మపుడుప్రజనెల్లఁదనియించెనాహారహంబు.

వ. అది యట్లుండె నంత. 82

సీ. వెలయ వియ్యాలంది పీడుకోళ్లు గుడిచి నారము ల్మడిచిన నాపసాని
యొజ్జన మొనరింప నుచితక్రమంబునఁ బుణ్యాంగన ల్గడఁబ్రోలు సొచ్చి
పాలుపులియఁగ నాకబలికృత్యములు సల్పి యావధూవరుల నెయ్యంబుతోడఁ
బూర్ణకుంభాంతరస్వర్ణశాల్యంబు లోఁదొరలకుంటె మునుపు సరయుప్రవృత్తిఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బుచ్చుకొనుటకు నెచ్చెలులెచ్చరింపఁ, గరములిడి యిరువురకు నొక్కటియై దొరక
బెనఁగులాడుచుఁ జెలువవ్వు లానరఁ బులక, లడరఁ గనిరి మిథస్స్పర్శనానుభవము.

గీ. ఎల్లభంగులఁ జిత్రమై యెసఁగునట్టి, సతి కళాపూర్ణరాజసంగతిఁ దనర్ప
జగతి కెల్ల మహాపర్వ మగుచుఁ బరఁగె, నప్పుడావేళ మనుఁ డేఁచు టరిదిగాదె.

క. అనుపమవార్షశ్రీలం, బెనుపొందెడు పెండ్లికూఁతుఁ బెండ్లికొడుకుఁ గ
న్గొనుజను లప్పుడు దమలో, ననయముఁ బ్రమదాద్భుతంబు లావహిలంగన్. 85

గీ. కడుఁ గళాపూర్ణుఁ డనుకీర్తిఁ గన్నయాతఁ, డీసతివిశేష మెఱుఁగుట యెన్నవలదె
యీమధురవస్తువు ను గొన నెఱిఁగెఁ గాన, మధురలాలస యనుపేరు మగుడఁ గొనరు.

గీ. అని నుతించి రిట్లు ఘనసమృద్ధిని వివా, హంబు సంపతిల మదాళయుండు
పెండ్లికొడుకు వెంటఁ బ్రియపుత్త్రి ననిపె న, నంతవస్తుతతుల నరణ మిచ్చి. 87

వ. అవ్విధంబున ననుపునప్పుడు సముచితలౌకికవైదికాచారంబు లన్నియు ను విహితం
బులు గావించి రూపానుభూతి తనకూఁతుఁ బిలిచి యి ట్లని బుద్ధిచెప్పె. 88

క. సుముఖాసత్తి మణిస్తం, భమహాయోగీంద్రు లత్తమామలు నీకో
రమణీమణి నీకోడం, ట్రము నెఱుఁగరు వారు యోగరసనిశ్చలతన్. 89

గీ. అత్తమామ లన్న నాచార్యుఁ డన్న స, ద్ధర్మ మన్న నిష్టదైవ మన్న
నీకుఁ బతియ సుమ్ము నెయ్యంపుఁగూఁతుర, యిది మహోపదేశ మెఱిఁగికొనుము.

క. దివ్యాంగన యొఱపరి గడు, భవ్యచరిత నీదుసవతి పతికంటె ను సం
సేవ్యసుమీ యాయమయెడ, నవ్యయభయభక్తివినయ వైయుండఁ దగున్. 91

క. సౌందర్యవిలాసాదుల, యందును తగులువడి యితరమరయని మగవా
రుం దలఁచుగఁ గల రయిన న, నిందితచరితములె సుమ్ము నీపతి కింపుల్. 92

ఉ. కొందలు రూపసంపదనె కొందలు సాధుచరిత్రశక్తనే
యొందుఁ బ్రసిద్ధులై పతుల కింపొనరింతు రనూనమైన చ
క్కందనము సువర్తనముఁ గల్గిన నెన్నిటి కేమిచెప్పనా
చందనగంధి జాదులు ప్రసాదము గాదె చకోరలోచనా. 93

ఉ. కావున రూపయౌవనవికస్వరగర్వభయంబుచేతఁ గా
నీ విభుఁ డిచ్చు మన్ననల నెయ్యపుటాల వటంతు నమ్మి కా
నీ వినయాదు లేమఱక నీహృదయేశుఁ దదీయ బంధుమి
త్త్రాపథుల న్సపత్నిని యథార్హవిధి న్ముదమందఁ జేయుమీ. 94

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. అని డగ్గుత్తిక వెట్టుకొన్చు ఘనపక్ష్మాంతర్నిరుద్ధాస్రువై
యనుపం జాలక చాల కంపె సుతఁ గన్యారత్నముం దల్లి వీ
డ్కొనఁగాఁ జాలక చాల కంత మది నెట్లో యొక్కచందాన వీ
డ్కొనియె న్వేమఱుపింపలేవు పతిభక్తుల్లాత్మవిశ్లేషముల్. 95

వ. ఇవ్విధంబున మధురలాలసా పాణిగ్రహణకల్యాణవైభవంబు నవధరించి కళాపూర్ణుండు గృహప్రవేశమహోత్సవానంతరంబున దేశాంతరాయాతరాజలోకంబు నప్పోక సత్కారవిశేషంబులం బరితోషంబు నొందించి తత్తద్దేశంబుల కనిపె నంతఁ దద్వధూతిలకంబు వికసితవదన లగుసకియల మునగలవలన. 96

క. తననవసంగమదిన మది, యని విని యుబ్బుచుఁ బ్రహృష్టయై మాటికి వ
చ్చినచోటికి వచ్చుచుఁ బో, యినచోటికిఁ బోవుచుండె నేమో కలఁకన్. 97

సీ. మధురలాలస నేఁడు మగని పాన్పునుచును నిజకోపమిత్తించి నిలుచువారుఁ
గోప మేల ఫలించెఁ గోర్కి నీ కని తన యపరువింతలకు మాఱలుగువారు
మాయమ్మ యివి కల్లమాట లింతియె నీవు వైకోపమని శాంతి గఱపువార
లిప్పటనుండి మాకేల యక్కాడు చూచె దివ్వార్త నిజమని నవ్వువారు
నిజముయిన నేమియనఁగ దే నీవు వెఱవ, దఱుము కొని నచ్చుచున్నారు తరుణి వీరు
సారె కను వారు వై బోంట్లు సరసగోష్ఠి, నలుపఁగా నాఁటి పవ లెల్లఁ జెలువగడపె.

క. అంతటఁ దలదువ్వి గడు, న్వింతలు సింగారములుఁ బ్రవీణతఁ జెలులా
కాంతకుఁ జేసిరి లజ్జా, క్రాంతత నొల్లమి నటింపఁగాఁ దమబలిమిన్ 99

సీ. ఇట్లు సింగారించి యెదుట నద్దము వెట్టి చూచుకొమ్మన లజ్జఁ జూడఁగొంకుఁ
జెలు లెడఁగా జన్న నిలువు టద్దముఁ జూచి కొనఁగోర నటు దిద్దుఁ గురులు వికలు
నంతవా రేతేర నెంత సూక్ష్మగ్రాహి యిదియంచు ముకురపరీక్ష నెఱపు
నాయలంకారరమ్యత చెదరకమున్న యధిపుఁడు తనుఁ జూడ నాత్మఁ గోరు
సిగ్గుకతమున సఖియలచేష్ట వాని, చనువు బరికించుఁ దొడవుల యునికి మట్టు
మచ్చుమర లేక యుండ నేమఱికయోను, మిగుల మేగరగరికనా మెఱుఁగుబోఁడి.

చ. అనదృశభూషణాన్వితవిలాసవిచిత్రత నొప్పె నానము
ల్లసితసువర్ణవర్ణ గృహలక్ష్ముల చెక్కిళులో యనంగ నిం
పెసఁగెడు నిల్వుటద్దముల నేణమదాదివిచిత్రలోచనా
లసమయపత్రవల్లికల క్రియతోఁ దననీడ యేర్పడన్. 101

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఆసౌభాగ్యవతీ వతంస మొకయేకాంత ప్రదేశంబునం
బూసెజ్జ న్విహితోపదేశయగుచుం బొల్పొందెఁబత్త్రాళి
స్యాన్నప్రచ్యుతిభీత్యధోఘటితహస్తాంచత్కపోలంబుగా
న్యాసింగాముని నిల్వటద్దమునఁ దా సౌందర్యము ల్డిందఁగన్. 102

గీ. ఇవ్విధమున నాప్పు గేక్షణ యేకాంత, వర్తనమున నుండి ప్రసవమాగ
మావిలంబసిద్ధి కభిలాష మెంతయు, పహిమ వోలఁ దనదు మానసమున. 103

చ. విభుఁ డిఁక వచ్చు! చెప్పుడిదొ కో విఘ్నము లేమయినం ఘటిల్లునో
యభినవకౌముదీయుతము లైనవి యాకెవ నాదు సంగమం
బభిమతమాట్ల కూడద యొకప్పుడు నట్టిది గాని నాఁడు దు
ర్లభము గణించునే సురవిలాసిని వల్లభుఁ డన్యకాంతలన్. 104

చ. తనకడకేఁగి నప్పుడు పదంబులకే ప్రణమిల్ల నవ్వరాం
గన కృపకల్గినట్ల కడు గారవ మొప్పఁగఁ గౌఁగిలించుచుం
దనరుచు చాల నైదువతనంబున నంచు నొసంగ దీవన
ల్తనకును వాంఛితంబ యిదిష్టతక్కృపభఁగులు నమ్మవచ్చునే. 105

చ. అది యును గాక యాత్రిభువనైకసమాదరణీయరూపసం
పద గలవల్లభుం గలసి భవ్యసుఖంబులు గన్న యింతి దా
మదినిసహించునే నిమిషమాత్రముఁ బాయఁగఁ బాయకుండఁ దఁ
త్తదుచితసేతు లెప్పుడు ను దప్పక పన్నుచు నుండుఁగా కిలన్. 106

శా. లోకు ల్కాముఁడు కాముఁ డంచుఁ గొలఁదు ల్లాపింప కాయుత్తమ
శ్లోకుం బోలిచినం గతానుగతికోలోకో యటం చుండుట
ల్గాకి ట్లీతఁడు నొప్పునే యఖిలదృక్పర్వంబుగాను న్నొ ర
మ్యాకారుండఁట శంభుదృష్టి కహహా యామంట రప్పించునే. 107

మ. తరుణీశాతకటాక్షవీక్షలకొన ల్డాగొన్న చోట్లుంబలె
న్నరుకోభావిభవాకరంబు లగుచు న్రోమాంకురస్థానము
ల్పరఁగన్మట్టినఁ గందునో యని కడుం బాల్గారుచున్నట్టి యా
ధరణీనాసు మెఱుంగుఁ జెక్కులు నేత్రప్రేమపాత్రంబులే. 108

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

*శా. మాసం డద్భుత శంఖ మొక్కటిని సంపాదించి దోర్మధ్యశ
స్తూరీచర్చ నెపంబునం దనదు కేల్దోఁప న్సువర్ణత్వశో
ధాలిప్సన్మశి కత్తి చూప నతఁ డత్యంభోధుఁ డై చేరి యిం
పారం బట్టుట దోఁచుఁ దద్గళముఁ గేళాఘంబు మోముం గనన్. 109

మ. శమగాంభీర్యధృతిక్షమార్జవదయాశౌర్యప్రమోదాదికో
త్తమనానాగుణరత్నకోశనిలయోద్యత్కాంచనద్వారబం
ధనుహాస్తంభదమానబాహుఁ డగునాధాత్రీశువక్షఃకవా
టము పై నెప్డాళా గంవపట్టెగలి నుండన్నాదుకే శ్రేష్ఠపుటల్. 110

క. ఏలిక లైరి తను రాజ్యాశ్రీ, జేలఁగ మని యునికి మెచ్చ కేమో యలతా
రాళి యుము నఖిలరాజశ్రీ, ఖాలంకృతి యయ్యె మదధిపాంఘ్రినఖము లై. 111

గీ. ఆలలితచరణము లొత్తుకేలు కేలు, కోర్కెఁ దద్వక్షమునఁ జేర్చుకుచము కుచము
దివుటఁ దద్రహఃకథవిను చెవులు చెవులు, పలుకు లేల తద్రతి గన్న బ్రదుకు బ్రదుకు.

చ. అని తలపోయుచు న్నిజవయస్యలు పిల్వఁగ వేళ లైన నం
దునికి యెఱుంగ కెందరయుచుం జెదరో తనునంచు లేచిపో
వ నలయఁ లోఁడి యిందుక ప్రవర్తిలునంతన వేడ్కతో సఖీ
జనులరుదెంచి రచ్చటికి సంభ్రమ మొప్పఁగ నల్లనవ్వుచున్. 113

వ. అందు నొకప్రౌఢ యగుసతి నయంబుతోడ.

సీ. ఓచెలి యొక్కెడ నున్నదానవె యంచు నల్లన డాసి వాలారుగోళ్ల 114
నూరక ముంగురు లొకచోట దువ్వి పాపటచేరుచుక్క సంఘటన యరసి
శ్రవణభూషల తెనిరవవారఁ దుడుచుచు నిది వేళ యౌఁట హృదయేశు సేవ
కేతేరవలయు నురా తడయక యంచు నొడివి యొక్కించుక తడవు నిలిచి
యింతియామాటకే మంటి పి పెలుఁగని, నీతి లేదు ప్రియుం డదె నీదు రాక
కెదురు చూచుచునున్న వాఁ డిచ్చయెఱిఁగి, చనుట తగుఁ గేళిగృహమునకనుచుఁ బలికె.

---

* మాసం దద్భుతశంఖమొక్కటిని సంపాదించి దోర్మధ్యశ
స్తూరీచర్చ నెపంబునం దనదు కేల్దోఁపన్సువర్ణత్వశో
ఖాలిప్స న్మశి కత్తి చూప నతఁడుత్కంఠోద్ధుఁడై చేరనిం
పారం బట్టుట దోఁచెఁ దద్గళముఁ గేళాశంబు మోముం గనన్.
అని యప్పకవిడీనిం గకులస్థవిజయములోనిదని యుదాహరించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పలికిన మాఱువల్కక త్రపాభరనమ్రముఖారవింద యై
జలజదళాక్షి యొప్పెఁ దన చన్గవ కన్గవడాలు పర్వఁగాఁ
గలయఁగ మంచిగందమునఁ గస్తురి తత్సమయోత్సవాంగమం
గళకలశార్చనాఖ్యశుభకర్మము సల్పెడుపాల్పు దోఁపఁగన్. 116

ఉ. ఆఁగతి నున్కి చూచి సఖు లందఱు నే మిట వచ్చుటేమి నీ
లా గిది యేమి యింతి కిది లక్షణమే చనుదెమ్ము లెమ్మనన్
హ్రీగరిమంబు వాపుచు నొకించుక లేవఁగఁ బూను మాను నా
లోఁ గొదగొన్న సిగ్గునఁ జెలు ల్బలిమిం దను దివ్వఁగోరుచున్. 117

వ. అంత నొక్కట మిక్కిలిప్రగల్భ యగుమగువ మిగులం జనవువొరసి. 118

మ. పాది యై నాథులు దారఁ గాఁపురము లింపుల్మీఱఁగాఁ జేయుచుం
గదిపెండేసికొమాళ్ళఁ గూఁతులఁ దగం గన్నట్టి యిల్లాండ్రకు
న్మది లజ్జాదులు లేవె నీకుబలె సన్మానంబులోఁ జక్కవ
చ్చెదొ యేమే గలదో యటంచుఁ దిగిచెం జేపట్టి యాయంగనన్. 119

వ. అయ్యవసరంబునం గళాపూర్ణుండు తదాగమనంబున కెదురు చూచుచుండి వారిగజ
బిజి కొంత చేరువ ను వినంబడినం బ్రేయసి విలోకనోత్కంఠ యాఁపలేక లేచివ
చ్చి కౌతుకం బడర గవాక్షమార్గంబునం దద్రూపలావణ్యవిలాసంబు నిరీక్షించుచు
నచ్చెరువంది యాపాదమస్తకంబుం గ్రమంబునం బరికించుచుఁ దనమనంబున. 120

ఉ. క్రింద ను మీఁద నుం బడి యకించిదనూయఁ బెనంగులాడు న
ర్ధేందుఁడు నుల్లసచ్ఛలసమృద్ధతమిస్రముఁబోలెఁ జాలఁ జె
న్నొందెడు ఫాలముం గబరి యున్నతిపాపటముత్తియంపుఁ జే
రుం దులకించు కస్తురి యుం రూఢిగ బాహులలీల నొప్పఁగన్. 121

ఉ. ఎత్తినకోలగా మదనుఁ డేసిన వే చని వచ్చు నర్ధచం
ద్రోత్తరబాణమో యనఁగ నొప్పెడు పాపటతో లలాట మా
యుత్తముఁ డంత దానిఁ బడకుండఁగ విల్లిడు పెల్ల గౌతుకా
యత్తతఁ దన్ముఖంబునకు నానెనొకో యన నొప్పెఁ గెంబొమల్. 122

లయవిభాతి.

తనపడగకై భువనమున వెదకఁగాఁ జనిన వినుతములు రెండు దొరకిన ను మరుఁడందుం
బెనుగడఁక చూడ మొగము నెడుహసితామృతప్రఘనసరసీఁ బాఁటవిడిచిన నసుత నొండొం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టిని దటుముల్లాడు నయననిభశుభమీనములకు ను బతనకృత్యపద్ధిపనుప రతమధ్యం
బున నిడిన చంపకపుఁ గనదిపుఢిపోయనఁగ నినితపరనాసపసదనరెడుఁనిరూఢిన్.

క. సముదాత్తమీనసంచా, రమునఁ దొలంకుచు ను ముఖసరస్సున లావ
ణ్యము వెళ్ళిపాటిఁ గ్రేవల, నమరించిన పిల్లకోలఁకు లంగనవీనుల్. 124

గీ. ఒనర మకరధ్వజుండు చేర్చిన తదంక, విలసనముతోడఁ జిన్ని లేఁదళుకుటరిగె
పిల్లలో యన మకరిసముల్లసత్క, పోలఫలకంబు లమరెను బాలికకును. 125

మ. శిరసంపదంబరయం బరాత్ములకు నీశీతాంశుబింబాస్య వా
తెరబింబప్రతిబింబభావము సమర్థించు న్నిరూఢంబుగా
వరబింబానుభవంబునుం బలె నధోవాప్తి న్విశుద్ధామృతం
పురసం బానుచు వేశుకాదులుబలె న్మోదింతుఁ జిత్రంబుగన్. 126

గీ. సంజఁ గెంపారు సన్నపు జలదరేఖ, యందు నొక్కింత మినుమినుమనుచుఁ దోఁచు
చిన్ని తారలగతిని రాజిల్లుచున్న, చెలువపలుమోవిముఱుఁగునఁ బలుకుఁబడిని. 127

చ. ప్రతినవచారుకేసరపరాగశలాటుమిళిందబృందచి
త్రితకుహూళియుగంబుగతిఁ గ్రేవలఁ గర్ణకలాపరత్నని
ర్గతరుచిమంజరు ల్దనరఁగాఁ గ్రముకద్రుమకంఠలక్ష్మికిం
బ్రతిభటవృత్తిఁ జూపెడు ను భామినికంఠముసొంపు పెంపుతోన్. 128

సీ. లీలమై గదియు నిల్పినపైఁడితమ్మిమొగ్గలనాళయుగ మన నలరుకాను
నవిప్రేఁగుచేతఁ దిర్యఙ్ముఖంబునఁ గొంత నతిఁజెంది ననఁగఁ జన్గవబెడంగు
పొలుపొందు తన్నాళములసంధిరేఖ యేర్పడుచోటుబలె రోమరాజిపొలుపు
నొండొంటిఁబాసి పోకుండ దానికి నంట్లు వైచినచందాన వళులసొంపు
నొప్పుచున్నవి యే మనిచెప్ప నార, చాల నన్నివి కలఁచుట సముచితంబ
కామునకు బొట్టెకోలలు గావె నాళ, ములఁ బ్రకాశించు తామరమొగ్గ లరయ. 129

చ అనుపమను ప్రతిస్మరులయాటకు నర్హము లంచుఁ గప్పి పె
ట్టినపువుబంతు లీసతికడిందిచనుంగవ తేఁట్లు క్రేవలం
దు ను బొరపుండఁ జేరి చినతోరపుసంపఁగిపూవుదండ లీ
వినుతభుజంబు లాతుదల వేడ్కఁ గనిడ్డచిగుళ్లు హస్తముల్. 130

గీ. అతివయవలగ్నయష్టిఁ జెంపొరసనాభి, మురువు కాంచనస్రగ్విలమో యనంగ
నుల్లమును నెల్ల హరియించుచున్న దార, యళనుశిఖియందు నేల్వ హస్యమునుబోలె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. మానవతీవతంసము సమగ్రనితంబవిజృంభణంబు జం
బూనదిసైకతస్థలము పోల్పు వహించుచుఁ జాల నొప్పెడుం
బై నునుమంచువోలె వెలిపట్టుమడుంగు బెడంగు చూప నా
పై నవసారసాలిపరిపాటి సుసంచితకాంచి మించఁగన్. 132

గీ. అతివతొడలు ను జఘనంబు లరసిచూడఁ, గొమరుమీఱు భుజమిలితొండములశిరసు
తోడివలరాచవారియుద్భుతపుహస్తి, యగ్రభాగంబు చూపఱ కాత్మఁ దోఁప.

మ. ప్రమదారత్నము జంఘ లింపెసఁగెడుం బ్రాగ్భాయమాయనంబు లై
నమనోజాతసువర్ణకాహళికలో నా వానిఁ బూరించువా
రిమెఱుంగు ల్గలబుగ్గలో యన శుభశ్రీ నొప్పెడు న్గుల్ఫదే
శము లాపైఁ బికికిళ్ళనాఁ గనకభూషాపఙ్క్తి నింపారెడున్. 134

చ. జలజపలాయతాక్షి మృదుచారుతరప్రపదద్వయీవిని
ర్మలరుచి గల్లుగల్లుమను రత్నపుటందెలమ్రోఁత జృంభణం
బుల నవకంపుఁగచ్ఛపముపోల్పు నపల్పుచు గెల్పుదెల్పెడుం
గలుగునె యింక దీనికి జగంబులలో నుపమాప్రసంగముల్. 135

చ. అకలుషతార లేతదబలాంఘ్రిని బట్టినతిమ్ముల న్నఖా
త్మకతను గొల్చి పాయ విది ధర్మమ యీజలజంబు లాదిఁ దా
రకములరాజు రాజుగ్రహరాజు కరం బిడ నొప్ప పెంపులో
సకలజయస్మరోదయము సల్పుటఁ దెల్లమ నాకు నిత్తఱిన్. 136

గీ. అతనుదశదిశావిజయకీర్త్యంకురముల, మీఁద ననుప్రగ వెలువడి మెఱయుఁవిత్తు
లతివపదనఖములు వానియంతికమునఁ, జలువ కిడినలతావిశేషంబు మేను. 137

క. అని వర్ణించుచు మిగుల, న్మనము తదాలింగనంబునకుఁ దమకింప
న్జనపతి కోరె నవిఘ్నత, ననయముఁ గొనసాగి రాఁ దదాగమనంబున్. 138

ఉ. ఆయెలనాగ యంతటఁ దదాలయసన్నిధిఁ జేర్పు లజ్జ పె
న్నాయిడి చేత బోంట్లను గరం బలయించె ను సాగిపోక భూ
నాయకుఁ డేమియప్రియ మొనర్చితి నీకు ను దోసకారిసి
ద్ధా యుడికించె దింత ననుఁ గాంత ను రా విడ కంచు దూఱఁగన్. 139

క. అంతట దర్ప్రహదేహళి, చెంతకు నయ్యింతి చేర శీఘ్రమతఁ జని భూ
కాంతుఁడు దనపానుపుపై, సంతసమునఁ బొదలుచుండె శయనించి తగన్. 140

వ. అంత. 141

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఓసి వెఱ్ఱిపడుచ యూరక రమ్ము పె
నంగ కెదుట నదె కనుంగొనియెడు
ననుచు నొయ్యఁ బలుకుచు నుఁ జూపెఁ బ్రియుఁ నొక్క
ముగుద కేల నోరు మూసికొనుచు. 142

క. అడుగులు తడఁబడఁ బులకలు, పొడమఁగ సఖివెనుక కొదుగఁబోవుచు నరసె
స్నైడ మలఁచి పడఁతి యప్పుడు, కడకంటివిలోకనమునఁ గాంతునియునికిన్. 143

సీ. రేఖలై మీఁదట రెప్పలయొప్పఁ బన్నాగంబు కడపళ్ళ బాగునెఱప
నరిదిపట్టుపడాలయంచులగతిఁ గ్రిందిపక్ష్మమాలికలు చూపట్టుచుండ
వెలయింపఁ బన్నాగములకుఁ బైనిడిన యబ్బురపుదండెలు పోలె బొమలు దనర
నొఱగులదెసఁ దోఁచుచున్నట్టి శిరసులబలెఁ గనీనికలు గొల్ములుదలిర్ప
శుభ్రభాగము ల్బిగియుముసుంగుదన్ని, యెసఁగు పెఱమేను లననొప్పనెదురఁబడుర
తిన్నరులఝంపలము లనఁ దృష్టిఁ బొలిచె, వెఱపుతో నింతి క్రేఁగఁట విభుని నరయ.

గీ. అంత మరలంగ మరలంగ నతివ చెలులు, బలిమిఁ బొదువంగఁ బట్టి లోపలికిఁ దెచ్చి
రప్పు డొకబోటి నృపునిపాదాంతికమున, రెండుసందిళ్లు పట్టి కూర్చుండఁబెట్టె.

గీ. పెట్టి యోలతాంగి ప్రియునంఘ్రులొత్తు మ, టట్టు పెనఁగితేని యెఱుఁగుదు గద
యని నృపాలుఁ జూచి యటు పాద మిడఁగద, య్యా పరాకుమాని యనియెనగుచు.

క. అని తచ్చరణంబు విలా, సినియూరువులందుఁ జేర్పఁ జేసి బలిమి నా
వనజముఖి చేతఁ బట్టిం, చెను సంవాహన మొనర్పఁ జేసెఁ గ్రమమునన్. 147

సీ. అదె యెవ్వరే పిలిచెదరు నదేమొకో యరసివచ్చెద నంచు నరిఁగె నొకతె
చిలుక యాఁకలిని దర్పింపరైతిరె యదె కూయుచున్నది యంచుఁ బోయె నొకతె
మనజాలవల్లిక మఱచివచ్చితిఁ గొంచుఁ జను దెంతు నది యంచు జాఱె నొకతె
యది వోయి యెంతసే పయ్యెఁ జూచితె తోడుకొనివత్తు నే నంచుఁ జనియె నొకతె
యంపలు ను బోయెదరె నేను నరుగుదెంతు, ననుచు నొయ్యనఁ బల్కుచుఁ బెనఁగిలేవ
మధురలాలన నప్పుడు మనుజవిభుఁడు, పదమునం దూరుభాగంబు లదిమిపట్టె. 148

ఉ. లేవఁ బెనంగి వేఁడియుఁ ను లేమ విభూషలు మ్రోయఁ దోడనే
యావిధి మ్రోఁతలైన శరదిందుముఖీ వినువారు నిన్ను క్రీ
డావతి [illegible]చంద్రడె యంచుఁ దను డాయఁగ హస్తము పట్టికొంచు గో
త్రావిభుఁ డొయ్యఁ బల్కెఁ జెవిదండఁ బెనంగఁ దలంక నెంత యున్. 149

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. కదలఁగరా దొకించుక యుఁ గల్లున స్రొయుఁగ నంచు నందియ
ల్మొదలుగఁ గొంతసా మ్మపుడు మున్దియ యొయ్యన కీ లెడల్చి చే
లాదవఁగ నూన్చి వల్లభుఁడు నోనతి యాయితపాటు లెస్సయాం
చు దయితతోఁ గపోలములు సోఁకఁగ మంతన మాడె నవ్వుచున్. 150

వ. అప్పుడు. 151

ఉ. ఏపలుకుం జెవింబడఁగనీక పెనంగుచు మోము దవ్వుగాఁ
బాపుచుఁ ద్రోపులాడు సతిపాణితలంబుల మేళనంబు న
ర్వీపతి కింద్రభోగమటు వేడ్క నొనర్ప ముఖాబ్జముం గడుం
బాపఁగ నాలకించుటయె బ్రహ్మసుఖోదయ మయ్యె నయ్యెడన్. 152

సీ. ప్రథితమిథోరాగకథలమంతనముల హృదయంబులోపలిబెదరు దీర్చి
సవ్యాజకృతకుచస్పర్శాదిలీలల నంగాంగమేళనమలవరించి
జిలిబిలినెయ్యంబుఁ జిట్టకంబులచేత నెలనవ్వు చెక్కులమోలవఁజేసి
లజ్జాపదంబు లల్లన మాటిమాటికిఁ జెనకుచు నొక్కింత సిగ్గుపఱచి
యపుడుకుసుమసాయకాగమాధ్యయనాధి, కారసిద్ధిఁ గొంత గలుగఁజేసె
నావసుంధరాధిపావతంసుండు రూ, పానుభూతితనయ కావరమున. 153

గీ. సగుని చిట్టంటుసేఁతలఁ గరము ప్రేమ, మెఱుపుపోలెఁ దళుక్కున మెఱచుఁ గాని
నెలఁత సిగ్గను మొగులులో నిలుపలేవ, యది యుఁ మిక్కిలి నింపయ్యె నతనిమదికి.

ఉ. భీతి యుఁ లజ్జ యుం దనరఁ బెంపతి డాఁగుమనోజుఁ దేర్చి ధా
త్రీతలనాథుఁ డంగనమదిం దలచూపఁగ నట్లుసేయ వాఁ
డాతనికిం గ్రియాసచివుఁ డై సతినీవి వదల్చెఁ బాదుకో
నాతని నిల్పె నేఁడు ప్రియ యాత్మఁ గరంచుచు జుంబనాదులన్. 155

వ. ఇవ్విధంబున. 156

ఉ. మిక్కిలి మిక్కుటం బగుతమి న్రతికి స్సతి నాలుకొల్పుచుం
జెక్కిలి నొక్కి చుంబనము చేసి కవుంగిట నొలలార్చి తాఁ
జొక్కుచుఁ జొక్కఁజేయుచుఁ బ్రసూనశరాసనఖేలనక్రియ
లెక్కువెఱింగులం జలిపెఁ బ్రేయసి యింపుకొలంది నంతటన్. 157

క. దినదినమున కతివమది, న్ఘనగరిమ న్మరుఁడు దఱుమఁగా రతులతతి
న్దినదినమునకుఁ గృశించెను, గనుకనియెను ద్రప యుఁ నిరవకాశతఁబోలెన్. 158

వ. అప్పుడు. 159

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. చనుకట్టుంటఁగనీక మోవికి ముఖస్పర్శంబు గానీక తా
ఘనయంచు న్గ్రహియింపనీక జఘనన్యాకాంతిం బ్రవర్తిల్లనీ
క నితాంతంబుఁ బెనంగుట ల్గ్రమమునం గంజాక్షి వేసారిన
ట్లౌనర న్మానుమ వేడ్కఁ దేల్చె నృపముఖ్యుం గొన్ని రేలంతటన్. 160

సీ. పరిరంభరోధంబుపైఁ బరాకునఁబోలె నధరపానంబున కనుమతించి
నెమ్మోవి నిడ్డఁ జింతిలుపరాకునఁబోలె గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి
కుచకళికలు చూచుకొనుపరాకునఁబోలెఁ గటివస్త్రహృతి కవకాశ మిచ్చి
నీవి క్రమ్మఱఁగఁ బూనెడుపరాకునఁబోలె జఘనమంటుటకు న సమ్మతించి
చెలువ తనలజ్జ చెలిమి యుఁ జెడక నడవఁ, దద్విరోధి యైనట్టి చిత్తజునిపని యు
మాఱువుసేయుచుఁ గొన్ని నాళ్లాత్మవిభుని, హృదయవృత్తికి నొకవింతయిం పానర్చె.

చ. కపటపునిద్రవోవుతఱిఁ గౌఁగిట వానుచు మోవి మోవిఁజే
ఱుపుచు ను గొన్నిరాత్రులు వసం దనియించె లతాంగి యంతఁ ద
త్కపటముఁ గాంచి యుం గననికైవడి నట్ల యొనర్చి కొన్ని రే
లపు డతఁ డాఁపలేక నగ నల్లన తాను ను నవ్వె వేడ్కతోన్. 162

ఉ. అల్లన యంతఁ బ్రేమవిభవాతిశయంబున లజ్జ నోర్చుచు
న్వల్లభుచేతు లాఁచుతఱి నవ్వులు గుల్కఁగఁ బూనె నంత నే
నొల్లక యున్న మాన విపు డోర్చుమ నీ విది యంచు నవ్వుచుం
బల్లవపాణి యొత్తె మునిపంట నిజేశ్వరుమోవి నయ్యెడన్. 163

ఉ. చెప్పినయట్లు సేయ నిఁకఁ జెల్వ కరంబుఁ బెనంగితేని నేఁ
జెప్పెద సుమ్ము నీ విపుడు సేసినవాతెఱఁగంటి బోటితోఁ
దప్పక యంచు వల్లభుఁడు దన్వెఱపింపఁ దలఁకినట్ల తా
నప్పతికోర్కె దీర్చె సతి యర్థి మెయిం బురుషాయితక్రియన్. 164

సీ. పాలిండ్లు వ్రేయపడి పతిఁజూడ లజ్జఁ దద్వక్షస్స్థలంబుపై వ్రాలివ్రాలి
మగఁడు దన్వేఁడుచు నెగనెత్తి పట్టఁ గామునకట్టు లిడఁ గేల మూసిమూసి
యిఁకఁ జూడఁ గప్పితి నిదె యంచుఁ జనుముక్కులతఁడు పాణులనంట నలిగియలిగి
కటిభార మెగయనెత్తుటకుఁ బోడ్పడియెద నని చాఁపఁ బతిచేతు లాఁచియాఁచి
తనదుగోప్యాంగముల దాఁచికొనఁగరామి, యరసి కెలనికి డిగిపోవ మరలిమరలి
కొమ్మ పుంభావరతి కాదిగొంటకాని, కొలఁది యెఱుఁగద మది దొరకొన్న వెనుక.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. తరళితతాటంకధాళధళ్యంబులు మెఱుపుఁదీగెలరీతి మెఱయుచుండఁ
బరిగళన్మల్లికాప్రసవవిలాసంబు తరుణబలాకలసరణిఁ బరఁగ
నతిరభసచ్ఛిన్నహారమౌక్తికములు వడగండ్లచందంబు గడలుకొలుప
నూర్పుగాడ్పులతోడ నొలిమైఁ బర్వుఘర్మకణోదయంబు వర్షంబుగాఁగఁ
గాంతకబరీభరంబు సుగారుమొగులు, వితతముగ నంతకంతకు విఱియఁబాఱఁ
దన్నుఁ గని సుమాళించుచుధవునిహృదయ, నవమయూరము చెలరేఁగి నాట్యమాడె.

చ. దరముకుళద్విలోచనము దార్యదుదంచితకాంచినాదము
న్విరమదురోజవల్గనము విస్ఖలదూరుకముం గళానిరి
త్వరమణింబు నై సతిరతంబు తదాత్వరతస్పృహాపునః
పుపుష్పితపూరితం బగుచుఁ బొందె గడుం బరిపూర్తి నంతటన్. 167

వ. ఇవ్విధంబునం గ్రమప్రవర్ధమాన కందర్పదర్పశిల్పంబులనొప్పు నప్పడంతితోడిక్రీడల
నాపుడమిఱేఁడు వేడుకం బ్రవర్తిల్లుచున్నంత. 168

ఉ. పాటిలెఁ గృష్ణధర్మ మొకపాటిగ నంత వసంతకృంతనో
చ్చాటితహేతిసంపదలసత్ప్రినవప్రదరప్రతాపసం
ఘాటహుతాశనోల్ముకనికాయమతిప్రతిపాదనోదయ
త్పాటవపాటలాపటలపాటలితోపవనావనీకమై. 169

సీ. కమలసౌగంధికగంధవాసితసర్వదిక్కంబు లగుకేళిదీర్ఘికలను
బన్నీటితూవరఁ బరఁగించుధారాగృహంబుల ఖేలనాడంబరముల
వెలఁదివెన్నెలలఁ జిప్పిలు చంద్రకాంతంబు మేడలమీఁది సంక్రీడనములఁ
జెంగల్వరేకుల సెజ్జలనొప్పు కర్పూరవేదికల విహారములను
వలిపెచెంగావులను ముత్యముల తొడవుల, మల్లెపూవులదండల మలయజాంగ
రాగముల సంతతము ననురాగ మమరఁ, గడపి రాదంపతులు గ్రీష్మకాలమెల్ల. 170

ఉ. అందముగాఁగ నంతట ఘనాఘనకాలము చాలనొప్పె ని
ర్నిందితగంధబంధనవనీపవనీకమనీభవన్నిజేం
దిందిరబృందముక్తనళినీమలినీభవనాగతారసా
స్పందజుగుప్సతద్ఘనయుతాయితయాయిమరాళజాలమై. 171

వ. అక్కాలంబున. 172

క. మెఱపులకును నలుకులకును, వెఱచుట నెపముగ లతాంగి విభుకౌఁగిటిలోఁ
జొచ్చెఁ బొదివి విసువ పలెఁకు, స్వెఱపుడుపుట నెపముగాఁగ విడకుండె నతన్. 173

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఇవ్విధమున నొండొరుపై, నవ్వంబుగఁ బ్రబలుప్రేమమహిమంబులతో
జవ్వనపుఁబోఁడుముల కడు, నవ్విభుఁడు న్సతి యుఁ గడప నంతటిలోనన్. 174

క. తనవిభుఁ డనిశము నవ్విధ, మున నాసతిఁ బాయకునికిఁబోలె న్మహిదా
ఘనఘలశాలీక్షుశరా, సనబాణక్రాంతిఁ జెందె శరదృతువపుడున్. 175

క. ఆరమణీరమణుల కా, శారదవేళలు గరంబు సరసతఁ బెనిచె
న్నారదగంధానయన వి, శారదపవనములు ఘర్మసలిలము లడఁపన్. 176

స్రగ్ధర. హేమంతం బంత నంతర్హ్వాతకమలబలోద్దీతవిస్ఫీతశీత
క్షామాత్మస్వామిధామక్రమణకృశపిపూర్ణ ప్రవిశ్రాణితాతి
క్షేమప్రేమప్రకామశ్రితరతముదితస్త్రీముఖవ్యూహసాహా
ర్దామందానందదింమాదయకలనబలె న్యామిను ల్మెచ్చవచ్చెన్. 177

క. అగలునఁ జవ్వాదినిదే, మగఁ బూసినఁ బట్టివజ్రమణిసౌధముల
న్పిగికాఁగిటఁ జేర్చు విభుం, డిగురాకుంబోఁడి నట్టిహేమంతమునన్. 178

వ. అంత. 179

శా. అన్యోన్యోన్నతిఁ బొల్చె మాఘము లవంగాసంగభృంగౌఘమై
యన్యక్కారతుషారభృత్యవరశైత్యచ్ఛన్నకందర్పదా
ర్జన్యాసంగ మనంప్రవర్ధితపరీరంభక్రియాసంభృతా
న్యోన్యాంగప్రసభప్రవేశయువయుగ్మాంతశ్శ్రీకృతశ్లాఘమై. 180

సీ. మడఁతపసిమిడిగింబెము ల్మంజిడిజిగి, దోమతెరమంచములు పసంతులు జవాది
యగలుసిరులు చిన్నెలుగాఁగనతఁడుగడపెఁ, జలినెలలుతద్వధూకుచశరణుఁడగుచు.

వ. తదనంతరంబ. 182

మాలిని. వికసితఘనమానోద్వేలజాలప్రవాళ, ప్రకటకపటరూఢప్రౌఢకీర్తిప్రతాప
ప్రకటజయనమంచత్పంచబాణస్తవోద్గా, యకశుకపికకాంతం బైవసంతంబువచ్చెన్.

ఉ. బాలికతో వనీరతుల భాసిలు వేనికిఁ గుంకుమాంకరే
ఖాలలితస్తనగ్రహణకాంక్ష ను వాతెఱ వాంఛచేతఁ ద
ద్వేళఁ గడుం బచేళిమఖిదేళిమదాడిమకేళిమత్తక్రీ
రాళియు బాలపల్లవరసాకలనాకులకోకిలంబులన్. 184

గీ. ఇవ్విధంబున నతఁ డెల్లబుతువులందు, నంతకంతకు మతిప్రేమ యగ్గలింపఁ
దత్తదుపభోగ్యవస్తుసంతతులచేత, మిగుల నింపుగ రమియించె మగువఁగూడి. 185

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అసదుగఁ జెప్పకోలుపాలయల్క నొకప్పుడు మార్గగంబుగాఁ
బొరలిన నింత సాహసము పోలునె మీకని నవ్వు నవ్వధూ
వరులఁ బ్రవాళశయ్య యిసపంకలఁ దత్తనుతాపయోగని
స్సరదకలంకఫేనలవజాలమిషంబున డాలునంధిలన్. 187

క. ఆమనుజాధిపుఁ డభినవ, కౌముదికిని వసనఁ దప్పక సమానమనః
ప్రేమలు మీఱఁగ దక్షిణ, తామహనీయుఁ డయి నడపె దర్పకలీలల్. 188

చ. అభినవకౌముదీరమణి యంతటిలో నొకనాఁడు రాగసా
రభము దలిర్పఁ గాఁ దను దిరంబుగ వీణియఁ బూని పాడుచు
న్శుభగతిఁ గొల్వఁ దత్పటిమసొంపు వినం బిలిపించె భూమిప
ల్లభుఁ డొకయింతిచే మధురలాలస నచ్చటి కాదరంబునన్. 189

గీ. ఇట్లు పిలిపించి తద్గాన మించుకంత, యాకె వినునంత నధిపుఁ డోయబల నీసుఁ బ్ర
వీణ యనవిందు నేను దద్వీణ నీవు, పుచ్చుకొని పాడు మంచు నాపాలఁతిఁబలికె.

క. పలికిన నీసుఁ గానన భీ, తిలి యిటు నటు నట్టుకొట్టు తెలివతెఱఁగు భూ
తలవిభుఁడు చూచి యిది యే, మలికుంతల తెలుపు మనుచు నడిగెఁ బోఁబోరిన్.

గీ. అనుగుట యు నీవిపంచి సమంచితశ్రు, తిప్రకాండములకు జగతీశలేంద్ర
మామకస్వరపటిమ సమాన మగునొ, కాదొ యనియెడుశంక యొక్కట జనించె.

క. నా విని యందుల కేమి స్వ, భావగతిం బాడు మనిన భామిని గాన
ప్రావీణ్యముఁ జూపె ను గదు, నావీణియ శ్రుతులు గితులు నధరితములుగాన్.

క. విభుఁ డపుడాకంఠస్వర, విభవమునకు నేపునకు వెఱఁగొందెఁ గడుం
ద్రిభువనదుర్లభ మిది యని, యభినవకౌముది యు మిగుల నద్భుత మొందెన్.

వ. పదంపడి యొక్కింత విచారించి మేదినీనాయకుండు మధురలాలసం జూచి. 195

క. నీవాయించువిపంచికఁ, దేవలయు న్దానికొలఁదిఁ దెలియుద మనిన
న్భువలయాధీశ్వరునకు, నావనరుహదళనిభాయతాక్షి వినీతిన్. 196

ఉ. ఏటికి నెట్లు దోఁచిన సహించుటగాని నిజంబు చెప్పకే
నేర మెఱుంగఁబెట్టి ధరణీవర యింక ను నీవు మత్స్వరో
దీరణ యొత్తికోలునకు నీడుగఁ బల్కెడువీణ లేద యెం
చారసిచూచినం గొలుప దాత్మకు దానను బాట మిక్కిలిన్. 197

గీ. నగర నప్వీణ యునికి భూనాథ యేను, వినుచుఁ జూడంగవలయు నంచును నలఁతు
దీనకొలఁది యేపాటిమో దేవరకును, దెలియఁ బరికించితిరె లేటతెల్లముగ ను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అనుట యు నమ్మహీపాలుం డబ్బాలికతో ని ట్లనియె నేఁటివర్తమానంపు వీణియలం
దు నిదియె యుత్తమం బగుట చిత్తంబున నిడి యేను మొదల నుండియు దీనిపరిచ
యంబునం దగిలియుండుటంజేసి యిప్పటిదాఁక నెప్పుడు నధికంబునకు బుద్ధిపోవదు
గాని యిప్పుడు భవదీయగానంబు వినంగ మంద్రమధ్యమతారస్వరవిలాసవిశేషంబు
ల కిదియ కడకత్తియ మని యు నిర్వీణియపలుకులు సమగ్రంబులు గా వని యు ను
న్మానసంబునకు సరిదాఁకి యున్న యది యని యభినవకాముడిం జూచి దీనికంఠస్వ
రంబునకుఁ దగినవీణియ యొక్కఁడ నేనియుఁ గలదొకో యనిన విని యాభామిని
యోభూవర దేవరవు గానప్రసంగంబున మున్నే నువిన్నపంబు చేసితి మదీయం బైనయీ
వల్లకి యెల్లవీణియలకు నెక్కు డని తొల్లి తుంబురుండు మెచ్చి ధరియించియుండుఁ
దనకుం బ్రియశిష్యురాలం గావున నతండు నాకు నొసంగె నింక సింతకంటె నుత్త
మంబు లెక్కడం గలిగెడు నని పలికి యొక్కింత చింతించి యి ట్లనియె. 199

క. అతుంబురుఁ డీసందున, గీతకళ న్నారదునకుఁ గీడ్పడియెనన
న్నూతలనాయకవింటెని, జేతోగతిఁ దెలియు మేవిశేషము గలదో. 200

వ. అనుట యు నమ్మాటవలనఁ గళాపూర్ణుండు మున్ను మధురలాలసకథలలోనఁ దనకు
వినఁబడిన నారదుని తుంబురునిజయోద్యోగంబు దలంచుకొని తత్ప్రసంగంబున నిజ
పూర్వజన్మవృత్తాంతంబు సంస్మృతం బైన నందు మృగేంద్రవాహనామందిరగుప్తం
బైనతనవిపంచి యునికి చింతించి మదాళయపుత్రికంఠస్వరంబునకు నదియె తగినది
యని హృదయంబున వితర్కించుచు దానిం బరికించి తెప్పించుట కుద్యోగించి యా
చంచలాక్షిం జూచి యింక నొక్కవీణియ యొక్కచోట నున్న యది నీదుపాటకు
ననురూపంబుగాఁ బోలు నని పలికె నప్పలుకులకు మున్న యభినవకాముడిం దదీ
యసఖులు ప్రక్కంబడి యొక్కడం దొలంగం దొడ్డొకనిపోయి యేకతంబున ని
ట్లనిరి. 201

క. అకటకట ముగుదవన్నం, తకుఁ గలవు సపత్ని పాటతగులంతఁ గడుం
బ్రకటించుపలికిఁ దొడ్డై, వికసిల్లుచుఁ జెప్పె దెచటివీణెలసుద్దుల్. 202

గీ. అకెగానంబు నీవీణె నతకరించు, టాదియందునె యెఱిఁగిచు మ్మతఁడు నేఁడు
పిలిచి తెప్పించె నిన్నింతచులుకఁ జేయు, కొఱకె తప్పదు మామాట యెఱిఁగికొనుము.

ఉ. నేఁడు దలంప నీవుఁడు నీభవనంబునఁ జాటవించు ను
న్నాఁ డఁటఁ యాకెమీఁదట మనం బిడెనే నిడుఁగాక యంతటం
బోఁడిమిఁ బిల్వఁబంచెఁ దలపోయఁగ నింకొకవింత యాకెసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ల్లాఁడి కరంబు వ్రేలఁ బదిలంబుగఁ దాల్చినవాఁడు చూడవే. 204

చ. ఎఱుఁగవుగాక యొక్కపుడొకించుక మార్గమిడ్డ కూర్మికిం
గొఱఁతయె యెంతచెప్పినను గోమలి నేరవ యల్కఁ దెమ్మకో
నెఱయ నధీనవై పెటఁగి నేఁ డిదిగోఁ గయికొమ్మి మిక్కిలి
స్నేహమెసె యతండు నీవు వినసేర్చెడి మాటలు చెప్పఁడేని యర్థ. 205

క. పడఁతి యెటులయినఁ బ్రాణముఁ, బిడికిటఁ బట్టుకొని నేఁడు ప్రియుతో నీవె
ప్పుడుపలెఁ బలుకక యుంచుక, తడ వుండుము మాకుఁగాను దాలిమితోడన్. 206

గీ. మధురలాసపాటపై మదిని దనకు, నింత వేడుక గలిగిన నేఁకతమున
సకతము ను వింటగాక యిట్లశఁడు నిన్ను, నోటఁబలుచుట తగునె నీకోర్వఁదగునె.

క. కావున నీయాటమి నీ, కేవెరవునఁ బాయు నది యధీశుఁడు తానే
కావించు క్షణము పలుకక, నీ వుంచిన నేమెఱుఁగమె నెయ్యముకోలఁదుల్. 208

వ. అని బోధించిన తనమనంబున నాయించుఁబోఁడి. 209

క. నానెయ్యపుఁదమితుహిమము, చే నప్పుడు విభుని తెఱఁగుఁ జింతింపఁగలేఁ
గాని సఖీజనకథితం, బైనది యింత యు నిజంబ యారసిచూడన్. 210

క. కావున నేఁ జనవులకుం, బోవుట యుఁక ననుచితంబు బుద్ధిఁ దలంపం
గా వినువారలు నగరే, తావలపున విభుని కొదవఁ దలఁపనికాఁకన్. 211

వ. అని విచారించుచు వారి కప్పటికిం దగినయుత్తరం బిచ్చి నిశ్చలం బైనధైర్యంబున
నెప్పటియట్ల ప్రవర్తిల్లుచుండె నంత నాఁటిరేయి భూనాయకుండు తదీయగృహంబు
న కరుగునప్పుడు. 212

క. నాయకునిరాకఁ గనుఁగొని, యాయచ్చరపూవుఁబోఁడి యత్యంతపరి
స్ఫాయద్భక్తివినీతివి, ధేయత ఘనసంభ్రమమునఁ దేటపడంగన్. 213

శా. అత్యంతంబు నలంకరింపనిమనోజ్ఞాంగంబుతో నీనికిం
బ్రత్యుత్థానము చేసి మానికిబలెం బాద్యాదిసంపూజనా
కృత్యంబుల్ ఘటియించెఁ గాని సరసోక్తిస్మేరపీఠాదిలా
లిత్యం బేమి యుఁ జూపదయ్యె రతికేళీరాగరమ్యంబుగన్. 214

క. తలిమముపై నెరసులు గిర, సులు లేకుండంగఁ దుడిచి సుకిదడిమపుడు
వ్వలువ పయిఁ బఱచి తలగడ, నిలిపె విభునికయనమునకు నెలఁతుక యంతన్.

వ. తదనంతరంబ యందు నాత్మేశుండు పవ్వళించియుండ నాచంచలాక్షి చేరువఁ దా
నొక్కపసిండిగద్దియం గూర్చుండి యాకుమడిచి యొసఁగుచుండెఁ దత్ప్రకారంబు
గనుంగొని యాభూరమణుండు తనమనంబున. 216

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. శృంగారగంధి యై చిఱునవ్వు తెలిఱాలు చెక్కుటద్దములపైఁ జిక్కుటిల్లఁ
బుష్పబాణోద్ధతిఁ బుంఖానుపుంఖమై తొలఁకుచుండుఁ గటాక్షవిలసనములు
నాకూతగర్భంబు లగుచుఁ దేనియ లుట్టఁ గలికిపల్కులు ప్రవర్తిలుచునుఁడు
గుబ్బచన్నులకెలంకుల నారువోసినయ ట్లుప్పతిలుఁ బులకాంకురములు
వచ్చి యే నిట్లు నిలిచిన నెచ్చెలువకు, నిప్పు డవమాని యేమొకో యిట్లుశుష్క
వినయభక్తిపాతివ్రత్యవిహితవిధుల, నన్ను వంచించుచున్నది నళినవదన. 217

వ. అనిసంశయించి నేఁటిపాట లీపాటలకంధికిం గౌటిల్యకారణంబు గాఁబోలుఁ బరీక్షించి చూచెదంగాక యని యాకమలవదన కి ట్లనియె. 218

గీ. నీ విదేమి చెప్ప నేఁ డొకలాగున, గానిపించుచున్న దానవబల
యెపుడు నే నెఱుంగనిట్టివి నీయందు, ననుడు మాఱుపలుక కబల యున్న. 219

ద్వ్యక్షరికందము. నా నెమ్మనము న మానీ, మానని మానమున మనసు మన్నన నన్నో
మానిని నీమనమున నను, మానము మానమును మాని మనుమను నెమ్మిన్. 220

వ. అనుచు నచ్చెలువ సొలయుచు ని ట్లనియె. 221

ఉ. పాటల గెల్చినట్టిసతి పల్కులు పల్కులు గాక యిట్లు నేఁ
డోటమి నున్నమాపలుకు లోన్నప యేటికి నీకు నట్టియా
మాటలకేమి పోదు చదివక్కవ వే ఱొకచోట నుండఁగా
బోటుఁ జనాలు చన్నె మిముబోంట్లకుఁ దక్కినవారికిన్ వెసన్. 222

ఉ. మాపని యేమియున్నయది మానక యెక్కుడు డీ లెఱుంగున
స్మీపాడగాన్నగల్గుట యు మిక్కిలి నబ్బుర మింతనుండి మీ
కీపరిపాటి సేవ రచియించుటకే తగినట్టిదాన నో
భూపవరేణ్య యేను జెఱపోఁడుము లెంతటిదవ్వు మాకిఁకన్. 223

చ. అనుచు నట్టిమన్ననలు నాబహుమానము నాప్రియంబు నా
చనువు ను గల్గియున్నపుడ చచ్చుట యుక్తము మాకు నట్టిశో
భనగతికి న్విరోధి యగుపాపపుటాయువుఁ జట్టుకొంటగా
కనియెడిదేమి యున్నది నరాధిప నిన్ను గుణైకభూషణున్. 224

క. సంగీతకళలఁ జెలఁగుకు, రంగాక్షి బెడంగులం గరంగుట తప్పో
భంగించి యితరకాంతఁ, దొఱంగుటతప్పో తడంబఱచి పురుషులకున్. 225

క. నావిని యేయపరాధము, నావలనం గలుగఁ దెలిసి నారీమణి యీ
భావమున నెన్నియేని యు, భావంబులు ముట్టమాటి పలికెదు నీనుకన్ 226

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పయికొని నన్ను నిట్లు మఱు బారికి లోనుగఁ జేయఁబూని యే
నియతిరొ పట్టినందియము నీకొనరింపఁగఁ బోలుఁగాని య
ట్టియహిత మేను నీవు ను ఘటింప ను నీచరణంబు మీఁదియా
నయనుచు లేచి వచ్చి పతి నాతిపదాబ్జము పట్టెఁ ఒట్టినన్. 2.7

ఉ. ముట్టకు చాలుఁ జాలుఁ గడు మోహపు కేవుల కాళ్లు పట్టుకో
నెట్టు ను జెల్లుఁగాక ధరణీశ్వర యేటికి పట్టిదోసము ల్గ
ట్టెదు నాకు నంచు నెడగాఁ జరణంబుఁ దరల్చికొంచుఁ దాఁ
బట్టెఁ దదీయహస్తములు భామిని యాఁపుచు రెండు చేతులన్. 228

గీ. అతఁడు నోసరోరుహాక్షి నీకంటె మో, హంపుదేవు లెవ్వరంచు సతిని
గ్రుచ్చి కౌఁగిలించుకొని యెత్తి యక్కునఁ, గదియఁ జేర్చుకొనియె గారవమున.

ఉ. అత్తలిరాకుఁబోఁడి యపు డక్షుల నశ్రుకణంబు లొల్క డ
గ్గుత్తికతోడ నీదయకుఁ గూర్మికి లాలనకుం గొఱంత రా
జోత్తమ కల్గునే కలుగ దొక్కపుడు న్మతి యేమొ నేఁడు నా
చిత్తములోన మాన దొకసిగ్గు ను విన్నఁదనంబుఁ దాపమున్. 230

వ. అనుటయు నమ్మహీకాంతుండో కాంత నీచింతతెఱంగెఱుంగుదు నేఁటిదాఁక నెందు నద్వితీయం బనఁ బొగడ్తం గాంచిన నీవిపంచి యితరనారీగానంబు చేత నవమానితస్వాంతం బగుట యిట్లని వగచుచున్న దానవు దానికంటె నత్యుత్తమం బైన విచిత్రవల్లకి యొక్కటి యేను మత్పూర్వజన్మంబున ధరియించినది యొక్కచోట నున్నది యని విన్నవాఁడ నది యెటులనైనను సాధించి తెచ్చి తద్వాదనాభ్యాసంబుతోడ నైన నిన్నెంతటివారికిని మీఱశక్యంబు గాని గానవిద్య నుద్యోతించునట్లు చేసెద నమ్ము మనియె నవ్వనిత యు నతండు పూర్వజన్మంబున మణికంధరుం డను గంధర్వకుమారుం డగుటఁ దాను నెఱింగినది గావున నతనికి నట్టివీణెఁ గలుగుట సంభవించు నది యని మనంబునకు సరిపుచ్చుకొని సంతసిల్లెఁ గళాపూర్ణుండు నివ్విధంబున నవ్వనిత డెందంబు కందు వాపి సాంద్రానందంబున నభిమతక్రీడల రమించె మఱునాఁ డచ్చెలువ నెచ్చెలులముచ్చటలవలనఁ గర్ణాకర్ణిక నవ్వార్త మధురలాలస చెలికత్తెలు విని యన్నెలఁత కెఱింగించిన నయ్యంగన తనమనంబున. 231

క. గానాదికళల కొదవలు, దాన తగం దీర్చి పతి ముదం బొనరింపం
గానునికి కెనయె పతితమ, గానాదుల మెచ్చఁజేయు కాంతల బ్రదుకుల్. 232

గీ. నాకుఁ దేఁదలంచు లోకోత్తరపు వీణెఁ, దనకుఁ నొసఁగఁ జేసికొనియె నార
దముని ప్రేమ నడుమ దొరవాటు గొట్టెని, ట్లుండ వలదె జగతి నువిద లైన. 233

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అని తలపోయుచు న్జలువపౌనన దాన నొకింత వింతరీ
తిని గనుపట్టఁ గన్గొని రతిక్రియవేళఁ దదీయచింతమా
న్చె నతఁడు శాల్లమీఁదఁబడి శీఘ్రము తత్పదభూష లప్పది
గ్గనపతిదారమాళిమణిసంతతిఁజేయఁ గృతప్రతిజ్ఞుఁడై. 234

గీ. ఈఁతిం దనకాంతల కిడువురకు న, దానొడంబడినట్టి యర్థములు రెండు
తలఁపులోపల నుండఁ దత్సాధనార్థ, మొకపువేళ నృపాలుఁ డిట్లూహ సేసె. 235

సీ. అభినవకాముని కామిని యున్నచో టెఱిఁగించి పొమ్మన్న నిపుడ పోయి
తెమ్మకొనోపుఁ డా దివ్యకామిని గాన నైన నాకనుచితం బట్ల పనుప
దాన మత్సామర్థ్యహీనతదోఁచుఁ గావున నట్టుగాఁ దేను జనులఁ దగిన
వారిఁ బంచిన విఘ్నకారు లెవ్వరు గలరో మాన్పకొన సమర్థులుగ వల యు
నింక నటుగాక తద్దేశ మేలు దొరకుఁ, జెప్పి పంపిన నతఁడు యాసించు నేమొ
యున్న యు సుమాని యేనె దండెత్తి చనిన, నవి యుఁ దన్మార్గరిపులసంపదలఁ జేరు.

వ. ఇంక మధురలాలస కొడంబడిన యందియులు సాధింప దిగ్విజయంబు నందుఁ గాని
శక్యంబు గావని తోఁచుచున్న యది యని విచారించి యూహాపోహార్థంబున సకల ని
జకార్యభారధారేయు సత్యదాత్మనామధేయుఁ బిలిపించి. 237

క. లోనికి నపు డెవ్వారిని, రానీకుండంగ ద్వారరక్షుల నిడి ధా
త్రీనాథుఁడేఁగె మంత్రివి, ధానోచితభవనమున కతండును దానున్. 238

గీ. ఏఁగి తనతలఁపు ప్రకార మెల్లఁ జెప్ప, నధిప నరిదాఁకెఁ గద నేఁటియుత్న మెల్ల
వాఁడు మధురలాలస లక్షణములు చూచి, యే వినిన మాటకని ప్రీతి నెనఁగె నతఁడు.

గీ. అనుడు నతఁ డట్లయువు ఏని యపుడు నగుచు, నింక దీనికిఁ గర్తవ్య మెద్దిమనకుఁ
బదియుఁ బదియు ను గా నీతిపదవి నరసి, తెలియఁదగునని యిట్లనిపలికె మఱియు.

గీ. అనఘుఁ శ్రుతిచతుష్టయైకాధిగమ్యమై, నిపుణమంత్రిసంప్రణీతమగుచుఁ
గడు నపూర్వఫలము గావించు మంత్రంబు, యజ్ఞశీలునకు ధరాధిపతికి. 241

క. నాకుం జూపఁగ నీతిశ, శాకలనము లల్పశౌర్యులతెఱంగులు గా
కే కార్యమునకు వచ్చు జ, యైకపదము శౌర్యబలముచుని యుం దోఁచున్. 242

గీ. ఎచట నెపు డెద్ది చేఁబూని యెట్టివానిఁ, బ్రబలశౌర్యంబు దాఁకి పరాక్రమించు
నదియె పోరికిఁ దగుదేశ మదియె సమయ, మదియె కైదువు శక్యంబు నతఁడె గెలుచు.

ఉ. అల మొనర్పఁబూను రిపు నగ్రమునం గనుఁగొన్న నొక్కయా
ఖీలపుఁ దేవ మప్పు డటు బిట్టువయించు ను శౌర్యశాలికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్వాలలు మున్న గూర్చుకొని వచ్చి దహించునె కాననంబుఁ దా
త్కాలికహేతిసంపదలఁ గాక హుతాశనుఁ డెంచి చూడఁగన్. 244

ఉ. ఏనుఁగు శైలతుల్యత వహించియు మందగతిత్వదోషముం
బూనుట వన్యభావమును బొందెఁ దనస్థితి కొంచె మయ్యుఁ బం
చానన మెంతయు న్శరభసాతిశయోత్పతనప్రభావముం
బూనుట ఘాతుకత్వమును బొందె జయంబులు శౌర్యసాధ్యముల్. 245

క. సకలకళానిపుణులు సే, వకులై కొలువఁగఁ బ్రతాపవంతుఁడు గొలిపిం
చుకొనుం గావునఁ బోలవు, సకలకళలు నొకప్రతాపసంపదలోడన్. 246

చ. ఇనుఁ డొకచో నొకింత యుదయించిన మాత్రన విచ్చిపోవు పే
ర్చిన పెనుజీఁకటు ల్నిరవశేషముగా నవి యట్లు విచ్చిపో
వనయము శీతధాముని కళౌఘమృజావిధినైన నీనిచే
తవ కనరాదె యేరికిఁ బ్రతాపకళాగుణతారతమ్యముల్. 247

చ. ఒకఁ డొకకేల నొంచె నధికోన్నతిఁ జేర్చినఁ మేరుశైలనా
యకుఁ బెఱవేల్పు లందఱుఁ జిరాశ్రయణంబున వంపలే రొకిం
చుక యును బుద్ధిలో నరసి చూడ జగంబుల నుగ్రుఁ డస్త్రసి
ద్ధికి బుధుల్ప్రసిద్ధికిని దెల్లముగానివి సూ ఫలస్థితుల్. 248

మ. ఇది యత్యంతము దుష్కరంబు సుకరం బీకార్యమ న్భేదచిం
త పగుం గొంచెపుఁ గార్యకర్త యెడ నత్యంతప్రతాపాఢ్యునం
దది యెంతే విఫలంబు దానవుల శుష్కాశుష్కతాభేదము
ద్యవతిస్ఫూర్జితదావపావకు నెడ న్వ్యర్థంబు గాదే కదన్. 249

క. కావున శూరుం డుత్సా, హావేశం బైనయపుడె యహితులమీఁద
న్వేవేగ దండుగదలం, గావలయుం గదల నిపుడు కాలోచితమున్. 250

చ. అన విని సత్త్వదాత్ముఁడు ధరాధిపుతో వినయంబు మీఱ ని
ట్లను మనుజేంద్ర నీవు గనునట్ల నయస్థితి నేను గాననే
ర్తునె యయిన న్మనంబునకుఁ దోఁచినలాగున విన్నవింతు నీ
యనుమతిఁ జేసి నిశ్చయత నాప్తుల కిచ్చక మాడవచ్చునే. 251

గీ. ఫణినాథ కడుఁ బ్రతాపోజ్జ్వలం బైన, నీదుభావమునకు నాదు మృదున
యోక్తి యొకటఁ గొంతయుం బైనఁ గైకొమ్ము, జ్వలితఖడ్గమునకు జలముపోలె. 252

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. నృపతి నీతిపథము నీఁడువాఁడు తె, ప్పుడు గదాకులుండు పథ్యవిధిని
విడిచియును నొకొక్కయెడ జయించుట గల, దైన నిందఁ జెందు నజయమైన.

క. నీతిపథంబున నడుచుచు, హీతలనాయకున కొక్కయెగ్గొదవినఁ దా
రాతని నిట్టట్టనను వి, ధాతం దిట్టుదురు గాని ధరణి న్లోకుల్. 254

గీ. ఎందు నీతివిహీనుని జెందునట్టి, సిరిని దిట్టుదు రెట్లు దాఁ జేరె నతని
ననుచు భూజను లందఱు నినుముఁ గూడి, యున్న యగ్నికిఁ బెట్టు రాకుండు నెట్లు.

ఉ. ఏయెడ నెంతయు న్నృపతి కెక్కినపట్టి బలంబునం దనూ
చ్ఛాయము పేర్మిచేతఁ దముఁ జాలఁగ మించిన సామజంబుల
న్ధీయుతయుక్తిఁ బట్టుకొని తెచ్చి నరు ల్దము కెక్కిరింతలం
జేయుట నీతివైభవవిశేషము గాదె తలంచి చూడఁగన్. 256

చ. ఇమ్మెయి నాచరింపఁదగు నీపని యీపని యిట్లొనర్పసా
ధ్యమ్మగు నన్నయుక్తియె కదా భువి నీతి యనంగఁ దద్వివే
కమ్ము మహాబలాఢ్యునకుఁ గానఁగరాదు పురత్రయీజయా
ర్థమ్ము నగంబు చాపముగఁ దాల్చిన రుద్రుఁడె సాక్షి దీనికిన్. 257

గీ. వింటఁ దొడిగి యేయ వెసఁ జను నెంతద, వ్వంతదవ్వు చనునె యంపకోల
దేవుఁడైన రిత్తచే వైవ నటుగాన, బలిమికంటె నీతిబలిమి లెస్స. 258

గీ. విను నృపాల సంధివిగ్రహంబులు యాన, మాసనంబు ద్వైధమాశ్రయ మనఁ
దనరు షడ్గుణములు దగువేళఁ జలుపమే, లొసఁగు ననయప్రయుక్తికీను. 259

గీ. ధరణిసామభేదదానదండము లన, నాల్గుపాయములని నామములును
లక్షణములు చెప్ప దక్షు లిందఱు ప్రయో, గాప్రయోగవిధులు గలుగుటరుదు.

గీ. గోరఁ బోవుపనికి గొడ్డలి యును దాన, సులువుపనికిఁ గోరు బలె నృపాల
గురులఘువ్యవస్థ యరయ నీచతురుపా, య ప్రయోగకరణ మనుచితంబు. 261

సీ. సరిగాఁగఁ బదవు లొండొరులకు నడచఁగా సమవిపక్షునియందు సామవిధి యు
మూలబలంబు పెంపున దుర్జయుం డయి పేర్చు శాత్రవునందు భేదవిధి యు
నెందును సంధిని హితులబలంగంబుచే నొప్పు రిపునందు దానవిధి యు
సాధునిశ్చితపరాజయుఁ డై విహీనబలుం డైనయరియందు దండవిధి యుఁ
జలుపవలయు ధరాతలేశ్వరవరేణ్య, బుద్ధియందు క్షయస్థానవృద్ధు లను త్రి
వర్గము నెఱింగి పంచాంగవర్తనములఁ, దెలిసి శక్తిత్రయంబున వెలయవలయు. 262

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. మంత్రగోపనము సేమఱుట యు దీర్ఘచింత యు నిరర్థకప్రజల్పిత యుఁ బ్రసాద
విరహితత్వము బుధావిజ్ఞానము శుభాప్రయోగంబు విషయానురాగభరము
నన్పృతంబు నాలస్యము ను నాస్తికత్వంబు నర్థంబులందు ననర్థమతి యు
దీర్ఘసూత్రత్వంబు దీర్ఘరోషంబు నిర్ణీతకార్యము లాచరింపమి యు ను
భూమిపతికి దోషములు నివి పదునాల్గు, వీనిఁ దెలిసి నెఱయ విడువవలయుఁ
గామరోషజంబు లై మీఱినట్టిస, ప్తవ్యసనములందుఁ దగులవలదు. 263

క. కొలిచినవారలజీతం, బులు వేళలు దప్పకుండఁ బూర్ణముగా నీ
వలయు ను వారల ప్రేమను, బలము నృపాలునకు నెల్లపట్లను మిగులన్. 264

క. ఏమేకట్టడ లెవ్వరి, కాయాకట్టడలు దప్ప కధిపతి ప్రబలన్
న్యాయమునఁ బ్రోవవలయుఁ గృ, పాయుతుఁ డై తస్కరాదిబాధ లుడుపుచున్.

క. దండార్హుల దండింపమి, దండానర్హు లగువారి దండించుట యీ
రెండు నకీర్తిదములు భూ, మండలనాయకుల నిరయమగ్నులఁ జేయున్. 266

క. ఇవి యన్నియు నిప్పుడు ప్రసం, గవశంబునఁ జెప్పఁబడియెఁ గాని సకల నీ
తివిదుఁడ వీవలఘువిధ, ప్రవర్తనము నీక కలదు పార్థివముఖ్యా. 267

గీ. సకలదిగ్జయంబు సలిపినయట్టిమ, దాశయుని జయించి నపుడె సిద్ధ
మెల్లదిశల నీదుకిల్లాకు సాగుట, యైన నృపులశాంతి యస్థిరంబు. 268

వ. కావున నీవు ను జని యావదుమ నంకుశితవన్న లగుచు నెదుర్పడం గడంగు గడుసు
దొర లెక్కడెక్కడం గలరో వారి నుక్కడంచి దిక్కుల న ప్రతిహతంబు గా భ
వత్ప్రతాపంబు నెఱపుట తగిన కార్యంబు దేవర యానతిచ్చినట్లు తదుచిత సమయం
బిదియ యౌ ట్లెంత నీవు మధురలాలసను సకలదిగ్దేశాధీశశుద్ధాంతకామినీమాళిమా
ణిక్యనిర్మితనూపురసమర్పణంబుశీఘ్రంబు సేయుటకుఁ బ్రతిన పట్టుట చెప్పఁజున్న
వాఁడవు తాన్పుశమంజీరధారణకారణంబైనయానాకీమణియుప్పట్టంబు శీఘ్రభావి
ఫలం బగుచు నిన్ను నట్టిప్రతిన పట్టించెఁ దప్పదు దానఁ జేసి జయంబు నవశ్యలభ్యంబ
యభినవకౌముది ప్రయోజనంబు ను దదానుషంగికఫలం బగుచు సిద్ధించుట చెప్పవలద
కావున నీతిచాతురీపూర్వకంబు దండయాత్ర నలుపు మని యిట్లనియె. 269

చ. బలములు గొంత కాత్రవుని బల్మినడంగినకిమ్మట న్ధనం
బులపన దండువెచ్చములఁ బొల్పతి పోయిన యట్టివిప్పుట
న్గెలిచిన గెల్ప గెల్పెయగు నీసతిభాగ్యము సార్థమే యగు
న్బలభవహాని యెంత కను బాటిలకుండు ను నీతిమైఁ జనన్. 270

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఓరాజేంద్ర ప్రదక్షిణక్రమముగా యుక్తంబు దిగ్జైత్రయా
త్రారంభం బటుగాన గెల్వు మును ప్రాచ్యావాచ్యపాశ్చాత్యుల
న్నీ రాష్ట్రింబున కెగ్గొనర్చుటకుఁ బార్ష్ణిగ్రాహులఁ డిప్పెళ ను
న్నారో పగ్రుఁడు మాగధుం డిపుడు తత్సంధాన మర్హం బగున్. 271

వ. అని విన్నవించి.

శా. పారప్రస్ఫురితాంగపంచకలసత్సంధ్యాదిషాడ్గుణ్యవి
స్తారోద్యత్సచివైకమత్యకృతమంత్రప్రక్రియానిర్ణయో
ధారాధాయతశక్తియుగ్మభృతరాజ్యశ్రీపరిభ్రాజితా
చారుస్ఫూర్తికళావిరాజిత సమస్తక్షోణిభృత్పూజితా. 273

క. బంధురశౌరీభూరిధ, గంధగరవచలితవలయనగధాతురజో
బంధుత్వప్రత్యుద్గమ, సంధుక్షితదోఃప్రతాప శౌర్యకలాపా. 274

మాలినీ. గురుతరజయధాటీఘోటకస్తోమచంచ, త్ఖురపుటదళితక్ష్మాధూళిఘూమ్యాపలాయ
త్పరనృపమశకాఘూధర్మవిధ్వంసితాఘా, నరవినుతచరిత్రా నారభూపాలపౌత్రా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ
సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బైన కళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీమదుమారమణాయనమః.

# కళాపూర్ణోదయము.

---

## అష్టమాశ్వాసము.

క. శ్రీలాకీర్తిసతీసమ, లాలనఖేలనగుణాచలద్దాక్షిణ్యా
శీలితపుణ్యజనుర్భార, వాలా నందేలకృష్ణవసుధాపాలా. 1

గీ. అవధరింపు మమ్మహామాత్యవరునీతి, సరణివిని కరంబు సంతసిల్లి
యుద్ధగేహుఁ డానరేంద్రుఁ డప్పటికిని, మగధరాజుసంధి దగున యనుచు. 2

ఉ. ఆనరపాలుపాలికి వడంతరచారిజనుంబుకల్మి యు
స్మానగుణంబు నాప్తతయు మాటలనేరుపు ధైర్యముం బరా
స్థానజనానురంజనసుదక్షత యున్నవయోద్ధతిస్థలా
నూనవివేకముం గలవయోన్నతు నంపెను రాయబారిగా౯. 3

సీ. ఆరాయబారి యు వ్యగ్రసంప్రేషితజనులచే మగధేశ్వరునిపురోహి
తప్రధానాములఁ దగుసామదానవివర్తనంబున నిజవశులఁ జేసి
యతిగౌరవప్రవేశితుఁ డై సభాస్థలిఁ దద్విభుఁ బ్రశ్నోచితంబుగాఁగ
దేశకాలాదివార్తాశంసనముప్రజేశ్వరుమహిమత్వముం జరగ నడపి
దాన నెదిరికి మానంబు దఱుగకుండఁ, గడునుదద్గుణస్తుతిఁ జేసి కలయనాడి,
మఱియుఁ గలనీతిపటిమ నాత్మప్రభునకు, నతనికిని దాను సంధాన మమరఁ జేసె. 4

మ. అనుపమనీతిశౌర్యనిధి యంగమహీరమణుండు సర్వావ
ర్తనమునఁ జాల యంత్రితఘనధాన్యబలప్రముఖంబులందు నెం
దును గొదలేక యుండ గడిదుర్గములుం దనరాజధాని యు౯
ఘనపరిరక్షణక్రియఁ దనర్పఁగఁ జేసె దృఢప్రయత్నుఁ డై. 5

క. తనబలనాథులకందఱ, కును జెప్పించెను గరంబుఁగోర్కిఁ బ్రయాణం
బు నవారలు నుత్సాహము, దనరఁగఁ జాటించి రపుడు తమపాళెముల౯.

ఉ. అంబుజమిత్రుఁ డంత నపరాంబుధిఁ జేరఁగఁ బోయె నాత్మబిం
బంబపు డంతకంతకుఁ గ్రమప్రథమన్నికటత్వతారత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాంబున సంక్రమించు తమసంచితచంద్రమరాగవీచికై
త్యాంబులఁ బోలె రక్తిమము తద్దయుఁ బూనఁగ వేఁడిమానఁగన్. 7

ఉ. కాలకృషీవలుండు గడఁకం బరిణత్యరుణాతపచ్ఛటా
శాలిచయంబు గోసి వెలుచం బనమోయుచు నున్నవాఁడు గాఁ
బోలను గుప్పగా నన నభోమణిమండల మంతకంతకుం
జాలవిశాలమై చరమశైలము చేరున నొప్పెఁ జూడ్కికిన్. 8

ఉ. కాలకలాదుఁ డింత యును గాంచనరేణువు ప్రత్యగాశనాఁ
గ్రాలెడు క్రోవిఁ గూర్చి కరఁగంగఁ బ్రబద్ధిన మొందు జాళువా
మేలిమిపూదెనాఁ బొలుపుమీఱె ననుం డవి గాఁక యొర్వఁ గీ
లాలనిమజ్జితంబయినలాగునఁ గ్రుంకెను బశ్చిమాంబుధిన్. 9

చ. పశిఁ దనుఁ బాలఁగాఁ దలఁచు వాసుకర్గను చేతిభానుఁ డ
ప్పుడిపుడుఁదు మార్చి కడుఁ బేర్చుచు రోదసివేరికంటచే
నును గక చొప్పరే యను నసోర్ధతవాస్తి మిగఁ బుఁదు నొ
ప్పెదుమదబిందు జ్యాంప వసఁ బెంపెసఁగెం గడసంజ చూడ్కికిన్. 10

ఉ. కేళవుఁ డర్విరాట్తనువు కృష్ణసమాఖ్యవహించఁ జేసెనో
యూపుఁడు మూర్తి లెన్నిదియు నెనికతోలుఁ గప్పెనో సమ
స్తాశలుఁ గూడి వృత్రవనుజాధపభూమికఁ దాల్చెనో యనం
జేలలతం దమఃపటలి పేర్చి సమస్తముఁ గప్పెనంతటన్. 11

గీ. నిండె యనిమొత్తి క్రత్తి చేనికిని రక్త, బలియుడి రసంగ నెఱసంజ తోలుత నమరఁ
దలుచుగాఁ దాన విఁతిఁసిన మెఱుఁగుఁగత్తి, విస్తనాఁ జుక్క తెంతయు నల్లసిల్లె.

చ. అరయఁగ నూర్ధ్వలోకము ప్రశస్తమహాం బయి పంశయంబుగా
నడుదుగ నెంత యుం బ్రకటమై యది గొ గగనంపుఁ బ్రాఁతిన
ప్వరము సుచ్ఛిద్రజంబున విభాసిలుచున్నది యంచుఁ జూపరు
ల్గగము ఉక్కూహలంబు మొయిఁ గన్గొనఁ గాఁ దనరారెఁ దారకల్. 13

గీ. అంత నసురాధినాథు గృహాంగణమున, జాల గంటంపుఁ గలుగుంచి జల్లిదనఁగఁ
దూర్పు తెలువయ్యె నంతలఁ దుసు వదీను, గజము నిలిపిరో మనసు ధాకరుఁడుఁదోఁచె.

గీ కాలమను జనింపుడు చంద్రికాపటంబు, నేయఁబన్నిన మగ్గ మొకో యనంగ
నవమయూఖాళి నొసాఁగి చిఫుల నొప్పె. బిధుఁడు మరెవానికృపాఖ్యఖిత్తి విఁరగమనఁగ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. వెల్లమునుఁగుఁ గోక విచ్చినరీతిఁ బా, లారఁబోసినట్టి యందముగ ను
బ్బించి చల్లినట్లు పండువెన్నెలలు గా, యంగఁ దోఁచెఁ గెలనమమునను. 16

మ. కలయన్లోకములందుఁ బర్విన తమఃకాలుష్యముం జంద్రికా
క్ష్యాలసత్త్వగుణప్రకర్షమునఁ బ్రక్షాళించుచుం దద్దయుం
బొలుపొందెన్ ద్విజరాజమండలము పెంపుల్మీఱ నొక్కొక్కచో
జలవం బుండెను మీఁదమీఁద భవనోపమక్రియం బర్వఁగన్. 17

ఉ. ఇట్టిటు యామినీరమణుఁ డేఁచఁగఁ జెప్పటలీలఁ జాలఁ జూ
పట్టమిఁ జూచి శ్రీనెలవు పద్మినిఁ గైకొన కప్పు డక్కటా
గట్టిగఁ దత్ప్రియాళితతి కైరవిణిన్ సెసఁ జేరె రాజుచే
పట్టినవారు దేవు లనుపల్కు యథార్థము సర్చసేయఁగన్. 18

సీ. కొనుఁడి వే విరులన్నఁ గొననేల నినుఁజూడ మరుఁడు రున్నాఁడు విరు ల్వేఁటి యనుచు
నీపట్టిమాటల కావచ్చుటన్న నట్లేను రా విది వెల యించ మనుచు
నిపుడు మీయిష్టంబు లిందెవ్వి యనిన నాకవ్వి బాఁచిన గుచ్ఛకములె యనుచు
నివి చెల్లకవిరుమ్మెడివి చాలుఁ దలఁ డన్న నెఱుఁగదు మఃపు డంట నేను ననుచు
జైటిటివాని నొల్లక తడిపావడలను, బొదివి పెట్టిన యవి దివఁబోవునట్టి
యువజనుల దంటమాటల కొప్పి నగుచుఁ, బుష్పలావిక లమ్మిరి పువ్వులపుడు. 19

వ. అట్టిసమయంబునఁ బట్టనంబునం గలదండనాయకు లందఱుం దమతమేలికజయప్రయాణంబునకుం దగిన సన్నాహంబున నాయత్తపడుచుండిరి కళాపూర్ణుండు నభినవకాముదిమందిరంబున కరిగి యయ్యెగురుఁబోఁడితోడ నోకమలవదన నీకు నోడఁబడినవీణె యసాధించుటకు దిగ్విజయుం బొనర్పనంతపలసె నేఁటిపేళవఁ దత్ప్రయాణం బని యెతెంగించి మధురలాలసపాలికిం జని యాకంజవదనతో ని ట్లనియె. 20

క. నీనూపురంబుమణులకు, నై నిఖిలదిగంతవిజయయాత్ర యొనర్పం
గా నెల్లి మంచిదివసం, బో నెలఁతుక యనుచుఁ జెప్పి యొగి నరిగెం దన్. 21

చ. తమకము మంగన ల్కరము తత్పరత న్బిగియించు కౌఁగిలు
ల్గనునపు వేడ్క నించుక యుఁ గైకొన కప్పుడు తెల్లవాఱునం
దమకము మానసంబుల ను దాల్చుచు మాటికి నెల్లవారు సం
భ్రమమునఁ దూర్పుచూడఁ గనుభాసిలె నాఁటిరేయామ మిక్కిలిన్. 22

సీ. సమకాంతిఁ జనల దోఁచని నీలిగవిసెన సిడిప్రమాఁకటుల వడ్డపడఁగ విధుఁడు
వలసినప్పుడు దాని వ్రాల్చుటకై కట్టినట్టి పగ్గములు దీర్ఘాంశులతలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రతిరాజు సిరిహెచ్చ రజని కాళికి నిడి యాడుకోయిలభటుఁ డంకశోభ
యితనిమీఁద వ్రంతమాడు కప్రపుధూళి చంద్రికవిసులు నక్షత్రసమితి
యారజని కాళి యెందేనివరుగఁదలఁచు, బెజ్జఁగ్రివాల్పించుచున్నవాఁడే మేఁయిప్ప
డతఁడు తలనిడుకొమ్ము నా నంతకంత, గోరిచంద్రుఁడు పడమటఁ జేరఁజొచ్చె. 23

గీ. కోడి తపతప ఱెక్కలుగొట్టుకొనుచుఁ, గూయుక్రమ మొప్పమీఱ వేకువయనియొడి
కవముగట్టి విఘూమానధనముదోఁచు, ననమశరుఁడు తప్పటఁ గొట్టి యార్చెననఁగ.

ఉ. పారదబద్ధనద్ఘుటికఁ పాకపరీక్షగొనంగఁ జంద్రికా
క్షీరము నంచున స్సుమయసిద్ధుఁడు పెట్టె ననంగఁ జాల నొ
ప్పారెను వేగుచుక్క యదియంటినచోటు సువర్ణమయ్యె నో
నారమణీయమైన యరుణద్యుతిఁ దద్దయుఁ దూర్పు శోభిలెన్.

చ హిమకరుఁ డప్పు డొప్పఁ బ్రణయించి తుషావృతి నిడ్డ గార్హప
త్యముక్రియ దక్షిణాగ్నిగతిఁ దాల్చె నగస్త్యుఁ డమూడుదీప్తి సాం
పమరె సముల్లసద్యుతియు తాహవనీయము నా నొకొక్కచో
నుముకలబూది చిందనదియో యనఁ జిల్లరచుక్కలుండఁగన్. 25

వ. అంత. 26

సీ. సమయవ్యతిక్రమశంకానసంరంభ జాగ్రదుత్థితసర్వజనచయంబు 27
రథ్యకేతనముఖ్యరథకార్యఘటనాదిసంభ్రమాకులసూతసంచయంబు
ఘంటానుథాప్రముఖద్విపసన్నాహభూరితరత్వరాధోరణంబుఁ
బల్యయనఖలీనబంధాదిసైంధవకల్పనాలోలాశ్వికవ్రజంబుఁ
దక్రదధ్యుపదంశాదివిక్రయకర, భామినీహూతివాచాటభటకదంబ
నమవలంబితభోజనచాపలంబు, నగుచు నవ్వేళఁ దనరె నన్నగర మంత. 28

సీ. పొందుగా నందలంబులు పల్లకీలు దేక్షత నాయితముసేయు జైబికులు ను
దగువాహనముల నంతిపురకాంతల నిడి దిడ్డు నైపించు హెగ్గడులు ను
ద్రోవఁ బోఁజాలఁబెట్టి తొలుత గాఁ దమతమ మొనలగల్పుచు చమూపతులు ను
నుష్ట్రవామీశకటోక్షాదివాహితభర్మపేటికలగు భాండారికులు ను
గరము సంభ్రమింప ఘనతర మైనత, త్కలకలంబు లప్పుడు పాలుపుమీఱెఁ
గైరవప్రియోదయారంభపూర్ణమా, నార్ణవారవంబు ననుకరించి.

సీ. ప్రస్థానసముచితబ్రహ్మమంత్రముల భూగీర్వాణపఙ్క్తు లాశీర్వదింప 29
జయజయ జేవ యన్నబ్జజృంభణములో బిరుదావళులు వందిజనులు చదువ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేత్రహస్తులు చెప్ప విపరించి చూప సామంతభూనాథు లంతంత మ్రొక్కఁ
బట్టపేనుఁగుఁ బైఁడిపల్లకిఁ దేజీని దగనాయితము సేసి దండఁబెట్ట
జైత్రభేరీధణంధణ శబ్దనుహిమ, గరము ఘూర్ణిల్లె దిక్కులు గ్రక్కదలఁగ
లలితగుణయుక్త మగు శుభలగ్న వేళ, నతఁడు ఘనంబు వెడలె భూతలవిభుఁడు.

క. ఇత్తెఱఁగున వెడలి యతం, డుత్తమకరి నెక్కి దిగ్జయోత్సాహవిలా
సోత్తంభనకాహళికా, తుత్తుంభధ్వనులు వార్ధులఁ గలఁగింపన్. 31

చ. గురుతరకేతుభూతిఘనకూటము లైనమహారథంబులుం
జలదవనీధరేంద్రముల చాడ్పున నొప్పెడు సింధురంబులు
స్మరపవమానచాతురిమస్ఫుటవేగము లైనవాజులు
న్వరభటసంచయంబుఁ గొలువ న్వెడలెం బుర ముతెఁ డంతటన్. 32

వ. అప్పుడు. 33

సీ. మిళితభూగగనాంతములనఁదు విచ్ఛినఁ గాన్పించుబ్రహ్మాండకాంతి యనఁగ
దిశ లెన్ను చిదిపూర్వదిశ యని బ్రహ్మ నిల్పిన యట్టి మొదలిటిరేక యనఁగ
నుదయాచలాధీశు నుత్తమాంగంబున భాసిల్లు పచ్చబొట్టుపాగ యనఁగ
గగనాఖ్యపనసవృక్షప్రకాండోపరిభ్రాజితం బనుపక్వఫల మనంగఁ
దారకాధర్త చంద్రికాక్షీరభోజ, నాంతమునఁ బూర్వసంధ్యయ న్యక్కుంత వెచి
లీలఁ జేర్చిన పసిఁడిపళ్లెర మనంగఁ, దరణి విశ్వంబు గాన్పించె వరుసతోడ. 34

వ. ఇవ్విధంబున సూర్యోదయంబున సకలజనమనోరంజకం బగుచు నొప్పుచున్నంత.

చ. ధళధళనాయుధద్యుతివితానము గ్రమ్మఁగఁ జాల నొప్పుచు
న్వెలువడు సేనలం బురమువీథులు నన్మణిసౌధకోటిలోఁ
బొలుపెసఁగ న్దినేశరుచిపూగధగద్ధగితాంబుసారిణీ
విలసితపుష్పితోపవనవీథులువోలె సురాళి మాడ్కికిన్. 36

క. అంతటఁ బ్రాకారద్వారాంతము సమ్మర్ద మెనఁగ నత్యంతాయు
ష్మంతులముగదా యనుచు ను, సంతసమునఁ గడచిపోవుజను లాడికొనన్. 37

వ. ఇవ్విధంబునంగ్రిముకకంఠోత్తరపురద్వారంబునిర్గమించితద్బలంబులునడుచునప్పుడు.

గీ. ఎంతదవ్వులవస్తువు నెదుటఁగాన, రైరి ప్రథమనిమేషంబునందుఁ బక్క
దానినంతన కడచురథవ్రజంబు, వేగమునఁ జేసి రథికులు వెఱఁగుపడుచు. 39

క. తురగప్రచారము సు గుం, జరమదముఁ బరస్పరాతిశయచాపగుణ
స్ఫురణము నొదవ నపంకము, నరజస్కము నగుచు మార్గ మప్పు డింపానఁగన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. జల్లులతోడి పెన్బల్లెంబు లెగవైచి పట్టుచుఁ జేరెము ల్వాఱువారు
మెఱుఁగులు చూపుక్రాల మిఱుమిట్లు గొలుపంగఁ జేతికారుల బయల్ప్రమ్మువారు
బెడిదంపుటరిగెలు బిఱబిఱం ద్రిప్పుచు వడిఁ బిల్లమెలమలు వైచువారు
తెగనిండఁ దిగిచి నల్దెసలకుఁ బొట్టెకోలలు చూపి పల్లటీ ల్దాఁటువారు
నొండొరుల కభిముఖులైన నుబ్బువారుఁ, గడలు చాపుచు వేడుక కయ్యమున ను
జెలఁగి తమవారలకు నింపు సలుపువారు, నగుచు వీగఘటులు మించి రతిశయమున.
గీ. మునుపుగా నేఁగి యసిమగొల్లెనలు పన్ని, త్రోవ నెక్కడెక్కడ నేమి కావలసిన
యట్టిభక్ష్యభోజ్యాదుల యమ్మకమునఁ, దనియఁ జేసిరి వణిజులు తవ్వలముల.
చ వలసినచోట నెల్ల నభివాంఛితవస్తుచయంబు గల్గుట
న్నలనలు దాఁకు సాంద్రవరణంబుల నొప్పెడు పల్లకీలఁ బోఁ
గలుగుట నర్థవంతులకుఁ గట్టిన సాన్పుపుసండయాత్ర యిం
పలరఁగఁ జేసెఁ బట్టనమునట్ల యనర్గళభోగహేతువై.
చ. అలఘుబలప్రతాపయుతుఁడై యతఁ డమ్మెయి వచ్చుదండువా 43
ర్తలు వినుచుం దదగ్రదిశరాజులు గొందఱు ముక్తమార్గులై
వలనలుపోవువారుఁ దగువస్తువు లప్పనఁ బంపువారుఁ గే
వలవినయంబుతోఁ గొలుచువారు నునైరి యథోచితస్థితిన్.
వ. అంత. 44
సీ. సలకసౌభాగ్యలక్షణధన్య యైనట్టి మధురలాలసకు సత్యధికపుణ్య 45
విభవకు జగదేకవీరపత్నికి నందె లఖిలదిగ్దేశధరాధిపతుల
పట్టప్రదేవులు ధరియించు మాళిరత్నముల జయింపఁ దన్మాఘప్రతిన
యేతదర్థంబు దండెత్తి తా నిదె యమ్మహారాజు వచ్చె మీయర్థముల ను
ప్రాణముల నిల్పుకొనుఁ డింక రాజులార, యెదురు గాఁ దగ నిష్టంబు లిచ్చియనిపి
యనుచుఁ దనపత్రికలు సత్వదాత్తుఁ డనిపె, నరపతుల కెల్లఁ గొందఱు నడచి రట్ల.
క. ఇత్తెఱఁగునఁ దగఁ గానుక, పుత్తెంచిన నృపులనెల్లఁ బ్రోచుచు సారా
జోత్తముఁడు చని పరాక్రమ, వృత్తిని మత్తిలిన గౌడవిభుపై విడిసెన్.
చ. విడిసిన నల్గి గౌడపృథివీతలనాథుఁడు క్రోధదీప్తుఁడై 47
బెడిదఁపుఁగ్రీలఁ జేర్పఘనసభీషణసేనలతోఁ బురంబుఁ దా
వెడలి పరాక్రమించెఁ దనవిక్రమసంపద కోహటించి న
ల్గడల నరాతిసైనికనికాయము బిట్టు గలంగి పాఱఁగన్.
48

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అట్టిసమయంబునఁ గళాపూర్ణుండు. 49

క. తనదు గుడారము దాఁకను, గనుకని తలఁగఁబడి వచ్చుఘనసజసేనం
గనుఁగొని యీఁడకుఁ డోడకుఁ, డనుచుం గాఁడవిభుఁ డనికి నతిమెనె యనుచున్.

క. తానుకలు గొనుచు నిటఁ బోడ, గానఁగ వచ్చునొ యటంచుఁ గడుఁ దెగఁ దనపై
సేనిం దాఁకం గటకట, యీనెటి వనటున్న సడఁతు నిప్పుడ యనుచున్. 51

వ. పరిసరవర్తులం గనుంగొని. 52

శా. తేజం బల్లనకట్టి కూడఁగ వెసం డం డంచు మత్సేసల
గ్రాజోత్కండి కలంచి పోఁగలఁడె తాఁ బ్రాణంబుతో నంచు మ
త్తేజఃపాథి గణింపఁ డెట్లనుచు నేదీయఃకృపాణం బతి
భ్రాజిష్ణుద్యుతిగా నొఱం దిగుచుచుం బ్రస్ఫీతసంరంభుఁ డై. 53

వ. పటభవనంబు వెలువడి పగఱ కభిముఖుంబుగాఁ జనుచుండ. 54

ఉ. సాహిణి యంతఁగూడ రథసంబునఁ దెచ్చె సమిద్ధయుద్ధస
న్నాహముఁ జిత్రసత్వజవసత్వకృతార్యమఘోటకప్రభా
వోహము రోషభీషణవిపోషితహేషితభీషితాహిత
వ్యూహము భూరిభూషణసముజ్జ్వలదేహము నొక్కవాహమున్. 55

ఉ. తెచ్చిన నెక్కె నవ్వసుమతీధవుఁ డాతనివున్కి చూచి యా
ద్యచ్చతురంగవాహినులు దాఁకఁ దదీయబలాధినాయకుల్
హెచ్చిన శౌర్యసాహససమృద్ధుల నొండొరు మీఱి తేఁకి
న్నెచ్చొనరించుచు న్వడి నమిత్రబలంబులఁ దాఁకి రంతటన్. 56

ఉ. అత్తఱిఁ దద్బలం బరిబలౌఘముల న్నడుమాడి వైచెను
వ్వెత్తుగఁ జుట్టుముట్టుకొని యీఁటెల డొంకెనలం గటార్ల బ
ల్లత్తుల నత్తలంబుల ను గైదువు పక్కెర జోడు కాలు గే
ల్గుత్తుక డొక్క ప్రక్కచెవి కొమ్మని యేర్పడకుండునట్లుగన్. 57

ఉ. ఈడితశక్తి నంగజగతీశ్వరుసైనికు లట్ల చెండుచెం
డాడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగి యు
ల్లోడఁ దెఁ బాఱఁజొచ్చుటయు మీఁక నుగాడఘరాతలేశ్వరుం
డోడకుఁ డోడకుం డని పటూక్తులచే నిజసేననిల్పుచున్. 58

వ కదు వడిమీఱఁ దాఁ దోలుతఁ గా రథము న్నడిపించి ఘోరవుం
ఖంఖుపులువోసి తూపు లరిబృంసముపైఁ బరఁగించె నాతనిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గడచి తదీయసేనలు న గ్రమ్మై నరాతులమీఁద సాహసం
బడరఁగఁ జేపచేర్దిగిచినట్లు సమస్తము నొక్కమొత్తమై 59

క. ఆకతనపుఁగోల్తలకుం, గాక కలంగఁ బడి నాల్గుగడలకు విచ్చెం
జీకాకుపడుచు నంగమ, హీకాంతునిసేన లెల్ల నెంత యు భీతిన్. 60

ఉ. ఆకరణి న్గలంగి చనునట్టిబలంబు ను హాసభాసురా
లోకములం గనుంగొనుచు లోకజనస్తుతుఁ డంగభర్త యు
గ్రాకృతితో విపక్షనిచయంబుపయిం గదలించె నశ్వముక్
భీకరలీల వాలు జళిపించుచుఁ గెంపువహించుచూడ్కితోన్. 61

చ. హయము నదల్చి థేయనుచు నాజికిఁ దోలుట యొండు దోఁచె న
వ్యయరయశక్తి నంత మఱి పచ్చినత్రోవ యాఁ బోయినట్టిత్రో
వ యు నొకటం గనంబడవ వాడలు వాడలు గా నతం డసి
క్రియలను జక్కఁజేసిన హాదిద్విరదాదులచేతఁ దక్కఁగన్. 62

ఉ. ఇక్కరణిం గడంగి యతఁ డెంత యు మిక్కిలి నక్కజంబుగా
నుక్కనఁ జక్కసేయఁ గడు నోటమి మోహత శేషసైన్యము
ల్గిక్కన విచ్చె వీఁపు వెనుక న్మఱుమానిసి లేక యన్నఁగాఁ
జిక్కిన మేఁకవోలె వగఁజెంది నిజాధిపుఁ డొంటిఁ జిక్కఁగన్. 63

శా. ఆచందంబున నొంటిఁజిక్కిన నిజక్ష్మాధీశు వీక్షించి యా
త్రాభంగుం డనువండనాయకుఁడు మాద్యద్ఘోటకారోహశి
క్షాచాతుర్యధురంధరుం డగుచు ఖడ్గాఖడ్గి సంగ్రామవి
ద్యాచార్యుం డని ప్రస్తుతు ల్గనినవాఁ డత్యంత శౌర్యంబునన్. 64

క. తురగారోహణము న భీ, కరతరఖడ్గంబు నొప్పఁగాఁ దిరిగి నిజే
శ్వరునకు నడ్డం బై ని, ర్భరరథసముతోడ నంగపతి కెదిరించెన్. 65

సీ. వ్రేటున కను వైనరీతి మైఁ దమవాగె చన్న వెంబడిగ నశ్వములు మెలఁగ
నొండొంటిఁ గొట్టుచో ఖండాలు ఖంగుఖంగునఁ దాఁకి మినుమిణుఁగురులు గ్రక్క
నొకచోటు చూపి వేఱొకచోటు వడి వ్రేయు పూవు లెచ్చరికలఁ బొల్లవోవ
నెక్కువ తక్కువ లెందు నించుక యుఁ గల్గక నేర్పుఁ బోక లీలన తనర్ప
వసురణకౌతుకావలస్వర్గయువతి, జనకటాక్షనిరీక్షానుసరణవశత
నిర్ధరాశ్లేయకద్యుత్తు లినుమడింపఁ, బోరి రప్పుడు వార లద్భుతముగాఁగ. 66

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆమేడ యాత్రాభంగుని, యాయుద్ధముఁ జూచి మెత్తమై గౌడమహీ-
నాథుకుదండప విజయా, శాయత్తతఁ దిరుగఁజేరె నతనిబలంబుల్. 67

సీ. అమ్మహాయుద్ధంబు నట్లు ఘోరతఁ బ్రవర్తిలఁ గళాపూర్ణుండు తీవ్రగతిని
గడుచిత్రహస్తలాఘవముఁ జూపుచును దత్త్వాఢి లోపల నాత్మరక్షయందు
నించుకేమఱుట దోఁపించి వ్రేటున కొన యిచ్చిన వేయ వాఁ డెత్తినట్టి
బలుకేలు నారౌతు పల్లంబు నశ్వంబు నెనిమిది తునుక లై యిలఁ బడంగ
వ్రేసె నేటవాలుగ నొక్కవ్రేటుననగ, భీరరయమున నసిధారఁ బెడమరల్చి
కలన వేటాఱుతునియలు గాఁగ వ్రేయు, బిరుదురౌతుల వార్తలు బెండుపడఁగ. 68

వ. అప్పుడాకాశంబుననుండి విలోకించు నాకలోకనివాసు లాకళాపూర్ణుని భుజశక్తి
శౌర్యసాహస హస్తలాఘవంబులకు నద్భుతంబు నొందుచుఁ దమలోన. 69

ఉ. వ్రేటున కెత్తినట్టి ప్రతివీరునికత్తికి నొడ్డుకొంట యొ
చ్చేటను గల్గినట్టిది యశోధనుఁ డీఘనుఁ డివ్విచిత్రదోః
పాటవమెంతినమ్మినొకొ వైరినిజాయుధ మెత్తి వేసెఁ దా
వ్రేటు నాల్గుతున్కలుగ వ్రేయుచలంబు ఫలంబు నొందఁగన్. 70

వ. అని కొనియాడి రట్టి సమయంబున. 71

క. సంగరకేళిఁ నతండీ, భంగిని విహరింప గౌడపతి సేన యుఁ దా
నుండలఁగి పాఱె రేఁగులఁ, దంగేళ్లుగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయు భీతిన్. 72

వ. ఇవ్విధంబునఁ బలాయనంబు నొంది యతఁడు నిజపట్టణంబు సొచ్చెఁ గళాపూర్ణుం
డు ను బ్రచండతరసింహనాదబంధురజయదుందుభిధణంధణఘోషణభీషణం బగుసే
న యుం దాను ను నతని వెనుకొనిచని యతిరయంబునఁ బురంబునఁ జొరనుఱుపణించి
నఁ దద్రక్షకులు తమకపడుచు గవనులు మూయించి దంచనంబులఁ బిరంగులు జబురు
జంగులుఁ దుపాకులు మొదలైన సాధనంబుల ముమ్మరముతోఁ గ్రమ్మికొని కొమ్మకొ
మ్మకుఁ బెక్కండ్రుగా నుక్కుమిగిలి లెక్కకుమిక్కు డగుచు విక్రమాటోపంబునఁ
గోట బలసికొనుటయుఁ గటనటద్భ్రుకుటీవికటితముఖుండగుచు సత్వదాత్ముండను. కళా
పూర్ణుని ప్రెగ్గడ దమమొగ్గరంబు నగ్గలికమెఱయ లగ్గలకు డగ్గఱించినఁ దదుగ్రత
కుం గాక చీకాకుపడుప్రజలగజిబిజి లాలించుచు గౌడపతి వివిధోపాయనపురస్స
రంబుగాఁ బురంబు వెడలి యాకళాపూర్ణమహారాజుఁ గని కొలిచి యతనిదయ వడ
సె నివ్విధంబున దుర్వారదోర్వీర్యభవగర్వంబున ..నాయుఁ దీవల్లభుండు నవ్వల నడ
చి గడుసుఁదనంబునం దనకు మోఁడొడ్డిన యొడ్డినిపై బలంబుల విడియించె నప్పుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. చతురంగబలోన్నతిసం, భృతగర్వత నెదురుపోఁజూఁ జెట్టైనతండు
ద్ధతవీరరసావిర్భూ, ర్జిత మగురణ మప్పు డుభయసేనల కయ్యెన్. 73

వ. అంత. 74

ఉ. దుమ్మునఁ గొంతసేపు నది దుర్దమరక్తముచే నడంగ ద
ర్పమ్మునఁ గొంతసేపు నది పంబినపేరలతం గలంగఁ గ్రో
ధమ్మునఁ గొంతసేపు నదితద్విషయారివాలిం దొలంగ గ
ర్వమ్మునఁ గొంతపేపు వసువాసి గణింపఁగఁ బోరి నమ్మెనల్. 75

ఉ. అట్టియెడ న్సమగ్రబలుఁ డంగవిభుండు చరన్మహాద్రినాఁ
బట్టగుచుం గడు న్మెఱయు పట్టపుటేనుఁగు నెక్కి మిక్కిలి
న్బెట్టిదపుం బ్రగడంకఁ గరిబృందములో బలనాయకు ల్దనుం
జుట్టు నుగొల్వ 'రాఁ'దనుచు న్నడిచెం బ్రతిపక్షసేనపై. 76

ఉ. అప్పు డెదిర్చి యుత్కలధరాధిపునాజ్ఞను దగ్గజేంద్రము
ల్చెప్ప నశక్య మైన మదజృంభణలీల దలిర్పఁ బోరనే
ర్పొప్పఁగ శాత్రవద్విరద యూధములోడ ను జూడ మెట్టిదో
చెప్పను నిట్టి బెట్టిదపు టేనుఁగుపో రని మెచ్చఁ జూపరుల్. 77

సీ. ఎడనెడ వడిఁ గూడి సుడిరీతిఁ దిరుగుచుఁ దలపడి దర్పంబుఁ దెలుపునవి యు
వెనువెన్క కొక్కింతచని యొక్కటొక్కటి దంతము ల్భేదిల్లఁ దాఁకునవి యుఁ
జెడవాయునీక బల్విడి నంటఁగదుముచు నట్టెట్టు వడిఁ ద్రోపులాడునవి యు
మావంతు లన్యోన్యమథితు లై కూలినఁ బూఁపుతప్పక యుల్కఁ బోరునవి యు
నగుచునవు డగ్గజేంద్రంబు లతిశయిల్లె, దంతఘట్టన నిష్ఠురధ్వానముల ను
జటులఘంటాఘణంఘణశబ్దముల ను, గతినంఘీంకారముల ను దిక్తటములదర. 78

క. ఆవేళ వంగవిభుదం, దావళముసువడిని దిరిగి తాఁకినఁ బ్రతిదం
తావళము లెల్లఁ బెలికిల, మావంతులు గ్రిందుగాఁగ మహిపైఁ ద్రెళ్లెన్. 79

వ. అప్పుడు నిజగజేంద్రంబు వత్తైఁ ఆపెఁ జెలపి నుతిపించు క్రముకకంఠోత్తరపురాధీశుని యాటోపవిజృంభణంబునఁ గలంగఁబడు నిజసైన్యంబు వారించుచు ఘోరాకారంబైన వారణంబు నారోహణంబు చేసి యుత్కలాధీశ్వరుం డక్కడిందివీరుని మార్కొని యక్కజంబైన విక్రమంబు నెఱపె నట్టి సమయంబున. 80

మ. ఘనవృత్తి న్జవనత్వముల్మెఱపుచు న్సవ్యాపసవ్యక్రమ
భ్రమణంబొప్పఁ దటాలునం దలఁపకు న్బల్షాల షండాప్రపకాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డము లొండొంటిఁ బెనంగి ఘీంకృతిమహానాదంబు రోదోంతరా
ళము ఘూర్ణిల్లఁగఁ జేయు నమ్మదకరు లసంరంభఘోరంబు లై. 81

వ. ఇత్తెఱంగున నత్యంతఘోరంబుగా నవ్వారణంబు లవారణీయసారంబు లై పోరు
చుండ నంతటఁ గళాపూర్ణుండు. 82

క. ఎడనెడఁ దడఁబడుచో నడఁ, గుడియెడమలఁ దిరుగు నేనుఁగుల పిఱుఁదులు నే
ర్పడునట్టి క్షణములోనన, పెడమరలి విపక్షు వెనుక బిట్టుతికె నెసఁగన్. 83

క. ఉఱుకుచు నె కఠినముష్టి, న్నెన్నతిచెడ నడివీఁపు వొడిచి నిజభుజముల నే
డ్తెఱ మెఱయ వానిసంధులు, బిఱుసున వెడుకఁగఁ గుదించి పెఱికె ల్వ్రేటన్. 84

క. వెండియు నట్టిటుఁ గదలక, యుండ నతం డతులబలరయోద్ధతి మహనీ
యుం డగుచు వానిఁ దద్వే, దండమునడికట్టుత్రాళ్లఁ దగ బంధించెన్. 85

ఉ. ఎంతయు విక్రమంబలర నిట్లు కవీరునిఁ గట్టివైచి తా
నంతట వాని వానిమదహస్తిని జెంగున దాఁటి మిక్కిలి
న్వింతగ నంతరాళమున నెవ్వడిఁ గ్రమ్మఱి వ్రాలె నప్పుడా
దంతి నెదిర్చి పాఱు తనదంతిపయి న్రణసమ్ముఖంబుగన్. 86

గీ. అంత నొక పంట్రకోలచే నహితుకరిని, వితిగిపాఱఁగఁ బొడిచి పోవిడక మగిడి
త్రిప్పుకొని తెచ్చె తత్కుంభదేశపార్శ్వ, ములు చుఱుకుముట్ట సేయుచుఁ జలము లుబుక.

ఉ. ప్రాణముతోడ నక్కళనృపాలకు నిమ్మెయిఁ బట్టి తెచ్చి సం
ప్రీణునిఁ జేసి తావిడిచె నెన్నఁడు నిట్లసమానయుద్ధపా
రీణులతోడ నింక నెదిరింపకుమీ యని బుద్ధి చెప్పి క
ల్యాణగుణాఢ్యుఁ డంగవసుధాధిపుఁ డీప్సితరత్నహారి యై. 88

వ. ఇవ్విధంబున నిరర్గళవిజయస్ఫురణంబున భాసిల్లు నాసుముఖాసత్తినందనుండు తనకు
నంతటఁ గళిందద్రవిళచోళపాండ్యాదిభూపతులు తమయంత నే వశవర్తు లగుచు
నానావిధోపాయనంబులతోడ నెదుర్కొనుచు ననుప దక్షిణసముద్రతీరంబునకుం
జని కేరళమహీపాలునిమీఁద విడిసిన నతండు. 89

క. శూరత పాటించి చమూ, వారంబులఁ దాను నతనివడి మార్కొనియెన్.
భేరీభూరిధ్వానము, హోరథటిజితాబ్ధిఘుమఘుమారవుఁ డగుచున్. 90

ఉ. అత్తఱి రెండుసేనలు రయంబునఁ దారసిలెం గడంక నై
యుత్తరదక్షిణార్ణవము లొండొకట న్వడిఁ దాఁకెనో యన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దత్తగళత్ప్రదీప్తతఁ దనర్చు నవేంధనవహ్నియో యన
న్నెత్తుఱు వోల్పె నంత మును నింగికిఁ బర్వఁగ ధూళిధూమముల్. 91

వ. అయ్యెడ నపుడు. 92

లయవిభాతి.

తనకునకలాయుధములు న బసినిచేతఁ దునిసినను బోటివోని మగతనము గడుఁ బ్రాపై
తనర నది వేడ్క నహితునకు నెదురేఁగి నిజతనువుళరము ల్వైచికొనుచు బలమూర్ఛ
న్మునుఁగుచుఁ దదీయమగుతనువు ప్రథమంబుగ నుతునఁ బొడుచుఁ బరవశునిఁగ నితఁ డుభయభాగం
బునకుఁ దమకించు సురవనితలకుఁ బల్వురకు ఘనపదము నొందునొక పెనుజగడమయ్యెన్

లయవిభాతి.

సరభసశరవృష్టి కెదురరుగుటకు విఘ్నమని యరసి తన బెట్టిదపుటరిగె ఘనశౌర్య
స్థిరతనటు వైచి సెలబినుము గఁడొక్క రుఁడు సరభసగతిస్ఫురణఁ బఱుదు సమ్ముఁ బోఁగా
నుకమున నిమగ్నముగఁ బరఁగిన పరాయుధము చరమశిఖిపింఛమువ సరనియమలంఘి
త్వరిత పరిరంభవిధిగరిమ నరపినను సురతరుణివవభిన్నకచభర మనఁగ నొప్పెన్.

లయవిభాతి.

పటియుఁ గరిహస్తమును బిఱికిటని క్రిందిటికి నణఁచి యది మెట్టుకొని వడిఁ జివఁచివ్రసెం
డనుగ లెదు రెక్క యొక బెడిద పుభటుండు తనయెడపు చెయికుంభతటినిడితదుపరిస్థం
బోపుచును బోటువడి కనుఁ దలఁకె నాత్మఁ గరమిడెనదికుచస్థలిని గడుగడిసి వేల్పుం
బడఁతిగనుపట్టగనుఁ జడిసియిపుడే నెచటుఁ బొడిచితినొ దీనిఁ గొడిఁ బడ ననుచు లజ్జన్

సీ. మావంతు గర్వంపుమాటఁ గోపించి తన్మదహస్తి కొక్కరౌ తెదురు నిలిచి
సమకట్టు జల్లుల నమర నిజోత్తమాశ్వము న ధేయన నది చమరమృగముఁ
గినిసి కరంబు పైకిని దాఁటుకొనియెనుగతిఁ జౌకళింప నాక్షణమునందు
నతఁడు వైచిన ఘనాయతశూల మహితుమూర్ధము గాఁడి దంతివక్షమున వెడలె
నాతఁ డెదుకొడ్డినట్టి శూలాయుధమున, వారియురము గాఁడి యారౌతుశిరము పైకి
వెడలె నాశస్త్రకీలితద్విపతురంగ, వీరతనువుల కొంతర వెలఁగొనర్చె. 96

వ. ఇత్తెఱంగున నత్యంతశౌర్యసాహసంబున జనంబులు సరకుగొనక యిరువాగు ను
ఘోరంబుగాఁ బోరుచుండఁ గేరళభూరమణుండు కళాపూర్ణుకడకు రాయబారం
బనిచి యీవృథాబలక్షయంబువలన నయ్యెడు ఫలంబేది మనమిద్దఱము నుద్దించుకొని
కటారుల నెక్కటికయ్యంబు గావించుచు శౌర్యంబులఁ గొలంది సెలవుద మని చె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్పించిన నాతం డట్లకా నిమ్మని యియ్యకొనియె నంత నభయబలంబులఁబోరు
వారించి. 97

ఉ. భూరిధృతి న్నృసింహజలపోఁతకటార్లఁ గొల్లఁ బూని య
ద్వీరవరుల్ మిథోవితతభీరరసోగ్రకటాక్షభాగం
భీరతఁ బల్లటీల్గొనుచుఁ బేరెముదాఁటుచు నింతినంత నుం
జేయుచు నంది చాఁపులను జిమ్ము కటార్లటు పాఱఁ దట్టుచున్. 98

చ. ప్రిదులని శౌర్యసంపదలఁ బెట్టినవండలు డిప్పకే కడుం
గదుముచు హుంకరించుచు నుగ్రైదువుఁ జూపుచు నట్ల యిట్ల యం
చదియిచె యంచుఁ దప్పుకొనుచుంచుఁ దగుచ్చలి యుంచు నెందుఁ గ
న్పవటుట లేక యైమపదనేయక పోరిరి పేరువాఱుమన్. 99

చ. బియముకటారికాండ్రు పరభీకరసత్త్వులు వార లిద్దఱుం
బెరుసుఁదనంబుఁ నేర్పు నెఱబంటుఁదనంబు నొకళ్లొకళ్లకు
న్సరి యగుచున్కి గొర్చుకొన సంధులు రోషకటాక్షవీక్షణ
స్ఫురణ కటార్ల పైవడరెఁ జూపఱు లోహిత శంక నొందఁగన్. 100

క. ఒకని నొకించుక యును సోఁ, కక యుండెఁ గటారి మొనలు కడు బెట్టు వడి
న్నొకబికలుగఁ బోట్లాడుచు, వికసిల్లెదు నాకడిండివీరులతుందుర్. 101

క. అంతఁ గళాపూర్ణుఁడు గడు, వింతగ నతిచిత్రహస్త వేగత పరభూ
కాంతుఁ దడఁబఱచి పొడిచె నొ, కింత చొరఁ గటారిమొన ననేకస్థలముల్. 102

వ. అప్పుడు తత్ప్రతివీరుండు. 103

క. ఆనేర్పునకు ను జంపం, గానొల్ల మికిని మనంబు గడు వెఱఁగుపడ
న్నా నతనిపాదయుగళికి, నానతుఁ డయ్యెను గటారి యటు వైచి వెసన్. 104

వ. ఇట్లానతుం డై కరకమలంబులు మొగిడ్చి యోమహానుభావా నీవు రాజమాత్రుండ
వే దివ్యపురుషుండవు గాక యేవాంధ్రదేశంబుననుండి వచ్చినయొక్క యత్యంతచా
తురీధురంధరుం డైనకటారిసాధనకానివలన ననేకకాలం బభ్యసించి పేరుగలబిరుదు
మూస్టీలఁ బెక్కండ్ర జయించి యెక్కడ ను నొక్కవోని మానవంబున ననూన గ
ర్వుండ నగుచునికిం జేసి నిన్ను నిట్టిపోరునకుం బిలిచితి వ న్నిట్లు పరిభవించుట య
త్యద్భుతంబు గాదె యని కొనియాడి యమ్మధురలాలసారమణు సపరివారంబుగా ని
జపురంబునకుఁ బ్రార్థించి తోడుకొనిపోయి మహోపచారంబులం బూజించి యతి
నికభిమతంబు లై వరిసదుస్పద్వాంతకాంతలశిరోరత్నంబులు సమర్పించి ప్రణయపూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్వకంబుగా ననిపె నప్పు డంగాధిపతి యతనివలన మృగేంద్రవాహనానిలయం బున్న చోటు విని యచ్చటి కరిగి యమ్మహాదేవిని సేవించి తద్భవనవలభు లరసి తనపూర్వజన్మంపువీణియుఁ గని పుచ్చుకొని యత్యంతసంతుష్టుం డగుచు నంత నుత్తరాభిముఖంబుగా యాత్ర గావించె. 106

గీ. అప్పు డామట్టుపట్ల ధరాధిపతులు, తనకు నిష్టంబు లైనరత్నముల నిచ్చి
కొలిచి యనుప సాధూపతి గూర్జరేశు, పై నడచె వానిశౌర్యదర్పంబు విసుచు.

క. అతఁడు న దద్వార్తలు విని, యతిభీకర మైనయట్టి యాత్మధ్వజినీ
తతితోడ వచ్చి తాఁకెం, బ్రతివీరుని దిశలు ధూళిపటలము గ్రమ్మంగన్. 107

ఉత్సాహ. అప్పలంటు లొక్కటొకటి నెట్టు గవియ సొప్పు లా
గుబ్బగాఁగ నడరె వాద్యఘోషభీషణంబుగా
నిబ్బరంపుటార్భటిని జనించె నంత నెల్లచో
డబ్బ డుబ్బ ఖంగు ఖింగు ఠంగు ఠింగు మన్ధ్వనుల్. 108

వ. అప్పు డుప్పతిల్లు ధూమంబుచొప్పు నుత్పాదించుచు రోదోంతరాళంబు నాచ్ఛాదించు ధరాపరాగంబువలన ను ధింధింకృతం బైనయుభయబలంబులు దమతమయేలికలబియదు లుగ్గడించుటలకతన నాత్మపరసైనికవివేకంబులో కానాకభంగిని సంఘట్టిల్లం బోరుచో ఖంగుఖంగున నొండొంటిఁ దాఁకుచుఁ దడఁబడు వెడిదంపుటడిదంబుల వెడలుమిడుఁగుఱులవలన ను సాటోపంబు లైనయీఁటెపోటుచేత గాటంపుఁ జెల్లున జిల్లుచిల్లున వెళ్లు నుల్కాలజ్వాలామాలికల నాభీలంబు లగుధారాళరక్తపూరోద్గమంబులవలన నుభయసేనానాయకప్రతాపప్రాదుర్భావనిర్భరార్భటీశంక లంకురింప బిరుదకాహళశంఖభేరీపటహరటితపటిమంబు ను బ్రతిభటార్భటపటుత్వవిఘట్టనసమయసముదితరసర్వరవిస్ఫురద్వరసింహనాదంబులు ను మదచండిమోద్దండవేదండమండలాఖండఘీంకారఘోషంబులు ను భీషణహయహేషితంబులు ను నఖర్వపూర్వనిర్వరామటంకారనిస్వనంబులు ను వికస్వరస్యందనబృందనేమిశబ్దంబులు ను నంబరంబున గుల్ప నం దుండ జడిసి పుడమికి డిగిన నిబిడంపుజలదసముదయంబులపగిదిఁ జొదలు మదగజంబులమదధారావర్షంబులకుఁ దగినయందంబున నింద్రగోపబృందసందేహకందళనికరంబు లగుచు మాంసశకలంబులు గానిపింప నంతకంతకు నెంత యు నధికంబు లగుక్రోధంబులతోడ యోధవీరులు చేరి ఘోరాసిధారలఁ జక్కాడఁ జివఁ గఱుకఁ నం [illegible]ట్టు మిట్టించి పడుధవళోష్ణీషభూషితమస్తకస్తోమంబులభంగులు నంగ్రామరంగాంబరీషాభీలకాలరాత్రిభర్జనసముజ్జ్వలనశకలంబు నఁ బగ్గిల్ల సుర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థలంబులు నఱకు కఱకుటలుఁగులకతన వెనుకకొరగు నెఱమేటిబలుమగల ప్రక్షేపక్ష ణాకృష్టనిష్ఠురధనుర్వలయ నిష్ఠ్యూతంబులగు శరవ్రాతంబులు వెడవెడనార్చు పగఱ మొగములఁ బ్రవేశించి పెడతల వెడలుచు సముత్కటతాత్కాలికరోషాధిక్యకర్క శామందసందష్టపుంఖమూలంబులై చిక్కి యుఁ జిక్కువడక యక్కజప్రజవభరం బున శరంబులతోడం బెకలించుకొని యెగయ విగళితచికురంబు లగుశిరంబులు గగ నంపుఁజప్పరంబునకుఁ జల్లులుపుల్లారవిందంబులుఁ బూవుదండలునై యొకవిచిత్రపుసొం పు సంపాదించు మృత్యుదేవతామహోత్సాహ సన్నాహంబుఁ దలఁపింప నకంపితశౌ ర్యసాహససముద్భటు లగుభటులు ను దెసలం బొదివి కదననిపుణత నెఱప నిలువునన యుసువులువిడిచి నిరంతరనిర్ఘాతశాతశక్తితోమరప్రముఖశస్త్రచరమభాగాలంకరణచా రుపింఛమాల్యాదివిలసితంబులై యధోభాగంబులఁ గెంబట్టుపఱపు మెఱుపు నెఱపు పలపంకిలరుధిరప్రవాహంబులతోడ వీరపురుషసంభోగవిలంబాసహరంభాముఖ్యదివిజ కామినులకు నలంకరించి యుపాయితంబు చేసిన చతుస్తంభకుంభనికేతనంబులో యనం గానిపించు నేనుంగులమీఁద శిఖరంబుల చాడ్పునఁ గనకమయకిరీటకవచధారణాధోర ణశరీరంబులు రాజిల్ల విదారితానేకచక్రంబు లగుచు నొకకడ నొత్తిగిల్లినఁ బ్రదల్లినయర దంబులయితరచక్రంబులు కృష్ణముఖకీలీముఖకృత్తనేమిఘట్టనంబుల బిఱుసున నిఱుసులొ నలఁబిఱిబిఱిం దిరుగుచు నిపతితరథంబులు భూరితరవీరరసావేశంబున వైరివీరవ్రాత పాతనార్థంబు చక్రాయుధంబులు ద్రిప్పెడినో యనుతలంపు సంపాదింపఁ బెంపు మీఱుచు నొప్ప ద్రిప్పుడు వడువునం బఱిఘవిల్లుచు నుండఁ దొండంబులెత్తి తిరుగం డ్లకరణి సుడివడిఁ దిరుగుచు నొండొంటిం దాఁకు కరులపరిసరప్రదేశంబునం దొట్టువ గట్టి పొల్లుతోడి యాఢకికణరాసులుం బోలెఁ గానిపించురుధిరపలలకరంభితాస్తోకకీక నలేశకూటంబుల చేర్పున శూర్పంబుల నేర్పున నేర్పరించుచు సంపతితసప్రాణసా మజవిఘూర్ణమాన కర్ణవ్యాపారంబులు దీపింప సంగ్రామభూమి యుద్దామరౌద్రబీభ త్సభయానకహేతువగుచు నుద్యోతించె నట్టిసమయంబున సుముఖాసత్తిపుత్రుండు.

చ. నరిపడఁ బోరుచుండ నటు సైన్యము నేమి యుం మీఱనీని యా
యరిబలముం గనుంగొనుచు నల్గఁ గనుంగవ కెంపుపూన ని
ష్ఠురగుణటంక్రియానినదశుంభదిషుప్రకరప్రవర్షణో
ద్ధురుఁ డయి తద్బలంబుపయిఁ దోలె రథంబుఁ గడు న్నయంబునన్. 110

ఉ. గూర్జరభూమిపాలుఁడు ను గ్రోధము మీఱఁగ నాన్యపాలు న
త్యూర్జితబాణవృష్టి కడునుగ్రతఁ గప్పుచుఁ దాఁకి తత్పరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్ఫూర్జితసాయకంబుల నిషూదితసూతుఁడు భగ్నకేతుఁడు
న్నిర్జితబాహుశౌర్యుఁడు వినిర్జితధైర్యుఁడు నయ్యెఁ జెచ్చెరన్. 111

గీ. ఇట్టు దలఁకి యతని కిచ్చె నాత్మీయశు, ద్ధాంతకామినీశిరోవతంస
మణు లతండు నతని మన్నించి యవ్వల, నరిగె విజయవార్త లతిశయిల్ల. 112

ఉ. అంతటఁ గానుక ల్గొనుచు నానృపతిం గురుకాదిదేశభూ
కాంతులు వచ్చి కొల్చిరి జగత్పరిరక్ష యొనర్ప రుక్మిణీ
కాంతుఁడు శౌరి చన్న వెనుక న్మఱి దక్షుఁడవీవ యెవ్వరీఁ
డింత యు నొప్ప సద్గుణసమృద్ధుల నీకని సన్నుతించుచున్. 113

సీ. ఆరాజతిలకుఁడు ద్వారకానగరంబు విపధిముంచుట మున్న విన్నవాఁడు
గావున వారి తత్కథలాదరంబున నడుగుచు యదుసింహు నంబుజాక్షుఁ
దనపూర్వజన్మగాంధర్వవిద్యాగురుఁ గనుఁగొనునట్టిభాగ్యంబు తనకు
దొరకమి కాత్మ నుందు ను జాల వగచుచు నాత్మునక్యమునఁ దత్పురాంతికమున
కరిగిదండప్రణామంబు లాచరించి, వసుస మాళవబర్బరధరణిపతుల
పైనడచి భీషణంబైన భండనమున, బహువిధాయుధపటిమచే భంగపఱచె. 114

శా. ఆవార్త ల్దవుదవ్వుల న్వినుచు హూణాదిక్షమానాయకు
ల్వేగ న్వినయంబుతోడ నిజతన్వీమౌళిరత్నాదివా
జావస్త్రవ్రజ మంపినం బనిపె సన్మానంబుచేయ న్హిమ
గ్రావాంతంబుగ నేఁగి తాఁ దిరిగె నారా జంతటం బూర్వగన్. 105

లయగ్రాహి. ఆతని మహాజయవిభూతి పసమించు నవిగేతరణకేళిపటిమాతిశయగర్వ
శ్వేతునకు నాకితఁడువో తగినజోడు వసుధాతలమునందనుచుఁ గౌతుకములోఁ బ్రా
గ్జ్యోతిషపురాధిపుఁ డభీతి నెదురేఁగి ఘనహేతినికురుంబమణికేతనసముద్య
న్నూతనగభస్తిపరిపీతకకుబంతరము లై తనకు దారుణచమూతతులు గొల్వన్. 116

ఉ. వైరిచమూసమూహము లవారణనన్నియు నప్పు డాతని
న్ఘోరతఁ జుట్టుముట్టుకొని కోయన నార్చె ను దోన యద్భుత
స్ఫారతరార్భటిం బిఱుదుసంకులఁ దారలు బూరగొమ్మలున్
భేరులుఁ దమ్మటంబులు ను భీషణవృత్తిని బిట్టుమ్రోయఁగన్. 117

చ. బెడిదఁపుభంగిఁ దధ్వనుల పెంపు నడంచుచు నంత నెంత యు
న్వడిఁ దనరారె నంగజనసాంఘుగుణక్వణనంబు దానిఁ దా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముడసులు గ్రొక్కుచు న్విశిఖమండలి పెన్కొనితూఁ స్థరంబు బ
ల్విడిని సమస్తదిగ్నృపులపేరుల మేనుల నుక్కు దక్కఁగన్. 118

గీ. అతనివింట వెడలు నమ్ముల వేగవై, చిత్రి యేమిసెప్పఁ జేవలసిన
మురువుబిరుసుఁగ్రోవిముట్టించిన తెలంగుఁ, జెలువుకట్ట తెగినబిఱుసుఁ దోఁచె. 119

చ. దొనపయిఁ బాయ కెప్పుడు ను దూపు లెడల్పుచు నున్నరీతిఁ దాఁ
జనుమఱ చేర్పునం జెపుడు జాఱక య మ్మరిఁబోసియున్నచా
డ్పున శ్రవణాంతసీమ నెపుడు న్వలయాకృతిచాపమైన కిం
జినిగతిఁ దోఁచెఁ దక్కరము చిత్రరయంబునఁ బెక్కురూపులై. 120

వ. ఇత్తెఱంగున నప్పార్థివోత్తముం డత్యంతచిత్రం బైన ధనుర్విద్య నేర్పు నిర్వహించిన నుదంచితంబు లైన బాణపరంపరలచేత నరాతిసైన్యంబులందుఁ జిందఱవందఱలగు నరదంబులు ను జినిఁగినకేతువులు ను జీకాకుపడు రథికులును జడిసిన సారథులు ను ద్రుంగిన యేనుంగులు ను దునిసిపడిన మావంతులును దుర్త్తము లైనతుంభశంబులు ను దునుక లైనపరిస్తోమంబులు ను బొలిసిన యశ్వంబులు ను బొరలెడి రౌతులు ను బొడ వడంగిన పల్లంబులుఁ బొడి పొడి యైన పక్కెరలు ను నుఱుము లైన పదాతు లు ను నులిసిన కంకటంబు లును నుసి యైనకైదువులు ను నుగ్గునూచం బైన యరిగెలు ను దెగిపడిన యాభరణంబులు ను దెరలి పాఱు రక్తంబులు ను దెట్టువలు గొన్న మాంసంబులు ను దెట్టులు గట్టిన యస్థిశకలంబులు ను జూపఱకు నద్భుతభయానకబీభత్సరసంబు లావహిల్లఁ జేసి నవ్విధంబున నమ్మణిస్తంభ నందనుని యమందవిక్రమంబున నుక్కుదక్కి రిపుసేనాంగంబుల భంగిం గనుంగొని యతనిబలంబులు జయోత్సాహదుర్వారంబు లై యురువడించె నయ్యెడం గలంగి పాఱు నిజబలంబుల నిలువరించుచుఁ బ్రాగ్జ్యోతిషాధ్యక్షుండు రోషకషాయితాక్షుం డగుచు నక్షయం బైనతనవిక్రమోత్సేకంబునఁ బరానీకంబులు కాందిశీకంబు లై చీకాకుపడ భీకరంబునం దనరథంబు కళాపూర్ణునిదిక్కు నంబఱపించిన నతని దలకడచి తత్ప్రియసఖుండు చండబాహుం డనువాఁడు వాఁడిమిగిలి యాయంగపతిలోడఁ దలపడియె నపు డయ్యిద్దఱకుఁ దద్ద యుం బ్రొద్దు మహాయుద్ధంబు ప్రవర్తిల్లెనంత.

గీ. వారలతిచిత్రకరలాఘవంబు పేర్మిఁ, బేర్చి యొండొరులపయి నేసెఁ బింజపింజఁ
గలుచుకొనిపాఱుతూఁపులొక్కటియనోలెఁ, గానిపించుచుఁ దలపించెఁ గడలవారు.

క. అనయముఁ గరలాఘవ మి, ట్లొనరఁగ నేయుచుఁ బరప్రయుక్తము లెల్లం
దునుముచుఁ బోరఁ దదంతర, మునఁ గుప్పలువడియె బాణములశకలంబుల్. 122

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అట్టిసమయంబున మధురలాలసావల్లభుం డెల్లవిధంబులం బ్రద్యుమ్నుండు దనకు నాదరిం
చి తనుపడవుగాఁ జేయుచున్న యావైరివీరు బవరంబునకు వెఱఁగందుచు నతనిగెల్చు
టెట్లాకో యని తలంపు వొడమ ధనుర్ధరుం డైనస్వభావసిద్ధుం దలంచి మనంబునం
దు నమస్కరించి తదనుగ్రహలబ్ధంబు లయిన యమోఘనిజధనుర్బాణంబుల నుద్దేశించి
యేమీ మీకు ను లోకంబులోని శరశరాసనంబులు సరియగుచు నింతసేపు పోరించుట
సహింపవచ్చునే మీమహత్త్వంబుఁ జూపుట కిదియే యవసరంబనుచు వలు మ్మనుచు
నుత్సాహంబున హెచ్చి మిక్కిలి యెక్కుడైన హస్తలాఘవవిశేషంబున. 124

సీ. ఆవిభుఁ డేసెఁ బ్రసూరాస్త్ర మట్టిద యేసె దాని నెన్నైనక నొత్తఁగఁ బరుండు
నదియోర్వ కిమ్మనుజాధినాయకుఁ డాత్మవిశిఖపుంజము నేసె వేఱే యొకటి
వినుతుఁడు తనదుబాణము పింజయేసె నట్టిరువురుఁ బైఁబయి నేయ నేయ
పారిడి సిద్ధబవింబ్లు సోఁకుట కొక్కింత కడమగా శరరాజి నిడుపు సాగఁ
దనవరుస యేటు వెస నేసి ధనువుఁ దునిమి, యంగవిభుఁడంత రిపునియేటడఁచెఁదద్భు
జాంతరముఁజూచిపాఱె నాయంపచాలు, పుంఖముఖమయ్యెఁ జెబల్మిఁ బొంగడందర మె.

క. దానం బ్రాగ్జ్యోతిషధా, త్రీనాథునిసఖుఁడు ధరణిఁ గ్రెబ్లుట యును ద
త్సేనలు చెల్లాచెదరై, నానాదిక్కులకుభయమున న్పసఁ బఱచెన్. 126

వ. అప్రణాచండబాహుపాటువలన నాటోపంబు దప్పి ప్రాగ్జ్యోతిషపతి యంగపతి
శరణుసొచ్చి తన శుద్ధాంతకాంతాశిరోరత్నంబులు కానుక యిచ్చె నంతఁ దద్వార్త
చేతన భీతిల్లి కోసలప్రముఖులు ను మాగధుండును దమయంతన వశవర్తు లగుచు
నస్మణి స్తంభసుతునభిమతార్థంబులం దనిపి యనుగ్రహంబు వడసి రివ్విధంబునం గళా
పూర్ణుండు సకలదిగ్దేశాధీశుల జయించి తత్తత్ప్రియాంగనామాళిమాణిక్యంబుల మధు
రలాలసాచరణమంజీరనిర్మాణంబుకొఱకు సాధించి యెందు ను నెదురులేక యమం
దవిజయానందంబునం దిరిగి వందిమాగధవారంబులు కైవారంబులు సేయ నిజపట్టణం
బుచేర నరుగుదెంచె నప్పుడు. 127

సీ. ఇంక నించుక వసి కింద్లన విశ్రమింతము కూడ రారంపు తడయ కనుచు
నలమిట్టు దాఁటిన ధళధళఁ గాన్పించు మణిపీఠికనకహర్మ్యంబు లనుచుఁ
గంటిరే యల్ల గంగాసరయూసంగమప్రాంతవనరాజి మహిమ లనుచు
సకలదిగ్దేశము ల్చరియింపితిమి గాని యిట్టితోఁటలు గాన మెందు ననుచుఁ
గనుఁగొనుండోలిఁ గాన్పింపఁగాఁ దొడంగె, గోపురములవె యవె పైఁడికోటలనుచుఁ
గ్రమముకకంకోత్తర పురంబుఁ గ్రమ్మఱంగఁ, జూపఁగంటిమి నేఁడు నీసొంపు లనుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ప్రమదమున సంభ్రమించుచుఁ, దమతమవా రెదురుకొనఁగ దత్తస్వస్తి
క్రమవీక్షణముల సభ్య, శ్రమ మంతయు మఱచి వేడ్కఁ జనుచు న్నతి యుక్.

ఉ. తొల్లిఁటి ప్రాఁత పట్టనము ద్రోవలు నల్లవె రోసిపాడుఁ డం
దల్లుని బుష్యశృంగుని కృపాస్థల నింపుల ముంప సంపద
త్యుల్లసితంబు చేసి ప్రియ మొప్పఁగ నిల్పినయట్టి మేస దా
నల్లదె కంటిరే నవనవాకృతి నిప్పుడు నొప్పెడుం గడున్. 130

గీ. పూని కర్ణాత్మజుఁడు కృపసేసెఁ డాత్మ, మాయము దాఁటించినట్టి వాఁగల్లదిగో
నాటి కది యబ్బురముగాని వీటిలోని, నేఁటికిఁ గ్రాడిగఁట్టాలు దాఁటుచుండు. 131

ఉ. హారిసమృద్ధితో నిచటి కామడ నున్నది తూర్పునందుఁ గా
సారపురంబు తద్విభుఁడు సన్నుతశీలుఁడు సత్వదాత్ముఁ డీ
తోరపువీను కౌతుకముతో నొసరించె నతండు నేఁడు భూ
భారధురీణు నీయధిపుఁ బట్టముగట్టెను దా నమాత్యుఁడై. 132

వ. ఇవ్విధంబున మఱియుఁ దత్తత్ప్రదేశవస్తువిశేషదర్శనప్రసంగోచితభాషణంబుల న
విదితాయాసంబు లగు తెరువులు జరగ నరుగుచున్న సకలజనులు నక్కడక్కడం గ
డలకుఁ దొలంగి కనుంగొనుచుండ నద్దండభేరీపటహశంఖకాహళాది నాదంబులు
రోదోంతరంబునం బిక్కటిల్ల మిక్కిలి యెక్కుడైన యక్కజపు వైభవంబున భూ
విభుండు పురంబు ప్రవేశించె నయ్యవసరంబున. 133

ఉ. భేరులు లోనుగాఁ గలగభీరపు వాద్యచయంబు ప్రోఁతలం
దోరపు ప్రౌఢి మించె ను గుతూహలసంభ్రమజృంభమాణరా
మారథసాధిరోహణసమాకులసౌధసమంజువాసమం
జీరఝుళంఝుళధ్వనివిశేషము లెంత ప్రజాసమృద్ధియో. 134

ఉ. ఆవిభుఁ జూచు కాంతలముఖావళి సౌరణగండ్ల శోభిలం
గావిలసిల్లె సౌధము లఖండితదిగ్జయధామచిత్రిత
త్పావనచారుకీర్తికృతతర్జనభీతి సహస్రభావిభ
న్నానవరత్నహేమక మలామరసింధుజలౌఘమో యనన్. 135

గీ. అతనిఁ జూడంగఁ బఱతేర నడరి జాజి, యొకతె కొప్పువిరాజిల్లె నొకరిఁ బట్టఁ
బదుమచుకుర నాజ్ఞఁ జని మెడఁబట్టి ద్రొబ్బి, తెచ్చు రోలంబభటు లనఁ దేజరిలుచు.

ఉ. శోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచి యుల్లన
ద్వేణిభరంబుతో మొగపుఁదీఁగ వఁలగ్నమునం దమర్చి యొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్ఠాణముతోఁ గె గా సిడి పెడ న్వలగొన్నది చాలమిం గొన
ల్పాణులనుండఁ గొను మఱి బాగుగఁ గానుకఁ బెట్టుకైవడిన్. 137

ఉ. గుబ్బెత యొత్తు వచ్చె నృపసుంజుఁ జూడ రతార్త నీవి దా
గొబ్బునఁ గట్టుచుం బయిఁటకొంగది మాన్పఁగఁ బోలెఁ గాళ్ళపైఁ
బ్రబ్బికొనం గుచోద్ధతభరంబునసుం బయికాపువోలెఁ ద
బ్బిబ్బుగఁ జేతికి న్దొంకి పెన్నిటివ త్రి మురోవృతంబుగన్. 138

లయవిభాతి.

జలకమపు డాడి యొక చెలువ ననుఁగావిజిగివలువ వెసఁ గట్టుకొని జిలుఁగుఁరవమాదా
వళపుఁ బడి యొత్తుకచములఁ బెనఁచి దుట్టుకొని కెలనికది కెంజడల మెలిపగిదిఁ దోఁప
న్గలితధృతి యోగినియు బళి నగుచు దెంచె నృపతిలకుని గను-గొనఁగ లలితకుచమధ్య
స్థలిఁ బరళ ముక్తికము లిగిచ్చు సయంబు వెలిఁదొలఁకిపడు సత్వ మన వెలుఁగ నటియింపన్.

ఉ. త్నారమణుం గనుంగొనఁగ గాటపు వేడుకఁ బాలు దెంచె నా
య్యారి యొకర్తు ము న్జలకమాడుచు వైచిన కీలుగంటు దా
సారెకు జంఘలం బెనఁగ నక్కరంబునఁ బాయఁబట్టి శృం
గారరసంపుగిండి గల కాముని యూడిపుఁ గత్తె యో యనన్. 140

గీ. ఇత్తెఱంగున బౌరులకెల్ల నేత్ర, పర్వ మొనరించు రూపవైభవముతోడఁ
గ్రముకకంఠోత్తరమహాపురప్రవేశ, మాచరించి ఘనైశ్వర్య మతిశయిలఁగ. 141

క. శుభతర మైనవిపంచిక, యభినవకాముదికి నొసఁగి యాత్మసదవున
న్విభుఁడు నియమించె రూపా, సభూతిజకు నూపురములనుం జేయింపన్. 142

వ. దానం జేసి యమ్మానవతి యు నానందంబునొందుచు నెందు నత్యపూర్వంబులైన నా
నాభూషణవిశేషంబుల నలంకృతయగు సమయంబునఁ బ్రసంగవశంబునఁ జెలులవల
న నాత్మబాల్యసమయసంప్రాప్తరత్నహారంబుసుద్ది విని ప్రాణవల్లభుని ప్రథమాను
గ్రహవిశేషం బైన యాభరణంబు ధరియించుటకు నభిలాషంబు వొడమ దానిం దె
ప్పించి నిజహృదయస్థలలంబియగుటకుఁ దగునట్లుగా నిడుగడలఁ గొన్ని మణులు నిలిపి
మాలికసూత్రంబునం గ్రుచ్చి ధరియించి తనవిలాసంబు పరిఢవిల్ల సురటిగొని వసునికడ
కరిగి పరిచర్య సేయుచుండె నంత. 143

సీ. ఆయితంబుగఁ జేసినట్టి యందియజోడు సత్వదాత్ముఁడు కరాబ్జమునఁ బూని
యచ్చటికేతెంచి యధిపు కన్యాబ్జమసంజ్ఞ నయ్యింతియగ్రంబునందుఁ బెట్టి
బ్యామినీకొడఁబడ్డ సకలదిగ్దేశభూనాథశుద్ధాంతకాంతాశిరోమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీప్రకల్పితనూపురప్రకాండము లివి యంఘ్రులఁ బూను మా యమ్మ యనుచు
వసుధ సాఁగిలి మ్రొక్కిన వలదు వలదు, మ్రొక్క నాకును వందనార్హుఁడవు నీవు
మేనమామ వెఱుంగవు గాని నేఁటి, దాఁక నిదియంచు నతని శాతరుణి మ్రొక్కె.

క. మ్రొక్కిన నతఁ డుదదందుచు, మిక్కిలి వెనువెన్క కొదిగి మేను వడంక
న్నిక్కంబిది సంకోచము, దక్క మనియె సతి యు శేచితగువినయమునన్. 145

వ. అప్పుడు కళాపూర్ణుండు నవ్వుచు నతనిం జూచి యాచెలువ యన్నట్లు నిజంబు గావ
లయు సంకోచం బేల తత్ప్రకారంబు తెలియనడుగుట గాక యని యి ట్లనియె. 146

గీ. తనదు శైశవమున నీవు తనునడిగిన, నీకులాఖ్యాదు లింతకి నేఁడు దాఁచె
నేమొ మేలయ్యెఁ దెలియుద మిప్పుడడిగి, యనుచు నాపువ్వుఁబోఁడి యాననముఁ జూచి.

ఉ. నీవగు చిన్ననాఁటి యలనిర్మలబోధవిశేష మిప్డు ల
బ్ధోదయ మయ్యెనో తిరుగ నుల్లములోన నితండు నీకు నో
పైదలి మేనమామ యగుపద్ధతి యెట్లది నేఁడు చెప్పఁట
ట్లాదట నాఁ డితం డడుగ నప్పుడు చెప్పమి యెట్లు చెప్పుమా. 148

వ. ఆ శైశవంబున నట్టివిజ్ఞానంబు గలుగుటకుఁ గారణంబు నాఁ డడిగి తెలిసికొనకెమికిఁ
బశ్చాత్తాపంబు నొందుచుండుదు నది యెఱిఁగింపవలయు. 149

క. అన విని యాసతి యంత యు, వినిపించెద వినుఁ డటంచు విభునకు లీలం
దనచేతి సురటి విసరుచు, వినయమధురఫణితి నిట్లు వినిపించెఁ దగన్. 150

సీ. అధిప మున్ని తఁడు మహారాష్ట్రదేశ మేలెడు సుగ్రహుం డనుపుడమిఱేఁడు
మాతల్లి రూపానుభూతి యాతని యువ్వ యితనికులీనత కెల్లనృపులు
కడు వేడ్కపడి తమకన్నెల నిచ్చి సంబంధబంధువులుగాఁ బ్రణతనిష్ఠఁ
బత్రికలంప నంపఁగ నందు నెవ్వరి వాంఛ లీడేర్ప నెన్నరిని విడుతు
నను విచారముతోడ నిట్టట్టు నుడువక, కడపె బహుకాల మది యవగణనగాఁగ
పగచి యొక్కొక్క నెపమున వారు మేరఁ, దప్పి యితనిపైఁ జేసిరి దండయాత్ర.

క. ఈతఁడు దా వెలుపల రై, యే తెఱఁగున నైన వారి యే పడఁచి పరా
భూతులఁ జేయుదు నని ప్ర, ఖ్యాతజవహయాధిరూఢుఁ డై పురి వెడలెన్. 152

గీ. ఇట్లు కడకుఁ దొలఁగు టెఱిఁగి యా రాజులు, తిరిగి యరిగి రాత్మదేశములకు
రాజు లేనియట్టి రాష్ట్రంబు పైఁ జని, జనుము గొనుట యేమిశౌర్య మనుచు. 158

వ. ఇతండు నయ్యహితభూపతులు తిరిగి పోవు టెఱుంగఁడు గావున నతిదూరంబుగాఁ
జని యొక విపినమధ్యంబున నిలిచి యాశత్రువుల నెవ్విధంబున జయింతు నను చింత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొకింతతడవుండి చరితవ్రతానుసారంబున నిట్లని తలపోసి. 154

సీ. మిగులంగ నుట్టుపాటగుటఁ జేసి కలంక నెఱిఁగి యెఱింగింప నెఱుఁగ కిట్లు
శిష్యుండ యేఁగుదెంచితి నసహాయత నేమయ్యెనో పురం బేమయ్యె రా
ప్రజ లేమయ్యెరో విపక్షభూపాలకు లిది యెఱుంగు నుపాయ మేది యొక్కొ
చొప్పు మార్చితిఁ బెక్కుచోట్ల శాత్రవభీతి నావారుఁ గనలేరు నన్ను నరసి
యేను తిరిగి పోయెద నంటి నేని శత్రు, లెచట నెట్లడ్డగింతురో యిదియుఁ దగదు.
ఉన్నచోటనె యుండి తానుల్లమునను, సకలమును గాంచువాఁ డెంత సుకృతియొక్కొ.

క. అట్టి మహత్త్వము గాంచిన, యట్టి బ్రదుకు బ్రదుకు గాక యన్యమహత్త్వం
బెట్టిది యీ నేల జనులకు, నట్టిప్రయాసంబు దానివలనఁ దలంపన్. 156

వ. అని యట్టి సర్వజ్ఞత్వంబు సాధించుటకు దృఢనిశ్చయంబున మహోత్సాహుండై తురగాధిరోహణంబు సేసి వాసుదేవనిత్యసాన్నిధ్యప్రసిద్ధసిద్ధంబైన యమునాతీరంబున కరిగి యందు బృందావనంబున. 157

క. తా నెప్పుడు నతిభక్తిం, బూని కొలుచు బాలకృష్ణుఁ బురుషోత్తము ను
త్తానశయు న్వటపత్రత, లాను న్మది నిలిపి సలిపె నధికతపంబున్. 158

సీ. కొమరొందు మఱ్ఱియాకునఁ బవ్వళించి చూపట్టెడు బాలరూపంబుతోడఁ
బాణియుగ్మంబునఁ బదిలంబుగాఁ బట్టి మొగమున నిడుపదాంబుజముతోడఁ
జరణాంగుళీపానజాతలాలాభిషిక్తంబైన చిన్నిహారంబుతోడఁ
బూని చూడ్కులకు బ్రహ్మానందశైత్యంబు గులుకు నెయ్యపుముద్దుఁ జెలువుతోడ
నతని మనమున నవిరతధ్యానమహిమఁ, దిరముగాఁ బాదుకొన్న యాదేవి రూపు
వెలిఁ బ్రకాశింపఁ జేయుచు విష్ణుదేవుఁ డధికకారుణ్యలీలఁ బ్రత్యక్షమయ్యె. 159

క. ఆతెఱఁగునఁ బ్రత్యక్షం, బై తను నిష్టము నువేఁడుమని హరి పలుకం
బ్రీతివశత నించుకతడ, వీతం డేమియును బలుక నెఱుఁగకయుండెన్. 160

క. పదపడి ప్రబుద్ధుఁడై తత్, పదపద్మంబులకు భక్తిఁ బ్రణమిల్లి తగ
న్నెదుట ముకుళితకరములు, గదియించి వినీతి దనరఁగా నిట్లనియెన్. 161

క. అలఘుశరావందంబునఁ, బలుక నెఱుఁగకున్నవాఁడఁ బరమపురుష నీ
వలన న్సర్వజ్ఞత్వము, గలుగుట నాకోర్కి దానిఁ గరుణింపు నయన్. 162

వ. అని విన్నవించుటయు నద్దేవదేవుండు తన మెడనున్న రత్నహారంబుఁ దిగిచి దీని నాయకరత్నం బెవ్వరిహృదయస్థలంబున నెంతతడవు సోఁకియుండు వారికి నంతతడవును సర్వజ్ఞత్వంబును సకలవాక్పటుత్వంబును గలిగియుండు నని యును బ్రా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ్మాణమనోవ్యథఁ గావించువారియొద్ద నిది యుండ దని యు నానతిచ్చి యిది యతని
చేతి కిచ్చి యంతర్ధానంబు నొందె నితండు నమ్మహనీయహారంబు పడసి వచ్చువాఁ
డప్పనంబులో నొక్క దేవాలయంబునందు. 163

సీ. మెఱుఁగెక్కు బిగువులై మీఱిననవియున ట్లింపొందు గుబ్బపాలిండ్లతోడఁ
గడుఁ గృశత్వంబునఁ బిడికిటిలోపల నడఁగెడు బడుగు సెన్నడుముతోడఁ
జిఱునవ్వు తెలి నిగ్గు చిలుకుచుఁ దనరారు తళుకులేఁజెక్కుటద్దములతోడ
జగతి నెందు ను లేని చక్కఁదనాన సొంపగు చిన్ని ముద్దు నెమ్మొగముతోడఁ
గరము విలసిల్లు సకలాంగకములతోడ, రహిఁదనర్చు నలంకారమహిమతోడ
ద్వారశాఖలపండ నింపారుచున్న, ప్రతిమ నొక్కటిఁ జూచె భూపాలచంద్ర.

క. చూచి మనంబున మెచ్చుచు, నాచేరువ నితఁ డటుండ నంతటిలో భ
వ్యాచారశీలుఁ డచటికి, వాచంయముఁ డొకఁడు మార్గవశమునఁ జేరెన్. 165

గీ. చేత కాషాయవస్త్రంబు చెఱఁగు విసరు, కొనుచు హరిహరి యనుచు నింపున నొకింత
తడవు గూర్చుండఁ దత్సవిధప్రదేశ, మండపంబున నధ్వశ్రమంబు కతన. 166

సీ. ఆయతీశ్వరుఁ డంత నతిరమ్య మైన యామెప్పంపుఁబూఁబోఁడి యొప్పుఁ జూచి
బళిర శిల్పికులేంద్ర బ్రహ్మ ను మీఱి తేపగిదిఁ జేసితిర యీప్రతిమ ననుచుఁ
దనమదిఁ గడు మెచ్చి తల యూఁచుచును నిట్టిపడఁతులు గలరొకో పుడమి ననుచు
నిట్టిది సన్న్యాసి వీక్షింపఁ దగ దని మార్మోము పెట్టుచు మఱి యు మఱి యు
నిచ్చఁ గ్రమ్మఱఁ జూచుచు నేమి చెప్ప, నతనువికృతికి లోనయ్యె ననుచుఁ జెప్పి
కొంతసంకోచమందనాకొమ్మ తెఱఁగుఁ, గనితొలఁగిపోయెనొక సెపంబున ను మంత్రి.

క. జనపతి యు భార్యవదనముఁ, గనుఁగొని యేమయ్యెఁ గడమకథ కౌతుకమం
దనరించుచున్నయది నా, కును వినిపింపంగవలయుఁ గోమలి యనియెన్. 168

చ. అన నిఁక నేమి చెప్పుదు జనాధిప యాయతిముఖ్యుఁ డంత నె
మ్మనమునఁ బట్టలేక ప్రతిమ న్బిగియారఁ గవుఁగిలించె నిం
పొనరఁగ లేచివచ్చి కడు నొక్క మఱుంగున నప్పు స్వగ్రహుం
డునికి యెఱుంగమి న్నగియె నుండఁగలే కితఁడుం గిశాకికెన్. 169

వ. నగుట యు నతం డది విని యు విననిచందంబుఁ గల్పించుకొని తత్ప్రతిమాలింగనం
బొక యసృచ్ఛాచేష్టావిశేషంబుగాఁ గల్పించుటకుఁ దాత్కాలికయుక్తి నద్దేవాల
యంబున వెలసి యుం గలదేవాంగనాదిప్రతిమల నట్ల యాలింగనంబు చేయుచు న
మస్కరించి తత్ప్రదక్షిణంబు సేయుచుండఁగని స్వగ్రహుండును నతని కపటచేష్టలతె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లం గాంచి యి ట్లింత చేసినఁ బూర్వంబు నేఁత నే నెఱుంగుదు ను గదా యని ప
ఱవ ననుచు మఱి యుఁ బరిహసించె దాన నయ్యతి యతివ్యథమానమానసుం డగు
చుఁ గడునలిగి యిడితుదిగా నీమొదలి యెఱుక యెంతగల దంత యు వినిహతం బ
య్యెడు మని శాపం బిచ్చె సుగ్రహుం డతిభయాకులుం డగుచు శాపమోక్షణంబు
దయచేయు మని పాదంబులంబడి లేవకుండె నయ్యతీశ్వరుం డు ను. 170

క. నాయీరహస్యచేష్టిత, మేయెడ నేని యు ను సుబ్బ నేని గలుగు నీ
పోయిన మది గ్రమ్మఱఁగఁ బ, డాయత్తత వెలయు నప్రియము మది లేమిన్. 171

ఆ. అనుచుఁ జనియె నతనియాశాపమహిమచే, నెఱియ సుగ్రహుండు మఱచిపోయె
నాక్షణంబుతుదగ నటు ప్రథమముగ వి, జ్ఞాతమగుప్రపంచజాత మెల్ల. 172

గీ. అట్లు విస్మృతసకలపూర్వాత్మచరితుఁ, డగుట నీతఁ డెఱుంగలేఁ డయ్యెఁ దిరుగఁ
గైకొనంగఁ దదాదిమక్షణమునందె, యొకపుచిస్థలి నడినహారోత్తమము ను. 173

గీ. బ్రాహ్మణవ్యథఁ గావించు పాపమతికి, నిది నిలుపదంచు హరిపల్క మొదల విని యు
నతని వెతఁ బెట్టి కోల్పోయె హార మితఁడు, దైవఘటన యెవ్వారికిఁ దప్ప టరుదు.

క. ధర నెవ్వారలు చేసిన, దురితంబులు నుచ్చరింప దోస మఁట మహా
పురుషుల కొకకొద యొకచోఁ, బొరసిన నది పగటుపాపము వృథా చను నే. 175

ఉ. అంతట దైవసంఘటన నచ్చటువాసి యతండు దివ్యదే
శాంతరము ల్చరించుచు నిజాహ్వాయవంశచరిత్రవిస్మృతిన్
భ్రాంతునిలీల మత్తుగతి బాలునికైవడి నెద్దిగన్న న
త్యంతమునద్భుతం బగుచు నాత్మకుఁ దోఁచుచు నుండ వర్తిలెన్. 176

క. ఆదిమసంకేతగ్రహ, ణాదులు విస్మృతము లగుచు నాఖ్యాగుణజా
త్యాదివ్యవహారజ్ఞత, లేదయ్యె ను నితని కపుడు లేశం బైనన్. 177

చ. వెనుకఁ గ్రమక్రమంబున నవీనము గా నుదయంబు నొందిపెం
పొనరె నృపాల యీతనికి నుత్తమమధ్యమవృద్ధకర్మద
ర్శనమున ద్రవ్యకర్మగుణజాతివిశేషవివేచనంబు శా
లునకు ను బోలె మానసములో నిఖిలవ్యవహారహేతువై. 178

క. తనపులనామాదులు ద, క్క నశేషము నిట్లు వెలసెఁ గాని యతఁడు భూ
జనవర యని యెఱుఁగఁడె యెం, దు ను దజ్ఞులు నేఁటిదాఁక దొరకకయునికిన్.

వ. ఇవ్విధంబునఁ బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూసంగమప్రాంతవనం
బు చేరి వర్తిలుచుండఁ బత్కాలంబునందుఁ గాసారపురం బరాజకం బైన నందుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలమంత్రిప్రముఖరాజపురుషులు ను జారులు ను రాజనిశ్చయార్థులై యుత్తమగజంబు న లంకరించి దానికరంబున నొక్కపుష్పమాలిక యిచ్చి యెవ్వనికంఠంబునం దగుల వైచునతండు మనకు రా జని దైవప్రార్థనాపూర్వకంబుగా నియమంబు చేసికొని దా ని వెంబడి నేతేర నది యేతెంచి తనతొండంబుననున్న పుష్పమాలిక యాసుగ్రహుని మెడవైవ నరాజకత్వదుఃఖదుర్బలు లై యున్న యామంత్రిముఖ్యుల కండజకు నట మున్న యితనిదర్శనమాత్రంబున నొక్కసత్వవిశేషం బుదయించె నయ్యుభయనిమి త్తంబుల నత్యంతసంతుష్టులగుచు నతనిఁ దద్గజారూఢునింగాఁజేసి పురంబునకుం గొని పోయి రాజ్యాధిపత్యంబునకుం బట్టంబుగట్టి తత్స్వరూపమాత్రంబ తమకు మున్న సత్వదాయకం బగుట సంస్మరించి సత్వదాత్ముం డని ప్రశంసించిరి. యితనినామజా త్యాదు లప్పటి కప్రసిద్ధంబు లగుట నదియె వెలుఁగుచు దిక్కులం బ్రఖ్యాతం బయ్యె నట్లు కాసారపురాధీశ్వరుం డై రాజ్యభోగంబు లనుభవించుచు నంతట భవజ్జననీ జనకు లయిన సుముఖాసత్తి మణిస్తంభులఁ దనపురంబున నిలుపుకొని సేవసేయుచుఁ గ్రమంబున నీకు నమాత్యుం డయ్యెఁ దత్ప్రకారంబులు విస్తీర్ణంబు గా శైశవంబు నంద యేను నీకు విన్నవించినదానిఁ దలంచికొను మవ్విధంబున నమాత్యుం డైనవె నుకనంగదేశం బాశ్రయించి యందుఁ గ్రముకకంఠోత్తరనామధేయపురం బైనయీ పురంబు నూతనంబుగ నిర్మించి నిన్నుఁ బట్టంబు గట్టినది నీకు విదితం బైనది చె ప్ప నేల యీవిశ్వవిశ్వంభరామండలేశ్వర యీసత్వదాత్ముని కులనామాది ప్రకారం బులు పూర్వంబున నతఁ డడుగ నపు డేను జెప్పకుండుటకు నిప్పుడు చెప్పుటకు మ ఱి యు నాఁటినకలజ్ఞానోదయంబునకు నిమిత్తం బడిగితి రది విన్నవించెద విన నవధరింపుఁ డని యి ట్లనియె. 179

సీ. అట్లు సుగ్రహుఁడు ము న్నా దేవతాలయంబునఁ బెట్టి క్రమ్మఱఁ బుచ్చుకొనఁగ
మఱచినయట్టి యమ్మణిహారము ను మధురాపురాశ్రయుఁ డొకబ్రాహ్మణుండు
దైవవశంబునఁ దా నచ్చటికి వచ్చి కని పుచ్చుకొని పోయి తనగృహమున
బహువర్షము ల్వేల్పుబలె భక్తిఁబూజించి యంతట నిది త్రిలోకాధిపతికి
యదుకులాభరణంబున కచ్యుతున కు, పాయనంబుగఁ గొనిపోవు టర్హ మనుచు
ద్వారవతి కేఁగి యతనిసందర్శనంబు, వడసి కానుక గాఁ బెట్టెఁ బార్థివేంద్ర.

చ. అనయముఁ బ్రీతితో వారి యు నాతనికానుక యాదరించి కై
కొని తనభీష్టవస్తువులు గొబ్బునఁ దాఁ గృపచేసి యప్పు డిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పావనము దండకాకృతిసముజ్జ్వలసంస్తవలీల కొంత యు
న్ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకు న్ధరాధిపా. 181

చ. అతఁడు మహాప్రసాద మని యప్పుడు దానిఁ దగ న్ధరించి బా
లతఁ గనుపట్టువిష్ణుకలాపము గావునఁ దద్భుజాంతర
స్థితి కిది చాల కొప్పి గళసీమన యెంత యు గుప్త మై తదీ
యతరళ విూరుచిద్గుణము నాతనికిన్ హృదయంబు సోఁకమిన్. 182

ఉ. ఆమణికంధరుండు తుదయం దలఘువ్రతుఁ జేర్చె డాని నా
భూమిసురుండు నీ కొనఁగ భూరికృపోన్నతి నిచ్చి తీవు నా
కోమహితాత్మ తత్తరళి మొప్పఁగ నాహృదయంబుసోఁక ను
ద్ధామసుబోధ నైతి శిశుతానముయంబున నట్లు మిక్కిలిన్. 183

ఉ. క్ష్మావరచంద్ర నీవు ప్రథమంపుజని న్మణికంధరుండ వై
యావిధిఁ గృష్ణు చేఁ బడసి యంతట నిజ్జనవంబునందు భూ
దేవవరేణ్యు చేఁ బడసి దివ్యము నమ్మణిహారము న్గృపై
శావృతబుద్ధి ని ట్లొసఁగి యంతగఁ జేసితి నన్ను మన్ననన్. 184

క. ఇటు నటు నేఁ గదలఁగ నం, తట హృదయస్థలముఁ బాసి తన్మణికడకేఁ
గుట నుడిగెఁ దెలివి యట్లా, దట నీమంత్రీశుఁ డడుగుతఱి నవనీశా. 185

వ. కావున నప్పుడు సత్యదాత్ముని నామజాత్యాదు లేను జెప్పకుండుట కిది కారణంబు
నాఁ డట్లు బోధోదయం బగుట యు నుడుగుట యు నేతన్మాలంబు లని యెవ్వరు
నెఱుంగకుండుట ను నిది సామాన్యహారంబ యనుతలంపున మావారు దాఁచి వాఱచు
టఁ జేసి నాఁటనుండి నేఁటిదాఁక నిద్దివ్యహారం బెన్నఁడును ధరియించుట యు లేదు
నేఁ డాభరణభరణసమయంబునఁ బ్రసంగవశంబునఁ దలంచుకొని చెలులు తన్మా
స్త్రప్రకారం బెఱింగింప నిది సుముహూర్తలబ్ధం బైనప్రథమభూషణంబని యు భక్తద
త్తం బని యు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగ స్పర్శనాయక ర
త్నంబుగా నిపుడు ధరియించియున్న దాన నిచ్చోటికి నిపుడు నూపురంబులు గొను
చు నప్పదాత్ముం డేఁగుదెంచిన నింత లోపలికోలఁ పునకు నచ్చుపాటిచనువు కలిమికి
నితం డెంత భాగ్యవంతుఁడొకో యని యొక్కింతుక భావింప నతని జాత్యాదు లిన్ని
యు మదీయహారనాయకమాణిక్యంబు మాహాత్మ్యంబున నిట్లు చెప్పెదోఁచె భూత
భవిష్యద్వర్తమానభువనప్రపంచంబునందు నెద్దియైన దేవరకుఁ దెలియవలసిన యది
కరతలామలకసమానం బై కనంబడియెడు దీని ధరియించి చూడుఁడని యనుపమాస్త్ర న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుంభలక్ష్మి తెరచాటున నస్తాద్రి కెలంకునం గించిత్ప్రకాశాప్రకాశరూపం బగుచు
నపూర్వంబు నెఱపు నమ్మహానీలరత్నమాలికఁ దనదు పయ్యెద వెలుపలికిం దిగిచినఁ
జూచి యాజగతీవల్లభుండు. 186

ఉత్సాహ. తివుసు పట్టు యుండ నిమ్ము తిరుగఁ బుచ్చుకొనుట యొ
ప్పవు నె నీవు నిచ్చినట్టిహార పట్లయుండఁగా
నువిద దీని మహిమఁ దెలుపు టొప్పఁగాక యన నళి
యవనినాథ జాణ విది యుపాయ మనుచు నవ్వుచున్. 187

గీ. ఒఱగుమీఁదటఁ జేరకూర్చున్న ప్రియుని, యురముతరళంబు సోఁక మేనొయ్య వంచి
కనఁగవలసినయది గనుం డనుచు నంతఁ, గుచభరాలసపోలె నక్కువను వ్రాలె. 188

క. వనజాక్షి యిపుడు గనవల, సినయది నా, కిదియె యందుఁ దెలుపుఁడు తమకం
బునఁ గౌఁగిలించె నిదె, లను బిగిసారంగ మధురలాలసఁ బ్రేమన్. 189

చ. ముది తమి నంతట న్నిలక మానవనాథుఁడు చిత్తభావశం
వదబహుచేష్టితుం డగుచు వర్తిల నేమిటికిం గడంగి యె
య్యాదిదొరకొంటి మే లనుచు నబ్జజుఁ డిద్ధరఁ జంచలాత్ముల
స్వవృతుల లెస్సకూర్చె జతనంబున నంచు లతాంగి నవ్వఁగన్. 190

ఉ. అంతట నెట్టకేలకుఁ బ్రియాంగనప్రార్థన నవ్వసుంధరా
కాంతుఁడు తేటతెల్లమిఁగ గాంచెఁ దదుక్తకథాప్రపంచమ
త్యంతము సత్యపాట మహితం బగుతత్కుచమధ్యరత్నసం
క్రాంతుని వ్యాప్తప్రదేశ మెసఁగ న్మది నించుక పాటఁ జూచుచున్. 191

వ. అంతట సత్యదాత్ముండు శాపమోక్షంబున నాబాల్యానుభూతపదార్థజాలం బంత
యుఁ దనంతన యాత్మసంస్మరణగోచరం బగుచు నటమున్న మధురలాలసచేతఁ
దావినినవి కలిగి సరిదాఁకుచుఁ బ్రమోదంబు నద్భుతంబును నాపాదించుచుండ
నేఁగుదెంచి తగిన యవసరంబు దెలిసి యాకళాపూర్ణమహారాజుం గాంచి తనకుఁ బు
నఃప్రాప్తం బైన యారెంటుక తెఱంగు విన్నవించె నేమో యిట్లు శాపముక్తుండ
నైతి నని యనేకప్రకారంబుల నాపుణ్యదంపతుల నంస్తుతించి తొల్లింటినాఁటి మ
హారాష్ట్రరాజ్యభోగంబుకంటె ననేకగుణంబుల నధికం బై యిప్పటి దేవరపాదప
ద్మసేవ పరిపూర్ణసౌఖ్యంబు నొసంగుచున్నది యది యెల్లకాలంబు నాకుఁ గలుగ
ననుగ్రహింపవలయు నని సాష్టాంగప్రణామం బాచరించె నతండు మధురలాలసాబం
ధుక్పవిశేషజ్ఞానంబున నతని నెప్పటికంటె నిక్కలి గారవించి గృహంబున కనిపి మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టి యు నభినవశపస్తుభోధసాధ నేచ్ఛల మధుర లాలసాపరిరంభణసుఖంబు లనుభ
వించుచుండె నప్పుడు. 192

గీ. ఉభయహృదయదేశయుగపన్మణిస్పర్శ, మహిమ నొక్కరొకరి మక్కువపస
లొక్కమాటె యొక్కరొకరి కేర్పడఁదదా, శ్లేషసుఖము మిగులఁ జిత్రమయ్యె.

క. శుభధర్మశీలయుగున, ల్లభయత్నముచేత నిపు డిలాపతి దనపై
నభినవకాముదికింగల, సుభక్తి గని తదుచితంబు చొప్పడ నడపెన్. 194

చ. అలఘుతరానుభావ యగు హైహయకన్యక హారశక్తి చేఁ
దెలివి యు వాక్పటుత్వము ను దేజరిల న్నిజపూర్వవాసనా
బలముల నెల్లకీరణనపాటవ మెంత యు మీఱ నిద్దె భూ
తలవిభుఁ డగ్రతం దనరి తద్ద యుఁ గానకళాప్రవీణగన్. 195

చ. సకలమహీజనావనవిచారము సంధిలవంత నోలిమై
నకలుషధర్మశోభిని మదాశయపుత్రిక యత్నమొప్ప భ
ర్తకుఁ దెలిపె న్స్వరాష్ట్రి పరరాష్ట్రిగుణాగుణవర్తన స్సనా
యకపరిరంభకాలముల నప్పటికప్పటి కెచ్చరించుచున్. 196

సీ. తావిన్నకన్నయర్థముఁ జెప్ప కడఁచితివని తెల్పి శిక్షించుఁ దనదు చెలుల
రిపులకు లోనిచ్చె నపరాధియయ్యె వీఁడని యమాత్యులతప్పు లరసి యడఁచు
ముచ్చిలఁదలఁచె వీఁడిచ్చలోనని మూఁదలించి దండించు మలిమ్లుచుల ను
నాలితో రే యాతఁ డతిమాత్రమున నగ్లెఁ దగదని చెప్పించుఁ దగినరీతి
మధురలాలసనపరిరంభణవిశేష, సమయహృద్దేశఘటితతచ్చారుహార
తరళమాహాత్మ్యమున సమస్తజ్ఞుఁ డగుచు, భువనమరుదంద నాకళాపూర్ణుఁ డపుడు.

వ. అంత నొక్కనాఁ డతండు మధురలాలసతోడ నేకాంతంబున నుండి సర్వజ్ఞత్వకా
రణదివ్యమాణిక్య ప్రశంసాప్రసంగబున విష్ణుదేవుని మాహాత్మ్యంబు తలంపునం బొడ
మఁ దదీయకీర్తనం బిహపరసాధనం బని సంభావించుచుఁ దద్ప్రసంగవశంబున. 198

గీ. ఆదిజన్మంబునందు ననంతశయన, పద్మనాభుని సన్నిధి భాగవతుల
వచనమున రమావిష్ణుసంవాదనకథ, తానొనర్చుట మదిలోనఁ దలఁచుకొనియె. 199

క. ఈపగిదిఁ దలఁచుకొని సుక, లాపంబుగ దాని మధుర లాలసమధురా
లాపములచేత వినుటకు, భూపాలుని మదిని వేడ్క పొడమె న్మిగులన్. 200

గీ. ఇట్లు వేడ్కవొడమ నిందుబింబానన, యాననంబుఁ జూచి యానృపాలుఁ
డాపరాతిశయము ననురాగము ను గరం, బలరుచుండ నిట్టు లనుచుఁ బలికె. 201

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆదిమమైనజన్మమున నంగన యేను రమాముకుందసం
వాదము కావ్యరూపమున వర్తిలఁజేసితి నంచు వింటి
బాల్యోచితతావకీనమధురోక్తులలో నది నీమణీగుణ
శ్రీవనరార నాకసి యశేషము నిప్పుడు సెప్పఁగాఁ దగున్. 202

క. నీపరిరంభణమహిమను, దీపితమగు తెలివివేళఁ దిరముగ నదియే
నోపడఁతి కనుటలే దెవఁ, బైపై నీమీఁదితమిని భాసిలుచునికిన్. 203

వ. అని పలుకు ప్రాణవల్లభుని పలుకులకు నగుచు నమ్మగువ రాజగతీవర దేవరమది కిపు
డెయ్యది ప్రియం బదియ చేయుట నాకు నుం బరమప్రేమాస్పదంబు గావున నప్పా
వనకథ యెల్ల వినిపించెద విన నవధరింపు మని పలికి తనకు సకలజ్ఞాననిదానం బగు
చు హృదయప్రదేశంబున నలంకరించుచున్న దివ్యహారనాయక మాణిక్యంబునకు
నంజలి చేసి తదీయప్రాప్తి కారణంబు లైన యాకళాపూర్ణుని నలఘుప్రతు మణికంధ
రుఁ గృష్ణుని విప్రుని సుగ్రహు వటపత్రశాయిని హృదయంబునఁ దలఁచి యాగురు
పరంపర నాకు ననుగ్రహకారిణి యగుఁ గావుత మనుచుం బ్రణమిల్లి యాలక్ష్మీనా
రాయణ సంవాదకథ తొల్లిటిమణికంధరోక్త ప్రకారంబున నిట్లని చెప్పఁదొడంగె.

సీ. అమృతపూరాశ్చర్యతమవిరజానదీసీమావరుద్ధసంస్థితికతంబు
పరగణనాతిగబ్రహ్మాండలుద్భవప్రకృతిపాథోధిపారాయితంబు
సూర్యచంద్రాగ్ని తేజోనిరపేక్షణప్రాకృత స్వప్రభాభాస్వరంబు
స్వేచ్ఛాగృహీతసమిద్ధవిశుద్ధసత్వశరీరనిత్యముక్తవ్రజంబు
నగుచుఁ బెంపొందు నిఖిలవేదాంతసిద్ధ, పరమకళ్యాణగుణచణబ్రహ్మతత్వ
సతతసాక్షాత్క్రియావిభూషితనిజాను, భవసుఖితజీవమగు శౌరిపరమపదము.

గీ. చిదచిదీశ్వరాత్మకము నశేషజగదు, పాశ్రయము తోయహుతవహపవనవియద
హంక్రియామహదవ్యక్తకావరణము, నగునజాండాలి కవల నజ్జగము వెలయు.

క. గణుతింపఁ బ్రకృతిదోషము, లణుమాత్రము లేవు గాని యచటఁ బరఁగున
త్ర్యణుకబ్రహ్మాదిజగ, ద్గుణమహిమ లనంతకోటిగుణితసమృద్ధిన్. 207

క. అరము నరణ్యాము ననఁగా, శరధు లమృతచయము లచట శతకోర్మిసము
త్కరశీకరశీతలతల, మదురుపులకితతటద్రుమము లై యమరున్. 208

క. అవిష్ణులోకమున కన, మావాహిని విరజయు యమరు పూనితమోక్ష
శ్రీచరణరాగభాగవ, తావళిశుభలగ్నసమయయవనికపోలెన్. 209

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఆసింధూత్తము చేరువ న్సరసి యొం డైరమ్మదీయంబు నా
భాసిల్లు న్దలనీలికాకబకకాపద్మాస్యపుష్పంధయా
ళీసంవీక్షణపిచ్ఛికావళిమృణాళీబాహు కోకస్తన
శ్రీసంవాదితమూర్తి ముక్తిపదలక్ష్మీమండలీకర్త యై. 210

గీ. ఆసరోజాకరము పొంత నతిశయిల్లు, బిల్వభూరుహ మొకటి శోభితపలాశ
విసరకిసలయసముదయోల్లసన మహిమ, నవిరళస్థితశుకపుంజ మనఁగ దనరి. 211

గీ. ఇంపుమీఱు నచట నెంత యు నశ్వత్థ, శాఖియొకటి సోమసదన మనఁగ
మహిమతో సువర్ణమయము శాఖాత్రయి, శోభితంబు నగుచు శ్రుతులు పొగడ.

చ నెలకొని యమ్మహీరుహమునీడ ను బంచశతాప్సరస్సము
ద్యలు సుమచూర్ణకజ్జలపటాభరణంబు లనేకము ల్కరం
బుల ధరియించి వర్తిలుచు ముక్తత నచ్చటి కేఁగుదెంచువా
రల కెమరేఁగి చేయుదురు ప్రౌఢిమ సంధిలఁగా నలంక్రియల్. 212

సీ. కలికి కన్గొనల చూపుల పేరఁ బర్వు మవ్వపు నల్లగల్వలు వైచివైచి
మందహాసములను చందనోదకములు పలుమాఱు మోములఁ జిలికిచిలికి
హారంబు లిడుచు బాహారుచిచ్ఛలమున భుజములందు హరిద్రఁ బూసిపూసి
శ్రుతిభూషణము లమర్చుచు హస్తకాంతికుంకుమములు చెక్కుల్లఁ జమర చమరి
యలరఁ జేయు నచ్చరలపిండు ముక్తిక, న్యల ను బెండ్లిఁగూడి బులియుచున్న
క్రొత్త పెండ్లికొడుకుఁ గొమరుల సయ్యాట, లాడుతద్వ్యఘూవయస్య లనఁగ. 213

వ. ఇవ్విధంబునఁ బరమాద్భుతం బైన యాభువనోత్తమంబునందు. 214

గీ. ఉభయకర్మతంత్రులకు నమోఘనీయ, మగుట నామ్నాయములమోఘయని నుతింప
వాఙ్మనసగోచరము గాని వైభవమున, బ్రబలు రాజీవలోచను రానిధాని. 215

సీ. ఘటమంచుఁ బటమంచుఁ గారయుక్తులఁ జెంచు దుష్టతార్కికులకు దూరమగుచు
శ్రుతి యంచు స్మృతులంచు శుష్కకర్మము లెంచు మీమాంసకుల కప్రమేయ మగుచు
ఝురి యంచు ఖరి యంచు జనులఁ బీనుల నొంచు శబ్దైకరతుల కసాధ్యమగుచు
మృష యంచు నిజ యంచు విషమోక్తిఁ గలహించు నద్వైతపరుల కప్రాప్యమగుచు
కృష్ణవిష్ణోహృషీకేశ కేశవ యను, భక్తుల కెప్పుడు ను దుర్లభంబు గాక
పరఁగుఁ బ్రకృతివికార దుస్పర్శతరము, గురుతరానందఝురము వైకుంఠపురము.

చ. తడఁబడుచుండు నందు నమృతంపుఁ గొలంకులు శాద్వభూములు
న్వైడలుపు పచ్చరాచలువ నేలలు పచ్చికచోట్లఁ గెంజిగి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్జైకిగొను పద్మరాగమణిసౌధములుం బలిరాజు ప్రాఁకులుం
బడఁకులపిండు భిత్తి గతభాసురతత్ప్రతిబింబజాలముల్. 217

క. పరమసుమనోమనోజ్ఞత, గరమాత్మారామపరవికాసము దనరం
గరుసవుఁ జరితల గరితల, గరగరితల గరిమ నగరిగరిమను సమునగ్. 218

చ. విమలు రచింపనేల తనువింతగు నవ్వులసొంపు గల్గఁ గ
స్తురి కలయుంపు లేల తమ చొక్కపుఁ జాఫులయింపు గల్గఁ గ
ప్పురముల ప్రముగ్గులేల తమ పుణ్యనఖద్యుతి పెంపు గల్గనం
చుమదుగఁ జూపఱు ల్పొగడ నయ్యయిలీలఁ జరింతు రంగనల్. 219

సీ. విమలపాండిమ పేరఁ బరిశుద్ధసత్వంబుఁ దలిరాకు నెపమున నలఘుకృపయు
దళమిషంబున నాత్మఁ గల కృష్ణకాంతి యుఁ బుష్పాళ్లునాఁ గల్మిపొలఁతి
మధుశైతవమున సమ్మదబాష్పధారలు గళికాఫలంబునఁ బులకములు న
సౌరభసంజ్ఞ సుజ్ఞానవానన యుఁ బేరెలమిపేరిటిసౌఖ్యవిలసనంబు
బెలిఁ బ్రకాశింప నిత్యముక్తులు సేవింపఁ, గొమరుమీఱంగఁ దరులతాకుంజరూప
ధాములనుచు వర్తించుచు తత్పురంపు, బహువిధోద్యానవాటికాభ్యంతరముల.

చ. అళిశుకకోకిలాదివపురాశ్రయలీలఁ దము న్భజించు ని
త్యుల సుమనఃఫలాదిపరితుష్టులఁ జేయుచు వారుఁ గాము ము
క్తులకు వినోదలీల సమకూర్తురు వృక్షలతాదు లైనవా
రలు హరిదాసు లెప్పుడుఁ బరస్పరభక్తిపరాయణు ల్గదా. 222

సీ. కొన్ని సౌభాగ్యసంపన్నలక్ష్మీపదాంభోజలాక్షాలక్ష్మిపూజితములుఁ
గొన్ని భూదేవివిఘూర్ణత్కటాక్షవీక్షాపక్ష్మలతగురుచ్ఛ్రజములుఁ
గొన్ని నీళానఖాంకురవిన్యాసచంద్రకితప్రవాళసంతానకములుఁ
గొన్ని భాగవతలోకోన్నతక్రీడావిభూషితచ్ఛాయావిశేషితములు
నగుచుఁబరవాసుదేవవిహారకుతుక, విభవముల కాస్పదంబు లై వెలయుచుండుఁ
దత్పురోద్యానములు నిరంతరపరాగ, పుష్పరసవృష్టిశీతలభూతలములు. 222

వ. అట్టి దివ్యవస్తువైభవంబులఁ గరంబు గనుపట్టునట్టి యాపట్టనమధ్యప్రదేశంబునందు.

సీ. రవిచంద్రకోటి తిరస్కారధారేయమహనీయదీప్తిసంపదలఁ బొదలి
వేదప్రసిద్ధమై వెలయు నద్భుతరత్నమయసహస్రస్తంభమండపమున
మహితవిభూతియుగ్మవిచిత్రరూప మై ధర్మాదినూఱుపాదములతోడఁ
జెలువొందు మాణిక్యసింహాసనమున సహస్రసపత్రాఖ్యపద్మంబునందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శేషతల్పాధినాథుఁ డై సిరి యు ధర యు, నీళ యు ను భజియింపంగ లీలనందుఁ
గేవలభూవిలాసానుభావభావి, తాఖిలాజాండవర్తనుం డచ్యుతుండు. 224

గీ. అనవానపత్రంబు పూర్వాదిగాఁగ, సకలదళముల విమలాదిసతులు నిలిచి
వారి భజింతురు చామరహస్తలగుచుఁ, గమలనిలయలీలావతారములరీతి. 225

చ. అకులితభక్తిఁ బూర్వదిశయందు నను గహాయన్వఘాటి దాఁ
గుతుకమునిమోఁ గాఁ బసిఁడికుంచియ వైచుచుఁ గొల్వుసేయు నం
తతము ను హస్తకంకణఝుణత్కారణక్వణనంబు లవ్విభు
న్నతిన పరాకు స్వామి యనుశబ్దములాగున నెచ్చరించుచున్. 226

సీ. శయనాసనాంశుకచ్ఛత్రాదికంబులు దాన యై ఫణిపలోత్తముఁడు గొలువ
ధ్వజము వాహనము వీవనయు నాదిగఁ బెక్కురూపు లై గరుడుఁ డామూర్తిఁ గొలువ
పలుబు విద్యాధిదేవత యైన వేత్రంబుఁ బూని సూత్రవతీవిభుండు గొలువ
నారతకత్య మింపారఁ దత్పురిఁ గాపుకుముదాది నిత్యసంఘములు గొలువ
భువనముల దుష్టనిగ్రహంబునకుఁ దాన, పొలుపడి యున్న యాయుధపంచకంబు
జయజయధ్వను లెసఁగంగఁ జారుపురుష, భావమునఁ గొల్వ నావిశ్వభర్త మెఱయు.

మధురగతిరగడ.

కెందమ్ములు వడఁకించు పదంబులు, నిందు వైభవము గేలునఖంబులుఁ
గగమునదను చొక్కపుఁ జిఱుఁదొడలు ను, గరికరవిభవముఁ గాదనుతొడలును
బడియార్వన్ని యబంగరువలువును, మెదలెడితళుకుల మేఖలచెలువు ను
ఘనవజనకుఁ గను పొక్కిలివిడి యు ను, దవిలియురంబునఁ దనరెడు సిరి యుం ను
వరయ జీవముయ మగుకౌస్తుభము ను, నెరయ వైజయంతీహారభ యును
బ్రకృతిమయతఁ జొప్పడు శ్రీవత్సము, వికసిల్లఁగఁ బర్వెడు ఘనవత్సము
నహంకృతియాత్మక మగు శంఖంబు ను, మహనీయమనోమయచక్రంబు ను
దనర నొకవిచిత్రపుసోయగము ను, ననుపువటచుహస్తాంబుజయుగము ను
నురగతల్పమున నూఁదిన కరము ను, బరఁగినజానువు పై నొకకరము ను
నవ్వుమకరసుండలసువిలాసము, భవ్యకపోలప్రకటితహాసముఁ
బవడమును గణింపని నెమ్మోవి యు, నవచంపకనిభనాసికఠీవి యుఁ
దలిదమ్ముల నగు తీరు నయనములుఁ, బొలుపలరెడు కనుబొమల చెలువములుఁ
గనుఁగొన నింపగు కస్తురిదామము, ననుపమానమగునలకస్తోమముఁ
గలకలనగు చక్కనివదనంబు ను, ధళధళపసురత్నకిరీటంబు ను .

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననుగృకజలధర మగువర్ణంబు ను, నినకోటుల నగియెడు తేజంబు ను
గలుగుదివ్యమంగళవిగ్రహమున, నలరు భక్తనిత్యానుగ్రహకుఁ
బరఁగు రమావిభు పరమపదేశ్వరు, నిరవద్యాత్మకు నిత్యు నికీశ్వరు
నజు నచ్యుతు హరి నఘసంహారుని, ద్రిజగన్నాథుని ద్రిగుణవిదూరుని
నఖిలశేషిఁ గరుణైకపరాయణు, నిఖిలవేదవర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున, నలరుదు రక్కడ నతివిభవంబున. 228

వ. అందు. 229

సీ. తనవిలోచనసంజ్ఞ దవునకు భువనసర్గముఖక్రియాచార్యకంబు నదుకఁ
దనవిలాసంబు కాంతునకు శృంగారసామ్రాజ్యనీతిధురీణమంత్రి గాఁగఁ
దననర్మలీల నాథునకు దశాకృతిప్రకృతి కానన్మాత్రధారత వహింపఁ
దనముద్దుఁబలుకు భక్తవితానవాత్సల్యకర్ణి కారవిధానకారణముగ
నఖిలకళలందుఁ దోడునీ డగుచు మెలఁగు, నధిపునకుఁ బాలమున్నీటి యూఁడుఁబెద్ద
యరిదిమక్కువ సెక్కువ యవిరతంబు, నుపవడింపక యతఁడు దన్నుపచరింప.

ఉ. ఆజగదేకమాత తగునట్టిప్రసంగవశంబున స్సను
ద్వేజకభూరిసంసృతినవీనదవానలతప్యమాన సా
నాజనకోటిఁ బ్రోచు కరుణాకర నమ్మఁ గదుం దొలంగ నీ
రేజదశాత్ముఁ జూచి మృదుకీతి దలిర్పఁగ నప్పుడి ట్లనన్. 2 3 l

క. దేవా యిపు డొకయర్థము, దేవర నడుగంగ బుద్ధిదివిరెను మిగుల
న్నా విన్నపముఁ బ్రసాద, శ్రీవెలయఁగ నొకటి యవధరింపఁగవలయున్. 232

ఉ. ఈభువనంబు లెల్ల సృజియింప భరింప హరింపఁ గర్త వై
శోభిలువాఁడ వీవు మధుసూదన యంబుజసంభవుండుఁ జే
లోభవవైరి యుగ్రమున లో భవదీయకృపాసమర్పిత
ప్రాభవు లైకదా కనిరి పన్నడ సర్గలయాధికారముల్. 233

గీ. జీవకోటుల నుభయకర్మావళీఫ, లానుభవమునఁ దరిచేర్ప నాత్మఁ దలఁచి
నీవు బ్రహ్మాండసృష్టిరక్షావిలయము, లిట్లు గావింతు వని నుతియించు శ్రుతులు. 234

గీ. అది యుఁ గాక మొదలు తుద లేనిసుకృతదు, ష్కృతములు భోగమునఁ దరింపరాదు
యకట యాత్మబోధ సార్థమై వేదశా, స్త్రములు గలుగఁజేసి తమలకృప ను 235

ఉ. అట్టిశ్రుతిస్మృతుల్ దెలుపునట్టియుపాయము నాదరింపక
ట్టట్టు చరించి ముక్తి కెడ లైన జనంబులఁ బ్రోచు సత్కృప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నెట్టిన కామకృష్టముఖనిర్మలమూర్తులు దాల్చి తీవు ని
న్నెట్టు నుతింపనేర్తుఁ బరమేశు నకారణసత్కృపాపరా. 236

ఉ. ఇంచుకయేని వేసరక యోగతిఁ జక్కులిగొట్టి పాల్చురా
గించువిధంబున న్బలిమిఁ గేళవ నీవు హితం బొనర్చుచో
నెంచఁ గృతార్థుఁ డొక్కఁడు దొరఁ డింతిరొ కాని సమస్తజీవులుం
గొంచక యంతకంతకు నుగ్రుంకెద రుగ్రభవార్ణవంబులోన్. 237

క. ఇది యంత యు నీమాయా, భ్యుదయావిలాసంబు దెలియఁ బురుషోత్తము నీ
మదిలో నిత్యాది దలఁచిన, వొడవక మాన దని తోఁచుచున్నది నాకున్. 238

ఉ. కావున నెల్లజీవులకుఁ గామితకోత్తము నీయనుగ్రహా
శ్రీవిధనంబుచే నమృతసిద్ధిగఁ గోరెద సర్వశేషివా
దేవరను న్విభేదము మదిం గలదే యొకకొండలు న్స్వభా
భావముఁ బొంపఁజేయు భవబంధులఁ గొండఁజేయు నచ్యుతా. 239

వ. అని యివ్విధంబున సకలరక్షణార్థంబుగాఁ బరమకరుణావేశకలితవ్యాసయ యగు
చుఁ బలుక లిననైత్యంపుఁబొయ్యాలి తియ్యంపుఁబలుకుల కయ్యంబుజాక్షుం డిచ్చ
మెచ్చుచు నత్యాదరంబున నమ్మత్తకాశినిఁ బ్రసాదమేదురదరహాసితలోచనంబుల వీ
క్షించి. 240

క. జనకునికంటెను జననికిఁ, దనయుల పై వత్సలత్వధర్మను మిగులన్
ఘనమంత్రము గాన నీకే, యనుపమకారుణ్యా మచిత మరవిందముఖీ. 241

ఉ. అంబుజనాక్షి నీపలికినట్ల యసంకుచితప్రభావధా
ప్తత్వంబున నేఁ బ్రవర్తిలుట సత్యము గాని నవారవారిక
ర్మంబులు చూడ నందఱ సమంబుగ నెవ్విధిఁ బ్రోవవచ్చు నం
దుం బరికించి చూడ గుణదోషవివేక మనార్యకృత్యమే. 242

వ. అర్వ్యవార్యకర్మంబు లేను క్రియాంగంబులుగాఁ గొనుటయు ను దమధయుష్యవస్థాని
మిత్తం బైనవేదరూపాజ్ఞ లోకంబున నిలుపుటయు ను గారణంబు మత్స్వాతంత్ర్యంబ
కావున పారివారికర్మంబుల వెంబడిన యేను ఫలం బొసంగుట స్వాభావికం బ
గుఁ దెలిసికొ మ్మని యిట్లనియె. 243

క. వినుమల్లైన సుఖపు, ర్ణన కించుక బుద్ధి జనుఁడు దలకొల్పినసూ
త్రన యదియే నీదెప్పుడు, ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. సుకృతములందు నెంచఁ బరమోత్తమ మైనమదర్చనాదిసి
ద్ధికి ధరణీజనంబుల మదిం దలకొల్పిన కాదె యోఁ గృపా
ధికత దశావతారనముదీర్ణవిహారము పూనుట ల్బుధా
త్మకులకుఁ దన్మహామహిమదర్శనము స్వస్థిత యేమి సేయుదుర్. 244

వ. మఱియు ను. 245

క. అమృతపదప్రాప్తి కుపా, యముల ను మర్త్యాజనాదు లఖిలజనులకు
న్నమకూర్చనె యుండుదు ని, త్యము శ్రీరంగాదిదివ్యధామములందున్. 246

తరల. ఇది యెఱుంగ జాలక యింక నుం గృపనెల్లజీవులఁ బ్రోవ నీ
మదిఁ గడుం దమకించి లేవి యు మానసంబున నామ స
మ్మదము మిక్కిలి యెంచి చూడ సమస్త జీవనయాలుతా
ళ్యుదయ మెవ్వరి కింపుగాదు పయోజపత్రవిలోచనా. 247

వ. కావున నీప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చు విశేషంబు విను మట్లు లోకానుగ్ర
హార్థంబుగా నేను నిత్యసన్నిధిస్థానంబులుగా నంగీకరించిన శ్రీరంగకాంచీవేంకటా
చలాహోబళపురుషోత్తమాది దివ్యస్థలంబుల కరిగి సేవింపనోపకున్న నుం దమయు
న్నచోటనే యుండి తత్తద్దివ్యదేశనివాసు నన్ను నిజేచ్ఛానుసారంబునం దలంచి కేలు
మొగుచువారికి సంసారంబు నుద్ధరింపఁ జేయుదు నని యానతిచ్చిన నంతసిల్లి యది
యె చాలు నని యమ్మహాదేవుని దీనవాత్సల్యంబు ననేకప్రకారంబుల నన్నుతించె
నని చెప్పి మధురలాలస యాకళాపూర్ణమహారాజుం గనుంగొని యిది యిప్పుడు మీ
ర లడిగిన భవదీయపూర్వజన్మవిరచితలక్ష్మీనారాయణసంవాదకథాప్రకారంబు దేవ
రప్రశ్ననిమిత్తంబున నిశ్శ్రేయససులభోపాయంబు దొరికె నేఁడు సుదినం బయ్యె
మదీయజన్మంబు సఫలం బయ్యె నని పలికి శ్రీరంగాదిదివ్యదేశమాహాత్మ్యంబునకును
బొంగుచు నింతభక్తవత్సలుండవే యుని పరమపురుషు నఖిలలోకైకనాథు నారాయ
ణుఁ దలంచి ప్రణమిల్లెఁ గళాపూర్ణుండును దదాదిగా నత్యాదరంబున విష్ణుసేవఁ గా
వించుచు ధర్మమార్గంబున రాజ్యపరిపాలనంబు సేయుచు. 248

తే. సమ్మదము మీఱఁ దనయగ్రజాయయందు, మధురలాలసయందు నమర్త్యనిభుల
సుతులఁ గాంచెఁ గ్రమంబున సుప్రసాదుఁ, డనఁగ సరసుఁ డనంగ జెంపారుఘనుల.

క. వలపమరఁగ నవవర్షం, బులనతి దనకేళికాదవి భోగక్రియనిం
పలరెను నట్టుగఁ జేసెం, దలఁపఁగ నిది చిత్రమనఁగ ధర నిక్కఁ జెలికా. 250

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఆయిలాతలవిభుమహనీయకీర్తి, పుండరీకంబు బాయక యుండు లక్ష్మి
వేడ్కఁ దాల్చిన సంపఁగివిరులబంతి, కరణిఁ గాన్పించు బ్రహ్మాండ మరసిచూడ. 251

ఉ. ఆయనసీశ్వరు న్నిమతు లాజి నెదుర్కొనుపాటివారు లే
రేయెడఁ గల్గిన న్రణము లించుక తప్పులపక్షకోటికిం
జేయఁగరాదు చేసిన నజృంభితత న్మదకుంభికుంభవ
త్వాయితనిర్ఝరీపచములం దవి యుం న్నఖఘాతిమాత్రముల్. 252

శా. తద్ఘాటీముఖముఖ్యులం జటుల గాంధర్వాళిపాదాహతి
ప్రోద్ఘాతక్షితిధూళి నింకెను మహాంభోధి న్ద్వీపమ్మండలీ
శుద్ధాంతప్రమదావిలోచనము లశ్రుప్రాప్తిచేఁ గ్రమ్మఱ
న్వృద్ధిం బొందఁగఁ జేయు మానసభితావిఖ్యాతి సార్థంబుగన్. 253

ఉ. రూపవిలాసవైభవనిరూఢిన కా దసమాస్త్రకాళలుం
దాపృథివీశుఁ డొండొకక్రియం బరికించిన మన్మథుండ యు
ద్దీపితకాంక్షఁ బద్మముఁడు ధీవిహారము చేత శాత్రవ
క్ష్మాపతుల న్నిలింపపురకాంతల నొండొరు తోడఁ గూర్పుటన్. 254

ఉ. ధీరుఁడు శూరుఁ డక్షయవితీర్ణివిహారుఁడు బంధులోకమం
దారుఁడు నీతిమార్గసముదారుఁడు లోకపవిత్రకీర్తి వి
స్తారుఁడు దోషదూరుఁడు నితాంతగభీరుఁడు నిత్యశోభనా
కారుఁడు ధర్మసారుఁ డవికారుఁడు సజ్జనపాలుఁ డయ్యెడన్. 255

గీ. అతనిగుణము లెన్నఁగఁ జతురాస్యుఁ డైన, నచతురాస్యుండు ధిషణుండు నధిషణుండు
ధరసహస్రముఖుండు హీనుండు పక్షముఖుల, దక్షముఖుల ను మఱి వేఱ తడవ నేల. 256

ఉ. పూర్ణసమస్తసద్గుణవిభూషితుఁ డై పాలుపొందు నాకళా
పూర్ణకథ ల్విన న్జనుఁ డె బొల్పుగ సంతతి వైభవాదివి
స్తీర్ణశుభంబు కల్మిఁ జిరజీవన మున్నది గల్గెఁ గాన నా
నిర్ణయ మాఖ్య లెల్ల మదినిల్పి వినందగుఁ బఠింపుఁ డింపుతోన్. 257

ఉ. భవ్యత నెల్లదేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధ మగుఁ గావుత నిత్యము సర్వలోకసం
స్తవ్యనిజప్రతిష్ఠ వాలయుం దాండవకృష్ణుకృపన్ పవిత్రతా
ప్రవ్యసనాతిధన్య మగు సజ్జనకోటియనుగ్రహంబునన్. 258

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. శ్రీశోచిష్ణుకటాక్షవీక్షజయలక్ష్మీసంతతావేశదూ
ర్గ్యా రాజద్భుజ యారవీటిపురభూః క్షోణీపాలాన్వయ
క్షీరాంభోనిధికౌస్తుభాయితమహాస్థేమోనయప్రస్ఫుర
న్నారత్నాకరపౌత్ర గోత్రతిలకా నంద్యాలకృష్ణాధిపా. 259

క. శోభితవైభవరూపమ, సోభవ కొండాంబికాతనూభవ భూతి
శ్రీభవ పరిశమితారి, ప్రాభవ బుధవర్ణ్యమాన రామసమానా. 250

వనమయూరము. శైలవరధీర నిజసంగరపవిత్రా, జాలఘుసచార సకలాంగసుతగోత్రా
పాలనవిహార యవిభంగజయయాత్రా, శీలసగధీర వరసింగవిభుపుత్రా.

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ
సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతంబైన కళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబునందుఁ బ్రబంధపరిపూర్తిశోభనం
బైనయష్టమాశ్వాసము సర్వంబును
సమాప్తము.
శ్రీమదుమారమణార్పణమస్తు.

SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7857

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

